టాల్‌స్టాయ్ సాహిత్యం : 'Meriyana'

# మేరియానా

(నవల)

(Telugu Version for Tolstoy's 'The Cossacks')



అనువాదం :

లక్ష్మీకాంత మోహన్



దాచేపల్లి ప్రచురణ

1956

# ముందుమాట

1

టాల్‌స్టాయ్‌ని గురించి తెలుగు దేశంలోని మేధావులకు చాలామందికి తెలుసు. కాని సామాన్యపాఠకులకు తెలియదు. అందువల్ల యీ పీఠిక రాస్తున్నాను.

టాల్‌స్టాయ్ 1828 లో, రష్యాలో, యాస్నాయా పోలియానా అనే పల్లెలో జన్మించెను. అతనిది జమీందారు కుటుంబం. చిన్న తనంలో మహాగడుగ్గాయి. బళ్లో శుద్ధ మొద్దుగా వుండేవాడు. అతనికి ప్రయివేటు ట్యూషన్ చెప్పే పంతుళ్లు "వీడొట్టి భభ్రాజమానం!" అని తేల్చి పారేసేరు.

ఐనా అతని కాలేజీ రోజులు గడిచినాక 30 యేళ్ల అనంతరం అతని "మట్టిబుర్ర" అందర్నీ ఆశ్చర్యంలో ముంచివేసింది. జ్యోతిష్యాలూ, జాతక చక్రాలూ బోల్తా కొట్టినాయి! "మట్టి" లోంచి "మణి" వుద్భ వించింది!! బ్రహ్మాండమైన రచయితగా టాల్‌స్టాయ్ ప్రపంచ ప్రసిద్ధి నందేడు.

అతను కొంతకాలం సైన్యంలో పనిచేసేడు. ఆ రోజుల్లో తాగుడు, జూదం, వ్యభిచారం, దౌర్జన్యం—అన్ని దుర్లక్షణాలూ—అబ్బినాయి. కాని, కథంతా అదిగాదు. రెండో వైపున జీవితంలో నరకం అతని కగుపిం చింది. అహంకారం, మోసం, కుట్రలు, హత్యలు—యిత్యాదులన్నిటినీ అతను చూసేడు. ఆ సమయంలో బుద్ధునిబోధలు, కన్‌ఫ్యూసియస్ సిద్ధాం తాలు, యేసుక్రీస్తు మొదలైనవారి వుపదేశాలు అతను పఠించేడు. క్రమేణా తనపై తనకే రోత గలిగింది. బుద్ధునిలాగా, యేసుక్రీస్తులాగా అతను జీవించా లనుకొన్నాడు.

అందుమీదట సైన్యంలోంచి వచ్చివేసేడు. తనకున్న 20 వేల యక రాలూ రైతులకి పంచియిచ్చేడు. నిరాడంబరంగా జీవించాలను కొన్నాడు. ఆదర్శమూర్తి అవ్వాలనుకొన్నాడు. రష్యాలో ఆనాడు కటిక దారిద్ర్యా నికితోడు నిరక్షరాస్యతగూడావుంది. దాని ఫలితం అజ్ఞానం. యివి పోవా లంటే అక్షరాస్యత అవుసరమనుకొన్నాడు. కాని ఆనాడున్న పాఠశాలలు

ఆదర్శ ప్రాయమైనవిగావు. తానొకటి స్థాపించాలనుకొన్నాడు. స్థాపించేడు. కాని, ఆశలకీ ఆశయాలకీ భిన్నంగా జరిగింది. వున్న పాళ్ళేన యొడారిలో వరి పండుతుందా? దానిమీద ఆ పాఠశాల యెత్తివేయాల్సివచ్చింది.

తన చుట్టూవున్న జీవితంలోని దుర్భర పరిస్థితులు టాల్‌స్టాయ్ మనసును పూర్తిగా మార్చివేసినాయి. వొకప్పటి వ్యభిచారి యిప్పుడు ఏక పత్నీ వ్రతుడు. అప్పటి హింసావాది యిప్పుడు అహింసావాది.......

జీవితక్షీరాన్ని మధించిన ఫలితంగా "సత్యమే దేవుడు", "అహింసా పరమోధర్మః" అనే సూత్రాలు అతనికి అగుపించినాయి. యీ జీవిత రహస్యాన్ని బోధించటానికి అతను కలం పట్టేడు. నవల, చిన్నకథ, నాటకం, వ్యాసం మున్నగు సాహితీ రూపాల్లో అతను తన ప్రచారం సాగించేడు. మత బోధకుల్నీ, భూస్వామ్య విధానాన్నీ, నిరంకుశత్వాన్నీ, యుద్ధాలనూ, హింసనూ చీల్చిచెండాడేడు. అయితే ఆయన అనేక అవాంతరాలను యెదుర్కోవాల్సి వచ్చింది. వొక వైపున ప్రభుత్వం మరోవైపున మతం ఆయన్ని అణగ తొక్కటానికి ప్రయత్నించినాయి. కాని వీరికీ టాల్‌స్టాయ్‌కీ హస్తిమశకాంతరంవుంది. ఆయన్ని మతంనుంచి బహిష్కరించినా చలించలేదు.

టాల్‌స్టాయ్ బ్రహ్మాండమైన ప్రతిభావంతుడు. ఆనాటి రష్యాని పూర్తిగా ఆకళింపు చేసికొన్న కళాకారుల్లో ఆయన అగ్రగణ్యుడు. అందువల్లనే "ఈయన భూమిమీద బతికున్నంతకాలం నేను దిక్కులేని పక్షినై దురపిల్లను!" అని మాక్సింగోర్కీ అన్నాడు. అందువల్లనే — ఆనాడు మాక్సిం గోర్కీ వంటి కమ్యూనిష్టు అనుకూల రచయితలూ, ఛకోవ్ వంటి ప్రతిభావంతులూ వున్నా — లెనిన్ ఆయన్ని "రష్యన్ విప్లవ ప్రతిబింబం" అన్నాడు. అంటే రష్యాలో విప్లవం యెందుకొచ్చిందో తెలిసికోవాలంటే టాల్‌స్టాయ్ రచనలు చదివితే తెలుస్తుందని అర్థం. అంత ప్రతిభావంతుడు *(Genius)* టాల్‌స్టాయ్!

టాల్‌స్టాయ్‌కి వీధిలోవున్న యిక్కట్లు చాలనట్లు యింట్లో ఆలి ఇక్కట్లు కూడా పెరిగినాయి. యిల్లు యిక్కటం ఆలుమక్కటం అన్నట్లయింది. మొదట్లో ఆ భార్యాభర్తలు చాలా అనుభోందికగానే వున్నారు. ఆయన భార్య యీయన రాసినవాటికి సాఫులు *(Jair Copies)* రాస్తూండేది. ("అన్నా కెరెనీనా" విషయంలో 7 సార్లు వోపికగా సాఫురాసింది.)

క్రమేణా వారి మధ్య కలహంపెరిగింది. ఆమె భోగి, ఆయన విరాగి. ఆమెకి స్తోత్ర పాఠాలుకావాలి, ఆయనికి సూత్ర భాష్యాలు యిష్టం. ఆమెకి ఆస్తి కావాలి; ఆయన వ్యక్తిగత ఆస్తి *(Private Property)* కి కట్టువ్యతిరేకి.

ఆయన యింటికి అనేకమంది–వందలు వేలు—మిత్రులూ, యాత్రీకులూ వస్తూపోతూండేవారు. ఆమెకి అనుమానం, అసూయ (*Jealousy*) పట్టుకొన్నాయి. వారి నామె ద్వేషించింది. ఆమెకెంత అసూయంటే ఆఖరికి కన్నకూతుర్ని గూడా యింట్లోంచి వెళ్లగొట్టేసింది అసూయతో! ఆయన తనపుస్తకాల్ని ప్రతిఫలం కోరకుండా ఊరికినే అచ్చుకిచ్చేవాడు. ఆమెకది యిష్టంలేదు. ఆయన తనని యేవిషయం మీదనైనా కొంచెం వ్యతిరేకించితే ఆగ్రహంతో పిచ్చెత్తిపోయి ఆమె నేలమీదబడి దొర్లుతూ చస్తానని బెదిరించేది. అలాగే ఆమెతో 50 సంవత్సరాలు కాపరంచేసేడు. అప్పటికాయనకి 82 యేళ్లు వచ్చినాయి. వృద్ధాప్యంలో మనశ్శాంతిలేదు. యిక వుండలేకపోయేడు. ఒకనాడు యెవరికీ చెప్పకుండా రైలెక్కి యెక్కడికి పోతున్నాడో తనకే తెలీకుండా బైలుదేరేడు. పదకొండు రోజుల తర్వాత ఒక రైలుస్టేషన్‌లో న్యూమోనియాతో అక్టోబరు 21వతేదిన (1910) అసువులు వదిలేడు.

# 2

క్లుప్తంలో ఆయన వ్యక్తిగతజీవితం అది. అయితే టాల్‌స్టాయి యేమిరాసేడు? ఆయనకంత ఖ్యాతి యేలవచ్చింది? కారణం యేమిటి? ఆయన్నుంచి మనం నేర్చుకోవాల్సిందేమిటి?

టాల్‌స్టాయ్ తన సిద్ధాంతాల ప్రచారంకోసం సాహితీ రూపాల్లో దాదాపు అన్నింటినీ వుపయోగించేడు. ఆయన రాసిన గ్రంథాలు 100 వాల్యూములున్నాయి. ఆయన రచనల్ని గురించీ, ఆయన కళని గురించీ 23000–2300 గాదుసుమా!-పుస్తకాలురాసేరు విమర్శకులు!!! యివి చాలనట్లు, ఆయన యింట్లో ఆయనతోపాటు సంవత్సరాల తరబడి జీవించిన మిత్రులూ, యాత్రీకులూ ఆయన పెదవి కదిపితే కలమూ కాగితమూ

పట్టుకొని ఆయన వుచ్చరించిన ప్రతిమాటనూ రికార్డు చేసికొన్నారు. అవి తర్వాత బ్రహ్మాండమైన వాల్యూములలో ప్రచురితమైనాయి.

ఆయనచేసిన నూరువాల్యూముల రచనల్లోనూ ''అన్నాకెరెనీనా'' ''యుద్ధమూ: శాంతీ'' (*War & Peace*), ''కోసక్కులు'' (*The Cossacks*), ''పునర్జన్మ'' (***Resurrection***) అనే నవలలూ; ''అజ్ఞాన ప్రభావం'' (*The **Power** of Darkness*), ''విజ్ఞానఫలాలు'' (*The Fruits of Enlightenments*), ''జీవచ్ఛవం'' (*The Live Corpse*) అనే నాటకాలూ చాలాప్రసిద్ధిలో వున్నాయి. యిక చిన్నకథల విషయంలో యిదమిద్ధమని చెప్పటానికి వీల్లేదు. అవి వందలు వేలుగావున్నాయి. కాగా అన్నీ అన్ని రత్నాలే. కాని, ''మనిషికెంత భూమికావాలి?'' (*How Much Land **Does A Man Require ?***) అనేకథా, ''దేవుడు నిజమెరుగు; కాని ఆగి చూస్తాడు'' (***God Sees the Truth; But Waits***) అనే కథా; యింకా అలాంటివి మరికొన్నీ బహుళ ప్రచారంలో వున్నాయి.

టాల్‌స్టాయ్ రచనల్లో జమిందారులూ, భూస్వాములూ, రైతులూ, ఉన్నతోద్యోగులూ, పెద్దమనుషులూ—చాలా యెక్కువగా మనకగుపించుతారు. వారి సోమరిపోతనమూ, విలాసాలూ వయ్యారాలూ, వారి అహంకారమూ అవినీతీ, వారిప్రేమలూ మోసాలూ—మొదలైనవి మనకగుపించుతాయి. వారిలోని బలహీనతల్ని టాల్‌స్టాయ్ ద్వేషించేడు. విమర్శా, ఆత్మవిమర్శల (***Criticizm & Self-criticizm***) విషయంలో టాల్‌స్టాయ్ చాలా కర్కశంగా వుంటాడనే విషయాన్ని మాక్సింగోర్కీ, బెర్నార్డ్‌షాలు నొక్కిచెప్పేరు. అందువల్లనే—ప్రఖ్యాత రష్యన్ రచయిత నికోలాయ్ గొగోల్‌వలె సూటిగా గాకపోయినా—టాల్‌స్టాయ్ ఆ వర్గాలవారిని వట్టి నిష్ప్రయోజకులుగా, సమాజానికి గుదిబండగా వుండేవారిగా చూపించి, ''యిదుగో పెద్దమనుషుల్లారా! మీరు వైదొలగటం మంచిది!'' అని హెచ్చరించేడు. ఆయన రచనల్లో హింసావాదం, వ్యక్తిగత ఆస్తివిధానం, భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీవిధానం—తీవ్రంగా ఖండించబడినాయి. ఆయన అభిప్రాయాలు సూటిగా తెలిసికోవాలంటే ఆయన రాసిన ''కళంటే యేమిటి?'' (*What is Art ?*) అనే గ్రంథాన్ని చదవటం వుత్తమోత్తమం. (ఈ గ్రంథాన్ని ఆయన 15సంవత్సరాలు కష్టించి రాసేడు.)

కాని, అన్నింటికంటె, యుద్ధమూ అది తెచ్చే వినాశమూ గురించి టాల్‌స్టాయ్ విస్పష్టంగా వివరించేడు. ఆ విషయాన్నుంచి ఆయన నైతిక ఆరాట పడ్డాడంటే యుద్ధాన్ని గురించి ప్రపంచంలోకెల్లా అత్యుత్తమమైన నవల నొకటి (War & Peace) రాసేడు: ఆ నవలకు "యుద్ధమూ: శాంతీ" అనే పేరు పెట్టేడు! యిటుచూడండి: "జలపాతం యొక్క శక్తిని ఫ్యాక్టరీల్లో వుపయోగపెట్టటంలో శాస్త్రం (Science) తోడ్పడిందనీ, మనం కొండలగుండా సొరంగాలుకొట్టామనీ, యింకా యేమేమో చేసామనీ మనకి చాలా ఆనందంగా చాలాగర్వంగా వుంది. కాని విచారించదగ్గ విషయమేమంటే ఆ జలపాత శక్తి, శ్రామికుల యోగక్షేమాలకి వుపయోగించటం లేదనీ, తమ భోగవస్తువులీన్నీ, మానవ మారణ హెూమాని కుపయోగించే ఆయుధాలను తయారించే పెట్టుబడిదారులు (Capitalists) మరితనికి లవటాని కుపయోగపడాతూందనేది!" (From What is Art?)

ఆయన యింతచేసినా నినాదాలవారు (Sloganic Jargonists) కొంతమంది- ప్లెఖనోవ్‌లాంటి కమ్యూనిష్టులు—టాల్‌స్టాయ్ పెట్టుబడిదారుల యేజంటనీ, ఆయన బోధలన్నీ ఏకనాటకమనీ ఆయన్ని క్రూరంగా నిందించేరు. (మనదేశంలో గాంధీగారి విషయంలోనూ ఆదిలో యింతేజరిగింది.) కాని, లెనిన్ ఆ వాదం తప్పనీ, టాల్‌స్టాయ్‌లో పరస్పర వైరుధ్యమున్నా, మహా కళాకారుడనీ చెప్పేడు.

—ర చ యి త.

# 1

మాస్కో నగరంలో అంతా ప్రశాంతంగా వుంది. గడ్డ కట్టిన మంచు మీదగా కిరకిరమంటూ దొర్లిపోయే బళ్ళ చక్రాల ధ్వనులు అరుదుగా మాత్రం వీధుల్లోని నిశ్శబ్దతని భగ్నం చేస్తున్నాయి. కిటికీలు చీకటిగా వున్నాయి; వీధి దీపాలు ఆర్పేయబడినాయి. నిద్రతో జోగుతూన్న నగరమంతటా ప్రతిధ్వనించుతూన్న చర్చి గంటలుమాత్రం ప్రభాతాగమనాన్ని తెల్పుతున్నాయి. మధ్య మధ్య వొక స్లెడ్జిబండి ఇసుకలాగా వున్న మంచుగుండా నెరుసుకుపోయి బజారు దాటి మరోమూలకు చేరి ఆగిపోతోంది; అక్కడ బండి బాడుగకోసరం కూచున్న బండివాడు నిద్రాదేవి వొడిలో వొరిగిపోతున్నాడు. వొక ముసలమ్మ చర్చిలో కెళ్ళింది. అక్కడ కొవ్వొత్తులు వెలుగుతున్నాయి; వాటి వెలుగు బంగారు మలామాచేసిన దిమ్మెలపైనున్న విగ్రహాల్లో ప్రతిబింబించుతోంది. స్త్రీ పురుషులు తమతమ పనుల్లోకి పోవటానికి సిద్ధమవుతున్నారు. పెద్దమనుషులకుమాత్రం యింకా పొద్దెక్కినట్లే లేదు.

షెవెలియర్ రెస్టారెంటులో, మామూలుకు భిన్నంగా, దీపం వెలుగుతుండటం దాని తలుపు సందుల్లోంచి కనపడుతోంది. యెవరిదో స్వంత స్లెడ్జిబండీ, మరికొన్ని గుర్రబ్బళ్లూ ఆ రెస్టారెంటు గుమ్మంవద్ద నిలబడి వున్నాయి; వాటిలో మజిలీ ఆఫీసునుండివచ్చిన వొక మూడు గుర్రాల బండి (ట్రోయికా) గూడా వుంది. ఆ బండివాడు చలికి గిజ గిజ వణికిపోతూ నిండా కప్పుకొని ఆ భవనంలో ఒకమూల వొదిగి కూచున్నాడు. చలిలో ముఖం ముడుచుకుపోయి వొక నౌకరు హాలులో కూచున్నాడు.

“యీ వాగుడువల్ల ప్రయోజన మేంటి ?” అని అత ననుకొన్నాడు. “అదిన్నూ, అసలు నేను డ్యూటీమీదున్నప్పుడే యీ లొడలొడలు జరుగుతా యెందుకో ?”

ప్రక్కనున్న వొక గదిలోంచి కంఠధ్వనులు వినవచ్చేయి. ముగ్గురు మనుష్యులొక మేజాబల్ల చుట్టూ కూచున్నారు; ఆ మేజాబల్లమీద రాత్రి తినగా మిగిలిన తొక్కులూ, ద్రాక్షసారా గ్లాసులూ, ఖాళీసీసాలూ చిక్కురొక్కురుగా వున్నాయి. వారిలో వొకడు—సన్నగా, పరిశుభ్రంగావున్న

కొద్దిపాటి మనిషాకడు—ప్రియాణమై పోబోతూన్న తన మిత్రుని వంక ప్రేమతో తన అలిసిపోయిన కళ్ళతో చూస్తున్నాడు. మరొకరు—పొడుగ్గా వున్న వొకతను—అరజాపుకొని సోఫామీద పడుకొని తన వాచ్ కీతో ఆడుకొంటున్నాడు. అసలు ప్రియాణమై పోబోయేవాడొక కొత్తకోటు తొడిగి ముందుకీ వెనక్కీ పచారు చేస్తున్నాడు, తన చక్కని గట్టిగోళ్ళతో బాదంకాయని పగలగొట్టటం కోసం మధ్యమధ్య ఆగుతూ. జేవురించిన అతని ముఖంలో చిరునవ్వు రెపరెపమంటూ, ప్రకాశిస్తూన్న అతని నేత్రాల్ని వెలిగించింది. అతను వుద్రేకంలో మాటాడేడు; కాని, చెప్ప దలచింది చెప్పలేక పోయేడు; చెప్పిందేదో అతని హృదయంలో దాగి వున్న భావాన్ని వ్యక్తం చేయలేక పోయింది.

"చివరి కెలాగైతేనేం నేను నిర్మొగమాటంగా మాటాడ గల్గుతున్నాను" అని అతనన్నాడు. "నా తప్పుల్ని కప్పిపెట్టుకోటానికి నేను ప్రయత్నించటం లేదు. కాని, కనీసం, నన్ను నే నర్థం చేసికొన్నట్లు నన్ను అర్థం చేసికోమనీ, అంతేకాని అందరిలాగా తేలికగా చూడవద్దనీ కోరుతున్నా. నే నామెకి అన్యాయం చేశానని మీరంటున్నారు" అని ఆ కొద్దిపాటి మనిషివంక చూస్తూ అతడు కొనసాగించేడు.

"అవును. ఖచ్చితంగా నువ్వావిడికి అన్యాయంచేశావు" అని ఆ కొద్దిపాటి మనిషి అన్నాడు, తన కరుణపూరిత నేత్రాలు మరింత కరుణపూరితమవుతూ, మరింత అలిసిపోయినట్లుగా కనపడుతూండగా.

"నువ్వలా యెందుకంటున్నావో నాకు తెలుసు. ప్రేమించబడటం అనేదానిలో ప్రేమించటం అనేదానిలో వున్నంత గొప్ప సుఖం వుందనీ, ప్రేమించబడటమే జీవిత పరమావధి అని నీ వూహ."

ఆ చిన్నమనిషి తన కళ్ళు మూసి తెరిచేడు.

"నిస్సందేహంగా అంతేరా, అబ్బాయ్—కావలసినదాని కంటే అది యెక్కువ" అని అత నన్నాడు.

"అయితే మరి మగనాడు మాత్రం తానెందుకు ప్రేమించగూడదూ?" అని ప్రియాణీకుడు అరంభించి హఠాత్తుగా మధ్యలో ఆగేడు, సాలోచనగానూ జాలితోనూ తన మిత్రునివంకచూస్తూ. "యెందువల్ల ? ప్రేమపుట్టదు

గనుక ......... అబ్బా ... వుహూఁ...ఒకరిచేత ప్రేమించబడటం ఆ తర్వాత అపరాధి ననుకోటం దురదృష్ట మనుకో; యెందుకంటే అందుకు ప్రతిఫలంగా యిష్టంలేంది నువ్వేదీ యివ్వలేవు...వోరి భగవంతుడా!'' అని అతను నిరాశగా తన చేయినూపేడు. "పనులు సక్రమంగా జరిగితే— కాని, అంతా తల్లకిందులుగావుంది; మనమనుకొన్నట్లు పనులు జరుగవు; వాటి యిష్టం వచ్చినట్లు అదో విడ్డూరంగా అవి జరుగుతాయి. అందాకా యెందుకూ? చూస్తే నేనే ఆ ప్రేమను దొంగిలించిన ట్లగుపించుతాను! మీరూ అలాగే అనుకుంటారు. కాదని అనమాకండి; మీరలాగే అనుకొని తీరాలి. ఐనప్పటికీ, నేనుచేసిన బుద్ధిలేని ఛండాలపు పనులన్నింటిలోనూ— అలాంటివి నేను చాలాచేశాను—యీపనంటే నాకు పశ్చాత్తాపం అనేది లేదని అంటే మీరు నమ్ముతారా! యీ సందర్భంలోనూ నేను ఆమెతో కావాలని అబద్ధమాడలేదు. ఓం ప్రథమంలో నేను ప్రేమించానని నిజంగా నమ్మాను. కాని, తర్వాత, నేను పొరపాటు పడ్డాననీ, యిది నిజమైన ప్రేమగాదనీ, యీ వ్యవహార మిక కొనసాగించ లేననీ తేలింది. అయినా ఆమె మొండిపట్టు బట్టింది. నేను ప్రేమించలేకపోతే అది నా తప్పంటారా? నేనేం చేయగలను?''

''సరే, అదంతా అయిపోయిందిగా'' అని అతనిమిత్రుడు నిద్ర రాకుండా వుండేందుకోసరం సిగరెట్టు ముట్టించేడు. అయితే దానర్థం యిదీ: "నువ్వెన్నడూ యెవర్నీ ప్రేమించలేదు, ప్రేమించటమంటే ఏమిటో నీకు తెలీదు.''

ప్రయాణీకుడు చేతుల్తో తన తలను గట్టిగా పట్టుకొన్నాడు; యేదో చెప్పాలనుకొన్నాడు గాని మాటలు పెగిలిరాలేదు.

''యెన్నడూ ప్రేమించలేదు!'' ఆఖరి కతనన్నాడు. "అవును, పూర్తిగా నిజమది. నేనెన్నడూ ప్రేమించలేదు. కాని, నాకు ప్రేమించాలని వుంది. అన్ని కోర్కెలకంటె అది బలంగావుంది నాకు. అయితే మరి, ఆమాటకొస్తే, అసలు ప్రేమనేది వుంటుందాంట? యెప్పుడూ యేదో అసంపూర్తిగా వుంటోంది. సరే, మాటలవల్ల ప్రయోజనమేంటి? నా జీవితం కలగాపులగం చేసుకొన్నాను. నువ్వన్నది నిజం—అదంతా గతం. మళ్ళీ యిప్పుడు నేనొక కొత్త తరహా జీవితం ఆరంభిస్తున్నా ననుకొంటున్నాను.''

"మళ్ళీ దాన్ని నువ్వు కలగాపులగం చేస్తావు" అని సోఫామీద పడుకొన్న పొడుగాంటి మనిషి అన్నాడు.

పెళ్ళికొడుకు ఆ మాటలు వినలేదు.

"నాకు విచారంగా వుంది గాని వెళ్ళిపోవటమంటే హాయిగావుంది" అతను కొనసాగించేడు. "విచారంగా ఎందుకున్నానో తెలవదు."

తన సంభాషణ తనకున్నంత ఆసక్తిగా మొదటివారికి లేదనే గుర్తింపు లేకుండా అతను అదే పనిగా తనని గురించి చెప్పుకోసాగేడు. మానవుడు ఆత్మోద్రేకం చెందినపుడు ప్రపంచంలో తనకంటే దివ్యమైందీ ఆకర్షణీయ మైందీ యేదీ లేదనుకొంటాడు; అతనికి అప్పుడున్నంత అహం భావం మరెప్పుడూ వుండదు.

వొక యువక నౌకరు గదిలో ప్రవేశించేడు.

"డిమిట్రీ ఆంద్రీయెవిచ్ గారూ! బండి మనిషి యిక నేమాత్రం ఆగడు" అని అతనన్నాడు. "రాత్రి పదకొండు మొదలు యిప్పటివరకూ గుర్రాలు నిలబడే వున్నయ్యి. మరిప్పుడు నాలుగు గంటలయ్యింది."

డిమిట్రీ ఆంద్రీయెవిచ్ తన బానిసైన ఐవాన్ వంక చూసేడు. అతని తలకి చుట్టివున్న ఆ రుమాలు, గొర్రె తోలుతో తయారుచేసిన ఆ కోటు, ఆ నిద్రముఖం వొక నూత్న జీవితంవైపు—శ్రమ, కష్టంతో నిండిన జీవితంవైపు—పిలుస్తున్నట్లున్నాయి.

"ఆఁ బయలుదేరే వేళైంది" అని అతనన్నాడు, బిగించని కోటు కొక్కెలకోసం తడుముకొంటూ.

తొందరపడుతూన్న బండి మనిషికి మరో కొంచెం మామూలు ముట్టజెప్పాలనే సూచనని నిర్లక్ష్యంచేస్తూ, అతను టోపీపెట్టుకొని గది మధ్య నిలబడ్డాడు. మిత్రులు వొకరొకరు వొకసారి, తిరిగి మరోసారి, మళ్ళీ కొంచెం ఆగినాక యింకోసారి ముద్దుపెట్టుకొన్నారు. పెళ్ళికొడుకు మేజాబల్లవద్ద కొచ్చి దాని మీదున్న షాంపేన్ గ్లాసును తీసికొని తాగి వేసేడు; తర్వాత, సిగ్గిల్లుతూ, నిరాడంబరంగావున్న ఆ చిన్నమనిషి చేయి పుచ్చుకొన్నాడు.

"ఆఁ. సరేగాని, యేమైనా నేనదిచెప్పేస్తేనే మంచిది!...నువ్వంటే నాకు మక్కువ గనక నీతో నిర్మొహమాటంగా వుండగలను. నువ్వామెని ప్రేమిస్తున్నావు—కాదూ? —నువ్వామెని ప్రేమిస్తున్నావని నేనెప్పుడూ అనుకొన్నాను."

"అవును" అని ఆ చిన్న మనిషి అన్నాడు, మరింత ప్రకాశంగా చిరునవ్వు నవ్వుతూ.

"బహుశా—"

"క్షమించండి సార్. నన్ను దీపా లార్పెయ్యమన్నారు" అని, వారి సంభాషణ వింటూ, దొర లెప్పుడూ ఒకే విషయాన్ని గురించి యెందుకు మాటాడుకొంటారా అని వింత పడుతూ, నిద్రమొఖంలోవున్న నౌకరు అన్నాడు. "బిల్లు రాయమంటారా, సార్?" అని, సమాధాన మేమొస్తుందో ముందే తెలుసు గనుక, పొడుగాంటి మనిషివంక తిరిగి అతనన్నాడు.

"ఆఁ" పొడుగాంటి మనిషన్నాడు "యెంత?"

"ఇరవైయారు రూబుళ్ళండీ"

పొడుగాంటి మనిషి వో క్షణంసేపు ఆలోచించేడు గాని యేమీ అనకుండా యిచ్చిన బిల్లుని జేబులో వేసేడు.

తక్కిన యిద్దరూ యింకా మాటాడుతునే వున్నారు.

"శెలవ్. నువ్వు మంచివాడివి!" అని ఆ చిన్న మనిషి అన్నాడు.

యిద్దరికీ గొంతులో యేదో అడ్డుపడినట్లయింది. వారు వసారాలో కెళ్ళేరు.

"ఆఁ. అన్నట్టూ, బిల్లు యెప్పుడు చెల్లించారో చెప్పండి" అని పొడుగాంటి మనిషివైపు తిరుగుతూనే సిగ్గిల్లుతూ ప్రయాణీకుడన్నాడు.

"యేం ఫర్వాలా, యేం ఫర్వాలా" చేతితొడుగులు తొడుక్కొంటూ పొడుగాంటి మనిషి అన్నాడు; అని మళ్ళా తలవని తలంపుగా యిలా అన్నాడు:

"నువ్వంటే నాకెంత అసూయగా వుంది!"

ప్రయాణీకుడు స్లెడ్జిబండిలో కెక్కి, కోటు కప్పుకొని, తానంటే అసూయగా వుందన్న మనిషి కూచోటం కోసం కొంచెం జరిగేడు. "అలా అయితే రండి" అని అతను వణికే కంఠస్వరంతో అన్నాడు.

కాని, ఆ పొడుగాంటి మనిషి "శెలవ్, డిమిట్రీ. భగవంతుడు నిన్నాశీర్వదించుగాక! నా కోరిక—" అని మాత్రమే అన్నాడు. అతని కోరిక తన మిత్రుడు యెంత త్వరగా బైలుదేరితే అంత మంచిదనే దవటం వల్ల ఆ వాక్యం అతను పూర్తి చెయ్యనేలేదు.

వొక క్షణంపాటు అంతా నిశ్శబ్దంగా వున్నారు. తర్వాత వొక గొంతుక "శెలవ్" అంది, మరొకటి "తయార్!" అని అరిచింది, బండి సరాసరి వెళ్ళిపోయింది.

"హే ఎలిజార్!" అని మిత్రుల్లో వొకరు పిలవగా బండివాళ్ళు దడాలుమని లేచి నాలుకతో ఛుకఛుక ధ్వనులుచేస్తూ, కళ్ళెపు తాళ్ళు లాగేరు. బండి చక్రాలు గడ్డకట్టిన ఆ మంచుమీద కిరకిర మన్నాయి.

"ఓలెనిన్ భలేవాడు" అని మిత్రుల్లో వొకరన్నారు. "కాని కకేషియాకి పోవటం చూడు! అందులోనూ చిన్న వుద్యోగిగా! నేనైతే చచ్చినా ఆ పని చెయ్యను......రేపు నువ్వు క్లబ్బులో భోంచేస్తావా?"

"ఆఁ."

ఆ మాటతో యిక వాళ్ళు యెవరి దోవన వాళ్ళు పోయేరు.

ప్రయాణీకుడికి వెచ్చగా, వేడిగా కూడా, వుంది. కోటు గుండీలు తీసి అతను బండి అడుగు భాగాన కూచున్నాడు; వెంట్రుకలు దట్టంగా వున్న మూడు గుర్రాలు బండిని బలవంతాన లాగుతుండగా, బండి వొక చీకటివీధిలోంచి మరోచీకటి వీధిలోకి పోతూ, అతనెన్నడూ చూడని యిళ్ల ప్రక్కగా పోతోంది. దూరప్రయాణాలమీద పోయేవారు మాత్రమే యిలాంటి వీధులగుండా పోతారని అతనికి తట్టింది. అతని చుట్టూవున్న చీకటి నిశ్శబ్దంగానూ భయంకరంగానూ వుంది; కాని, అతని హృదయం మాత్రం యేవో గ్యాపకాల్తో, ప్రేమతో, పశ్చాత్తాపాల్తో, కన్నీటి భారంతో నిండివుంది.

"వారంటే నాకు మక్కువ, చాలా మక్కువ. చక్కని వాళ్లు! చాలా చక్కని వాళ్ళు!" అని అతను మరల మరల అనుకో సాగేడు. అతనికి యేడ్వాలనిపించింది. అత నెందుకు యేడ్వాలనుకున్నాడు? అతనంత మక్కువగా వున్న ఆ చక్కని వాళ్ళెవరు? ఇది అతనికి బాగా తెలీదు.

అతను యిళ్ళవంక చూసి ఆ యిల్లో యీ యిల్లో అలాగో ఎలాగో అంత చోద్యంగా యెందుకు కట్టారా అని వింత నొందేడు; ఎందుకని తన కంటే యెంతో విభిన్నమైన బండివాడూ, ఐవానూ తనకి అంత దగ్గరగా కూచుని, చలికి పిడచ గట్టుకొనిపోయిన టంగువారుల్ని గుర్రాలు లాగుతుండగా తనతోపాటు వూగుతూ, కుదుపుళ్ళుబడుతున్నారా అని వొక్కోసారి అతనికి విచిత్రమైంది. తర్వాత మళ్లీ, "వాళ్ళు చక్కని వాళ్ళు! వాళ్ళంటే నాకు చాలా మక్కువ!" అని నణుక్కొంటాడు. వొక తడవ యిలా బిగ్గరగా అన్నాడుగూడాను.

"దానిది యెంత తాకిడీ! అది అద్భుతమైంది గాదూ?"

అని పలికి తన నలా అనేట్లు చేసిందేదా అని వింతపడి తన నిలా ప్రశ్నించుకొన్నాడు.

"నేను మస్తుగా తాగి వున్నానా? యెంత చికాకు.........." నిజాని కతను రెండు సీసాల ద్రాక్ష సారా దాచి వున్నాడు గూడాను; ఐనా, కేవలం దాని ప్రభావమే అతని మనసుమీద లేదు. తన స్నేహితులు వుత్సాహంతోనూ, భిడియపడుతూనూ—అతని కగపడినట్లు మనఃపూర్వకంగానూ—యిచ్చిన వీడ్కోలుని అతను జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. ఆ కర సంచాలనం, ఆ మౌనాలు, ఆ హఠాత్తు చూపులు, తను బండిలో యెక్కినపుడు "శెలవ్" అన్న ఆ కంఠస్వరం అదంతా అతను జ్ఞాపకం చేసుకొన్నాడు; పరిదర్శించిన యెదుగు బొదుగులు లేని నిష్కాపట్యాన్ని మననం చేసుకొన్నాడు; యిదంతా అతని దృష్టిలో చాలా ప్రాముఖ్యతగల విషయం: తన బంధు మిత్రులేగాక, తనంటే యింతకుముందు నిర్లక్ష్యంగా చూసే వాళ్ళేగాక, తనంటే శత్రుభావంతో వుండేవాళ్లుగూడా తన నింతకుముందు కంటే యెక్కువగా ప్రేమించ దలచినట్లో—లేక మరణశయ్య మీదున్న

వాడిని క్షమించినట్లుగా—తాను ప్రియాణమై వెళ్ళేముందు క్షమించదలచి నట్లగుపించారు. "బహుశా కకేషియా నుంచి నేనెన్నడూ యిక తిరిగి రానేమో" అని అత ననుకొన్నాడు. తన మిత్రుల్నీ మరింకెన్నో తలచుకొని అతని హృదయం ప్రేమతో వుప్పొంగింది. అతనికి తనపట్ల తనకే జాలి కలిగింది. అతనికి తన మిత్రులపట్లగల వాత్సల్యమో, లేక వొక స్త్రీపట్ల గల ప్రేమో—అతనింకా యే స్త్రీనీ యెన్నడూ ప్రేమించలేదు—అతని హృదయాన్ని కదిలించి, మెత్తపరచి అతని పెదిమెలమీదకి అర్థం పర్థంలేని మాటల్ని తెప్పించలేదు: అలా చేసిందేదంటే తనలోగల మంచి కంతకీ తనకు గల ప్రేమ. (తనలో మంచి దప్పితే మరేదీ లేదని ఆ సమయంలో అతని కగపడింది).

చదువు పూర్తి కాకముందే ఓ లెనిన్ యూనివర్సిటీ వదిలేశాడు; అతనెప్పుడూ పని చేసినవాడు గాదు (ఒక గవర్నమెంటు ఆఫీసు పేరుకు మాత్రం అతని కొక ఉద్యోగం వుండేది); ఇరవై నాలుగేళ్ళ వయసొచ్చే వరకి తన ఆస్తిలో సగం తగలేసేడు; అతను సాధించిందేమీ లేదు; ఆఖరి కేదన్నా బ్రతుకు బాట చూసుకోనుగూడా లేదు.

ధనికుడూ యువకుడూ ఐన రష్యనువాడు 1840 ఆ ప్రాంతాల్లో యెంత అడ్డూ ఆపూ లేకుండా వుండేవాడో, యితడుగూడా తన పద్ధెనిమిదో యేట నుండీ అంత యిదిగానూ వుండేవాడు. ప్రత్యేకంగా అలా యెందుకు జరిగిందంటే అతని తల్లి దండ్రులు అతనికి చాలా చిన్న వయసులోనే చనిపోయారు గనుక, శారీరకంగా గానీ, నైతికంగాగాని అత న్నేదీ బంధించిలేదు. అతని కేలోటూ లేదు; యే బాధ్యతాలేదు—తన యిష్టం, తనరాజ్యం. అతనికే కుటుంబమూ, యేదేశమూ, యేమతమూలేదు. అతనికి దేనిలోనూ విశ్వాసంలేదు, దేనినీ అంగీకరించలేదు. ఐనప్పటికీ, దేనిలోనూ అతనికి విశ్వాసం లేకపోయినప్పటికీ, అతనికి చిరాకూ, చిరబురలాడటం, బిగదీసుకు కూచోటం లేవు; తద్భిన్నంగా, అతనెప్పుడూ యేగాలికి పడితే ఆగాలికి కొట్టుకుపోయేవాడు. ప్రేమ అనే దేదీ లేదనే నిర్ణయాని కొచ్చినప్పటికీ, అతనిముందర ఆకర్షణీయమైన యువతెవరన్నా వుంటే అతని హృదయం గతుక్కు మనేది. మర్యాదలూ, సర్యాదలూ, బిరుదులూ, హెూదాలూ అంటే అతనికి అసహ్యం; ఐనా యే విందు సమయాన్నో ప్రిన్స్ సెర్జీ అతని

వద్ద కొచ్చి మర్యాదగా పలకరించితే సంతృప్తితో భుజాలెగరేయకుండా వుండేవాడు గాడు. అయినప్పటికీ తనని బంధించే దేదీలేనప్పుడు మాత్రమే అలాంటి భావాలకి లొంగి పోయేవాడు. తన వుద్రేకం తనని శరీర కష్టం వైపో, శ్రమలవైపో, జీవితంలో పోరాటంవైపో యీడ్చుతుందని అతను గ్రహించగానే సరాలున ఆ బాదరబందీనుంచి వెనక్కు తగ్గి స్వేచ్ఛగా వుండటానికి చూసేవాడు. అలా అతను ఘరానా సంఘ జీవితంతోనూ, సేద్యంతోనూ—తన జీవితాన్ని వొకప్పుడు దేనికి అంకితం చేయాలను కొన్నాడో ఆ సంగీతంతోనూ—తానేమాత్రం విశ్వసించని ప్రేమతోనూ ఆటలాడు కొన్నాడు. బుది బలానికీ, హృదయానికీ, విద్యకీ సంబంధించక, వొకసారి పోగొట్టుకొంటే మరెన్నడూ తిరిగి రానటువంటి ఆతృతకి సంబంధించిన యువశక్తిని— తన జీవితాన్ని తీర్చి దిద్దుకు పోటానికి లేదా, లోకాన్ని తన కనుకూలంగా మలుచుకోటానికి మానవుడి జీవితంలో వొకే వొక సారి యివ్వబడే ఆయువ శక్తిని- యెలా వుపయోగించాలా అని అతడు వింత నొందేడు. అతను ఆ శక్తిని కళకీ, శాస్త్రీయ జ్ఞానానికీ విని యోగించాలా, లేక ప్రేమకీ, ఆచరణ యోగ్యమైన మరో పనికీ వినియో గించాలా?

కొంతమందికి యీ ఆతృత అనే దెన్నడూ వుండనే వుండదు. అలాంటివారు జీవిత రంగంలోకి ప్రవేశించినాక తమ మెడమీద యే కాడి పడుతుందో దాన్ని అంగీకరించి, తమ జీవితమంతా యిక దాంట్లోనే కష్టిస్తారు. తనలో వున్న సర్వశక్తిమంతమైన యువశక్తిని గురించి, వొక ఆశకోసరమో ఆశయం కోసరమో సంపూర్ణంగా ఆ పనిలో నిమగ్నమై కృషి చెయ్యగల తన శక్తిని గురించి, దూకాలంటే వెనకాముందూ చూడకుండా అగాధ పాతాళంలోకి గూడా దూకించగల తన శక్తిని గురించి, ఓలెనిన్‌కి సంపూర్ణంగా తెలుసు. యీ శక్తి అంటే, అదేమిటో అసలతనికి తెలీకపోయినప్పటికీ, అతనికి గర్వం గూడాను; అందులో అతనికి ఆనందం వుంది.

ఓలెనిన్‌కి తనమీద మాత్రమే ప్రేమ వుంది; తన నలా ప్రేమించు కోకుండా వుండలేడు గూడాను; యెందుకంటే తనవల్ల అంతా మేలు దప్పితే మరోటి జరగదని అతని వుద్దేశ్యం; కాగా, అతను నిరాశపడటం యింకా సంభవించలేదు గూడాను. తన గత జీవితమంతా సరైంది గాదనీ,

యింతవరకూ జరిగిందంతా ప్రాముఖ్యత లేనిదనీ యేదో తలవని తలంపు జరిగిందనీ, తానింకా సరైన జీవితం జీవించటం కోసరం నిజమైన ప్రయత్నం చేయలేదనీ; పౌరపాట్లూ గృహపాట్లూ, చిరబురలూ అన్నీ లేకుండా అచ్ఛం సౌఖ్యంతో నిండివున్న వొక నూత్న జీవితం యిప్పుడే ప్రారంభ మవుతూందనీ తన గత లోపాల్ని గుర్తించిన మానవుడు మహదానందంలో అనుకొంటాడు. అలాంటి మహదానందంలో అతను మాస్కో వదలి పోతున్నాడు.

దూరప్రయాణాలమీద వెళ్ళేటప్పు డెప్పుడూ ప్రారంభదశలో మన మనస్సు మనం బయలుదేరిన చోటుమీదే వుంటుంది. తర్వాత హఠాత్తుగా యే మర్నాటి ఉదయాన్నో మనం ప్రయాణం చేస్తున్నపుడు మన మనస్సు మన పోబోయే చోటిమీదికి వొక్కంగంతేసి గాలి మేడలు కట్టటం ఆరం భిస్తుంది. ఆలాగే ఓలెనిన్ విషయంలోనూ జరిగింది.

మాస్కో నగరం విడిచిపెట్టి మంచు కప్పివున్న విశాలమైన పొలా లున్నచోటికి రాగానే వాటి మధ్య తా నొంటరిగా వున్నందు కతను ఆనం దించేడు. తన కోటును కప్పుకొని నిద్రమత్తుతో ప్రశాంతంగా అతను స్లెడ్జి బండి అడుగు భాగాన పడుకున్నాడు. మిత్రులనుంచి యెడబాటైనందు కతనికి చాలా విచారం కలిగింది. గత సంవత్సరం చలికాలంలో తాను మాస్కో నగరంలో గడిపిన దినాలు అతని మనసులో అగపడినాయి. తనకి వీడ్కోలు యిచ్చిన మిత్రుణ్ణి, తాము మాట్లాడుకొన్న యువతితో అతనికి గల సంబంధాన్ని గురించి అతను గ్యాపకం చేసుకొన్నాడు. ఆమె ధనిక స్త్రీ. ''నే నామెని ప్రేమించానని తెలిసుండికూడా అతనెలా ఆమెని ప్రేమించాడు?'' అని అతను అనుకున్నాడు; దాంతో పిచ్చి అనుమానాలు అతని మనసులో రేగినాయి. "మనుషులు నీతిలేనివాళ్ళు ఆలోచించిచూస్తే."

తర్వాత అతను తన నిలా ప్రశ్నించుకొన్నాడు:

"నే నెన్నడూ అసలు ప్రేమించలేదెందుకని? ప్రతివారూ అదే అంటున్నారు. నేను అసహజమైన మనిషినా?''

తన మోహామదాంధతని అతను జ్ఞప్తికి తెచ్చుకోసాగేడు. తను ఓం ప్రథమంగా కులనీ సంఘంలోకి ప్రవేశించటాన్ని గూర్చి అక్కడ తాను

చాలాసార్లు కాలక్షేపం చేసిన తన మిత్రుడి చెల్లెల్ని గురించీ అతను మననం జేసుకొన్నాడు. మొదటిసారిగా ఆమెని కలిసికొన్నప్పుడు మేజాబల్ల మీదున్న దీపపుకాంతిలో, కూచుని యేదో కుట్టుకుంటున్న ఆమె మృదు మధురమైన ముఖంయొక్క దిగువభాగం శోభాయమానంగా ప్రకాశించింది. యీడికగావున్న అప్పటి సంభాషణల్నీ, అప్పుడు తనకి గలిగిన చిరాకునీ, తత్తరపాటునీ, ఆ ఆచారాల పట్టింపూ ఆ బాధా అంటే తనకున్న అసహ్యతనీ అతను గ్యాపకం చేసుకొన్నాడు. "అసలుది యిదిగాదు యిదిగాదు" అని అతనినేదో కంఠస్వరం అదేపనిగా హెచ్చరించింది; నిజంగా అంతే జరిగింది గూడాను.

తర్వాత, వొక సుందరితో గలిసి మజార్కా అనే నృత్యం చేసిన సంగతి నాతడు మననం చేసుకొన్నాడు.

"ఆ రాత్రి నే నెంత మోహంలో పడిపోయాను. ఎంత హాయిగా వుండింది! ఆ మర్నాటి వుదయం నిద్రలేచినపుడు నేను స్వేచ్ఛగావున్నా ననుకొనే సరికి నా కెంత నిరాశా నిస్పృహలు కలిగినయ్యీ!! నాలో ప్రేమనేది పుట్టి నా కాళ్ళు చేతుల కట్టి పడెయ్యలేదెందుకని? ఉహూం. అసలు ప్రేమనేదీ లేదు. తాను నక్షత్రాల నెంతగా ప్రేమించిందో — అంతకుముందు ద్యుబోరినిన్‌తోనూ, మార్షల్‌తోనూ చెప్పినట్లుగా నాతో అదే పనిగా చెప్పిన ఆ పల్లెటూరి స్త్రీగూడా ప్రేమనేది కల్గించలేక పోయింది" అని అతననుకొన్నాడు.

ఇది అతని వ్యవసాయాన్ని గురించి గ్యాపకం చేసింది; యీ ఆలోచనలు గూడా చప్పగానే వున్నాయి. "వారికి నేనెంతకాలం గ్యాపకముంటాను?" అని అతను ప్రశ్నించుకొన్నాడు; కాని, ఆ "వారు" అనేవారెవరో అతనికి తెలీనే తెలీదు. ఆ తర్వాత మరో ఆలోచన తట్టి అతను జంకి సణుక్కొనేటట్లు చేసింది: అది తాను ఆరువందల డెబ్బయి రొనిమిది రూబుల్లు బాకీపడిన మష్యూర్ కేప్పెలెట్ అనే దర్జీపనివానికి సంబంధించిన ఆలోచన; బాకీ తీర్చటానికి మరో సంవత్సరం వరకు ఆగాలని బతిమాలిన తీరూ, అప్పుడతని ముఖంలో అగుపించిన కలవరం, సహనం అదీ అతని మనస్సులో కనిపించేయి.

"భగవంతుడా! ఓ భగవంతుడా" అని బాధతో నణుక్కొంటూ సరుశ్రమని కోపం తెప్పించే ఆ దృశ్యాన్ని తన మనసులోంచి తోలెయ్యాటానికి ప్రయత్నించేడు. "ఐనా, యింత జరిగినా, ఆమె నన్ను ప్రేమించింది!" అని, ఆనాటి సాయంకాలం తాము మాటాడుకొన్న యువతిని మళ్లీ తల్చుకుంటూ అతను తనని పశ్నించుకొన్నాడు. "నిజం. ఆమెని నేను పెళ్లి చేసుకొనివుంటే బాకీలన్నీ పూర్తిగా తీర్చేసి వుండేవాణ్ణి; మరి యిప్పుడింకా నేను వాసిలీవ్ బాకీపడే వున్నానయ్యో."

తాను క్లబ్బులో పేకాడిన ఆనాటి సాయంకాలాన్ని గుర్తుకు తెచ్చుకొన్నాడు; ఆమె దగ్గరనుంచి అతను నరాసరి క్లబ్బుకి వెళ్ళి అవమానంతో కుంగిపోతూ వాసిలీవ్‌ని బతిమాలుకొన్నాడు; అతను నిష్కర్షగా నిరాకరించేడు. "వొక్క సంవత్సరం జాగ్రత్తగా ఖర్చుపెట్టుకొన్నానంటే ఆ వెధవ బాకీఅంతా తీరిపోతుంది!"

యింత నమ్మకం అతనికున్నప్పటికీ తాను ఎవరెవరికి బాకీవున్నాడో, యెంత బాకీ వున్నాడో, యెప్పుడెప్పుడు ఆ బాకీలు చేసాడో, వాటినెప్పుడు తీర్చగలడో మొదలైన విషయాలన్నీ అతను అంచనా కట్టుకోసాగేడు. "అసలు చూడనియ్యి! మోరెల్‌కిగూడా యింకా కొంత బాకీ వున్నాను" అని అనుకొంటూ అంత పెద్ద బాకీ చేసిన ఆ రాత్రిని అతను గ్నాపకం చేసుకొన్నాడు. అది జరిగిందొక యెరుకల నృత్యప్రదర్శనం వద్ద. దానేర్పాటుచేసింది పీటర్సుబర్గుకి చెందిన పెద్ద మనుషులు — జారు చక్రవర్తి సహోద్యోగి సాష్కా అనేవాడూ, మరొకడూ, ఆ ఖడాయికోరు గాడిదానూ...... "యీ పెద్ద మనుషులు తమని గురించి తాము అంత పొంగిపోవట మెందుకో?" అని అతననుకొన్నాడు. "తమ ముఠాలో కొకర్ని చేర్చుకోటమంటేనే వొక పెద్ద గౌరవమని అనటానికీ, అసలా ముఠాని యేర్పాటు చెయ్యటానికి వీళ్ళకేం హక్కుందంట? చక్రవర్తిగారి మనుషులమనా? యితరుల్ని వెధవలుగా, శుంఠలుగా వాళ్ళు చూసే తీరు చూస్తే నిజంగా అసహ్యమేస్తుంది! ఐనా, వాళ్ళంటే నాకు ఆవగింజంతైనా లెక్కలేదని వాళ్ళకి చూపాను. అయినప్పటికీ నేను జారు చక్రవర్తిగారి సహోద్యోగీ, కర్నలూఐన సాష్కావంటి వాడితో బాగా స్నేహితంగా వున్నానని ఆంద్రీకి తెలిస్తే అతను ఆశ్చర్యపడి చస్తాడు...అవును. ఆరాత్రి నేను అందరికంటే బాగా తాగి, ఆ యెరుకలవాళ్ళ కొక కొత్తపాట

నేర్పాను. అందరూ శ్రద్ధగా విన్నారు. యింకా బొచ్చెడన్ని పిచ్చిపనులు చేసి వుండేవాణ్ణి''అని అతననుకొన్నాడు. "ఐనా, నేనింకా చాలా చక్కని యువకుణ్ణి.''

ఓ లెనిన్ మూడో మజిలీవద్ద కొచ్చేసరికి ఉదయమైంది. అతను కొంచెం టీ త్రాగి, ట్రంకుపెట్టెలూ పార్సెళ్ళూ అవీ సర్దటంలో ఐవాన్‌కి తోడ్పడ్డాడు. అతని ముఖం ప్రశాంతంగావుంది. యేది ఖచ్చితంగా యెక్కడుందో, డబ్బెక్కడుందో, యెంతవుందో, తన ప్యాస్‌పోర్టూ, ప్రయాణానికి సంబంధించిన కాగితాలవీ యెక్కడున్నాయో—అతనికి తెలుసు. అవన్నీ చక్కగా సర్దినామనే భావం అతనికి వుల్లాసం కలిగించింది. ఆ పెట్టె బేడలమధ్య అతను సర్దుకు కూచున్నాడు. ముందున్న ప్రయాణం అతనికొక చక్కని జల్సా దూరప్రయాణంగా కన్పట్టింది.

ఆ వుదయాన్నా, మధ్యాహ్నంలో కొంత భాగమూ అతను అంచనాలు కట్టటంలో గడిపేడు. యిప్పటికేకొన్ని మైళ్ళు ప్రయాణంచేసిందీ, తరునాతి మజిలీ కింకా యెన్నిమైళ్ళున్నదీ, టీ గానీ మధ్యాన్నం భోజనం తీసుకొనే సరికి యెన్ని మైళ్ళు వెళ్ళేదీ, స్టావ్‌రోపోల్‌కి యెంతదూరమున్నదీ, మొత్తం ప్రయాణమింకా యెంత వున్నదీ.........

అదే సమయంలో, తనవద్ద యెంత డబ్బున్నదీ, యెంతమిగిలేదీ, తన బాకీలన్నీ తీరాలంటే యెంత కావాలిసిందీ, నెల జీతంలో యెంత ఖర్చు పెట్టాల్సిందీ అతను ఆలోచించి చూసేడు. స్టావ్‌రోపోల్ పోవాలంటే మొత్తం ప్రయాణంలో యేడోవంతు పోవాల్సుంటుందనీ, బాకీలు తీరాలంటే యేడు నెలలపాటు తాను జాగర్తగా డబ్బు మిగల్చాల్సి వుంటుందనీ, తన మొత్తం డబ్బులో అది యెనిమిదో వంతనీ, అని అతను టీ వేళయ్యేసరికి లెక్కలు గట్టి సంతృప్తిపడి వున్నిబట్టలు నిండా కప్పుకొని బండి అడుగు భాగాన చాచుకొని పడుకొని నిద్రపోయేడు.

ఇకనుంచీ అతని వూహాపోహలు భవిష్యత్తుమీదకి, కకేషియామీదకి, పోయినాయి. అతని కలలు అమాలత్ బేగ్‌తోనూ, సిర్‌కేషియన్ స్త్రీలతోనూ, పర్వతాలూ, వడిగల ప్రవాహాలూ, నిట్రంగావుండే కొండకోనలూ, ప్రమాదమూ మొదలగు వాటితో నిండిపోయినాయి. యిదంతా అస్పష్టంగానూ, గలిబిలిగానూ వుంది. ఐనా, కీర్తి సంపాదించాలనే ఆకాంక్షా,

రానున్న పరిమాదమూ భవిష్యత్తుని గురించి అతనికి ఆసక్తి పుట్టేట్లు చేసేయి. కనీ వినీ యెరుగని ధైర్యసాహసాల్తో అందరికి దిగ్భ్రమ కలిగించే లాగా లెక్కలేనంతమంది పర్వతవాసుల్ని తునుమాడుతూ జయంచి పారేస్తున్నట్లొకసారీ, మరోసారి తానే పర్వతవాసుడైనట్లూ రష్యన్ పాలననుండి స్వాతంత్ర్యం కోసరం పోరాడుతున్నట్లూ అతను కలగన్నాడు. ఆ దృశ్యాలు స్పష్టంగా కనపడసాగగానే తాను బాగా యెరిగున్న మాస్కోవాళ్ళు రంగంలో కనిపించేరు: రష్యన్లతోనో పర్వత వాసుల్తోనో పోరాడుతూ సాష్కావొకడున్నాడు; ఆఖరి కతని దర్జీవాడు గూడా వర్ణించ నలవిగానంతగా విజయుల విజయోత్సాహంలో పాల్గొంటున్నాడు! వీటన్నిటి మధ్యన, తానంతకుముందు పడిన అవమానమో, తప్పో, బలహీనతో తలపుకొస్తే యిప్పుడదేమాత్రం బాధ కలిగించటం లేదు: యెందుకంటే ఆ పర్వతాలూ, ఆ సిర్కేషియన్ యువతులు, ఆ ప్రవాహాలూ, ఆ ప్రమాదాలూ మధ్య యీ తప్పులేవీ యిక జరగవని చాలా స్పష్టంగా తెలుస్తోనేవుంది. వొకసారి తాను వాటిని వొప్పుకొన్నాడు గనుక యిక వాటి ప్రమేయం లేనే లేదు.

అన్ని దృశ్యాలకంటే ప్రియమైన వొక దృశ్యం మాత్రం అతని ఆలోచన లన్నింటిలోనూ వస్తోంది: అది ఓ సన్నని నడుమూ, పొడుగాంటి జడలూ, గంభీరమైన అమాయికపు కళ్లూ గలిగిన వొక సిర్కేషియన్ బానిస యువతికి సంబంధించి నట్టిది. పర్వతాల్లో వొక యెత్తయిన చోట నొంటరిగా వున్న వొక గుడిసె గడపమీద నుంచుని ఆమె అతనికోసం చూస్తోంది. అతను అలిసిపోయి, ధుమ్ము కొట్టుకొని, నెత్తురుతో తడిసి, విజయుడై ఆమెవద్దకి తిరిగొస్తున్నాడు. ఆమె ముద్దులు, ఆమె మధుర కంఠధ్వని, ఆమె భుజాలు, ఆమె అణకువ అతని హృదయాని కానందం గలిగించింది. ఆమె అత్యంత మనోహరంగావుంది గాని నాగరికత లేని మోటుమనిషి. చలికాలంలో ప్రతి సాయంకాలం అతను ఆమెకి చదువు నేర్ప నారంభించేడు. ఆమె తెలివితేటలుగలదీ, విషయాన్ని వెంటనే గ్రహించేదీ అవటం వల్ల కావలసిన విజ్ఞానమంతా త్వరలోనే సంపాదించింది. యేం, యెందుకు కాదూ? ఆమె సులభంగా విదేశీ భాషలు నేర్చుకోగలదు; ఫ్రెంచి సాహిత్యంలోని మహాగ్రంథాల్ని చదివి అర్థంచేసికోగలదు; ఉదాహరణకి నోటర్ డామ్‌డీపారిస్ ఆమెని తప్పకుండా మెప్పించగలదు. ఫ్రెంచి భాష

మాట్లాడగలదు గూడాను. గొప్ప కులీన సంఘానికి చెందిన స్త్రీకంటే అతి ఖులగదిలో ఆమె సహజమైన ఔన్నత్యాన్ని ప్రదర్శించగలదు. నిరాడంబరంగానూ, శక్తిమంతంగానూ, ఉద్రేకంతోనూ ఆమె పాడగలదు గూడాను. "యెంత అర్థంగాని వెధవవూహ!" అని ఆకస్మికంగా అతననుకొన్నాడు. సరిగ్గా అదేసమయానికి బండీ గుర్రాలూ మార్చుకొనే మజిలీ వచ్చింది. అక్కడ తను మరోబండిలోకి మారి అక్కడివాళ్లకి మామూలియ్యాలి.

కాని అతని వూహ లింకా అర్థంలేని ఆ "వెధవ చెత్త"కి అంటిపెట్టుకొనే వున్నాయి; మరోసారి అతనా యువతిని తల్చుకున్నాడు. విజయుడై వొకసిర్‌కేషియన్ సుందరితో చెట్టాపట్టాలు పట్టుకొని, జారు చక్రవర్తికి సహాయోద్యోగిగా నియమింపబడి రష్యాకు తిరిగి వెళ్తున్నట్లు అతడూహించుకొన్నాడు. "కాని ప్రేమనే వస్తువేదీ అసలు లేనేలేదు" అని మళ్లీ అనుకొన్నాడు. "గౌరవాలూ, బిరుదాలూ అన్నీ వట్టి చెత్త. కాని ఆ ఆరువందల డెబ్బయి యెనిమిది రూబుళ్ల మాటేమిటి మరి? నేను జయించిన భూభాగంవల్ల నా జీవితమంతటికీ సరిపోయేదానికంటే యెక్కువ డబ్బు వస్తుంది. నేను దాన్ని యెవరికన్నా యిచ్చెయ్యాలి. కాని, యెవరికి? సరే, కేప్పెలెట్‌కి ఆరువందల డెబ్బయి యెనిమిది రూబుళ్లు; పోతే తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు—"

అతని ఆలోచనలు గలిబిలిగానూ, తీరూ సారూ లేకుండానూ తయారయ్యేయి; అతని గాఢనిద్రని ఐవాన్ కంఠస్వరమూ, బండి ఆగిన ధ్వనీ చెడగొట్టేయి; సగం నిద్రలోనే అతను బండిదిగి తూల్తూ మరోబండిలోకి మారేడు; తిరిగి ప్రయాణ మారంభమైంది.

## 3

రష్యా మధ్యభాగంనుంచి దూరమైన కొలదీ గతాన్ని గురించిన జ్ఞాపకాలు తగ్గిపోసాగేయి. కకేషియాకి దగ్గరౌతున్న కొలదీ అతని హృదయానికి ఉల్లాస మెక్కువవుతోంది. అక్కడే వుండిపోవాలనీ, యిక వెనక్కి తిరిగి రాగూడదనీ వొక్కొక్కప్పు డత ననుకొన్నాడు. "యిక్కడ

నేను చూసే ప్రజలెవరూ నిజంగా ప్రజలుగాదు. వీరిలో యెవరూ నన్నెరగరు. వీ రెవరూ మాస్కో కులీన సంఘంలో ప్రవేశించి నా గతాన్ని గురించి తెలిసికోలేరు. అలాగే వీరిమధ్య నే నేం చేస్తున్నానో మాస్కోవాళ్లెవరూ తెలిసికోలేరు.'' దారిలో తనకెదురైన యీ మోటు మనుషుల మధ్య, మాస్కోలోని తన మిత్రుల్ని చూసినట్లు ప్రజలుగా చూడని యీ అనాగరిక ప్రజలమధ్య, గతాన్నుంచి తనకి సంపూర్ణ స్వేచ్ఛ కలిగిందనే భావం అతనికి కలిగింది. యీ ప్రజలు యెంత మోటుగా, యెంత అనాగరికంగా అతనికి కనపడితే అంత స్వేచ్ఛా వాయువు లతను పీల్చగలిగేడు.

స్టావ్రోపోల్ మొత్తాని కతని అంచనాల్ని తలకిందులు చేసింది. అంగళ్ళకి సైనుబోర్డు లున్నాయి. కొన్ని ఫ్రెంచి భాషలో గూడా వున్నాయి; చౌకంలోవున్న గుర్రబ్బళ్ళల్లో స్త్రీలున్నారు; విశాలమైన ఆ వీధిగుండా విలాసంగా నడుస్తూ వొక పొడుగాంటి వదులుకోటు తొడిగిన వొక పెద్దమనిషి ఎచ్చే పోయే వారివంక చూస్తున్నాడు. యిదంతా చూసి అతని మనస్సు కుంగిపోయింది. ''బహుశా యీ మనుషులు నా మిత్రుల్ని కొంతమందిని యెరిగున్నారేమో'' అని అతను ఆలోచించేడు. మళ్ళీ అతనికి ఆ క్లబ్బూ, అతని దర్జీ మనిషీ, జూదం, మాస్కో కులీన సంఘం......తలపుకొచ్చినాయి.

ఎలాగైతేనేమి స్టావ్రోపోల్ తర్వాత అంతా సంతృప్తికరంగా వుంది. అంతా మనోహరంగా, అపురూపంగా, సాహసోపేతంగా వుంది. ఆ కోసక్కులూ, ఆ బండి మనుషులూ, ఆ మజిలీ ఆఫీసులోనివాళ్ళూ నిరాడంబరంగా అతని కగుపించేరు; వారితో మనసువిప్పి, వా రే వర్గం వారా అనే ప్రమేయం లేకుండా, తాను మాట్లాడవచ్చు. తానిప్పుడు హృదయపూర్వకంగా ప్రేమించసాగిన మానవజాతికి చెందిన మనుష్యులు వాళ్లు; వాళ్ళు తనని మిత్రుడిగా చూసేరు.

డాన్‌కోసక్కులరాష్ట్రంలోనే అతను ప్రయాణించుతూన్న స్లెడ్జి బండి మామూలు బండికి మార్చబడింది. స్టావ్రోపోల్ దాటినాక చాలా వెచ్చగా వుండటంవల్ల ఓ లెనిన్ తన వున్ని తొడుగులు తీసేసేడు. అది వసంతకాలం—శోభాయమానంగా, అనుకొన్నదానికంటే అద్భుతంగా వున్న వసంతకాలం. రాత్రి ప్రయాణాలవల్ల ప్రమాదం జరుగవచ్చు

గనక పొద్దున్నకి వొక ప్రయాణం చెయ్యవద్దని కోసక్కులతనికి సలహా యిచ్చేరు. ఓలెనిన్‌కి ఏమిటోగావుంది; మందు దట్టించిన వొక తుపాకీ బండిలో సిద్ధంగా వుంచబడింది. ఓలెనిన్‌కి ఉల్లాసం పెరగసాగింది. వొక మజిలీ ఆఫీసువద్ద ఆఫీసువాడొకడు యీ మధ్యనే పల్లిస్కు రోడ్డుమీద జరిగిన వొక దారుణ హత్యని గురించి వారికి చెప్పేడు. పోనుపోను వారికి సాయుధులైన మనుషులు కనపడసాగేరు. “అయితే యిక్కడినుంచీ దాని ప్రారంభమన్నమాట!” అనుకొని ఓలెనిన్ తానిదివరకి చాలాసార్లు విన్న మంచుతో కప్పబడిన పర్వతాలు యెదురౌటం కోసం చూడసాగేడు.

ఎట్టచివరికి వొకనాటి సాయంత్రం బండితోలేవాడు తన కొరడాతో దిఙ్మండలం వైపు చూపేడు. ఆతృతతో ఓలెనిన్ దూరంలోకి నిదానించి చూసేడు; కాని, మకమక లాడుతూన్న ఆకాశం, మబ్బుల్లో సగం కప్పబడిన పర్వతాలు మాత్రమే అగుపించేయి. అతనికి కనపడిందల్లా బూడిద వర్ణంగా, తెల్లగా, మెత్తగా వున్నలాగా వున్న దేదో మాత్రమే; అతనెంత కళ్ళుపొడుచుకొని చూసినప్పటికీ తానిదివరకి యెంతో విన్నటువంటి యెంతో చదివినటువంటి పర్వతాల ప్రత్యేకత యేమీ అగుపించలేదు. పర్వతాలూ, మబ్బులు అచ్చం ఒకేతీరుగా అతనికి కనపడినాయి; తనకు నమ్మకం లేనటువంటి బాచ్ సంగీతంలోని మధురత్వంలాగా, ప్రేమలాగా, యీ పర్వతాల ధవళ శిఖరాగ్రాల సౌందర్యం గూడా వొక కట్టుకథని అతను అనుమానించసాగేడు. అందువల్ల యిక వాటికోసం యెదురు చూడటమనే విషయాన్నతడు వదులుకొన్నాడు. కాని మర్నాటి ఉదయం చక్కని గాలి స్పర్శకి నిద్రలేచి మామూలుగా కుడివైపుకు చూసేడు. ఆకాశం అతి నిర్మలంగా వుంది. ఇరవై అంగలదూరంలోనా అన్నట్లు బ్రహ్మాండమైన స్వచ్ఛమైన తెల్లని శిఖరాలు కోమలమైన వంపుల్తో అతనికి హఠాత్తుగా కనుపించినాయి; అద్భుతంగావున్న వాటి ఆకారాలు దూరాకాశంలో స్పష్టంగా కనబడుతున్నాయి. అవి యెంతదూరాన్నున్నాయో అతను గ్రహించేడు; అంతులేని వాటి మహావిశాలత్వాన్ని, మహా సౌందర్యాన్ని అతడు చూసి యిది స్వప్నమేమో ననే భయం అతనికి కలిగింది. కళ్ళు తుడుచుకొని వొళ్ళువిరుచుకొని చూసేడు. ఆ పర్వతాలింకా అక్కడే వున్నాయి.

"యేమిటది? యేమిటది?"

"యేమిటేమిటి? పర్వతాలు" బండితోలేమనిషి నిర్లక్ష్యంగా అన్నాడు.

"నేనుగూడా చాలాసేపట్నుంచీ వాటివంక చూస్తున్నా" అన్నాడు ఐవాన్.

"అవి అందంగా లేవూ? యీ సంగతి ఇంట్లో చెపితే వాళ్ళు నమ్మనే నమ్మరనుకో."

ఆ నున్నటి రోడ్డుమీదుగా బండి వేగంగా పరుగెత్తుతూంటే ఉదయ సూర్యకాంతిలో పర్వత శిఖరాలు గులాబిరంగుతో ప్రకాశిస్తూండగా పర్వతాలు దిఙ్మండలం వెంట పర్వేష్టుతున్నట్లున్నాయి. ఓలెనిన్‌కి మొదట ఆశ్చర్యం కలిగిందిగాని తర్వాత ఆనందం గలిగింది. మైదానంలోంచే సరాసరి పుట్టిన మంచులో కప్పబడివున్న ఆ పర్వతాల వరుస చూస్తూంటే వాటి మనోజ్ఞత అతణ్ణి పరవశుణ్ణి చేసేయి. ఆపాద మస్తకం అతను పులకితగాత్రుడయ్యేడు. యిప్పుడతని ఆలోచనలన్నీ ఆ పర్వతాల గంభీర నిశ్చలతమీదా, రాజఠీవిమీదా కేంద్రీకరించబడి వున్నాయి. అతనదివరకి అనుభవించిన లజ్జావమానాలూ, పశ్చాత్తాపాలూ, మాస్కోను గురించిన ఆలోచనలూ, కికేసియానుగురించిన వెర్రిమొర్రి వూహలూ—అన్నీ జాడ అనేది లేకుండా మాయమైనాయి. "అది ప్రారంభమైంది!" అని వొక గంభీర కంఠస్వరం చెబుతున్నట్లుగా వుంది.

అప్పుడే కనపడసాగిన టెరెక్ ప్రాంతం, ఆ రోడ్డూ, ఆ గ్రామాలూ, ఆ ప్రజలూ అదంతా యిప్పుడతని కెంతమాత్రం అసంగతంగా అగుపించటంలేదు. అతను ఆకాశంవంక చూసి పర్వతాల్ని గురించి ఆలోచించేడు; తనవంకో ఐవాన్ వంకో చూచుకొని, తిరిగీ పర్వతాల్ని గురించే ఆలోచించేడు. యిద్దరు కోసక్ రౌతులు, తమ వీపుల వెనకాల తగిలించిన తుపాకులు తాళయుక్తంగా అటూ యిటూ వూగుతుండగా, గుర్రాలు గోధుమ రంగుగానూ బూడిద వర్ణంగానూ వున్న వాటి కాళ్ళు ఒకదానితో నొకటి కలిసిపోతున్నట్లు మామూలు గ్యాలప్‌లో పరుగెత్తుతుండగా, ఓలెనిన్ బండి ప్రక్కగా వెళ్ళేరు......టెరెక్ అవతల వొక తార్తారు కుగ్రామంలోంచి పొగ లేస్తోంది...సూర్యుడు నడినెత్తిన వున్నాడు; నీళ్ళల్లో

తళుక్కుమని మెరుస్తున్నాడు......రోడ్డువెంట వచ్చిన వొక తార్తారు బండి వారి దగ్గరకొచ్చింది; దాని పక్కన సుందర యువతులు నడుస్తు న్నారు...... "అబ్రెక్కులు (సిర్కేషియన్ బందిపోట్లు) స్టెప్పీమైదానం మీదుగా పరుగెత్తుతున్నారు; మరి నేనో, భయంలేకుండా యిక్కడున్నాను. నాకు యౌవనం, బలము, తుపాకీ వున్నాయి; పర్వతాలు గూడాను! ..."

## 4

టెరెక్‌నది కొకపక్కగా షుమారు యాభైమైళ్ళ పొడుగునా, మార్పేమీలేని ప్రదేశంలో గ్రెబెన్స్క్ కోసక్కుల గ్రామా లున్నాయి. పర్వతవాసులకీ, కోసక్కులకీ మధ్యగావున్న టెరెక్‌నది యింకా బురద నీటితో వుండి వేగంగా ప్రవహించుతోంది. మధ్య మధ్య బూడిదరంగుసిల్టు (బురదమట్టి)ని రెల్లుతోనిండి పల్లంగావున్న కుడి ఒడ్డుమీద పేరుస్తూ, నిట్రంగావున్న యెడమ వొడ్డుమీద యుగాలతరబడి వున్న ఓక్‌చెట్లనీ, చిన్న చిన్నపొదల్నీ చిక్కు రొక్కురుగా వున్న వేళ్ళతో సహా పెకలించి వేస్తూ ఆ వొడ్డుని కోసిపారేస్తోంది. కుడి వొడ్డుమీద ఆల్స్ (తార్తారు కుగ్రామాలు) వున్నాయి. తార్తారులు రష్యన్లతో స్నేహితంగా వుంటున్నారు గాని యింకా అసంతృప్తితోనే వున్నారు. యెడమ నదీతీరం వెంబడి, నదికి అరమైలుదూరంలో, వొకదానికొకటి ఐదారు మైళ్ళదూరంలో, కోసక్కు గ్రామాలున్నాయి. పూర్వం ఆ గ్రామాలు సరిగ్గా నది ఒడ్డుమీదే వుండేవి. కాని యేటేటా వుత్తర దిక్కుకి జరుగుతూ టెరెక్‌నది వొడ్లుల్ని కోసి పారేసింది. యిప్పుడక్కడ మిగిలిందల్లా శిథిలాలూ, పాకపడ్డ తీగల్తో పొదల్తో చిక్కురు బొక్కురుగావున్న నిర్జనమైన పియర్–ప్లం చెట్ల తోటలూమాత్రమే. యిప్పుడిక్కడెవరూ నివసించటంలేదు; అక్కడ ప్రాణి కోటి వున్నజాడ యేమిటంటే ఆ చోట స్వేచ్ఛగా తిరగ్గలుగుతూన్న దుప్పులూ, తోడేళ్ళూ, కుందేళ్ళూ, మొదలగువాటి కాలి ఆనవాళ్ళు మాత్రం. అరణ్యంలో గుండా వొక గ్రామం నుంచి మరొక గ్రామానికి నడుపాంటి రోడ్లున్నాయి. అరణ్యం పొడుగునా అక్కడక్కడా కావలి గోపురాలు న్నాయి; కాపలావాళ్ళు ఆ గోపురాల మీదుండి కాపలా గాస్తుంటారు. అంత అరణ్యంలోనూ, యేడు గజాల వెడల్పునవున్న సుక్షేత్రమైన వొక

చీలిక భూభాగం మాత్రమే కోసక్కులది. దాని అవతల నోగేస్టెప్పిలోని యిసుక దిబ్బలశ్రేణి ప్రారంభమై ఉత్తరానికి చాలా దూరం వరకూ వ్యాపించి యెక్కడో అది ఆస్ట్రిఖాన్, టర్క్‌మేనియా, కిర్గిజ్ కైసాక్ స్క్ స్టెప్పిలతో కలిసిపోయింది. దక్షిణాన, టెరెక్ నది కవతల గ్రేట్ ఛెఛన్యా, కోఛాకలోసోవ్ శ్రేణి, నల్లపర్వతాలు, వరొక శ్రేణీ మంచు కప్పి వున్న పర్వతాల వరకూ వ్యాపించి వున్నాయి. ఆ పర్వతాల నెవరూ యింతవరకూ యెక్కలేదు.

సుక్షేత్రమైన ఆ చీలిక భూభాగంలో అనాదినుండీ సుందరమూర్తులూ సాహసోపేతులూ ఐన గ్రిబెన్స్క్ కోసక్కులు నివసిస్తున్నారు; వారి జాతి వృద్ధినొందుతోంది. వారు సనాతన మతస్థులు.

చాలా కాలం కిందట సనాతనమతస్థులైన వారి పూర్వీకులు టెరెక్ అవతలవున్న పర్వతాల మొదటిశ్రేణి (గ్రెబెన్) వద్ద, ఛెఛెన్ల మధ్య నివాసం యేర్పరచుకొన్నారు. వారు తమ రష్యన్ భాషనీ, సనాతన మత భావాల్నీ చక్కగా సజీవంగా అట్టిపెట్టుకొన్నప్పటికీ, తమ పిల్లల్ని ఛెఛెన్ల కీయటం, వారి పిల్లల్ని తాము చేసుకోవటం సాగించి వారి ఆచారవ్యవహారాల్నీ, జీవిత విధానాన్నీ అలవర్చుకున్నారు. వారు యీ నాటికీ చెప్పుకొనే వొక కథ ప్రకారం- ఐవాన్ దీ టెర్రిబుల్ అనే జారు చక్రవర్తి యీ టెరెక్ ప్రాంతాని కొచ్చేడనీ, కోసక్కు పెద్దల్ని పిలిపించి టెరెక్‌కి యీవలవున్న భూభాగాన్ని వారి కిచ్చేసి రష్యాతో స్నేహంగా వుండాల్సిందనీ అందుకు బదులు తాను వారి మత భావాల్ని, స్వాతంత్ర్యాన్నీ గౌరవిస్తానని చెప్పేడనీ అంటారు.

ఆనాటి నుంచీ తమకు ఛెఛెన్లతో బంధుత్వం వుందని కోసక్కులు అంటారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, విరామం, యుద్ధమూ, దోపిడీ అంటే వారికున్న ప్రేమ వారి అపూర్వ లక్షణం. యెన్నికల నడపుకోటం, చర్చి గంటల్ని స్వాధీనపర్చుకోటం, గ్రామాల్లో సైన్యాలమకాం వెయ్యటం—వీటిల్లో మాత్రమే రష్యన్ల ప్రభావం వుంది. తన సోదరుణ్ణి చంపిన ఝిట్ (ఛెఛెన్ యోధుడు) పట్లకంటే, తన గ్రామాన్ని కాపాడ్డానికంటూ తన యింట్లో మకాం పెట్టి చుట్టపొగతో ఆ యిల్లుని ఖండాలం చేసే రష్యన్ సైనికుడి పట్ల కోసక్కుకి యెక్కువద్వేషం వుంది. తన శత్రువైన

పర్వతవాసుణ్ణి అతను గౌరవిస్తాడు; కాని, ఆటవికుడుగా తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని అణగద్రొక్కేవాడుగా రష్యన్ సైనికుణ్ణి చూసి చాలా అసహ్యించుకొంటాడు. అతని దృష్టిలో రష్యన్ రైతంటే వొకవింత విదేశీ జంతువు. అలాంటి రకాన్ని యిక్కడ కొచ్చిన రష్యన్ చిల్లర వ్యాపారుల్లోనూ, వలస వచ్చిన యుక్రేనియన్ వాళ్ళలోనూ అతను చాలామందిని చూసేడు; అసహ్యంతో వాళ్ళకి అనేక మారుపేర్లు పెట్టాడు కూడాను. చక్కగా బట్టలు వేసుకోటమంటే సిర్కేషియన్లలాగా వేసుకోటమన్న మాట. మొదటి రకం ఆయుధాలు పర్వతవాసులవద్ద దొరుకుతాయి. మొదటిరకం గుర్రాలు కావాలంటే వాళ్ళదగ్గర్నుంచి కొనవచ్చు; లేదా చాటుగా దొంగిలించవచ్చు. యువ కోసక్కులకు తమకు తార్తారు భాషని గురించివున్న జ్ఞానమంటే మహాపొంగు; యేదైనా జల్సా చేసేటప్పుడు తమలో తాముగూడా తార్తారుభాషలో మాట్లాడుకొంటారు. అయినప్పటికీ యీ విశాల భూమిలో వొకమూల దిగబడిపోయిన యీ చిన్ని క్రిష్టియన్ తెగ, అర్ధాటవిక మహమ్మదీయులమధ్యా రష్యన్ సైనికుల మధ్యా వున్న యీ జాతి తామే అందరికంటే చాలా గొప్ప నాగరీకులమనీ, అసలు మనుష్యులంటే తామేననీ అనుకొంటూ వుంటారు.

కోసక్కు తన కాలంలో యెక్కువ భాగాన్ని మిలిటరీ నాకా (బౌట్ పోస్టు) లోగానీ, లేక వేటలోగానీ, చేపలు పట్టటంలోగానీ గడుపుతాడు. అతను చాలా అరుదుగా మాత్రమే యింటివద్ద కనపడ్తాడు. అతను గ్రామంలో కనపడటమంటే మామూలుకి భిన్నమన్నమాటే; యిక వూళ్ళోవుంటే జల్సాగా గడపటమే పని. కోసక్కులంతా యెవరికి కావాలిసిన ద్రాక్షసారా వాళ్ళు తయారు చేసుకుంటారు; ఇక తాగుడంటే వాళ్ళ దృష్టిలో "వొక పిచ్చ" అనేదిగాక అదొక శుభకార్యంలాంటిది; తాగకపోతే మతాన్ని వదులుకొన్నట్లే యెంచబడుతుంది.

స్త్రీ అనేది తన బాగు కోసరం యేర్పడిన వొక పనిముట్టు అని కోసక్కు అభిప్రాయం. పెళ్ళిగాక ఆమె స్వతంత్రంగా వున్నంతవరకూ హాయిగా వుండొచ్చు; కాని, పెళ్ళయినాక మాత్రం తన భర్తకి తన జీవితాంతం వరకూ సేవ జెయ్యటమే ఆమె విధి; ప్రాగ్దేశపు స్త్రీలాగా కిమ్మనకుండా బండ చాకిరీ చేసి తీరాలి. కోసక్కు స్త్రీమీద వున్న యీ కార్య

భారంవల్ల, పైకి చూడటాని కన్నివిధాలా ఆమె బానిసత్వంలో వున్నట్లు అగుపించినప్పటికీ, ఆమె శారీరకంగానూ మానసికంగానూ శక్తిమంతంగా అభివృద్ధిపొందింది. అంతేగాక, సామాన్యంగా తూర్పుదేశాల్లో వున్నట్లు, ఆమెకి పశ్చిమదేశపు స్త్రీకంటే కుటుంబం మీద చాలాయెక్కువ పలుకుబడీ, విలువా వున్నాయి. వీధిలో ఆమెకే జోక్యం లేకపోవటం అనేది యింట్లో ఆమెకి పలుకుబడీ, ప్రాముఖ్యతా యెక్కువవటానికి తోడ్పడింది.. కొత్తవారున్నపుడు తన భార్యతో చనువుగా మాట్లాడటం నామర్దా అని కోసక్కు అభిప్రాయం. కాని, ఆమెతో వొంటరిగావున్నపుడు మాత్రం ఆమె ఆ యింట్లో రాణీఅన్నమాటే. అతని యిల్లూ ఆస్తీ అంతాగూడా ఆమె బండ చాకిరీవల్లా, జాగరూకతవల్లా సంపాదించబడినట్టివే. శరీర శ్రమంటే వట్టి నామోషీపని అనీ యే నోగజాతి కూలివాడో, స్త్రీయో చేయాల్సినదనీ అతనికి గట్టినమ్మకం వున్నప్పటికీ, తాను వుపయోగించుకొనేదీ, తనదని చెప్పుకొనేదీ యిదంతా ఆ శ్రమ ఫలితమేననీ, తనని బికారీగా చెయ్యాలంటే ఆ శక్తి తాను బానిసలుగా చూసే తల్లి చేతుల్లోనో, భార్యచేతుల్లోనో వుందని అతనికి సూచన ప్రాయంగా తెలుసు.

నిత్యమూ వుండే బండచాకిరీ, తన భుజాలమీదవున్న బాధ్యతా గ్రిబెన్స్కు స్త్రీకి స్వతంత్రమైన, వొక ప్రత్యేకమైన పురుషత్వ శక్తీ, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం, స్థిరత్వం, బలం చాలా అభివృద్ధి పొందించినాయి. చాలా సందర్భాలలో స్త్రీలే పురుషులకంటే చాలా తెలివితేటలుగలవారు; చాలా అందమైనవారు. ఆమె సౌందర్యం అనేది అత్యంత స్వచ్ఛమైన సిర్కేషియన్ జాతి ముఖవర్చస్సూ, ఉత్తరదేశీయ స్త్రీయొక్క విశాలమైన శక్తిమంతమైన శరీర నిర్మాణమూ కలిసిన వొక అద్భుత సమ్మేళనం. వారు సిర్కేషియన్ దుస్తులు ధరిస్తారు: తార్తారు పరికిణీ, దగవన ధగధగా మెరిసే అంచులు కట్టిన బిగుతుకోటూ, మెత్తని తోలుకాని స్లిప్పర్లూ ధరిస్తారు. వారు రష్యన్ స్త్రీలలాగా రుమాళ్ళను తలచుట్టు కట్టుకుంటారు. పరిశుభ్రమైన పసందైన దుస్తులు వేసుకోవటం, యింట్లో అంతా చాలా శుభ్రంగా వుంచటం వారికి అలవాటూ అవసరంగూడాను. గ్రెబెన్స్కు స్త్రీలు, ప్రత్యేకంగా పెళ్ళిగాని యువతులు, పురుషుల్తో చాలా చనువుగావుంటారు.

కోవోంలిన్స్క్ గ్రామం గ్రిబెన్స్కు దేశానికి గుండెకాయవంటిదని అందరూ వొప్పుకుంటారు. యెక్కడికంటేగూడా యీవూళ్ళో పురా

తన గ్రెబెన్స్కా ఆచార వ్యవహారాలు స్వచ్ఛంగా కాపాడబడివున్నాయి; తరతరాలుగా ఆ గ్రామస్త్రీలు తమ అపూర్వ సౌందర్యానికి కకేషియా అంతటా పేరుబడ్డారు. ఆ గ్రామీణులు తమ ద్రాక్ష తోటలమీదా, పండ్ల తోటలమీదా, పుచ్చకాయలూ, గుమ్మడికాయలూ, జొన్నా మొక్క-జొన్నా పొలాలమీదా, చేపలుపట్టటం, వేటాడటం మీదా, దోపిడీమీదా జీవిస్తున్నారు.

టెరెక్ నదికీ యీ గ్రామానికీ మధ్య రెండుమైళ్ళ కీకారణ్యంవుంది. గ్రామంగుండా వున్న రోడ్డుకి వొకపక్కన వొక నది ప్రవహించుతోంది; అవతలి పక్కనవున్న ద్రాక్షతోటలూ, పండ్లతోటలూ తర్వాత క్రమ క్రమంగా నోగేస్టెప్పీ (గడ్డిమైదానం) కి చెందిన ఇసుకదిబ్బలు ప్రారంభ మవుతాయి. ఈ గ్రామంచుట్టూ మట్టికట్టలూ, ముండ్లకంచెలూవున్నాయి. ప్రతి ముఖ్యమైన రోడ్డుకీ చివర్న రెండు స్తంభాలమీద యెత్తైటికప్పువున్న వొక గేటువుంటుంది. వాటిల్లో దేని పక్కనో వొకదాని పక్కన యెప్పుడో వొకప్పుడు స్వాధీనపరచుకో బడి, తరతరాలు వాడకుండా ఆపర్నేవుంచ బడిన వొక పెద్ద ఫిరంగీ వుంటుంది. తన యిష్టమొచ్చినపుడు వొక కాపలా వాడు తుపాకీ బాకూ ధరించి ఆ గేటుపక్కన నిలబడతాడు; వాడికి దయ వుంటే అప్పుడప్పుడూ అటు పోయే యే ఆఫీసరుకో సలాంచేస్తాడు. గేటు కప్పుకింద "266 ఇళ్లు. పురుషులు 897; స్త్రీలు 1012" అని రాసివున్న బోర్డువుంది.

భూమికి రెండు మూడడుగుల యెత్తువున్న దిబ్బలమీద కోసక్కుల కుటీరా లున్నాయి; ఆ యిళ్ళకి చిత్రికపని చేసిన పెద్ద కురుమాడు *(gables)* లున్నాయి; రెల్లుతో ఆ యిళ్ళకప్పులు చక్కగా నేయబడినాయి. అవన్నీ కొత్తవి గాకపోయినా, నిటారుగా, పరిశుభ్రంగా, రకరకాల ఆకారాలు గల యెత్తుపాటి తలనాకిటి వసారాల్తో వున్నాయి. ఆ యిళ్ళు యెక్కడి తొక్కడిగా వుండకుండా, వొకదానికీ మరొకదానికీ మధ్య చక్కని జాగాతో విశాలమైన వీథుల పక్కనా, గొందుల పక్కన శృంగారంగా నిలబడి వున్నాయి. ఇళ్ళ ముంగిటవున్న చాలా తోటల్లో, ద్రాక్ష తీగెలమధ్యా యితర తీగెలమధ్యా, పొద్దు తిరుగుడు చెట్లమధ్యా లేత ఆకుపచ్చని ఆకులుగల నల్లటి పోప్లార్లూ *(Poplars)*, కసిందచెట్లూ యెత్తుగా సొగసుగా పెరుగుతున్నాయి.

విశాలంగావున్న గ్రామచౌకం (*square*) లో మూడు అంగళ్ళల్లో పొద్దుతిరుగుడు గింజలూ, గుమ్మడివిత్తులూ, చిక్కుళ్లూ, అల్లపు మిఠాయీ అమ్ముతారు. వొక పోప్లారు వృక్షశ్రేణి వెనకాల, చుట్టూ ఎత్తుపాటి దడివున్న యిల్లొకటుంది; అందులో రెజిమెంటల్ కమాండరుంటున్నాడు. ఆ ఇల్లు అన్నియిళ్ళకంటే యెత్తుగా, విశాలంగా వుంది. దానికి పెద్ద గాజు కిటికీలున్నాయి.

ఆదివారం తప్ప తక్కిన దినాల్లో ప్రత్యేకంగా వేసంగిలో, వీధులు నిర్మానుష్యంగా వుంటాయి. కోసక్కులు ఆ దినాల్లో డ్యూటీలో వుంటారు. యువకులు మిలిటరీ నాకాల్లో కాపలా వుంటారు; లేదా, దండయాత్రలకు పోతారు. యిక ముసలివాళ్ళు వేటాడుతూనో, చేపలు పడుతూనో, పండ్ల తోటల్లో వాటిల్లో ఆడవాళ్ళకి సహాయ పడుతూనో వుంటారు. పోతే యిక బాగా ముసలివాళ్లూ, పిల్లలూ, రోగులు మాత్రం యింటివద్ద వుంటారు.

---

## 5

ఆ సాయంకాలాన వాతావరణం అద్భుతంగా వుంది; కకేషియాకి అది ప్రత్యేకత. సూర్యుడెప్పుడో పర్వతాల వెనకాల మాయమయ్యేడు; కాని, యింకా వెల్తురుగానే వుంది. ఆకాశాన వున్న అరుణ కాంతిలో బ్రహ్మాండమైన ఆ ధవళపర్వతాల ఆకారాలు స్పష్టంగా కనపడుతున్నాయి. గాలి పల్చగా వుంది; కదలిక లేదు; దూరాన్నుంచి వచ్చే ధ్వనుల్తో నిండి వుంది

ఆ గడ్డి మైదానంలో మైళ్ళ పొడుగున ఆ పర్వతాల నీడలున్నాయి. గడ్డిమైదానం, నదీ, రోడ్డూ నిర్మానుష్యంగా వున్నాయి. యెవరన్నా గుర్రపురౌతు మధ్యమధ్య కనపడితే మిలిటరీ నాకాలలోవున్న కోసక్కులూ, కుగ్రామాల్లోని ఛెఛెన్లూ అత నెవరా అని ఆలోచించుతూ అతన్ని అనుమానంతో కనిపెట్టి చూస్తారు. రాత్రుళ్ళల్లో, వొకర్నిచూచి వొకరు భయపడుతూ, ప్రజలు గబగబా యిళ్లకు పోతారు. ఇకనీ నిర్మానుష్యమైన ప్రదేశాల్లో నరభయం లేకుండా మృగాలూ పక్షులూ వాటి యిష్టమొచ్చినట్లు తిరుగుతాయి. ద్రాక్ష తీగెల్ని పైకి కట్టుతూన్న స్త్రీలు పొద్దుగూకక

ముందే త్వరత్వరగా యిళ్లకు చేరుకొంటారు. ఇక ఆ తోటలూ, పొలాలూ తమచుట్టూ వున్న ప్రదేశంలాగా ఖాళీగా, కదలిక లేకుండా పడి వుంటాయి.

ఆ రాత్రిపూట అలాంటి సమయాల్లో కాలినడకమీదా, గుర్రాలెక్కీ, కిర్రు కిర్రుమనే యెడ్ల బళ్లెక్కీ అన్ని వేపులనుండీ యిళ్లకు చేరుకొంటున్న జనంతో బజార్లు కిటకిటలాడుతుంటాయి. చేతుల్లో చెట్ల బెత్తాలు పట్టుకొని, పరికిణీలు పైకి దోపి, వుల్లాసంగా పిచ్చా పాటీ మాటాడుకొంటూ ఆడపిల్లలు గడ్డిమైదానంనుంచి దుమ్ముతో దోమల్తో కప్పబడి ప్రవాహంలా వచ్చిపడుతున్న తమపశువుల్ని కలిసికోటానికి పరుగెత్తుతారు. బాగా పోషణవున్న ఆవులూ, బర్రెలూ తమతమ నెలవులకు పోతాయి. ధగధగ మెరిసే బిస్మెత్‌లు (బిగుతుకోట్లు) తొడిగిన స్త్రీలు తమ పశువులకోసరం వాటిమధ్య అటూయిటూ తిరుగుతూంటారు; వారి కేకలూ, నవ్వులూ ఆ పశువుల అరుపుల్లో కలిసిపోతాయి. యిదుగో డ్యూటీనుంచి శెలవుమీద యిక్కడి కొక గుర్రపురౌతు వచ్చాడు; వొక కుటీరం వద్దకి స్వారీచేస్తూ పోయి, వంగి, కిటికీమీద తట్టేడు వెంటనే వొక చక్కని యువతి ముఖం ఆ కిటికీలోగుండా కనబడింది. ఆమె బైటికొచ్చినాక ముద్దులూ నవ్వులూ మెల్లగా వినపడినాయి. అదుగో చిరుగులబట్టలు కట్టుకొన్న నోగేజాతి కూలివాడు, యెత్తుపాటి దవుడయెముకలు గలాడు, వొక కిర్రుకిర్రుమనే బండినిండా రెల్లుకట్టలు వేసుకొని చిత్తడి నేలనుండి కేప్టెన్ దొడ్లోకి బండి తోలుకొచ్చాడు; యెడ్లని విప్పదీశాడు; అవి వాటి బరువాంటి తలలు విదిలించినాయి. అతను తార్తారు భాషలో తన యజమానిని పిలిచేడు. వీపుమీద వొక కట్టెలమోపుతో వొక పెద్ద బురదగుంట పక్కగా, దడులకి అంటిపెట్టుకొని వొక స్త్రీ అతి కష్టంతో నడిచిపోతోంది. ఆమె తన పరికిణీని తన తెల్లని కాళ్లపైకి బాగా యెత్తిపట్టుకొని నడుస్తోంది. వేటనుంచి తిరిగొస్తోన్న వొక కోసక్కు తన తుపాకి నామెవంకచూపుతూ, ''ఆ పరికిణీని యింకాకొంచెం పైకెత్తరాదూ, సిగ్గులేని ముండా?'' అని సరసంగా అన్నాడు. వెంటనే ఆమె తన పరికిణీని కిందకి వదలటంలో కట్టెలమోపు కిందపడి పోయింది. వొక ముసలి కోసక్కు తన లాగు పైకి మడుచుకొని నిండా తెల్లటి చేపల్తో గులగులమంటూన్న వలని మోసుకొని పోతున్నాడు. కోటుగుండీలు తగిలించనందువల్ల బూడిదవర్ణ రోమాలో

నిండివున్న అతని యెదురొమ్ము కనబడుతోంది. అడ్డదోవని పోవటం కోసం తన పొరుగువాడి పడిపోయిన దడిలోంచి దూరేడతను. అతని కోటొక పుల్లకి తగులుకొంది. పొడుగాంటి యెండుకొమ్మ నొకదాన్ని యీడ్చుకొంటూ వొక స్త్రీ ఆ వీధివెంట వెళ్లింది. వీధిమూలలనుంచి గొడ్డల్తో నరుకుతూన్న ధ్వని ప్రతిధ్వనించుతోంది. పిల్లలు నవ్వుతూ పేల్చూ యెక్కడ కాస్త సదాటునేల కనబడితే అక్కడ తమ బొంగరాలు తిప్పుతున్నారు. అనవసరంగా చుట్టు తిరిగి రావటమెందుకని స్త్రీలు దళ్లు దాటి యిళ్లకు పోతున్నారు. ప్రతిచిమ్నీ నుంచీ కిజ్యక్ (గడ్డి, పేడా కలిసిన పిడకలు) ఘాటైన పొగ లేస్తోంది. ప్రతి యింట్లోంచి హడావుడిగా జరుగుతూన్న పనుల ధ్వని వినవొతోంది.

కార్నెట్ (సేనలో పతాకధారి) భార్య యింట్లోంచి గేటువద్ద కెళ్లి పశువులకోసం యెదురు చూస్తోంది. ఆమె కూతురు మేరియానా వీధిగుండా పశువుల్ని తోలుకొస్తోంది. పెద్దావిడ గేటు తెరిచిందో లేదో అప్పుడే ఒక పెద్ద ఆవు, వొంటినిండా దోమల్తో అరుచుకొంటూ దొడ్లోకి పరుగెట్టింది. తమ పెద్దకళ్లతో తమ యజమానురాలివంక చూస్తూ తోకల నాడించుతూ, బలిసిన ఆవులు చాలా దాని వెనకాల వెళ్ళయి. సుందరి మేరియానా తనచేతిలోని కర్ర నవతల పడేసి దభీమని గేటువేసి, పశువుల్ని వేరుచేసి వేటి కొట్టాల్లోకి వాటిని తోలటానికి వాటివెనక్క అటూ యిటూ పరుగెత్తింది.

"ఆ బూడ్సులు విడిచెయ్యవే, దెయ్యపుపిల్లా," అని ఆమె తల్లి కేక పెట్టింది. "వాటిని అరగదీసి అరగదీసి దుంపదెంచి గంపకెత్తావు."

దెయ్యపు పిల్లాఅని పిలవబడినందుకు యేమాత్రం నొచ్చుకోకుండా, ఆ మాట ముద్దుమాట ఐనట్లు వుల్లాసంగా తనపని తాను చేసుకోసాగింది. తలకిచుట్టిన ఆమె రుమాలు నుదుటిమీదికి జారింది; ఆమె గులాబీరంగు పరికిణీ, ఆకుపచ్చని బిష్మెత్ తొడిగివుంది. పశువుల వెనకాలే ఆమెకూడా చావిట్లోకి దూరి, లాలింపుగా కూనరాగాలు తీస్తూ పాలు పిండసాగింది. "ఆఁ. అదీ. కదలకుండానుంచో, చిట్టీ. యెంత వడిగలదానివే! ఆఁ. ఆఁ. అదీ!" పని తొందర్లోనే ముగించుకొని, పిల్లా తల్లీ ఆనాటి పాలతో—రెండు నిండుచెంబుల పాలు—పాలూ పెరుగూవుంచే గదిలోకెళ్ళారు. ఆ గది చిమ్నీలోంచి పెద్దపొగ లేచింది; అంటే పాలని కాస్తున్నారన్నమాట.

మేరియానా పొయ్యి మంటజెయ్యటం చేస్తుంటే, తల్లి గేటువద్దకి తిరిగెళ్ళింది. అప్పటికి చీకటి పడింది. కూరగాయల వాసనతో, పశువుల కంపుతో, ఘాటైన కిజ్యక్ పొగతో గాలి నిండివుంది. పొయ్యి రాజెయ్యటం కోసం పక్కిళ్ళకి నిప్పుకోసం పోయిన స్త్రీలు మండుతూన్న గుడ్డపేలికల్తో బజార్న పరుగెత్తుతున్నారు. పాలు పిండినాక భారం తగ్గిపోగా ఆవులు గురక పెడుతూ నెమరువేస్తున్నాయి. స్త్రీలూ పిల్లలూ వొకర్నొకరు కీచురుగొంతుల్తో పిల్చుకొంటున్నారు. పని రోజుల్లో పురుషుడి గొంతు విన పడటం అరుదు.

మగవాడిలాగా కనపడుతోన్న వొక పొడుగాటి స్త్రీ యెదురింటి నుంచి వొక గుడ్డపేలికతో బజారు దాటి వచ్చింది.

“యేమ్మా, మీ పనయిందా ?”

“మేరియానా పొయ్యి మంట జేస్తున్నది. నిప్పుకావాలా యేమిటీ?” అని కార్నెట్ భార్య, పొరుగమ్మకి తాను సాయపడుతున్నందుకు గర్వంతో, అన్నది.

ఆమె యింట్లోకెళ్ళింది. పనితో కాయలు గాచిన ఆమె చేతులు చిన్నచిన్న వస్తువుల్ని పట్టుకోటానికి అలవాటుపడనందున వొక అగ్గిపెట్టెని పట్టుకోబోయినప్పుడు ఆ చేతులు వణికేయి; అగ్గిపెట్టె అంటే కకేషియాలో అపురూపమైన వస్తువు! పిచ్చాపాటీ కోసం, ఆ వచ్చినావిడ గడపమీద చతికిల బడింది.

“అయితే మీ ఆయనింకా బళ్ళోనే వున్నాడన్నమాట ?” అని అడిగింది.

“అవునమ్మా. యింకా పిల్లలకి చదువు చెపుతూనేవున్నారు. శెలవులకి వస్తానని రాశారు” అని కార్నెట్ భార్య అంది.

“అబ్బో చాలా చదువుకొన్న మనిషమ్మా మీ ఆయనా! నిజంగా అందులో మేలుందమ్మా.”

“అవును మరి.”

“మా లూకా యింకా ఆ కాపలాపనిమీదే వున్నాడు. వాడు యింటికి రావటానికి శెలవు యివ్వనే యివ్వటంలేదు” అని పొరుగమ్మ

అన్నది, యీ మాట తన యిరుగమ్మకి లక్ష్యంలేదనే సంగతి తెలిసికూడా! లూకాని యీ మధ్యనే కోసక్కాగా తీసుకొన్నారు. కార్నెట్ కూతురు మేరియానాను తన కొడుక్కి చేసుకోవాలని ఆమెకుంది. అందువల్ల తన కొడుకుని గురించి అదీ యిదీ చెప్పాలని ఆమెకుంది.

"అయితే అబ్బాయి యింకా కాపలాలోనే వున్నాడన్నమాట?"

"అవునమ్మా. కిందటి ఆదివారంనుంచీ నాడింటికిరాలా. ఫోమిష్కిన్ కిచ్చి మొన్న వాడికి చొక్కాలు కొన్ని పంపా. అబ్బాయి బాగానే వున్నాడని అతనంటున్నాడు. ఆఫీసర్లుగూడా వాడంటే బాగా యిదిగానే వుంటారంట. వాళ్లు మళ్లీ ఎబ్రెక్‌లకోసం చూస్తున్నారన్నాడు. అబ్బాయి సుఖంగా వున్నాడంటున్నాడు."

"ఆఁ. భగవంతుడికి మొక్కుకో అందుకు." కార్నెట్ భార్య అంది. "'వూడ బెరుక్కునేవాడు' అన్నందుకు తగిపోయాడమ్మా."

లూకాకి ఆ మారుపేరు నీటిలో మునిగిపోయే వొక పిల్లవాణ్ణి రక్షించినందుకు—నీటిలోంచి "వూడ బెరికి"నందుకు—వచ్చింది. పొరుగావిణ్ణి సంతృప్తిపరిచేమాటేదైనా అనాలనే వుద్దేశ్యంతో కార్నెట్ భార్య ఆ విషయం వచ్చేట్లు అంది.

"ప్రతిదినం నేను దేవుడికి మొక్కుకొంటాను. మా వాడు మంచి బుద్ధిగలవాడు. అందుకనే వాడంటే అందరికీ యిష్టం. నాకున్న వొక్క కోరికా యేమంటే వాడిపెళ్ళి చూడటం. అదికాస్తా అయిపోతే నేను దిగులులేకుండా హాయిగా చచ్చిపోగలను."

"అయితే మరి పెళ్ళిగావాలంటే వూళ్ళో వున్న ఆడపిల్లలు చాల రేంటీ?" తన ముతకవేళ్లతో అగ్గిపెట్టెని జాగ్రత్తగా మూస్తూ కార్నెట్ భార్య డొంకతిరుగుడుగా అన్నది.

"కావాల్సినంతమంది, కావాల్సినంతమంది." తలనూపుతూ లూకా తల్లి అంది. "మీ మేరియానా, అబ్బ యెంత చక్కటి పిల్లమ్మా! అలాంటిపిల్ల యీ చుట్టుపక్కల దొరకనే దొరక దనుకో."

పొరుగింటావిడ లోపలి వుద్దేశ్యమేమిటో కార్నెట్ భార్యకి తెలుసు. లూకా అంటె ఆమెకి బాగానే యిష్టమైనప్పటికీ ఆ సంభాషణ మార్చా

లని అనుకుందామె. యెందుకంటే తాను కార్నెట్ భార్య; ధనవంతు రాలు; లూకా వడ్డీ మామూలు కోసక్కా కొడుకు; అందులోనూ తండ్రి చచ్చిపోయాడు గూడాను. అదీగాక తన కూతుర్ని అంత తొందర్లోనే యెవరికో కట్టబెట్టటం ఆవిడకి యిష్టంలేదు. యిక యింతకీ అసలు విషయ మేమంటే అలాచెయ్యటం మర్యాద గూడా గాదు.

''అవునుమరి. మేరియానా పెద్దదైతే మంచి పిల్లవుతుంది'' అని బెట్టుగా, బింకంగా అన్నదావిడ.

''సమ్మంధం కుదుర్చుకొని లగ్గంపెట్టుకోటానికి తొందర్లోనే మనుషుల్ని పంపుతా'' లూకా తల్లి అన్నది. ''ద్రాక్షతోటల్లో పని పూర్తిగానియ్యి, ఆపర్నే మేమొచ్చి నీతోనూ, మీ ఆయన్తోనూ ఆ వ్యవహారమంతా మాట్టాడతాం.''

''ఆ వ్యవహారంతో ఆయన కేంపని? నువు మాట్లాడాల్సింది నాతో'' అని సగర్వంగా కార్నెట్ భార్య అన్నది. ''యేదెప్పుడు చెయ్యాలో అదప్పుడు చెయ్యాలి.''

తన యిరుగింటమ్మ ముఖంలో కనపడుతున్న కరుకుదనంచూసి, యిక అంతకుమించి మాట్లాడ్డం ఆవిడ కిష్టంలేదు గాబోలునని, పొరుగిం టావిడ తన గడ్డపేలికకి నిప్పు ముట్టించుకొని లేచి నుంచుంది.

''సరే మమ్మల్ని మరచిపోమాక. నేచెప్పినదాన్ని గురించి ఆలో చించు'' అని ఆమె అంది. ''యిక నేను పోవాలి. పోయి పొయ్యి రాజెయ్యాలి.''

మండుతూన్న పేలిక నూపుకొంటూ ఆవిడ బజారు దాటుతుండగా, మేరియానా యెదురై తల వూపింది.

''అబ్బా! ముచ్చటైన పిల్ల! చక్కగా పాటుబడుతుంది'' పోతూన్న మేరియానాను కళ్లతో అనుసరిస్తూ ఆవిడనుకొంది. ''యింకా యెంత పెరగాలో? యిప్పటి కెప్పుడో పెళ్లయ్యి చక్కగా కాపరం చేస్తుండా ల్సింది గాదూ? మా లూకాకి దాన్ని చేస్తే—''

కాని, మేరియానా తల్లికి ఆవిడకుండే అగచాట్లు ఆవిడకున్నాయి; మేరియానా వచ్చి పిలిచేవరకూ ఆమె గడప కదలకుండా కూచుని దీర్ఘా లోచనలో పడిపోయింది.

# 6

సరిగ్గా సూర్యాస్తమయం అయ్యేముందు, టెరెక్ నది ఒడ్డుకి దగ్గరున్న నిజ్నీ ప్రొటోస్క్‌కు చెందిన మిలిటరీ నాకాలోని కాపలా గోపురంమీద 'ఫ్రాడ్జరికే' లూకా నుంచునివున్నాడు. గోపుర మీదున్న ఇనుప కమ్మీలమీదకివంగి కనుబొమలు ముకుళించి, నది అవతలవున్న దూర ప్రదేశంలోకి తేరిచూస్తున్నాడు; మధ్యమధ్య కిందకిచూస్తూ కిందవున్న తన కామ్రేడ్సుతో మాటాడుతున్నాడు. మంచుతో కప్పబడిన శిఖరాల చాటున మాయమవుతున్నాడు సూర్యుడు. దూదిపింజల్లాంటి మబ్బులపైన వున్న ఆ శిఖరాలు సూర్యకాంతిలో తెల్లగా మెరుస్తున్నాయి. పర్వత పాదాలవద్దవున్న మేఘసముద్రం పోనుపోను బాగా నల్లబడుతోంది. గాలి నిర్మలంగా వుంది. ఆ దట్టమైన అరణ్యంలోంచి చల్లని గాలి తెరలు దేరింది; కాని, నాకావద్ద మాత్రం యింకా వుష్ణంగానేవుంది. ఆ సాయం సమయపు గాలిలో కోసక్కుల కంఠధ్వనులు స్పష్టంగా, బిగ్గరగా ప్రతిధ్వనించుతున్నాయి. నిశ్చలంగా వున్న ఆ నదీతీరానికీ వేగంగా ప్రవహిస్తోన్న దాని మురికినీటి అలలకీ చాలాభేదం కనిపిస్తోంది. అక్కడా యిక్కడా వున్న తడియిసుకా, లోతులేనిచోటవున్న యిసుకా గోధుమ రంగుగా మెరుస్తున్నాయి. కాపలా స్థలానికి సరిగ్గా యెదురుగావున్న నది వొడ్డు నిర్మానుష్యంగా వుంది. నదికీ పర్వతాలకీ మధ్య విశాలంగా తెరలు తెరలుగా లెక్కలేని రెల్లుదుబ్బులున్నాయి. కొంచెం కుడిపక్కన వొక ఛెఛెన్ కుగ్రామమూ, గుంపులుగుంపులుగా వున్న దాని మిద్దెయిళ్లూ, గరాటు గొట్టంలాగావున్న వాటిచిమ్నీలు కనపడుతున్నాయి. లూకా చురుకైన కళ్లు ఆ కుగ్రామంలోని పొగగుండా చొచ్చుకుపోయి అక్కడ యెర్రటి, నీలపు దుస్తుల్లో అటూయిటూ కదుల్తూన్న ఛెఛెన్ స్త్రీలను చూడగలిగేయి.

అబ్రెక్కులు (ఛెఛెన్ బందిపోట్లు) నదిదాటి యేసమయాన్నయినా రావచ్చునని అనుకొంటున్నారు. యెందుకంటే—ప్రత్యేకంగా ఇది మేనెల. అందులోనూ అరణ్యం బాగా గుబురుగా వుండి దాటడానికి వీల్లేకుండా వుంది. యిక నది అంటే లోతులేదు. కొన్నికొన్నిచోట్ల గుర్రమెక్కే తేలిగ్గా దాటిరావచ్చు. అంతేగాకుండా, కొద్దిదినాలక్రితం రెజిమెంటు

కమాండరు దగ్గర్నుంచి ఒకడు సర్క్యులర్ పట్టుకొచ్చేడు: స్కౌట్లవల్ల తెలిసిన కొత్త సమాచారాన్ని బట్టి యెనిమిదివంది అబ్రిక్కులు టెరెక్ నది దాటి రావటానికి తయారవుతున్నారని, కనక చాలా మెళుకువగా కాపలా గాయాల్సిందని ఆ సర్క్యులర్‌లో హెచ్చరించబడింది. ఐనప్పటికీ ప్రత్యేక కాపలాయేమీ యేర్పాటు చేయబడలేదు. కోసక్కులు తాము యింటివద్ద వున్నట్లుగా ఆయుధాలు ధరించకుండా, గుర్రాల్ని రెడీలో అట్టే పెట్టకుండా, చేపలు పట్టుతూ వేటాడుతూ తాగుతూ తందనాలాడుతూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ఒక్క కాపలా మీదున్న సెంట్రీవాని గుఱ్ఱం మాత్రం జీనూగీనూ వేయబడి తయారుగా వుంచబడింది. దాని కాళ్ళకు బంధాలున్నాయి. అది పొదల మధ్య తిరుగాడుతోంది. పట్టా కత్తీ, మస్కెట్ తుపాకీ, యూనిఫారం ధరించి తయారుగావున్నదల్లా ఆ ఒక్క సెంట్రీ మాత్రమే. పొడుగ్గా, సన్నగావుండి, బాగా పొడుగాంటి వీపూ చిన్నకాళ్ళూ చేతులూ గలిగిన కార్పొరల్ తన బిష్మెత్ గుండీలు విప్పదీసి, కళ్ళుమూసుకొని ఒక గుడిసె గడపమీద కూచుని తన తలని ఒక చేతినుంచి మరొక దానికి వూపుతున్నాడు. అతని ముఖంలో సోమరితనం చికాకూ కనపడుతున్నాయి. వయస్సు ముదిరిన ఒక కోసక్కు ఆ నది పక్కన పడుకొని అది విసుగు పుట్టించే ధ్వనితో తన పక్కగా ప్రవహిస్తూంటే దానివంక సోమరిగా చూస్తున్నాడు. అతనికి వెడల్పాంటి నల్లగడ్డం వుంది; అందులో అక్కడక్కడా తెల్లటి వెంట్రుకలున్నాయి. తక్కిన కోసక్కులు గూడా ఆ వేడిమికి తట్టుకోలేక సగం నగ్నశరీరాల్తో ఆ నదిలో తమ బట్టలు గుంజుకొంటూనో, లేక, వేడి యిసుక తిన్నెలమీద చాచుకొని పడుకొని కూనరాగాలు తీస్తూనో వున్నారు. యెండకి ముఖం నల్లబడి పోయిన ఒకడు ఒక గోడ పక్కన తెగతాగి పడివున్నాడు. ఒక గంటా రెండు గంటలు ముందక్కడ నీడవుంది; యిప్పుడానీడ పోయి యెండ తీక్ష్ణంగా పడుతూందక్కడ.

కాపలా గోపురం మీదున్న ''వూడబెరికే''లూకా యెత్తుగా అందంగా వుంటాడు; షుమారు యిరవైయేళ్ల వయస్సు; అంతా తల్లిపోలిక. అతని ముఖమూ, మొత్తం శరీర నిర్మాణమూ గొప్ప శారీరకబలాన్నీ, మనోబలాన్నీ చూపుతున్నాయి. ఇటీవలనే అతనా కాపలాదళంలో చేర్చుకోబడినప్పటికీ అతని భావ ప్రకటనా, అతని నింపాదితనం, కోసక్కులకు ప్రత్యేక

మైన పెళ్ళియీడు అతనికి వచ్చిందనీ, ఆయుధాలు పట్టటం నేర్చిన మనుషులకి మల్లే అతనూ తయారయ్యేడనీ, తనని గురించి తానేమాత్రం తక్కువ అంచనా కట్టుకోవటం లేదనీ తెలుపుతున్నాయి. అతను తొడిగిన వస్త్రాలు పాంటి సిర్కేషియన్ కోటుకి కొద్ది చిరుగులున్నాయి; ఛెఛెన్ ఫ్యాషన్లో టోపీని తల వెనకాల వొకపక్కకి పెట్టేడు; అతని ఇజార్లు మోకాళ్ళకిందకి వదులుగా చుట్టబడి వున్నాయి. అతని దుస్తులు సొగసుగా యేమీ లేవు; కాని జిఘిట్ (ఛెఛెన్‌యోధుడు) అదొక ప్రత్యేక తరహాగా నీటుగా వేసుకొన్నట్లు అతనా బట్టలు వేసుకున్నాడు. జిఘిట్ వొంటి మీదున్న వాటిల్లో ఆయుధాలు మాత్రమే విలువగలవి. కాని వాళ్ళ అపరిశుభ్రమైన బట్టలు యెవరికీ చేతగాని రీతిలో అదొక ప్రత్యేక తరహాగా, వేసుకొని వాటికి బెల్టులూ గిల్టులూ పెట్టి నీటుగా వుంచుతారు. యీ తరహాని కోసక్కుగానీ, పర్వతవాసుడుగానీ వెంటనే గుర్తు పట్టేస్తాడు. స్వచ్ఛమైన జిఘిట్‌కున్న బడాయి లూకాకివుంది.

పట్టా కత్తిమీద వొక చెయ్యివుంచి కనుబొమలు ముడిచి దూరాన్న వున్న తార్తారు కుగ్రామం వంక అతను కనిపెట్టి చూస్తున్నాడు. వొక్కొక్కటీ తీసుకొని చూస్తే, అతని తీరు తెన్నులు సుందరమైనవిగావు. కాని, అతని గంభీరమైన నడవడికా, సూక్ష్మబుద్ధిని తెలిపే అతని ముఖాన్నీ, నల్లగా వున్న ఆ కనుబొమల్నీ చూస్తే, "అబ్బ! యెంత ఘనమైన కుర్రాడు!" అని యెవరూ అనుకోకుండా వుండలేరు.

"అక్కడ అటూ యిటూ హడావుడిగా తిరుగుతున్న ఆ ఆడాళ్లని చూడు!" ప్రత్యేకం యెవర్నీ సంబోధించి అనకుండా అతను కీచురు గొంతుతో అన్నాడు.

కింద చాచుకొని పడుకొన్న నాజరు వెంటనే తలెత్తి యిలా అన్నాడు.

"వాళ్లు నీళ్లకెళ్తూండి వుండాలి."

"వొక గుండు పేలిస్తే తమాషా యెట్లా వుంటుందో?" నవ్వుతూ లూకా అన్నాడు. "భలే పరుగెత్తుతారు!"

"అంతదూరం అనలది పోదోయ్"

''అని అనుకొంటున్నావన్నమాట! నా తుపాకీ కాల్చానంటే వాళ్ళతలల మీదుగా పోతుందనుకోమరి.'' తన చుట్టూ బుంయ్‌మంటూన్న దోమల్ని చిరాకుతో తోలి పారేస్తూ లూకా అన్నాడు. ''వాళ్ళ పండగొచ్చినపుడు గిరీఖాన్ యింటికెళ్ళి వాళ్ళ బీర్ రుచెట్లావుంటుందో చూడాలి.''

పొదలో యేదో గలగలమంటే కోసక్కులు అటు చూసేరు. మచ్చలు మచ్చలుగా వున్న వొక సంకరజాతి వేటకుక్క, నేలని వాసనచూస్తూ, తన బొచ్చుతోకని ఆడించుతూ, అక్కడికి పరుగెత్తుకొచ్చింది. అది తన పొరుగువాడైన ఇరోష్కామామ కుక్కని లూకా గుర్తుపట్టేడు. వెంటనే పొదగుండా అసలు వేటగాడే యిటురావటం అతను చూసేడు.

ఇరోష్కామామయ్య పర్వతమంత మనిషి. తెల్లటిగడ్డం. అంతమనిషి ఆ అరణ్యంలో యెవరూలేరు. అతనిభుజాలూ, యెదురొమ్మూ యెంత వెడల్పుగా వున్నాయంటే అతను పెద్దయెత్తరి మనిషిగా కనపడడు. అతనిది అంత తీరూ సౌరూగల శరీరం. అతను చిరిగి చీలికలైన రైతు తొడిగే కోటుని తొడుక్కొనివున్నాడు. రొండి దగ్గర కోటుని జొడ్లోకి దోపేడు. నలిగిపోయిన వొక మేకపిల్ల చర్మపుటోపీ తలమీదుంది. కాళ్ళకి ముతక తోలు ఇజార్లు తాళ్ళతో కట్టబడివున్నాయి. అతని భుజంమీద జీవంజీవక పక్షు *(phesants)* లకి కనపడకుండా వుండేందు కుపయోగించే వొక తెరా; వొకచిన్నడేగా, డేగకి యెరగావాడే వొక కోడిపిల్లా వున్న సంచీ వున్నాయి. రెండోభుజంమీదున్న తోలుపటకాకి అప్పుడే వేటాడిన వొక అడవిపిల్లి తగిలించబడివుంది. అతని నడుంవెనకాల బెల్టులో యేవేవో చాలా చిన్న చిన్నవి దోపబడి వున్నాయి: తుపాకి గుళ్ళున్న చిన్న సంచులూ, మందుగుండూ రొట్టే; దోమల్నితోలటానికొక గుర్రపుతోకా, రక్తపు మరకలున్న ఒరలోవున్న వొక పట్టాకత్తీ, రెండు జీవంజీవక పక్షులూవున్నాయి.

''పరుగెయ్, లాం'' అని అతను ఆ అరణ్యంలో ప్రతిధ్వనించేట్లు బలమైన మంద్రస్వరంలో అరిచేడు. తర్వాత తన బ్రహ్మాండమైన మస్కెట్ తుపాకిని (యిలాంటి రకాన్ని కోసక్కులు ''చెకుముకి రాయి'' అంటారు) భుజంమీద పడేసి, టోపీతీసి పైకెత్తేడు:

‘‘బాగావున్నారటోయ్, అబ్బాయిలూ ?’’ అతను సరసంగా అడిగేడు. ప్రయత్నమేమీ లేకుండానే, నది అవతలవున్న యెవర్నో పిలుస్తున్నంత బిగ్గరగా అతని కంఠస్వరం బైటికి దొర్లుకొస్తుంది.

‘‘అవును, చాలాబాగున్నాం మామా!’’ అన్నివైపులనుంచీ యువ కంఠధ్వనులు వుల్లాసంగా అన్నాయి.

‘‘వార్తలేమన్నావుంటే చెప్పండోయ్’’ చొక్కాచెయ్యి వెనక భాగంతో తన యెర్రటి ముఖంమీది చెమటను తుడుచుకొంటూ ఇరోష్కా అరిచేడు.

‘‘నేను చెపుతానుండవేఁ’’ అని నాజరు తన భుజాన్నీ, కాలినీ చివుక్కున కదిలించుతూ అన్నాడు. ‘‘అదుగో ఆ చెట్టుమీద పేద్ద రాబందు వుంటాంది. పొద్దుగూకగానే యిక బయలుదేరుతుంది.’’

‘‘ఆరి పోరా పోస్కోలాడా !’’ అన్నాడు ముసలాడు ఆ మాట నమ్మలేక.

‘‘నిజం. నీకెందుకు, నువ్విక్కడుండి కాపలాగాసి చూడుమరి’’ అని పళ్లికిలిస్తూ, తన పట్టువదలకుండా, అన్నాడు నాజరు.

తక్కిన కోసక్కులు నవ్వేరు.

అసలు నాజరు యే రాబందునీ చూడలేదు; కాని, యువకోసక్కులు మాత్రం ఇరోష్కా మామయ్యని యేడ్పించుకుతినాలనుకొన్నారు.

‘‘యెందుకా వెధవ్వాగుడు ?’’ గోపురంనుంచి లూకా అరిచేడు.

దాంతో వెంటనే గమ్మున వూరుకొన్నాడు నాజరు.

‘‘సరే సరే, దానికోసరం కాపలాగాస్తా’’ అని ముసలాడు అనగా కోసక్కు లందరికీ సంతృప్తి గలిగింది. ‘‘సరేగాని, అడివి పందుల్నేమైనా చూశారంటోయ్ ?’’

‘‘అదీ సంగతి. అడివి పందులకోసరం కాపలాగాయి!’’ అని, ముందుకివంగి తన వీపుని రెండుచేతుల్లోనూ గోకుకొంటూ, కార్పొరల్ దడాలున అన్నాడు. మనస్సుకి

అబ్రెక్కుల్ని వేటాడడానికి గాని అడివిపందుల్ని వేటాడడానికిగాదు, మామా! నువ్వేమీ వినలేదనుకొంటా, విన్నావా?'' అని పళ్ళికిలిస్తూ, కేవలం అనవుసరంగా కనుబొమలు ముడుస్తూ అతనన్నాడు.

''అబ్రెక్కుల సంగతా నువ్వనేదీ? వుహూఁ. నేనేమీ వినలా'' అని ముసలాడు జవాబిచ్చేడు. ''చూడూ, నీదగ్గిర చిఖీర్ యేమన్నా వుందా? కొంచెం తాగితే బాగుంటుంది. బాగా అలిసిపోయా. వేటాడిన దాన్ని దేన్నో వొకదాన్ని నీకు కొద్దిరోజుల్లో పట్టుకొస్తాగా. నిజం. వూఁ. కానియ్. కొంచెం యిలా యివ్వు. అబ్బాయి మంచాడు గాదూ!''

''అయితే వేటమాంసం కోసరం పొంచుక్కూచున్నావన్న మాట?'' ముసలాడు అడిగినదాన్ని నిర్లక్ష్యంచేస్తూ, కార్పొరల్ ప్రశ్నించేడు.

''అంటే యీరాత్రి కాపలాగాస్తానన్న మాట'' అని ఇరోష్కా జవాబిచ్చేడు. ''పండక్కి దేన్నయినా చంపొచ్చననుకుంటున్నా. అప్పుడు నీ భాగం నీకొస్తుంది. భగవంతుడితోడు.''

''ఇదుగో మామా!'' గోపురంనుంచి లూకా బిగ్గరగా అరిచేడు. అందరూ పైకి చూసేరు. ''యెగువ యేటిపాయవద్ద అడివిపందులు మంద లకి మందలుండయ్యి. వొట్టుమరి! మొన్న మనవాళ్లల్లో వొకడు వొక మంచిదాన్ని కాల్చేశాడు. నిజం'' అని అతడు తన మస్కెట్ తుపాకి వీపున తిరిగి సర్దుతూ ముగించేడు. అతని కంఠస్వరం అతను సరసాని కామాట అనలేదని తెలుపుతోంది.

''వొహో! అయితే 'వూడబెరికే' లూకా యిక్కడున్నాడన్న మాట'' పైకి చూస్తూ, ఇరోష్కా అన్నాడు. ''యెక్కడ కాల్చా రన్నావ్?''

''అయితే నన్ను నువ్వింకా చూడలేదన్నమాట? నేను చాలా కొద్దిపాటి మనిషిని. కాదూ? దాన్ని ఆ గొయ్యిదగ్గర కాల్చాడు'' అని లూకా నిజంగా అన్నాడు. ''మేము నడిచిపోతుంటే పొదల్లో పెళపెళమని వినపడింది. కాని నా తుపాకీ [illegible]మంది; అందుకని ఇల్యా కాల్చాడు. [illegible]ద దూరంగాదు. నీ కెందుకు

కార్పోరల్‌వంక తిరిగి "మోసీవ్‌మామా, కాపలామార్చే టైమైంది" అని దృఢసంకల్పంతో అని, తుపాకి భుజానపెట్టి, ఆజ్ఞ కెదురుచూడకుండా గోపురంనుంచి దిగిరాసాగేడు.

"దిగిరా" లూకా దిగి రావటం మొదలెట్టినాక కార్పోరల్ అన్నాడు. "గుర్కా, యిప్పుడు నీవంతు కాదూ? కానియ్‌రా, అబ్బాయ్" చుట్టూ చూస్తూ అతనన్నాడు. తర్వాత ముసలాడివంక తిరిగేడు.

"నిజం. నీ మిత్రుడు లూకా మాంచి నిపుణుడయ్యాడు. నీకు మల్లే యెప్పుడూ వేటకోసరం పొంచుక్కూచుంటున్నాడు. యిక అతన్ని ఆపే సంగతే లేదనుకో. అందాకా యెందుకూ, మొన్ననే వొక అడవి పందిని చంపాడు గూడాను!"

# 7

సూర్యుడస్తమించేడు. చీకటిఛాయలు అరణ్యాపు టంచునుంచి వేగంగావ్యాపించుతున్నాయి. కోసక్కులు భోజనానికై ఆ గుడిసెలోచేరేరు. ఇరోష్కా మాత్రం తానొక్కడే ఆ చెట్టుకింద డేగకోసరం కాచుకుకూచుని, యెరగావుంచిన కోడిపిల్లకాలికి గట్టిన తాడుని లాగుతున్నాడు. నిజంగా ఆ చెట్ల కొమ్మల్లో డేగవుందిగాని, యెరమీదికి అది దూకలేదు.

జీవం జీవకపక్షులకోసరం గచ్చపొదల్లో లూకా తాపీగా వుచ్చులు పన్నుతూ, వొకపాట తర్వాతొకపాట పాడుతున్నాడు. కొండంత శరీరమూ, పెద్దపెద్దకాళ్ళు చేతులూ వున్నప్పటికీ, మోటుపనినీ, మృదువైనపనినీ రెంటినీ అతడు నేర్పుగా చెయ్యగలడు.

"హీ, లూకా!" అని వోకీచురుగొంతు దగ్గర్నున్న పొదనుంచి వినవచ్చింది. "అంతా అన్నాల కెళ్ళారల్లేవుంది" యింకా బతికున్న వొక జీవం జీవకపక్షిని చంకలో పెట్టుకొని, పొదలగుండా తంటాలుపడుతూ నాజరు కాలిబాటమీద కొచ్చేడు.

లూకా తనపాటని దడాలున ఆపేసేడు.

"దాన్నెక్కడ పట్టావోయ్? పందెం, నావుచ్చుల్లోగాదూ?"

''యెవరుచ్చులో నాకు తెలవదు'' అన్నాడు నాజరు. ''బహుశా నీవేగావచ్చు.''

నాజరూ, లూకా యిద్దరూ వొకే వయస్సు వాళ్ళు. లూకాకి మల్లే నాజరుగూడా కిందటి వసంతకాలంలో కాపలాదళంలో చేరేడు. నాజరు చాలా కొద్దిపాటి మనిషి. గింగురుమనే కీచుగొంతుగలాడు. అతనూ లూకా యిద్దరూ యిరుగు పొరుగువాళ్లూ స్నేహితులూను.

''ఆ చెట్టుకింద గుంట పక్కనగామా? ఆ వుచ్చులు నావే. నిన్న వేశాను వాటిని.''

తొందరలాగా కాళ్లని వొకదానిమీదుగా వొకటివేసుకుని గడ్డిమీద కూచుని లూకా వొక వుచ్చుని పన్నుతున్నాడు. అతను లేచి నుంచుని, మెడసాచి కనుగుడ్లని భయంతో తిప్పుతూన్న జీవంజీవక పక్షివంక చూసేడు. దాన్ని తన చేతుల్లోకి తీసికొని దాని ముదురునీలంగావున్న బూడిద వర్ణపు తలని నిమిరేడు.

''భేష్. యీరాత్రి భోజనానికి దాన్ని కూరొండుదాం. చూడూ, దాన్ని చంపి బొచ్చుపీకెయ్.''

''మనమేతిందామా, కార్పొరల్‌కి యిద్దామా?''

''అతనివంతు అతను బాగా తిన్నాడులే.''

''వాటినిచంపటం నాకిష్టంలేదు''అని కొంచెమాగి నాజరు అన్నాడు.

''అయితే యిలా యివ్వు దాన్ని''

తన పట్టాకత్తి వెనక భాగంనుంచి లూకా వొక మడతచాకుతీసి, చివుక్కున లాగేడు. ఆ పక్షి రెపరెప కొట్టుకొంది. అది తన రెక్కల్ని చాచే ముందే వణుకుతూన్న దాని శరీరంనుంచి నెత్తురుకారుతూన్న దానితల వదులుగా వేలుకాడుతోంది.

''అదీ సంగతి'' నేలమీదకా పక్షిని విసిరేస్తూ లూకా అన్నాడు. ''మంచి కూరవుతుంది.''

ఆ పక్షిని చేతుల్తో పట్టుకొంటూ నాజరు కంపించి పోయేడు. ''అరె లూకా, ఆ ముసలి దయ్యం మళ్లీ మన్నిదాగుడు కాపలాకి పంపుతాడను

ఫోమ్యుష్కిన్తోవంతు. కాని అతిణ్ణ దాక్షిణ్యసారాకోసం ...క అతను నిన్నూ నన్నూ యేరి పంపుతాడు యెప్పటికిమల్లే.''

...లవేసుకొంటూ లూకా రక్షణశ్రేణి పక్కగా వెళ్ళేడు.

''ట్వైన్ దారం నీతోపాటు తీసుకురా'' పోతూ అతనన్నాడు.

అతను చెప్పినట్లే నాజరు చేసేడు.

''నోరు విప్పానంటే యెటువంటి మనిషినో వాడికి చూపిస్తానుండు. తప్పకుండా చూపిస్తా'' తన మిత్రుణ్ణి వచ్చి కలిసికొంటూ అతనన్నాడు. ''మేం పోమని చెపుదాం పట్టురా. బాగా అలిసిపోయామని చెపుదాం. దాంతోసరి యిక. నువ్వు చెప్పు. నీమాట వాడింటాడు.''

''అసలేమిటీ గొడవంతా ? చెత్తవాగుడు ! వూళ్లోంచి మన్ని వాడు పంపేస్తే వాడికేనష్టం. యెందుకంటే మనం అక్కడ జల్సాచేస్తాం. అసలైనా యిక్కడ మనం మామూలుకాపలాలో వున్నామో దాగుడుకాపలాలో వున్నామో తేడాయేంటి ?''

''వూళ్లో కెళ్లా లనుకొంటున్నావా ?''

''శెలవరోజున వెళ్తా.''

''నీ దున్యాకా, ఫోమ్యుష్కిన్తో పోతూందని గుర్కా అంటూన్నాడు'' అని నాజరు హఠాత్తుగా చెప్పేడు.

''దాన్ని గంగలోగలవనియ్యి'' అని లూకా గుర్రుమన్నాడు. అతనివళ్ళు తళుక్మన్నాయి. ''తొందర్లోనే యింకోపిల్లని పట్టేస్తా !''

''దాని మొగుడు యింటికాడ లేనప్పుడు గుర్కావెళ్లాడంట. వెళ్తే, ఫోమ్యుష్కిన్ అక్కడ కూచుని బజీ తింటున్నాడంట. కొంచెంసేపైనాక గుర్కావెళ్లాడు. వాడు కిటికీ పక్కగా వెళ్తుంటే, ''వాడు వెళ్లి పోటం మంచిపనైంది. బజీ తినవేం బుజీ? నువ్వు యింటికి పోనక్కర్లేదులే'' అని అది అందంట. యిక కిటికీ పక్కనవున్న గుర్కా భేష్ అన్నాడంట !''

''నాతో హాస్యాని కంటున్నావా మాట''

''వొట్టురా!''

కొంచెమాగినాక లూకా అన్నాడు.

''ఛష్. దాన్ని గంగలోగలవనియ్యి. కావాల్సినంతమంది ఆడపిల్ల లున్నారు. ఐనా, అసలదంటే నాకు రోత బుట్టింది.''

''నువ్వు చిచ్చరపిడుగువిరా. కాదూ? చూడూ, కార్నెట్ కూతురితో కాలక్షేపం చెయ్యారాదంటరా? అదింకా యెవర్నీ చూసుకోలా.''

లూకా ముఖం చిట్లించేడు.

''య్యేం, మేరియానాయే యెందుకనీ? యీ ఆడపిల్లలంతా వొకటిగా లేరూ?''

''అదంతా యెందుకు? వొక్కసారి అదెట్లా వుంటుందో చూడు మరి.''

''వో. తప్పకుండా. ఐనా వూళ్లో కావాల్సినంతమంది వున్నారు.''

లూకా యీలవెయ్యటం ఆరంభించి ఆఫీసు వైపుకి తల వేళ్ళాడేసి సోమరిగా నడుస్తూ, పోతూపోతూ కొమ్మలనుంచి ఆకులుకోస్తూ పోతున్నాడు. వొక నున్నటి మొక్కని చూసి దడాలున ఆగి దాన్ని కోసి వేసేడు.

''యిదుగో. తుపాకిలో మందుకూరటానికి మాంచి కర్ర''అన్నాడు, దాన్ని గాలిలో ఝుమ్మనిపిస్తూ.

ఆ మట్టి గోడల గుడిసెలోని నేలమీదున్న వొక పొట్టి మేజాబల్ల చుట్టూతా కోసక్కులు భోజనానికి కూచున్నారు:

''యీ రాత్రి యెవరి వంతు?'' అని తెరిచివున్న తలుపుగుండా పక్క గదిలోని కార్పొరల్‌కి వినపడేట్లు వొకరు అరిచారు.

''యెవరి వంతా?'' సందేహంగా కార్పొరల్ ఆ మాట పునరుచ్చరించేడు. ''ముసలి బక్లాకు వంతైపోయింది. ఫోమ్యుష్కిన్ని గూడాను. లూకా, నాజరూ పోవటం మంచిది. మరి ఎర్గుషోవ్ సంగతేమిటి? యీ పాటికి ఖచ్చితంగా మేలుకొనే వుంటాడనుకొంటా?''

''మరి నువ్వే యింకా మేలుకొంటివిగదరా!'' అన్నాడు నాజరు మెల్లగా. అతని మిత్రులు నవ్వేరు.

ఇగ్నషోవ్ అనేవాడు తాగి ఆ గుడిసె గోడపక్కన నిద్రపోయిన వాడు. సరీగ్గా అదే సమయంలో అతను కళ్ళు నులుముకుంటూ, తూల్తూ, ఆ గదిలో కొచ్చేడు.

లూకా లేచి తన తుపాకీని భుజాన వేళ్ళాడేసేడు.

"యిక పదండిరా, అబ్బాయిలూ" లోనికొచ్చి తలుపు మూస్తూ కార్పొరల్ అన్నాడు. తనకింది వీళ్ళు తన మాట వింటారా అని స్పష్టంగా అతనికుండే సందేహాలు అతని కున్నాయి. "తినగానే పదండి. నాకు పై నుంచి ఆర్డర్లు వచ్చినాయి. లేకపోతే మిమ్మల్ని పంపేవాణ్ణేగాదు. కాప్టెన్ యే క్షణంలోనైనా రావచ్చు యిక్కడికి. అంతే గాకుండా, యెనిమిది మంది అబ్రెక్కు లప్పుడే నది దాటారని విన్నా."

"యిక వెళ్ళటం మంచిది." ఇగ్నషోవ్ వొప్పుదలగా అన్నాడు. "ఆర్డర్లంటే ఆర్డర్లే. ఇలాంటి సమయాల్లో కొంచెం బాధలు తప్పవుమరి."

అదే సమయంలో తన నోటిముందర ఆ జీవంజీవకపక్షి కాలొకటి రెండు చేతుల్తోనూ పట్టుకొని తన చుట్టూ జరుగుతున్న దానికేమీ చలించకుండా, లూకా వొకసారి కార్పొరల్ వంకా మరొకసారి నాజరువంకా నవ్వుతూ చూస్తున్నాడు.

రాత్రిపడేవరకూ డేగకోసరం వృధాగా కాచుక్కూచున్న ఇరోష్కా కోసక్కులు బైలుదేరేముందు మకమకలాడుతూన్న ఆ గదిలో కొచ్చేడు.

"భేష్, అబ్బాయిలూ" అని తన ఖంగుమనే మంద్రస్వరంలో అతనన్నాడు. అతని కంఠధ్వని ఆ గదియొక్క యెత్తు తక్కువ నరంబీనుండి ప్రతిధ్వనించి తక్కిన కంఠస్వరాలన్నింటినీ మింగేసింది. "నేను అడివి పందులకోసం కావలా గాస్తా."

# 8

బూర్నిను *(felt)* వదులు చొక్కాలు తొడిగిన ఆ ముగ్గురు కోసక్కులూ తుపాకీలు తమ భుజానపడేసి ఇరోష్కాతోపాటు బైలుదేరేప్పటికి బాగా చీకటి పడింది. వారొక గొయ్యిపక్కగా నడిచి తాము దాసుడు కావలాగాసే చోటికి వెళ్ళేరు.

మొదట్లో నాజరు తాను రాను పొమ్మన్నాడు. కాని, లూకా అతని మీద రెగిరిపడే సరికి అందరూ కలిసి త్వరగా బైలుదేర గలిగేరు. కొద్ది దూరం వెళ్ళినాక ఆ గొయ్యి దగ్గర్నుంచి పక్కకి తిరిగి, రెల్లు దుబ్బుల మధ్యగా కనపడీ కనపడకుండావున్న కాలిబాట వెంట నడచీ, వారు పెరెక్ నదిని చేరుకున్నారు. నది వొడ్డుమీద వొడ్డుకి కొట్టుకొచ్చిన వొక నల్లటి పెద్ద కొయ్యదుంగ వుంది. దాని చుట్టూ వున్న రెల్లు యీ మధ్యనే కిందకి వంచబడింది.

"యిక్కడాగుదామా?" నాజరు అడిగేడు.

"యెందుకాగగూడదూ?" లూకా జవాబిచ్చేడు. "మీరిక్కడా గండి; నేనిప్పుడే వస్తా. యెక్కడికి పోవాలో ఇరోష్కాకి చూపించి వస్తా."

"యీ చోటు భేషుగ్గా వుంది" అని ఇర్గుషోవు వొప్పుకొన్నాడు. "ఇక్కణ్ణుంచి మన మంతా చూడొచ్చు; కాని, మనం మాత్రం యెవరికీ కనపడం. భేష్. యక్కడికొచ్చాం, యిక్కడే వుంటాం. యిది మహ భేషైన స్తలం."

నాజరు, ఇర్గుషోవులు తమ వదులు చొక్కాల్ని నేలమీద పరిచి, ఆ దుంగ వెనకాల కూచున్నారు. లూకా, ఇరోష్కాతో కలిసి వెళ్ళేడు.

"అదెంతో దూరం లేదు" అని ముసలాడి ముందు కొస్తూ లూకా మెల్లగా అన్నాడు. "అవెక్కడికెళ్ళిందీ చూపుతానుండు. నేనొక్కణ్ణే ఆ చోటు నెరుగుదును."

"నువ్వు భలే కుర్రాడివిరా" అని ముసలాడు తిరిగి మెల్లిగా అన్నాడు.

కొద్ది దూరం పోయినాక లూకా ఆగి వొక బురదనీళ్ళగుంట మీదకి వంగి యీల వేసేడు. "అవి నీళ్లు తాగటానికొచ్చే దిక్కడికే. చూశావా?" అప్పుడే నేలమీదపడిన వాటి కాలి గుర్తుల్ని చూపుతూ, దాదాపు యేమీ వినబడనంత మెల్లిగా అన్నాడతను.

"భలేవాడివిరా!" ముసలాడన్నాడు. "యీ దగర్లోనే యే బురద గుంటలోనో పడి అది దొర్లుతా వుంటంది. యిక నువ్వు పోవచ్చు. నే నిక్కడే వుండి కావలాగాస్తా. అభివందనాలు వూడబెరికేవాడా!"

లూకా నేలమీదపరిచిన చొక్కాని తీసికొని, తన యెడమప్రక్కన వున్న రెల్లు దుబ్బులవంక అటూ యిటూ త్వరగాచూస్తూ, తన కుడిప్రక్కన వున్న నిట్రిపు వొడ్డు కిందగా గిరగిరల్లో ప్రవహించుతూన్న టెరెక్ నది కేసి చూస్తూ, వెనక్కి తిరిగెళ్ళేడు. ''యీ దాపులో యెక్కడో 'యే అబ్రెక్కో పొంచివుండి నన్ను కనిపెడుతూ వుండొచ్చు. లేదా, నన్ను చూసి మెల్లగా జారుకొంటూండవచ్చు'' అని అత ననుకొన్నాడు. అకస్మాత్తుగా నీళ్ళల్లోంచి వినపడిన మర్మరశబ్దమూ గలగలమనే ధ్వనీ అతను తులిక్కిపడి తుపాకిపట్టుకోనేట్లు చేసేయి. వొక నల్లటి అడవిపంది అద్దంలాగావున్న నీటి వుపరిభాగంనుంచి దూసుకొచ్చింది. వెంటనే లూకా తుపాకి గురి బెట్టేడు. కాని, అతను కాల్చేముందే ఆ అడవిపంది రెల్లు దుబ్బుల్లో అంతర్ధానమైంది. అసహ్యంతో వుమ్మేసి లూకా ముందుకు సాగేడు. దాగుడు స్థలంవద్దకొచ్చినాక అతనాగి మెల్లగా యీలవేసేడు. అతని బదులు ఈలరాగా తన కామ్రేడ్సువద్ద కతను వెళ్ళేడు.

నాజరు వెచ్చగా ముడుచుకొని పడుకొని మాంచి నిద్రలో వున్నాడు. ఇర్గుషోవ్ వొకకాలిమీదగా వొకకాలు వేసికొని కూచు న్నాడు. లూకా కూచునేందుకై అతను కొంచెం జరిగేడు.

''ఇది నిజంగా వాటమైన స్థలం. యిక్కడ కూచోటం గమ్మత్తుగా వుంది'' అతనన్నాడు. ''సరేగాని, అతన్నక్కడికి తీసికెళ్ళావా ?''

''అదెక్కడుందో నేను చూపించా'' తన వదులుచొక్కాని కింద పరచటానికి వంగుతూ లూకాఅన్నాడు. ''యింతకుముందే వొకపెద్ద.... సరీగ్గా నదిపక్కనిచూశా. అదే అయ్యుండొచ్చు. ఫెళఫెళశబ్దం విన్నావు గాదూ ?''

''విన్నా. వినగానే అదేదో జంతువేననుకొన్నా. లూకా అడవి పందినిదేన్నో కదలగొట్టాడు అనుకొన్నా.'' తన వొదులుచొక్కాని కప్పుకొంటూ ఇర్గుషోవ్ అన్నాడు. ''యిక నే కొంచెం నిద్రపోతా'' అని కొనసాగించేడు. ''కోడి కూసినాక లెగ్గొట్టు నన్ను. మనకొక పద్ధతుం డాలి. నేకొంచెం నిద్రపోతా. తర్వాత నువ్వు నిద్రపో, నేను కాపలా వుంటా—అదీ పద్ధతి.''

"అది భేషైనపని; అయినా నాకింకా నిద్ర రాటంలేదు" అన్నాడు లూకా.

ఆ రాత్రి చీకటిగా, వెచ్చగా, ప్రశాంతంగావుంది. ఆ పర్వతాల్లో వొకటిగా కలిసిపోయిన వొక బ్రహ్మాండమైన నల్లటి మబ్బు ఆకాశంలో చాలా భాగాన్ని కప్పేసింది. గాలేమీ లేకపోయినా అది మెల్లగా యెక్కడికో కదిలిపోతోంది. అలల్లాగావున్న ఆ మబ్బుటంచులు నక్షత్ర ప్రకాశితమైన ఆకాశంలో స్పష్టంగా కనపడుతున్నాయి.

టెరెక్ నదినీ, దాని అవతల మకమకలాడుతూ కనపడుతూన్న ప్రదేశాన్నీ సరాసరి తన కెదురుగా వున్నదాన్ని మాత్రమే లూకా చూడగల్గుతున్నాడు. అతని వెనకాలా, పక్కలీన్నీ గోడల్లాగా రెల్లుదుబ్బులున్నాయి. మధ్యమధ్యన, కారణమేమీ లేకుండానే, ఆ రెల్లు దుబ్బులు వొకదాన్తో మరొకటి రాచుకొంటూ మర్మరధ్వని చేస్తున్నాయి. దిగువ నుంచి ఆకాశపు వెల్తుర్లో చూస్తే కంపించుతూన్న వాటి తల కుచ్చులు కోమలమైన నూమాగుచెట్ల కొమ్మల్లా అగపడుతున్నాయి.

లూకా సరాసరి నదివొడ్డు చివర్న నుంచున్నాడు. దాని కింద భాగాన టెరెక్ నది విసురుగా ప్రవహించుతోంది. దూరాన, నది మరింత ప్రశాంతంగా ప్రవహించుతోంది. అద్దంలాగావున్న దాని ఉపరి భాగాన లోతుతక్కువచోట్ల విసుగుపుట్టించే యేకధ్వనితో చిన్నచిన్న అలల్లేస్తున్నాయి. యింకాదూరాన, నీరూ, వొడ్డూ, ఆ మబ్బూ వొక చొరరాని గాఢాంధకారంగా కలిసిపోయినాయి.

కొన్ని నల్లటి ఆకారాలు నదినీటిమీద పడివున్నాయి. అనుభవం గల లూకా కళ్ళు వాటిని నదిప్రవాహం మోసుకొచ్చిన పెద్ద కొయ్యదుంగలుగా గుర్తించినాయి. మధ్యమధ్య ఆకాశాన మెరుస్తూన్న మెరుపు నది నల్లటిఅద్దంలో ప్రతిబింబించుతూ యేటవాలుగా వున్న అవతలి వొడ్డుని ప్రకాశించేట్లు చేస్తోంది. తాళయుక్తమైన రేధ్వనులు, రెల్లు దుబ్బుల మర్మర శబ్దాలు, నిద్రించే మనుషుల గుర్రుగుర్రుధ్వని, దోమల ఝంకారం, నది గలగలలు, అప్పుడప్పుడూ యెక్కడో చాలా దూరాన్ని హఠాత్తుగా మోగిన తుపాకిధ్వని వల్లనో, వొడ్డువిరిగి నీటిలో పడిపోతోన్న మట్టిగడ్డల ఫెళఫెళల వల్లనో, లేక బుళుక్కుమని నీటిపై కెగిరిన చేప శబ్దం

వల్లనో, ఆ కీకారణ్యంగుండా ఫెళఫెళమని పరుగెత్తుతూన్న అడవిపందుల శబ్దంవల్లనో, చెడగొట్టబడుతున్నాయి. వొకగుడ్లగూబ రెక్కల్ని టపటప లాడిస్తో మీదగాపోయింది. సరిగ్గా లూకా తలమీద అది అరణ్యంవైపు తిరిగి తర్వాత రెక్కల్ని రెపరెపమనిపిస్తో వొక చెట్టుమీద చాలాసేపు రెక్కల్ని దడదడలాడించుతూ గుండ్రంగా తిరిగి ఆ తర్వాత కొమ్మలమధ్య చక్కగా చేరింది. తలవని తలంపుగా వినవచ్చిన యీ ప్రతిధ్వనికి లూకా కనుబొమలు ముడిచి చెవులు రిక్కించి వింటూ తన తుపాకీని తాకేడు.

రాత్రిలో చాలా భాగం గడిచిపోయింది. ఆ నల్లటిమబ్బు పశ్చిమ దిక్కుకి జరిగిపోయి నక్షత్రాల్తో వెలుగుతూన్న ఆకాశాన్నీ, పైకి తిరిగిన పసుపుపచ్చని చంద్రవంకనీ కనపడేట్టు చేసింది. చలి పెరుగుతోంది. పడకలో నాజరు కదిలి, యేమిటోగొణిగి, మళ్లా నిద్రపడ్డాడు. లూకాకి విసుగ్గాగా వుంది. తన మడతచాకుని బైటికిలాగి అతను తన కర్రని తుపాకిగజం *(ramrod)* లాగా చెక్కనారంభించేడు. పర్వతాల్లో నివసిస్తోన్న ఛెఛెన్లను గురించి, కోసక్కులంటే వాళ్ళకెంత నిర్భయమైందీ, వాళ్ల అబ్రెక్కులు తనకు సూటిగానో మరొకచోటో నదిని దాటి యెలా రాగలిగిందీ అతను గజిబిజిగా ఆలోచించేడు. అప్పుడప్పుడూ అతను తాను దాక్కున్నచోట నుంచి లేచి నదిని జాగ్రత్తగా పరిశీలనగా చూస్తున్నాడు. ఐనా, అక్కడేమీ లేదు కనపడటానికి. క్రమక్రమంగా, నీటివంకా మకమకలాడే చంద్ర కాంతితో కనపడుతోన్న దూరపువొడ్డువంకా అతను చూచినకొలదీ, అతను అబ్రెక్కుల్ని గురించి ఆలోచించడం మానివేసేడు. తన కామ్రేడ్సుని లెగ్గొట్టే సమయంకోసంమాత్రమే అతనిప్పుడు కాచుక్కూచున్నాడు. యింటికి పోవాలని అతనికి కోరికగా వుంది. తన ప్రియురాలు (కోసక్కులు వొకరుంచుకొన్న ఆడమనిషిని అలాగే పిలుస్తారు) దున్యాకాని గురించి అత నాలోచించేడు; అతనికి కోపమూ ద్వేషమూ కలిగేయి. తెల్లవారవస్తోంది. వెండిలాంటి పొగమంచు నదిపై లేవసాగింది. గద్దపిల్లలు చెవులు రింగురు మనేట్లు యీలవేసి తమరెక్కల్ని టపటపమనిపిస్తున్నాయి. చివరి కెలాగైతేనేం వొక దూరపు గ్రామంనుంచి కోడికూత వినవచ్చింది; తర్వాత బిగ్గరగా దీర్ఘంగా మరో కోడికూత, ఆ తర్వాత చాలాకోళ్ళు కూసేయి.

"వాళ్ళని లెగ్గొట్టే వేళైంది" అనుకొన్నాడు లూకా; అతనప్పటికి తుపాకిగజం చెక్కటం పూర్తి చేసేడు. అతనికళ్ళు బరువుగావున్నాయి. అతను తన కామ్రేడ్సువంక తిరిగి యేకాళ్ళు యెవరినా అని చూసేలోగానే నదికి ఆవలిపక్కన యేదో ధ్వనైందని హఠాత్తుగా అతననుకొన్నాడు. గిర్రున అతను అటుతిరిగేడు. దిఙ్మండలం యిప్పుడు చంద్రివంక కాంతితో బాగా ప్రకాశిస్తోంది. అవతలివొడ్డు ఆకారమూ నదీ అతనికి కనపడినాయి. కొట్టుకొనిపోతూన్న కొయ్యదుంగలిప్పుడు స్పష్టంగా అగపడుతున్నాయి. తాను ఆ నదిమీద జారిపోతున్నట్లూ, ఆ కొయ్యదుంగలున్న పెరెక్ నది నిశ్చలంగా వున్నట్లూ వోక్షణంపాటు అతనికి అనిపించింది. కన్నులు చిట్లించి యేకాగ్రితతో అతను చూసేడు. ముందుకి పొడుచుకొచ్చిన కొమ్మవున్న వొక పెద్ద నల్లటి దుంగ అతని దృష్టి నాకర్షించింది. వూగకుండా, అటూ యిటూ తిరక్కుండా నది మధ్యన కిందకి మృదువుగా జరిగిపోతూన్న దాని చలనంలో యేదో ప్రత్యేకతవుంది. అది సొంతం ప్రవాహందిగువకి పోవటంలేదనీ, నదికడ్డంగా లోతుతక్కువ ప్రదేశంవైపు పోతూందనీ లూకాకి తట్టింది. అతను మెడసాచి దాన్ని పరిశీలనగా చూసేడు. ఆ దుంగ వొక లోతుతక్కువ ప్రదేశంవద్ద ఆగి విచిత్రంగా మరోదిక్కుకి మారింది. దుంగ వెనకాల యెవరిదో చేయి కనపడిందని లూకా అనుకొన్నాడు. "నేనొక్కణ్ణే వోఅబ్రిక్కుని కాల్చితే యెలావుంటుందో!" అని అతననుకొన్నాడు. వడివడిగా, హడావుడేమీ లేకుండా, తుపాకి తీసి, తుపాకి గుర్రాన్ని నిశ్శబ్దంగా వెనక్కులాగి, ఆ కొయ్య దుంగకి గురిపెట్టి, వూపిరి బిగబట్టి అతను సమయంకోసం నిరీక్షిస్తున్నాడు.

"వాళ్ళని లెగ్గొట్టను" అని అనుకొన్నాడతను. అతను వినగలిగేంత తీవ్రంగా అతనిగుండె దడదడ కొట్టుకోసాగింది. ఆ దుంగ హఠాత్తుగా ముందుకురికి వొడ్డుకి తేలిపోసాగింది. "హరి భగవంతుడా! గురితప్పుతుందేమో!" అని అతను నిరాశతో అనుకొన్నాడు. నీటిపై తేలిపోతూన్న ఆ కొయ్యదుంగ ముందరిభాగాన నున్నగా గొరిగున్న వొక తార్తారువాడి తల మకమకలాడే చంద్రికాంతిలో అతనికి సూక్ష్మంగా కనపడింది. సూటిగా ఆ తల కతను గురిపెట్టేడు. అది చాలాదగ్గరగా, తుపాకి నోటివద్ద వున్నట్లుగా అగపడింది. "ఖచ్చితంగా వాడు అబ్రిక్కే" అతను వుబ

లాటంతో అనుకొన్నాడు. అతను సరైన పైకిలేచి మళ్ళీ గురిచూసేడు. యిప్పుడాతల ఆ దుంగచివర్న బాగా కనపడటంలేదు. తాను బాల్యం నుంచీ యెరిగున్న వొక కోసక్కు ఆచారంప్రకారం "భగవంతుని పేరుతో, యేసుక్రీస్తు పేరుతో" అని మెల్లగా వుచ్చరించి అతను తుపాకి మీట నొక్కేడు.

వెంటనే కళ్లు మిరుమిట్లు గొల్పేంత కాంతి వెలువడి రెల్లుదుబ్బులీ నీటినీ వెలిగేట్లుచేసింది. ఆ వెనువెంటనే నదిమీదుగా రింగురుమనేట్లు తుపాకి ధ్వని వినపడి, తర్వాత దూరాన్నెక్కడో వురిమిన వురుము ప్రతిధ్వనిలాగా ఆ ధ్వని మారిపోయింది. ఆ కొయ్యి దుంగ యిప్పుడు వూగుతూ, అటూ యిటూ తొలుగుతూ ప్రవాహంవెంట తేలిపోతోంది.

"పట్టుకో. పట్టుకోమంటే!" తన తుపాకి దడాలున పట్టుకొని దాగిన స్తలంనుంచి పరుగెత్తివస్తూ ఇర్గుషోవ్ అరిచేడు.

"నోరుముయ్, దద్దమ్మా!" బిగబట్టిన పళ్ళసందునుంచి లూకా మెల్లిగా అన్నాడు. "వాళ్ళు అబ్రెక్కులు!"

"యెవర్ని కాల్చావ్?" నాజరు అదేపనిగా అడగసాగేడు. "యెవర్ని కాల్చావ్?"

లూకా సమాధానమేమీ యివ్వలేదు. అతను తన తుపాకీలో తిరిగి మందు దట్టించుతూ కొట్టుకొని పోతూన్న కొయ్యదుంగవంక శ్రద్ధగా చూస్తున్నాడు. కొంచెందూరాన అది వొక యిసుకతిన్నెవద్ద వొడ్డుపట్టింది. దాని అడుగుభాగాన నల్లగా పెద్దగావున్నదేదో కనపడింది; అది అటూ యిటూ ఆ నీటిమీద మెల్లగావూగింది.

"యెందుకుకాల్చావ్? యేమీ చెప్పవెందుకని?" అని ఆ కోసక్కులు హఠంవేసేరు.

"వాడొక అబ్రెక్కని మీకు చెప్పనేచెప్పాను" అన్నాడు లూకా.

"వెధవ్వేషాలెయ్యమాక, తుపాకి పేలిందా లేదా?"

"అబ్రెక్కు నొకణ్ణి కాల్చా. వాణ్ణే నేను కాల్చింది." వుద్రేకంతో అతని కంఠస్వరం కంపించుతూండ — గొణిగేడు. యెగిరి నుంచుని ఆ యిసుకతిన్నెవంక చూపేడ-

''వెధవ్వేషాలెయ్యమాక'' కళ్లు నులుముకొంటూ ఇర్గుషోవు మళ్లీ అదే మాటన్నాడు.

''వెధవవేషాలంటావు, నీ వుద్దేశమేంటి? చూడసలు! అటుచూడు!'' అతని భుజాల్ని దడాల్న పట్టుకొని అతను గుర్రుమనేంత బలంగా అతన్ని ముందుకి లాగుతూ లూకా అన్నాడు.

లూకా చూపినవైపుకి అతనుచూసి అక్కడొక మనిషి శరీరాన్ని గుర్తుబట్టి అతను ప్లేటు ఫిరాయించేడు.

''చచ్చాంపో! యిక యింకా మరికొంతమంది రావొచ్చు'' మెల్లగాఅని, అతను తన తుపాకీని పరీక్షించసాగేడు. ''వాడొకస్కౌటు. తక్కిన వాళ్ళు యిప్పటికే యిక్కడికొచ్చివుండాలి, లేదా, అవతలివొడ్డున దాటటానికి తయారవుతా నన్నా వుండి వుండాలి—నామాటలు బాగా గుర్తు పెట్టుకో!''

లూకా తన బెల్టు వూడదీసి కోటు విప్పదీయసాగేడు.

''నువ్వు చెయ్యబోయేదేంటిరా, బద్మా?'' ఇర్గుషోవ్ అరిచేడు. ''కనపడమాక. చావాలనుకొంటున్నావా యేంట్రా? వాడు చచ్చిపోయి వుంటే యెక్కడికీపోడిక. నాకు కొంచెం మందుగుండు యిలాయివ్వు. ఆ! నాజర్ నువ్వు ఆఫీసుకి పరుగెత్తు. వుషారుగావుండు. వొడ్డు పక్కగా మాత్రం పోమాక. పట్టుకొంటారు—నామాటలు బాగాగుర్తుపెట్టుకో!''

''వొంటరిగా పోతే నన్ను పట్టుకోటం! నువ్వే యెందుకు పోరాదురా?'' నాజరు·కోపంగా సమాధాన మిచ్చేడు.

లూకా కోటు విప్పేసి, నదివైపు నడవసాగేడు.

''ఆగరా. ఆగమన్నా!'' తుపాకిలో మందుపోస్తూ ఇర్గుషోవు అన్నాడు. ''వాడు కదలటల్లా. నీకు కనపడటల్లా? దాదాపు తెల్లారింది. మనవాళ్ళు వచ్చేవరకూ ఆగు. పరుగెత్తరా నాజర్. భయపడుతున్నావు దేనికిరా? యేంఫర్వాలేదన్నాగా.''

...వో చెప్పవురా? కానియ్

నీటిలో దిగే ఆలోచనని లూకా విడిచిపెట్టేడు.

''మీ యిద్దరూ ఆఫీసుకి పరుగెత్తండి. నేనిక్కడే వుంటా. గుర్రపు కావలావాణ్ణి పంపమని వాళ్ళకి చెప్పండి. అబ్రెక్కులిటొస్తే ప్రయత్నం చేసి మనం వాళ్లని పట్టెయ్యాలి.''

''భేష్. మనం ప్రయత్నం చెయ్యాలి. కాని వాళ్ళు తప్పించుకు పోతారు—నా మాటలు బాగా గుర్తుపెట్టుకో.'' లేస్తూ, ఇర్గుషోవు అన్నాడు.

నాజరూ, ఇర్గుషోవూ క్రాస్ (*cross*) చేసుకొని ఆఫీసుకి బైలు దేరేరు. వొడ్డువెంబటిగాకుండా పొదలగుండా తొక్కుకొంటూ అడవి బాటవైపు సాగేరు.

''లూకా, వున్నచోటినుంచి కదలమాక!'' ఇర్గుషోవు వెనక్కి తిరిగి చెప్పేడు. ''నేను చెపుతున్నా—కన్నుమూశావంటే వాళ్ళు గొంతు కోసేస్తారుసుమా.''

''మీరు పొండోయ్. నాసంగతి నాకు తెలుసులే.'' లూకా గొణిగేడు. తన తుపాకీని పరీక్షజేసి అతను తిరిగి నేలమీద కూచున్నాడు.

తన దృష్టిని ఆ యిసుకతిన్నెమీద నిలిపి, తన కామ్రేడ్సుకోసరం యెదురుచూస్తూ అతను కూచున్నాడు. కాని, ఆఫీసు చాలా దూరం. అతనికి చిరాకెత్తుతోంది. అబ్రెక్కులు చల్లగా జారిపోతారేమోనని అతనికి ఆరాటంగా వుంది. క్రితంరాత్రి తననుంచి వొక అడవిపంది తప్పించుకొని పోయినప్పుడు మనోవేదన పడినట్లే, యిప్పుడీ అబ్రెక్కులు పారిపోతారే అని అతను ఆరాటపడుతున్నాడు. ప్రతిక్షణమూ యెవరో ఆ నదివొడ్డుమీద కనపడతారనే ఆదుర్దాతో, అతను తనచుట్టూనూ అవతలివొడ్డువంకా అదేపనిగా చూస్తున్నాడు. తన తుపాకీని కాల్చటానికి తయారుగా వుంచేడతను. వొకవేళ తానే చంపబడవచ్చుననే ఆలోచన అతనికి తట్టనేలేదు.

# 9

బాగా తెల్లవారుతోంది. లోతు తక్కువ నీటిపై మృదువుగా వూగుతూ ఆ అబ్రెక్కు శరీరం యిప్పుడు స్పష్టంగా కనబడుతోంది.

ఇంతలో హఠాత్తుగా రెల్లు మర్మరధ్వని చేసింది. తెల్లటి యీకల వంటి ఆ రెల్లు తలలు కదలటం అతను గమనించేడు. తనకి చాలా దగ్గర్లో పాదాల శబ్దం అతనికి వినపడింది. తుపాకీని రెడీలో పెట్టి, ''భగవంతుని పేరుతో, యేసుక్రీస్తు పేరుతో'' అని అతను గొణిగేసరికి పాదధ్వని ఆగిపోయింది.

''హే కోసక్! మామని కాల్చమాక!'' అని వొక గంభీర కంఠ స్వరం ప్రశాంతంగా అంది. ఆ వెనువెంటనే ఇరోష్కా మామయ్య రెల్లు దుబ్బుల్లోంచి ప్రత్యక్షమయ్యేడు.

''హరి దేముడా! వెంట్రుకవాసిలో చచ్చిపోయేవాడివే!'' లూకా ఆశ్చర్యంతో అరిచేడు.

''నువ్వు కాల్చిందెందుకు?'' ముసలాడు అడిగేడు.

అడవిలోనూ, నదివెంబటే ప్రతిధ్వనించిన అతని శక్తివంతమైన కంఠ స్వరం లూకా చుట్టూవున్న నిశ్శబ్దతనీ, నిగూఢత్వాన్నీ పారదోలింది. అంతా సులువుగా, విస్పష్టంగా అయినట్లగపడింది.

''విను. నువ్వక్కడ వృధాగా కాచుక్కూచుంటే, నేనిక్కడొక అడవి మృగాన్ని చంపేశా!'' నుంచుని తుపాకీని సరిజేస్తూ, సహజవిరుద్ధమైన శాంతంతో లూకా అన్నాడు.

చిన్నిచిన్ని అలల్లేస్తూన్న నీటిపైన తేల్తూ, యిప్పుడు కంటికి స్పష్టంగా కనపడుతూన్న ఆ తెల్లటి వీపువంక ముసలాడు దృష్టి కేంద్రీకరించి చూస్తోన్నాడు.

''వాడు వీపుమీదొక కొయ్యదుంగ వేసుకొని యీదుతుంటే నేను చూశా......అదుగో అక్కడచూడు! చూశావా? నీలపు లాగూ, తుపాకీ, యింకా—నీకు కనపడటల్లా?''

''కనపడుతున్నాడులే'' ముసలాడన్నాడు. అతని ముఖవైఖరి నిశ్చలంగా, కఠినంగా వుంది. ''నువ్వొక జిఘిత్‌ని చంపావు'' అని, జాలిగానా అన్నట్లు, అతనన్నాడు.

''సరే, అసలు సంగతి విను. నేనిక్కడ కూచునుంటే అవతలిపక్కన దడాలున వొక నల్లటి వస్తువగపడింది. వాడక్కడున్నప్పుడే నేను చూశా.. నీళ్లల్లో దూకుతూన్న మనిషిలాగా నాకు కనపడింది. అది విపరీతంగావుంటే

అనుకొన్నా. తర్వాతొక కొయ్యదుంగ, చాలా పెద్దది, నీటిమీద తేల్తూ వచ్చింది. అది నీటిలో కొట్టుకొని పోటల్లా; అడ్డంగా, మనవేపు వస్తున్నది. యింతలో దడాలున దాని కిందొక తల అగపడింది. యిదేమిటాని అనుకొన్నా. గురిచూచి కొట్టాలనుకొన్నా. కాని, రెల్లుదుబ్బు లడ్డంవచ్చినయ్యి. అందుకని నుంచున్నా. కాని, ఆ మాదర్చేదు చూశాడనుకొంటూ నేను నుంచోటం. ఆపళ్ళే వాడు యిసుకతిన్నెమీదకి పాకి చుట్టూ చూశాడు. "తప్పించుకుపోలేవురా తాబేటిబుర్రా!" అనుకొన్నా. అక్కడే వున్నాడు నేలమీద నక్కి చుట్టూచూస్తూ. నా గొంతు నేదో పిసికినట్లయింది. తుపాకిని రెడీలో అట్టేపెట్టి కదలకుండా నుంచున్నా. చూశా, చూశా, ఆఖరికి వాడు బయటికీదుకొచ్చాడు. వాడు వెన్నెట్లోకి బయటికీదుకొచ్చినాక వాడి వీపంతా నాకు అగపడింది. "భగవంతుడి పేరుతో, యేసుక్రీస్తు పేరుతో" అన్నా. తుపాకి పోగగుండా, వాడు గిలగిల కొట్టుకోటం నేను చూశా. వాడు మూలిగినట్టు విన్నాననుకొన్నా. భేష్, వాణ్ణి చంపాగందరా అనుకొన్నా. తర్వాత వాడు ఆ యిసుకతిన్నెమీదకి కొట్టుకొచ్చినాక వాడు స్పష్టంగా నాకు కనిపించాడు. లెగవాలని ప్రయత్నం చేశాడు గాని ఫలితం లేకపోయింది. కొంచెం అటూయిటూ తంటాలుపడి యిక కదలకుండా పడిపోయాడు. నాకంతా చాలా బాగా కనపడింది. చూడు, వాడు కదలటంలేదు. తప్పకుండా చచ్చివుంటాడు. వాళ్ళేవళ్లయినా యింకా వుంటే పారిపోకుండా పట్టుకోటంకోసమని మనుషులకోసం మనవాళ్ళు ఆఫీసుకి పరుగెత్తారు."

"అయితే అతన్ని చంపావన్నమాట ?" మునలాడు విచారంతో ఆమాట తిరిగి అన్నాడు తలూపుతూ. "అతనిప్పుడు చాలా దూరానున్నాడురా అబ్బాయ్."

చెట్లకొమ్మలు విరుగుతూన్నధ్వనీ బిగ్గరగా అరుస్తున్న మనుష్యుల గొంతులూ నదీ తీరంనుంచి వినవచ్చేయి.

"హేయ్! ఆ చిన్నపడవ తెచ్చారంటోయ్?" లూకా అరిచేడు.

"నువ్వు భలేవాడివిరా, లూకా" అని కోసక్కుల్లో వొకరు అరిచేరు. "వాణ్ణి వొడ్డుమీదకి లాక్కురా!"

తాను చంపినవాడిమీద దృష్టి నిలిపి, లూకా తనబట్టలు విప్పదీయ సాగేడు.

"ఆగాగు! నాజరు చిన్నపడవని తెస్తున్నాడు." కార్పొరల్ అరిచేడు. "వారే వెర్రిమొఖం! వాడు చచ్చినట్టు నాటకమాడుతున్నాడేమో; నీ పట్టాకత్తి పట్టుకుపోరా వెంబటి" అని మరొకరు అరిచేరు.

"చెత్త!" పంట్లాములు లాగేసుకొంటూ, లూకా అరిచేడు. క్రాస్ చేసికొని గభాలున నీట్లోకి మునిగేడు. భారంగా గాలి పీలుస్తూ, తనవీపుని నీటిపైన బాగాయెత్తివుంచుతూ, తన తెల్లని చేతుల్తో విసురుగా యీదుతూ ఆ యిసుకతిన్నెవైపు అతను ప్రవాహాన్ని కడ్డంగా యీదసాగేడు. మాటాడుతూ అరుస్తూ కోసక్కులు నదివొడ్డుమీద గుమికూడేరు. కావలాకోసరం ముగ్గురు గుర్రపురౌతులు వెళ్ళేరు. లూకా ఆ యిసుకతిన్నెవద్దకి చేరగానే, వొకవంపువద్ద చిన్నపడవ కనపడింది. లూకా యిసుకతిన్నెని చేరేడు. అతను నుంచుని, ఆ శవంమీదికివంగి, దాన్ని దొర్లించేడు. "నిజంగా చచ్చాడు!" అని అతను కీచురుగొంతుతో అరిచేడు.

ఆ ఛెఛెన్‌కి తలగుండా గుండు దూసుకుపోయింది. అతను నీలి పంట్లామూ, వొకచొక్కా, సిర్‌కేషియన్ కోటూ తొడిగివున్నాడు. వొక తుపాకీ, పట్టాకత్తీ అతని వీపుకి కట్టబడి వున్నాయి. వాటిమీదొక పెద్ద చెట్టుకొమ్మ కట్టివుంది. అది చూసే లూకా కంగారు పడ్డాడు మొదట.

"భలే గండుచేపని పట్టావుపో." పడవమీద ఆ శవాన్ని వొడ్డుకి తెచ్చినప్పుడొక కోసక్కు అన్నాడు. ఆ శవం వొడ్డుమీది గడ్డిపై పడివుంది. కోసక్కులు దానిచుట్టూ వలయాకారంలో నుంచున్నారు.

"వాడు పసుప్పచ్చగా లేడూ?"

"మనవాళ్ళు వాళ్ళకోసరం యెక్కడికెళ్ళారో? తొంభైపాళ్ళు వాళ్ళింకా అవతలి వొడ్డుమీదే వుండి వుంటారు."

"వీడు తప్పకుండా స్కౌటు అయ్యుండాలి. కాకపోతే వొక్కడే యెందు కీదుకొస్తాడూ?"

"భలే మొనగాడు గాబట్టి అందరికంటే ముందొచ్చాడు. జిఘిట్ వస్తాదనుకోండి!" తన తడిబట్టల్ని వొడ్డుమీద పిండుతూ బాగా వణు

కుతూ లూకా అపహాస్యంగా అన్నాడు. "చూడండి, గడ్డాన్ని నీటుగా కత్తిరించి రంగుపూశాడు."

"చూడండి. వీపుమీదొకసంచి, దాంట్లో నాడి కోటూ వుంది." కోసక్కుల్లో వొకరన్నారు. "అందుకనే తేలిగ్గా యీదగలిగాడు."

"యిదుగో మనమిప్పుడిది చేద్దాం,' లూకా" కార్పొరల్ తన చేతుల్లో ఆ ఛెఛెన్‌మనిషి తుపాకినీ పట్టాకత్తినీ పట్టుకొని అన్నాడు. "ఆ కోటూ, కత్తీ నువ్వుంచుకో. యీ తుపాక్కి నీకు మూడు వెండి రూబుల్లిస్తాను. చూడు, దీనికి కంతవుంది" తుపాకి గొట్టంలోకి వూదుతూ అతనన్నాడు. "దీన్ని గ్యాపకార్థంగా దగ్గిరుంచుకోవాలనుంది."

లూకా సమాధానమేమీ యివ్వలేదు; ఈరకంగ బేరమాడటం అతన్ని కంగారు పరిచింది. కాని, దాన్నుంచి తప్పించుకొనేమార్గం లేదని అతనికి తెలుసు.

"వాణ్ణి గంగలో కలవనియ్యి" కనుబొమలు చిట్లిస్తూ ఆ కోటుని కింద విసిరేస్తూ అతనన్నాడు. "అది కొత్త మంచికోటన్నాగాదు. వొత్తి గుడ్డపేలిక!"

"ఐనా, పుల్లలు మొయ్యటానికి పనికొస్తుందిలే" అని కోసక్కుల్లో వొకరన్నారు. "మోసీవ్, నే నింటి కెళ్తున్నా." కార్పొరల్‌కి తానిచ్చిన బహుమతికి బదులుగా యేదన్నా రాబట్టే నిశ్చయంతో లూకా అన్నాడు.

"సరె సరే." యింకా ఆ తుపాకీని పరీక్షిస్తూనే వున్న కార్పొరల్ అన్నాడు. "అబ్బాయిలూ, వీణ్ణి ఆఫీసు కవతలకి మోసుకుపదండి. కాని యెండ తగలకుండా పైనేదన్నా పాకవెయ్యటం మాత్రం మరిచిపోమాకండి. బహుశా సొమ్మిచ్చి శవాన్ని తీసికెళ్లటానికి ఆ పర్వతాలనుంచి యెవరైనా రావచ్చు."

"యింకా యెండెక్కలేదులే." యెవరోలన్నారు.

"మరి యేనక్కొవచ్చి శవాన్ని పీకుతుందనుకో" వొక కోసక్కు సలహాగా అన్నాడు. "అప్పుడు తిరుగుడే ననుకొంటా, కాదూ?"

"ఆఁ. తిరుగుడేమరి. శవాన్నొదిలించుకు పోటానికి వాళ్లొచ్చేదినిజం. కాపలావేద్దాం."

''భేష్, లూకా'' కార్పొరల్ వుల్లాసంగా అన్నాడు. ''నువ్వొక బొక్కెన వోడ్కా-సారా మనకురాత్రికి కిప్పించాలి. తప్పదు.''

''అవును. అది ఆచారం.'' కోసక్కులు అంగీకరించేరు. ''అలాంటి పనికురాత్రిడు అలాంటి అబ్బాయిక్కని చంపే అదృష్టం!''

''అదిసరేగానీ, యీ కత్తినీ కోటుని యెవరుకొంటారు ?'' లూకా అడిగేడు. ''వూం. కానివ్వండి. పంట్లాముగూడా తీసుకోవచ్చు. అది నాకు చాలా బిగుతవుతుంది. వీడు సన్నటి లంబ్డీకొడుకు.''

వొకకోసక్కు ఆ కోటు నొక రూబుల్‌కి కొన్నాడు. మరొకడు రెండు బొక్కెన్ల సారా ఖరీదుకి కత్తిని కొన్నాడు.

''ఆc. వొరే అబ్బాయిలూ; యిప్పుడు మీరు తాగొచ్చు'' లూకా అన్నాడు.

''వొక బొక్కెన సారా మీకిస్తా. వూళ్లొంచి నేనే అది పట్టుకొస్తా.''

''ఆ పంట్లాం చించి ఆడపిల్లలకి జేబురుమాళ్లు కుట్టించరాదటోయ్?'' నాజరు అన్నాడు.

తక్కినవాళ్లు పగలబడి నవ్వేరు.

''యిక నాపండి!'' కార్పొరల్ ఆజ్ఞాపించేడు. ''శవాన్ని తీసుకుపొండి. యీ ఛండాలాన్ని ఆ గుడిసెపక్క నుంచటం చూడు!''

''యింకా నుంచున్నారెందుకోయ్? వొరే అబ్బాయ్, వాణ్ణి లాక్కుపదండా్రి'' లూకా ఆజ్ఞాపూర్వకంగా అన్నాడు. కోసక్కులు లూకా తమ ఆఫీసరైనట్లు అతని మాటకి లొంబడి, అయిష్టంగానే ఆ శవం కాళ్లు పట్టుకొన్నారు. కొద్దిదూరం వరకూ వారు దాన్ని నేలమీదయీడ్చి, తర్వాత కాళ్లొదిలేసేరు. అవి ప్రాణం లేకుండా తపుక్కున కింద పడినాయి. వెనక్కితగ్గి వాళ్లు కొంతసేపు నిశ్శబ్దంగానుంచున్నారు. నాజరు వచ్చి వాడి కణతపైనున్న తుపాకిగుండు రంధ్రం చూడటానికి వాడి తలని సరిజేసేడు. ''యెటువంటిదెబ్బో చూశారా? సరాసరి మెదడుగుండా దూసుకుపోయింది'' అని అతనన్నాడు. ''వీణ్ణి వాళ్ళు వదిలేసి వూరుకోరు. వీడి గ్యాపకార్థం యేదో ఒకటుంచుకుంటారు.''

దాని కెవరూ ఏమీ సమాధాన మియ్యలేదు. తిరిగీ నిశ్శబ్దదేవత ఆ కోనక్కాలపై తన రెక్కల్ని విప్పి సాచింది.

పొద్దెక్కింది. సూర్య కిరణాలు మంచు బిందువుల్లో వున్న పచ్చి గడ్డినీ, చెట్ల ఆకుల్నీ వెలిగించుతున్నాయి. నిద్రమేల్కొన్న అరణ్యంలో కెరెక్ యొక్క మర్మరధ్వనులు వినవొస్తున్నాయి. ఉదయాగమనాన్ని ఆహ్వానిస్తో, జీవంజీవక పక్షులు అన్నివేపులనుంచీ వొకదాన్తో వొకటి పలుకుతున్నాయి. నిశ్చలంగా నిశ్శబ్దంగా నిలబడి కోనక్కాలు చని పోయిన మనిషివంక చూస్తున్నారు.

ఆ శరీరాన్ని, పొట్టమీద బాగా బిగించబడివున్న ఆ నీలి పంట్లాం తప్పితే మరేమీలేదు. సన్నగా గోధుమరంగుగా వున్న ఆ శరీరంయొక్క అవయవాలు బహుసుందరంగా వున్నాయి. కండలు తీరిన అతని చేతులు అతని పక్కల్ని బిగదీసుకొని పడివున్నాయి. నున్నగా గొరిగున్న అతని గుండ్రిటి తల నీలవర్ణంగావుండి వెనక్కి పడివుంది. కణతమీదున్న గాయం నెత్తుటితో గడ్డకట్టివుంది. ఆ గొరిగిన తలకి భిన్నంగా అతని నుదురు సన్నగా యెండదెబ్బకి నల్లబడివుంది. గాజుగోలీలవలె కళాహీనమైవున్న అతని కళ్ళు పైకి యెక్కడికో చూస్తున్నాయి. నీటుగా కత్తిరించబడి యెర్ర రంగు పూయబడిన మీసాల కిందవున్న అతని సన్నని పెదిమలు మూలలకి విప్పారివుండి ప్రేమతో కొంచెం వెటకారంతో చిరునవ్వు నవ్వుతున్నట్లు న్నాయి. అతని చిన్నచేతుల్ని వున్నవేళ్ళని గోధుంరంగు వెంట్రుక లున్నాయి. వేళ్ళు లోపలికి ముడుచుకొని వున్నాయి. గోళ్ళకి యెర్రరంగు వేయబడింది.

లూకా యింకా బట్టలు వేసుకోలేదు. అతనిమెడ మామూలుకంటే మరింత యెర్రగావుంది; కళ్ళు మరింత ప్రకాశంగా వున్నాయి. నెడ ల్పాంటి అతనిచెక్కిళ్ళు అదురుతున్నాయి. అతనింకా తడిసేవున్నాడు. కనపడీ కనపడని ఆవిరిపొగ ఆ చక్కని వుదయ వాయువులో అతని శరీరం నుంచి బైటకొస్తోంది.

''వాడూ మనిషంటే!'' అతని శరీరపు తీరు సొరుల్ని మెచ్చు కొంటూ లూకా అన్నాడు.

"అవును. వాడే నిన్ను పట్టుకునుంటే నీపని ఖాళీ అయ్యేది" అని కోసక్కుల్లో వొకరన్నారు.

ఇంతకు ముందున్న నిశ్శబ్దదేవత యెగిరిపోయింది. కోసక్కులు మాట్లాడటం, అటూయిటూ గత్తర బిత్తరగా తిరగటం మొదలెట్టేరు. అందులో యిద్దరు పాకకి కొమ్మలు నరకటంకోసం వెళ్ళేరు. తక్కినవాళ్లు విలాసంగా ఆఫీసువైపు నడిచేరు. నాజరు, లూకా తమ యిళ్లకెళ్లటంకోసం హడావుడిగా తయారవుతున్నారు.

వొక అరగంటతర్వాత, టెరెక్ నదినీ గ్రామాన్నీ వేరుచేస్తూన్న అరణ్యంగుండా చాలావరకు పరుగెత్తుతూ, ఆ యిద్దరూ యింటిదోవ పట్టేరు.

"ఆఁ. చూడూ. నేను పంపానని ఆవిడతో చెప్పమాక. పోయి, భర్తయింటివద్ద వున్నాడేమో చూడు. చూస్తావా?" లూకా కీచురు గొంతుతో అన్నాడు.

"సరె సరే." నాజరు అణకువగా అన్నాడు. "యమ్కా యింటి గ్గూడా వెళ్దాంలే. మనకి మంచి ఛాన్సు. ఆ!"

"ప్రయత్నంచేసి నన్నావుచెపుతా."

వూరుచేరగానే ఆ యిద్దరూ తెగతాగి సాయంత్రం వరకూ నిద్రపోయేరు.

# 10

ఈ సంఘటనలు జరిగిన మూడోనాడు కకేషియా కాల్బల రెజిమెంటునుంచి నోవోంలిన్స్క గ్రామానికి రెండు దళాలు చేరినాయి. సామాను బళ్ళు వూడదీయకుండా ఆపరేన్ గ్రామచౌకంలో నిల్చున్నాయి. వంట వాళ్ళొక గొయ్యి తవ్వి తమకిచ్చిన కొయ్యదుంగల్తో త్వరగా అన్నం వండుతున్నారు. జీతాలిచ్చే సార్జెంట్లు సైనికుల జీతాల గొడవచూస్తున్నారు. సర్వీస్‌కోర్ *(Service corps)* మనుషులు గుర్రాల్ని

కట్టెయ్యటంకోసరం కట్టుగొయ్యలు పాతుతున్నారు. సైన్యానికి భోజనం, వసతీ మున్నగునవి చూసే ఆఫీసర్లు *(Quarter masters)* సైనికులకీ ఆఫీసర్లకీ పడకవసతులు చూపించుతూ, తాము తమ యిళ్లవద్ద వున్నట్లుగా విలాసంగా అటూఇటూ తిరుగుతున్నారు. బళ్ళతో, గుర్రాల్తో, బారుతీరిన మందుగుండు వాగన్లతో, జావ కాస్తూన్న పెద్దబానల్తో బజార్లు నిండిపోయివున్నాయి. కెప్టెనూ, లెఫ్టినెంటూ, సార్జంటుమేజరు అక్కడేవున్నారు. ఇదంతాకూడా ఆ సైనిక దళాలు మకాంచెయ్యాల్సిన గ్రామంలోనే జరుగుతోంది కనక, ఆ దళాలకి యింటివద్ద వున్నట్లుగా హాయిగా వుంది.

ఈ కోసక్కులెవరు? ఈ సైనిక దళాలు తమ గ్రామంలో బైతా యించటం వాళ్లకిష్టమేనా? క్రైస్తవ మతంలో వాళ్ళే తెగకి చెందినవాళ్లు? సైనికులు యీ ప్రశ్నల్ని పట్టించుకోనేలేదు.

జేబుల్లో తమ జీతపు డబ్బులు వేసుకొని, అలిసిపోయి, వొళ్లంతా దుమ్ముకొట్టుకొని, సైనికులు చౌకాల్లోనూ వీధుల్లోనూ మూగుతున్నారు. గ్రామస్తులకి తమ పట్లగల క్రోధాన్ని నిర్లక్ష్యం చేసేందుకు నిశ్చయించు కొని, సైనికులు యిద్దరు ముగ్గురుగా తమ తుపాకీల్ని ఖంగుమనిపించుతూ యిళ్లల్లో దూరేరు. తమ వొంటిపై వస్తువులూ అవీ గోడలకి తగిలించి, సంచులు విప్పదీసేసి, ఆడవాళ్లతో సరసమాడుతున్నారు. వాళ్లల్లో వొక పెద్దగుంపు తమకు ప్రియమైనచోట—జావకాచే పాత్రదగ్గిర—చేరింది. చక్కని ఆ గాలిలో కరిగినగాజులాగా—యెండమావుల్లాగా—వణుకుతూన్న నిప్పువంక తేరిచూస్తో, మొదట కనపడీ కనపడకుండా లేస్తూ తర్వాత ఆకాశంలోకి దట్టంగా లేస్తూన్న పొగవంకచూస్తో, వాళ్ళు తమ పొగ గొట్టాల్ని నోట్లోపెట్టి తాగుతూ రష్యన్లలాగా జీవితం గడపనందుకు ఆ గ్రామస్తుల్ని వేళాకోళం చేస్తున్నారు.

అన్ని దొడ్లల్లోంచీ గడబిడగా నవ్వుతూన్న సైనికుల గల్లంతూ, తమ యిళ్ళూ వాకిళ్లని రక్షించుకొనే ప్రయత్నంలో సైనికులకి నీళ్లూ వంట సామాగ్రి యివ్వటానికి నిరాకరించుతూన్న ఆడవాళ్ల కీచురుమనే కోప ధ్వనులూ వినవొస్తున్నాయి. పిల్లలు తమ తల్లుల్లో వొకర్నొకరో అంటి పెట్టుకొనో, లేక సైనికులవెంట కొంచెం దూరంగా పరుగెత్తుతూనో భయంతో యిదేమిటో తెలిసికోవాలనే జిజ్ఞాసతో వాళ్ల చర్యల్ని కనిపెడు

తున్నారు. ముసలికోసక్కులు యిళ్లల్లోంచి బైటికొచ్చి యిళ్లముందున్న మట్టిదిబ్బలమీద నిశ్శబ్దంగా కూచుని కలవరంతో సైనికుల వ్యవహారాలు గమనిస్తున్నారు.

మూడునెలల కిందట కకేషియా సైన్యంలో వొక చిన్నవుద్యోగిగా చేరిన ఓలెనిన్‌కి ఆ గ్రామంలోకెల్లా ఘనమైన యిళ్లల్లో వొకటైన కార్నెట్ యిల్లు వసతికి చూపించబడింది. వొక ఐదుగంటల ప్రయాణం తర్వాత గ్రోజ్‌నోలో తాను కొన్న కబార్డా గుర్రంయెక్కి అతను వుల్లాసంగా ఆ దొడ్లో ప్రవేశించేడు. తన యజమానిని కలిసికొనేందుకు ఐవాన్ హుడా వుడిగా గేటువద్ద కెళ్ళేడు.

"యెలావుండబోతుందో యేమిటో ఆ భగవంతుడికే తెలియాలండయ్యా!" అన్నాడతను.

"యేం? సంగతేమిటేంటీ?" యీ గ్రామాని కందరికంటే బళ్లతోగలిసి ముందువచ్చి యిప్పుడు జీనీరిజుట్టుతో చెమటలు గారుకొంటూ పెట్టే బేడా సర్దుతూన్న ఆ యువకుడివంక వినోదంగా చూస్తో ఓలెనిన్ అన్నాడు.

ఓలెనిన్ మరోమనిషిలాగా కనిపించేడు. నున్నగా గొరిగిన మీసాలకీ గడ్డానికీ బదులు యిప్పుడు మీసమూ చిన్నగడ్డమూ వున్నాయి. రాత్రుళ్లని పగళ్ళగా కాలంబుచ్చే మనిషికుండే పాలిపోయిన రంగుకి బదులిప్పుడు చెక్కిళ్లూ, నుదురూ, చెవుల వెనకాలా యెండదెబ్బకి యెర్రగా వున్నాయి. విలాసార్థం సాయంకాలం వేసుకొనే దుస్తులకి బదులు మకిల గట్టిన తెల్లటి సిర్‌కేషియన్‌కోటు తొడిగివున్నాడు. గంజి పెట్టిన తెల్లటి కాలర్‌కి బదులు యెండకి కమిలిన అతని మెడచుట్టూ అతని బిష్మెత్‌కి సంబంధించిన యెర్రటి టఫేటా పట్టీవుంది. అతను సిర్‌కేషియన్ బట్టలైతే వేసుకొన్నాడుగాని చక్కగామాత్రం వేసుకోలేదు. అతను రష్యన్‌అనీ, జిఘిత్ కాదనీ, యెవరేనా చెప్పగలిగేవారు. అంతా బాగానేవుంది; కాని వికారంగా వుంది. అది మినహాయించివేస్తే—అతని రూపుచూపుల్లో ఆరోగ్యం ఆనందం, ఆత్మ సంతృప్తీ వుట్టిపడుతున్నాయి.

"అవును. అది మీకు వింతగానే వుంటుందిమరి" ఐవాన్ అన్నాడు. "కాని, కొంచెం యీ జనాభాతో మాట్లాడి చూడండి! వాళ్లు మిమ్మల్ని

దగ్గరకే రానియ్యరు. అదీసంగతి! వొక్కమాటగూడా వాళ్ళు మీతో మాట్లాడరు. యెలాగైనా వాళ్ళు మన రష్యన్లకిమల్లేలేరు'' యింటివాకిలి వైపు వొక ఇనుపపాత్రని విసిరేస్తూ అతను కోపంతో చెప్పటం ముగించేడు.

''గ్రామపెద్దతో యెందుకు మాట్లాడగూడదూ మరి?''

''వాడెక్కడున్నాడో నాకు తెలవదు'' నొచ్చుకొన్నగొంతుతో ఐవాన్ అన్నాడు.

''మనిషివీ అంత తలకిందులయ్యావెందుకంట?''

''అన్నిటిమూలకంగానూ—వాళ్లని భూతంమింగ! యీ యింటి అసలు యజమాని యిక్కడలేడు. క్రిగాకి వెళ్లాడంటున్నారు. మరి ఆ ముసలిముండ వొట్టి చిల్లంగిముండ. హారి భగవంతుడా!'' చేతుల్తో తన తలని పట్టుకొంటూ ఐవాన్ అన్నాడు. ''తాము క్రిష్టియన్లమని వీళ్ళు చెప్పుకొన్నా, వీళ్ళు తార్తారకంటే చెడుముండాకొడుకులు. వీళ్ళతోపోలిస్తే తార్తార్లు పెద్దమనుషు లనుకోండి! క్రిగాకి వెళ్ళాడని వాళ్లంటున్నారు. క్రిగా — అంటే యేమిటో? యీ వెధవమాట మనమెప్పుడన్నా విన్నామాంట?''

''అంటే మనం మన భాషలో వీర్ (డాము) అంటామే అదనుకొంటా'' అని ఓలెనిన్ అన్నాడు. ''అయితే నీకేమీ బాగాలేదన్నమాట యిక్కడ?''

''మీ గుర్రాన్ని నేనుపయోగించవచ్చా?'' అని ఐవాన్ అన్నాడు. యీ కొత్తరకం జీవితంపట్ల అతను చాలా గందరగోళ పడినట్లున్నాడు. కాని క్రమంగా తనవిధికి అలవాటు పడుతున్నట్లున్నాడు అణకువతో.

''అయితే తార్తారే చాలా పెద్దమనిషన్నమాట? ఆ?'' ఓలెనిన్ గుర్రందిగుతూ జీనుమీద చేత్తో చరుస్తూ అన్నాడు.

''సరే. మీ యిష్టమొచ్చినట్లు వేళాకోళం చెయ్యండి. తొందర్లోనే నవ్వుకోటానికి కావాల్సినంత దొరుకుతుందిలే.'' ఐవాన్ సణిగేడు.

''పూఁ. వుడికిపోమాకవోయ్'' ఓలెనిన్ అన్నాడు. ''వాళ్లతో నేను మాట్లాడతానుండు. యేమీ ఆందోళనపడమాక. నేనంతా యేర్పాటు జేస్తా. అన్ని వ్యవహారాలూ చక్కబడతాయనుకో.''

ఐవాన్ సమాధానమేమీ యివ్వలేదు; అసహ్యంతో తలవూపేడు. ఐవాన్ తన యజమానిగా మాత్రమే ఓలెనిన్‌ని గుర్తించేడు. ఓలెనిన్ తన నౌకరుగామాత్రమే ఐవాన్‌ను గుర్తించేడు. మీ యిద్దరూ స్నేహితులుగదా అని యెవరన్నా వారితోఅంటే ఆ యిద్దరూ ఆశ్చర్యపడి వుండేవాళ్లు. ఐనా—తమకి తాముగా ఆ సంగతియెరక్కపోయినప్పటికీ—ఆ యిద్దరూ స్నేహితులుగానేవున్నారు. ఐవాన్‌కి పదకొండేళ్ళప్పుడు ఓలెనిన్ యింట్లో నౌకరు పనికి తీసుకోబడ్డాడు. ఓలెనిన్‌కి ఐవాన్ వయస్సే. తనుకి పద్దాను గేళ్లు వచ్చినపుడు, ఓలెనిన్ ఐవాన్‌కి చదువుచెప్పే వ్యవహారం తీసికొని ఫ్రెంచి భాషగూడా నేర్పేడు. తనకొచ్చిన ఫ్రెంచి భాషంటే ఐవాన్‌కి చాలాగర్వం. యిప్పుడుగూడా, తనకి బాగా సర్దాగా వున్నపుడు, వెకిలినవ్వు నవ్వుతూ ఐవాన్ ఫ్రెంచిపాడి వొకటివేస్తాడు.

ఓలెనిన్ వసారా మెట్లమీదుగా పరుగెత్తిపోయి ఆ యింటి తలుపు తీసేడు. సామాన్యంగా యింట్లోవున్నపుడు కోసక్కుస్త్రీలు తొడిగేట్లు వొక యెర్రటి పరికిణీ మాత్రమే తొడిగిన మేరియానా తలుపువద్దనుంచి అవతలికి యెగిరిగంతేసి, తనవీపుని గోడకానించి, తనముఖానికి దిగువ భాగాన్ని వెడల్పాటి తనచొక్కా చేతుల్తో కప్పుకొని నుంచుంది. మకమకలాడుతూన్న ఆ వెల్తుర్లో యెత్తుగా అవయవ సౌందర్యం అలరారుతూన్న ఆమె ఆకారాన్ని ఓలెనిన్‌చూసేడు. యువకత్వంలోవుండే తీరని దాహంతో అతను ఆమె చొక్కాకింద కనపడుతూన్న గట్టి స్తన్యాల్నీ, నునుసిగ్గుతో జిజ్ఞాసతో తనమీద కేంద్రీకరించబడివున్న ఆమె పెద్దకళ్లనీ అతను గమనించేడు.

"నాకు కావలసిన మనిషి యీమే"నని అతననుకొన్నాడు. కాని, అతనికి మరుక్షణంలోనే తట్టిన ఆలోచనేమంటే "యిలాంటివారు యింకా వుంటారు". అనేది.

అతను లోపలి తలుపుతెరిచేడు. పరికిణీ తప్పితే మరేమీ ధరించని మేరియానా తల్లి వీపు అతనివైపు పెట్టి వంగి పాచి వూడుస్తూంది.

"యిక్కడ వసతివ్యవహారమై వచ్చానమ్మా" అని ఓలెనిన్ ఆరంభించేడు.

ఆమె నడుం యెత్తకుండానే కఠినంగా వున్నా యింకా అందంగానే వున్న తన ముఖాన్ని అతనివైపు తిప్పింది.

''యెందుకొచ్చా విక్కడికి?'' యీ వచ్చిన కొత్తమనిషివంక చిట్లించిన కనుబొమల కిందగా వోరగంట చూస్తూ ఆమె గొల్లుమంది. ''మేమంటే వేళాకోళమా? ఆ? మమ్మల్ని వేళాకోళంచేసే దెలాగో చెప్పతానుండు. మిమ్మల్ని మహమ్మారిమింగ———''

ప్రయాణబడలికతో కకేషియా సైన్యాన్ని వసతిచోటా—ప్రత్యేకంగా తమ కోసక్కులు యుద్ధంలో వున్నారుగాబట్టి కోసక్కులుండేచోట—హృదయపూర్వకంగా తమని ఆహ్వానిస్తారని యింతకుముందువరకూ ఓలెనిన్ వూహించుకొన్నాడు. అందువల్ల యీవైఖరి చూడగానే అతనికి దిగ్భ్రమకలిగింది. ఐనప్పటికీ వసతియేర్పాట్లకి గాను తాను అద్దె చెల్లించుకొంటానని వివరించి చెప్పటాని కతను ప్రయత్నించాడుగాని ఆవిడ అతన్ని పూర్తిగా చెప్పనియ్యనేలేదు.

''యెందుకు నుంచున్నావిక్కడ? ఆ?'' అని ఆమె రింగురుమనే కీచురుగొంతుతో అరవసాగింది. ''మీ వెధవపొగాకుకంపూ, మీ వెధవ మొఖాలూ యీ పీడంతా యెవరికి కావాలిక్కడ? యింటాయన వచ్చేవరకూ కొంచెమాగు. మీ చోటెక్కడో ఆయన చక్కగా చూపిస్తాడు. నీ వెధవడబ్బు నీ దగ్గరే వుంచుకో. అయితే మేము డబ్బుమొఖ మెప్పుడూ చూడలేదనుకొంటున్నావా? వెధవ పొగాకుతో యిల్లంతా గలీజుగా గబ్బుకంపు కొట్టేటుచేసి, యీ భంజాలమంతా డబ్బిస్తే పోతుందనుకొంటున్నావు. యీపీడాకార మేంటో మాకు చూడగానే తెలుసు. నిన్ను గుండెల్లో కాల్చ! నిన్ను పొట్టలో కాల్చ......''

''ఐవాన్ చెప్పిందే సరైందిగా కనపడుతూంది'' అనుకొన్నాడు ఓలెనిన్. ''తార్తారు వీళ్లకంటే చాలా మెరుగు.'' అతని వెనకాల ఆవిడ తిట్లు దులిపి పోస్తుండగా, అతనా గదిలోంచి బైటకొచ్చేడు. అతను వెనక గదిగుండా పోతుంటే, యెర్రపరికిణీ కట్టుకొని కళ్లవరకూ వచ్చేట్లు నుదుటిమీద రుమాలు కట్టుకొన్న మేరియానా ఆకస్మికంగా అతనిపక్కగా ఆ వాకిటిగుండా బైటికి జారుకొంది. ఆమె విసురుగా మెట్లుదిగి, ఆగి,

వెనక్కి తిరిగి నవ్వుతూన్న ఆ యువకుడి కళ్ళవంకచూసి, ఆ యింటి మూల కెళ్ళి మాయమైంది.

నీటుగా దీటుగావున్న ఆమె నడక, నునుసిగ్గుతోవున్న ఆమె నల్లటి కళ్ళు, బిగువుగా మనోహరంగావున్న ఆమె శరీరం యింతకు ముందుకంటే అతని హృదయంపై గాఢంగా హత్తుకుపోయేయి.

"అవును. నాకు కావాలిసిన మనిషి తప్పకుండా యీమే!" అని అతననుకొన్నాడు.

వసతి వ్యవహారంపై యింతకుముందు జరిగిన రాద్ధాంతమంతా మరచి పోయి ఐవాన్‌వద్ద కెళ్తూ అతను అదేపనిగా ఆ యువతికోసమై వెనక్కి తిరిగిచూడసాగేడు.

"చూడండీ. అది వొక అడవిముండ గూడాను" ఐవాన్‌అన్నాడు. అతను సామానుబండి పనిలో మునిగివున్నా యిప్పటికి కొంచెం వుల్లాసంగా వున్నాడు. "వొట్టి అడ్డగాడిదముండ. వాటంగావుంది" అని అంటూ అతను పొట్టచెక్కలయ్యేట్టు నవ్వేడు.

# 11

మధ్యాన్నం అయినాక చాలసేపటికి ఆ యింటి యజమాని చేపలు పట్టేచోటునుంచి యింటికి తిరిగొచ్చేడు. గదికి అద్దెయిస్తారనేసంగతి తెలిసి కొని అతను తన భార్యను సమాధానపరిచి, ఐవాన్ కోర్కెలన్నిటినీ తీర్చేడు.

కొత్తనివాసంలో అంతా త్వరలోనే సద్దుబాటై చక్కగా వుంది. ఆ యింటివాళ్ళు తాము శీతాకాలంలో వుపయోగించే యింట్లోకిమారి, యీ వేసంగి గృహాన్ని ఓలెనిన్‌కి నెలకి మూడు రూబుళ్ళచొప్పున అద్దెకిచ్చేరు.

ఓలెనిన్ కొంచెం ఆహారంతీసుకొని నిద్రకుపడ్డాడు. తిరిగి సాయంత్రానికి నిద్రలేచి, వొళ్ళుకడుక్కొని, చక్కగా ముస్తాబై, భోంచేసి, సిగరెట్టు ముట్టించి, అతను బజారువైపునవున్న కిటికీపక్కన బైఠాయించేడు. వాతావరణం అంతకుముందుకంటే చల్లగావుంది. చిత్తిరిక పట్టిన కురు

మాళ్ళ (*gables*) తో వున్న ఆ యింటినీడ ఆ దుమ్ముగొడ్డుమీదగా యేట వాలుగాపడి యెదురుగావున్న యింటిమీదకి పాకింది. రెల్లుతో నేయబడిన ఆ యిల్లు అస్తమించుతూన్న సూర్యకాంతిలో మెరుస్తోంది. సైనికులంతా యెక్కడి వాళ్ళక్కడ సద్దుకున్నారు. పశువులు యింకా యిళ్లకురాలేదు; గ్రామస్తులింకా తమ తోటల్లో పనులు చేస్తూనేవున్నారు.

కార్నెట్ యిల్లు దాదాపు పెద్దబజారు చివర్నవుంది. మధ్యమధ్య అతనికి టెరెక్‌నది కవతల ఛెఛెన్యాయనుండో, తానింతకుముందే వెళ్ళివచ్చిన కుమైన్‌మైదానానుండో తుపాకిధ్వని మెల్లగా వినపడుతోంది.

మూడునెలలపాటు బంగిరి బయల్లో జాగరణచేసిన తర్వాత యిప్పుడతనికి చాలాహాయిగా వుంది. దుమ్ముతో, అలసటతో కూడుకొన్న ఆ దండయాత్ర తర్వాత యిప్పుడతని ముఖానికి కాంతీ, కాళ్ళ చేతులకి విశ్రాంతీ, మనస్సుకు శాంతీ, శరీరానికి పరిశుభ్రతా వచ్చినాయి.

గడచిన దండయాత్రని గురించీ, ప్రమాదాల్ని గురించీ అతను తల్చుకొన్నాడు. తాను వాటిని వీరోచితంగా యెదుర్కొన్నాననీ, అందులో యెవరికంటేనూ తీసిపోలేదనీ, యిప్పుడు తాను సాహసోపేతమైన కకేషియా సేనలో వొకణ్ణనీ అతను జ్ఞాపకంచేసుకొన్నాడు. మాస్కోనుగురించిన అతని ఆలోచనలు యెంతదూరాన దిగపడిపోయాయో ఆ భగవంతుడకే తెలియాలిక. అతని పాతజీవితం పూర్తిగా తుడిచివేయబడింది. వొక కొత్తజీవితం — ఇంతవరకూ యేపొరపాటూ గ్రహపాటూ లేని వొక సంపూర్ణ నూత్నజీవితం — ప్రారంభమైంది. ఇక్కడ కొత్తమనుషుల్లో వొక కొత్తమనిషిగా తానొక చక్కని కొత్తపేరు సంపాదించుకోగలడు.

అతని హృదయం వర్ణింప శక్యంగాని మధుర జీవితానందంతో నిండి వుంది. ఆ చిన్నగదిలో చుట్టూ చూస్తూనో, ఆ ఆ యింటి నీడలో బొంగరాల ఆట ఆడుకొంటూన్న పిల్లలవంక కిటికీగుండా చూస్తూనో, యెంత హాయిగా తానీ కోసక్కు జీవితానికి అలవాటు పడిపోయేదీ అతను వూహించుకొన్నాడు. మధ్యమధ్య అతను పర్వతాల వంక చూస్తున్నాడు. వాటి మహనీయ సౌందర్యం అతని జ్ఞాపకాలకీ, స్వప్నాలకీ యీషత్తు మహనీయతని కలుగజేసింది. తాను మాస్కోనగరం వదిలేప్పు డూహించుకొన్నట్లుగా

గాక అతని నూత్నజీవితం అనూహ్యమైనరీతిలో కమనీయంగా ప్రారంభమైంది. ''ఆ పర్వతాలు, ఆ పర్వతాలు, ఆ పర్వతాలు.........!''

''కుక్కని మ్మేడు
కూజా పట్టేడు
ఇరోష్కామామయ్యా కుక్క నమ్మేడు !''

అని రోడ్డుమీద బొంగరాలు తిప్పుతూన్న కుర్రాళ్లు అంతా వొక్కసారి పాట యెత్తుకొని బజారుమూలకి పరుగెత్తేరు.

''కుక్క నమ్మేడు
కత్తి యమ్మేడు
సారాకై సర్వమమ్మేడు !''

భుజాన తుపాకిబెట్టి, తన బెల్టుకి గుత్తిగా కొన్ని పక్షుల్ని వేళ్లాడేసి ఇరోష్కా పక్కవీధిలోంచి అగపడగానే, కుర్రాళ్ళు గుంపుగా మూగుతూ అతన్ని చూసి పక్కకి తొలుగుతూ వొక్కసారి గొల్లుమన్నారు.

''అవును. అది సిగ్గుచేటుపనేరా అబ్బాయ్. నిజంగా సిగ్గుచేటుపనే!'' చేతుల్ని బలంగా వూపుతూ నడుస్తో, కిటికీలవంక చూస్తో అతనన్నాడు. ''కుక్కని పోగొట్టుకోటం నిజంగా పాపపు పననుకో'' ఆరాటంతోనే ఐనా అది పైకి కనపడనీయండా అతనన్నాడు.

ఆ పిల్లల ప్రవర్తన ఓలెనిన్‌కి చాలా ఆశ్చర్యం కలిగించింది. అంతకంటేగూడా భావప్రకాశమైన సూక్ష్మబుద్ధిని తెలుపుతూన్న అతనిముఖమూ, ఇరోష్కామామయ్యా అని పిల్లలు పిలిచిన అతని శక్తిమంతమైన శరీర సౌష్టవమూ అతనికి మరింత ఆశ్చర్యం గలిగించేయి.

''వో తాతా! వో కోసక్!'' అని అతను పిలిచేడు. ''యిలా రా!''

ఆ ముసలాడు ఆగి అతనివంక తిరిగేడు.

''నమస్తే, బాబూ'' అని తన తలనుంచి టోపీ యెత్తుతూ అతనన్నాడు.

''నమస్తే, బాబూ'' ఓలెనిన్ బదులు పలికేడు. ''యింతకుముందు ఆ పిల్లలరిచే దేమిటీ?''

"ఆఁ. యేమీలేదు. వాళ్ళు నన్ను వుడికిస్తున్నారు. ఐనా దాన్ని నేనుపట్టించుకోను. అదిన్నూ, వాళ్లెందుకు కాస్త సయ్యాటలాడగూడదూ?" అని అతను శాంతంగావుండే వృద్ధులకి లక్షణమైన మధురస్వరంతో గంభీరంగా అన్నాడు. "మీరు యీ సైనికుల లీడరా ?"

"వుహూఁ. నేనొక చిన్నవుద్యోగిని. సరేగాని, ఆ పక్షుల నెక్కడ పట్టారూ ?"

"అడవిలో." తన వీపువెనకాల బెల్టునుంచి నెత్తురు మరకల్తో వేళ్లాడుతూన్న మూడు ఆడపక్షుల్ని చూపటంకోసం వీపుని కిటికీవైపు తిప్పుతూ అతనన్నాడు. "మీ రెప్పుడూ వీటిని వేటినీ చూడలేదా ? కావాలంటే రెంటిని తీసుకోండి. యిదిగో." రెండు పక్షుల్నతడు కిటికీగుండా అందించేడు. "మీకు వేటవచ్చా ?"

"ఆఁ. దండయాత్రి సమయంలో నేను నాలుగు జీవంజీవకపక్షుల్ని వేటాడాను."

"నాలుగు! మంచిదెబ్బే" ముసలాడు వెటకారంగా అన్నాడు. మీరు తాగుతారు గూడానా ? మా ఛిఖిర్ అంటే మీ కిష్టమేనా ?"

"యేదైనా నాకిష్టమే."

"భేష్. మీరు నరైనమనుషులు. మీరు నేనూ తోడబుట్టిన సోదరులుగా —క్యూనాక్ లుగా—వుంటామిక. మీరూ నేనూ."

"లోనికిరండి" ఓలెనిన్ అన్నాడు. "మనం ఆ ద్రాక్షసారా కొంచెం రుచిచూద్దాం."

"ఓ తప్పకుండా. కాని మీరా పక్షుల్ని తీసుకొనితీరాలి."

ఇరోష్కాకి ఓలెనిన్ నచ్చాడని ఇరోష్కా ముఖంలో స్పష్టంగా కనపడుతోంది. అంతేగాకుండా యితనివద్ద తాగటానికి సారా తేలికగా లభిస్తుందని ఇరోష్కా యిట్టే పసికట్టేడు. అందుకనే ఆ పక్షుల్నతని కివ్వటానికి నిశ్చయించుకొన్నాడతను.

పిలిచీ పిలవంగానే ఇరోష్కా ఆ యింటి గడపమీద ప్రత్యక్షమయ్యేడు. అప్పుడుగాని అతని బ్రహ్మాండమైన ఆకారాన్నీ, శక్తినీ

ఓలెనిన్ గుర్తించగలిగేడు. మంచులాంటి తెల్లటి గడ్డంలో పొదగబడిన అతని యెరుపాంటి గోధుమరంగు ముఖంలో బండచాకిరీచేతా పెద్దవయస్సు వల్లా నాగేటి చాళ్లలాగా వున్న రేఖలున్నాయి. కాని, అతని కాళ్ళనీ, చేతుల్నీ, భుజాల్నీ యువకుడికిమల్లే కండలుతేరి వున్నాయి. అతని తల మీదున్న పొట్టిజుట్టుగుండా పెద్ద మచ్చలు అగపడుతున్నాయి. ఆంబోతు మెడమీద వలే, లావుగా దృఢంగా వున్న అతని మెడనిండా చిక్కిరి బిక్కిరిగా ముడుతలున్నాయి. కాయలుగట్టిన అతని హస్తాలమీద దెబ్బలూ, గీతలూ వున్నాయి.

సునాయాసంగా అతను గడపదాటి, తన తుపాకి తీసేసి వొకమూల బెట్టేడు. నరాలున గదిచుట్టూ వోసారి చూసి ఓలెనిన్‌కున్న సరుకూ సరంజాం విలువెంతో అతను చటుక్కున గ్రహించి వేసేడు. తర్వాత తన మెత్తని చెప్పుల్తో చడీ చప్పుడూ లేకుండా గదిమధ్యకు నడిచివచ్చేడు. ఘాటుగావున్నా రోతగాలేని సారావాసనా, తుపాకిమందువాసనా, యెండి పోయిన నెత్తురుకంపూ అతని వెనకాలేవచ్చింది. దైవ విగ్రహంముందు అతను వంగి నమస్కరించి, గడ్డం నిమిరి సరిజేసి, తర్వాత ఓలెనిన్ వద్దకెళ్లి, బరువుగా మకిలగావున్న తన చేయి సాచేడు.

''కోష్కిల్డీ! అంటే 'శుభదినం' అని తార్తారు భాషలో అర్థం లేకపోతే 'నీకు శాంతి గలుగుగాక!' అని అర్థం.

''కోష్కిల్డీ! ఆఁ. నాకు తెలిసింది'' అన్నాడు ఓలెనిన్ అతని కరసంచాలనంచేస్తూ.

''ఆఁ. కాని నీకు తెలవదు. సరైన పద్ధతేంటో నీకు తెలవదు మొద్దూ!'' అని నింద్యంగా తలూపుతూ ఇరోష్కాఅన్నాడు. ''యెవరైనా కోష్కిల్డీఅని నీతో అంటే 'అల్లాలేసీ బోసన్' 'భగవంతుడు నిన్ను రక్షించు గాక' అని నువ్వనాలి. అదిరా సంగతి తమ్ముడూ. అంతేగాని కోష్కిల్డీ అనటంగాదు. కాని, నువ్వేమీ దిగులుపడమాక. అదంతా నే నీకు నేర్పు తాలే. యిక్కడ మావూళ్లో ఇల్యా అని మీ రష్యావాడొకడున్నాడు. వాడు భలేమనిషి, తాగుబోతు; దొంగ, వేటగాడు—అరె అల్లా, యెల్లాంటి వేటగాడని! సరే, వాడికి నేనన్నీ నేర్పాను.''

''అయితే మరి నువ్వు నాకు నేర్పబోయేదేమిటి?'' యీ ముసలా డంటే మరింత ఆసక్తి పుట్టుకురాగా ఓలెనిన్ అడిగేడు.

''నిన్ను వేటకి తీసుకెళ్తా. చేపలు పట్టటం నేర్పుతా. ఛాఛెన్లని చూపిస్తా. కావాలంటే నీకో కుర్రదాన్ని మాట్లాడి పెడతా. అటువంటి మని షిని నేను. నేను కొంచెం కుర్రవాళ్లల్లోనేలెక్క'' నవ్వుతూ అతనన్నాడు. ''యిక కూచుంటాను, తమ్ముడూ. అలిసిపోయా. కర్గా?'' తెలిసికొనే వుద్దేశ్యంతో అతనన్నాడు.

''అంటే యేమిటి?''

జార్జియన్ భాషలో 'భేష్' అని దానర్థం. నేనెప్పుడూ ఆమాట అంటాను. అదొక అలవాటు నాకు. కర్గా, కర్గా. అది నాకిష్టమైనమాట. ఆమాటని నేను అలా సరసంగా అంటాను. ఆఁ. యిక ద్రాక్షసారా మాటే మిటి, తమ్ముడూ? యేమీ తెప్పించవుమరీ? నీకు తైనాతీ సిపాయి వున్నాడుగాదూ? హే, ఐవాన్!'' అని అత నరిచేడు. ''మీ సైనికుల పేర్లన్నీ ఐవాన్లనే! నీ తైనాతీ పేరుగూడా ఐవానేనా?''

''ఆఁ. ఖచ్చితంగా ఐవానే. యిదుగో, ఐవాన్, యింటామె దగ్గర కెళ్ళి కొంచెం ఛిఖర్ పట్టుకొస్తావా?''

''ఐవాన్!......వాళ్ళు ఐవాన్ అని పేరెందుకు పెట్టుకుంటారో? విను ఐవాన్ అబ్బాయ్. వాళ్ళు వాడుతూన్న పీపాలోది కొంచెం యివ్వ మని వాళ్లకి చెప్పు. యీ వూళ్లోకల్లా భేషైన ఛిఖర్ వీళ్లదగ్గరుంది. గ్యాలన్‌లో నాలుగోవంతుకి ముప్ఫయ్యి కోపెక్కులకంటే యెక్కువ యివ్వ మాక. బాగా గ్యాపకంపెట్టుకో. రెండు కంటున్నానంటే ఆ చిల్లంగి ముండని నేనెరుగుదును. యెంతయిస్తే దానికంత ఆనందం......మనవాళ్లు కొంచెం మెతకబుద్ధిగలాళ్ళు. బుర్రలో గుంజులేనిరకం.'' ఐవాన్ వెళ్ళి పోయినాక అతను ఆంతరంగికంగా చెప్పనారంభించేడు. ''వాళ్ల దృష్టిలో మీరు మనుషులుగాదు; తార్తారులకంటేగూడా మీరు నాసిరకం. 'విషయ లంపటులైన రష్యావాళ్ళు' అని వాళ్ళు మిమ్మల్నంటారు. యిక నా విష యంలోనో, నువ్వు సైనికుడివైనా, నువ్వు మనిషివి. అందరికిమల్లే నీకూ చీమూ నెత్తురూ వున్నయ్యి. నే నన్నది నిజంగాదూ? మాటవరసకి ఇల్యా,

నాక్యొనాక్ - వాడుగూడా సైనికుడే. కాని, రత్నమంటిమనిషి. అంతే గాదు నాచిట్టీ ? అందుకని యిక్కడ మావాళ్లకి నేనంటేమంట. కాని, జీలకర్ర వాసంతగూడా వాళ్లని నేను లెక్క-జెయ్యను. సరసమంటే యిష్టం గల మనిషిని నేను. యెవరనాన్న నాకిష్టమే. నేను ఇరోష్కాని. అవును..."

ఆ ముసలి కోసక్కు ఓలెనిన్ భుజంమీద ప్రేమపూర్వకంగా చేత్తో తట్టేడు.

# 12

ఈ లోపల తన వ్యవహారమంతా నచ్చుకొన్న ఐవాన్ యిప్పుడు భలే హుషారుగా వున్నాడు. అంతకుముందు కంపెనీ మంగలిచేత గడ్డంగిడం చేయించుకొని తాను మాంచి యింట్లో మకాంపెట్టినందుకు గుర్తుగా తన పెద్దబూట్లలోంచి పట్లాంచివర్లని బైటికిలాగి వేసి నీటుగా తయ్యారయ్యేడు.

ఇరోష్కావంక, అతనొక జంతువైనట్లు శ్రద్ధగాచూచి నేలమీద ఆ ముసలాడుచేసిన మరకలు గమనించి తలనూపేడు. తర్వాత వొక బల్లకింద నుంచి రెండు ఖాళీసీసాలు లాగి అతనా యింటి యజమానురాలివద్దకెళ్ళేడు.

"నమస్కారం." అమాయికంగా కనపడటానికి నిశ్చయించుకొని అతననాన్నడు. "మీవద్దనుంచి కొంచెం ఛిఖిర్ కొనితెమ్మని మా యజమాని నన్ను పంపించాడు. దయచేసి యీ సీసాల్లో పోస్తారా ?"

ఆవిడ సమాధాన మేమీ యివ్వలేదు. ఆవిడ కూతురు వొకచిన్న తార్గారు అద్దంముందు నిలబడి తలకి వొక రుమాలు కట్టుకొంటోంది. ఆమె యిటు తిరిగిందిగాని తానుగూడా నిశ్శబ్దంగా వూరుకొన్నది.

"అందుకు బదులు డబ్బురూపేణా యిస్తానమ్మా" తన జేబుల్లోని నాణేల్ని గలగలమనిపించుతూ ఐవాన్ తిరిగి అందుకున్నాడు. "మమ్మల్ని బాగా చూడండి. మిమ్మల్ని బాగా చూస్తాం. అది అందరికీ క్షేమం."

"యెంతగావాలి ?" ఆవిడ దడాలున అడిగింది.

"గ్యాలన్లో నాలుగోవంతు."

"పోయి అతనికి పోసి యియ్యమ్మా" ఆవిడ తన కూతురుతో అంది. "మనం వాడుతున్న పీపాలోది పోసియివ్వు."

మరియానా తాళంచెవులూ, కొలతబుడ్డీ తీసుకొని బైటకెళ్లింది. ఇవాన్ ఆమె వెనకాలే వెళ్ళేడు. ఓలెనిన్ కూచున్నగది కిటికీపక్కగా ఆమె పోతూంటే, ఓలెనిన్ ఆమెనిచూపి యిలా అడిగేడు.

"యెవరా అమ్మాయి?"

ఇరోష్కా తన మోచేతితో ఓలెనిన్‌ని తట్టి కన్నుగీటేడు. "ఆగు" అని అతను కిటికీలోంగుండా బైటికి వంగేడు. ఎహీక్కే అని అతను బిగ్గరగా దగ్గి, యిలా అరిచేడు:

"మేరియానా! ఓ మేరియానా! నన్ను ప్రేమించవటే, నాచిట్టీ?"
ఓలెనిన్‌వంక తిరిగి అతనిలా మెల్లగా అన్నాడు:

"సరసమంటే నాకిష్టం!"

కోసక్ స్త్రీకి ప్రత్యేకమైన నిర్భీతి నడకతో జోరుగా చేతులూపుకొంటూ ఆ పిల్ల కిటికీ పక్కగా వెళ్ళిపోయింది. తల యిటు తిప్పకుండా ఆమె తన నల్లని పెద్దకళ్లతో ఆ ముసలాడివంక నిదానంగా తేరిచూచింది.

"నన్ను ప్రేమించవే, నిన్ను సుఖపెడతానూ" ఓలెనిన్‌వంక కన్నుగీటుతూ ఇరోష్కా అరిచేడు. "నేను సర్దాపురుషుణ్ణి. నేను కొంచెం కుర్రవాళ్లలోనే లెక్క. అచ్చం రాణీయే ఆ పిల్ల! కాదూ?"

"అందంగావుంది" ఓలెనిన్ అన్నాడు. "లోపలకి పిలువు."

"అహఁ. వద్దొద్దు, అదేమీ పనికిరాదు! అది లూకాని పెళ్ళిచేసికోబోతున్నది. లూకా చక్కని కోసక్కు, జిఘిత్ అన్నమాట—మొన్న బందిపోటుని చంపినవాడన్నమాట. ఐనా యేంఫర్వాలేదు. నీకు అంతకంటే వాటమైన దాన్ని చూసిపెడతా. యెలాంటిదంటే నువ్వు దానికి సిల్కుబట్టలు, నగలు తొడుగుతావనుకో కిందనుంచి మీదదాకా. చిలకల కొలికిని చూచిపెడతా. నామాట నమ్ము."

"నువ్వు, ముసలాడివి, యీ మాటలు మాట్లాడటమా!? పాపం సుమా!"

"పాపమా! పాపం అనేది యెక్కడుందసలు?" సిగ్గుపడకుండా ఇరోష్కా అన్నాడు. "అందమైన పిల్లదానివంక చూడటం పాపమా? అందమైన పిల్లతో గలిసి నడవటం పాపమా? అందమైన పిల్లని ప్రేమించటం పాపమా? మీవైపుని అంతేనా? కాదు, తమ్ముడూ, అది పాపంగాదు. ఫస్తు అవుసరం. భగవంతుడు నిన్ను పుట్టించాడు, ఆ పిల్లనీ పుట్టించాడు; ఆయన మనందర్నీ పుట్టించాడు. వుహూఁ. ఆడపిల్లవంక చూడటం పాపం గాదు. అసలాడపిల్ల పుట్టించేదెందుకు: ప్రేమించబడేందుకూ, మగవాడికి ఆనందం యిచ్చేందుకూనూ. నా దృష్టిలో అంతేరా అబ్బాయ్."

యీలోగా మేరియానా సెంపుదాటి చల్లగావుంటే ఒక కొట్టు లోకి వెళ్లింది. ఆ కొట్లోకూడా పీపాలున్నాయి. ఆచార ప్రకారం యెదో ప్రార్థనగొణిగి, ఆమె పీపావద్దకెళ్లి ఒక గరిటె అందుకొని ముంచింది.

ఐవాన్ గడపలో నుంచుని పక్కిలించుకొని ఆమెని చూస్తున్నాడు. ఆమె వొంటిపైన, వెనక సొంతుగా ముడి ముడుచుకొని పైకి దోపబడిన వొదులుచొక్కా ఒక్కటి మాత్రమే వున్నదతనికి చాలా వింతగా అగపడింది. అంతేగాక ఆమె మెడచుట్టు వెండినాణ్యాలు వేళ్లాడుతున్నందుకు అతనికి మరింత విడ్డూరంగా వుంది. రష్యాపద్ధతికిది పూర్తిగా భిన్నమనీ, తనదేశంలో బామ్మలుగూడా యిలాంటి వేషం చూస్తే నవ్వలేక చస్తారనీ అతననుకొన్నాడు. "యేదియేమైనా కొన్త కాలం గడపటానికి వాటంగా వుంది" అని అనుకొన్నాడు. "యీసంగతి యజమాన్తో చెప్పాలి తప్పకుండా."

"వెలుగు కడ్డం నుంచున్నావు దున్నపోతా" మేరియానా అకస్మాత్తుగా కేకపెట్టింది. "నువ్వా బుడ్డి యిలా యివ్వటం మంచిది."

ఆమె దాన్ని చల్లని యెర్రటి ద్రాక్షసారాతో నింపి ఐవాన్కి అందించింది. "డబ్బుని అమ్మకివ్వు" డబ్బులోవున్న అతని చేతిని వెనక్కిలోసేస్తూ ఆమె అంది.

"అంత కోపమెందుకు, అందాలబరిణా?" ఆమె పీపాని మూస్తుండగా ఐవాన్ సరసంగా నవ్వుతూ అన్నాడు.

ఆమెగూడా నవ్వింది.

"నీ సంగతేంటి? నువ్వెంత దయగలాడివా?"

''నేనూ మా యజమానీ చాలా మంచివాళ్ళం'' లాలనగా ఐవాన్ బదులు పలికేడు. ''మేము యెంతమంచివాళ్లమంటే మేమున్నచోటల్లా జనం మాపట్ల విశ్వాసంగా వుంటారు. అదెందుకంటే ఆయన కులీనుడు.''

ఆ పిల్ల ఆగి శ్రద్ధగా వింది.

''మరి ఆయనకి పెళ్లయిందా ?'' ఆమె అడిగింది.

''వుహూం. ఆయన యువకుడు. పెళ్లికాలేదు. యెందుకంటే కులీన వర్గానికి చెందిన పెద్దమనిషెవరూ యవ్వనంలో పెళ్లిచేసుకోరు'' ఐవాన్ గంభీరంగా అన్నాడు.

''యేమిటీ! దున్నపోతులాగావున్నా, పెళ్లికింకా చిన్న బాలుడన్నమాట. ఆయన మీ అందరిపైనా నాయకుడా ?''

''ఆయన చిన్న వుద్యోగి మాత్రమే. అంటే ఆయనింకా ఆఫీసరు కాదన్నమాట. ఐనప్పటికీ ఆయన గొప్పమనిషి. జనరల్ కంటేగూడా గొప్ప మనిషి. యెందుకంటే మా కర్నలేగాకుండా ఆఖరికి జారుచక్రవర్తిగూడా ఆయన్తో స్నేహంకట్టారు'' ఐవాన్ సగర్వంగావివరించేడు. ''యీసైన్యంలో వున్న వెధవలందరివంటి వాళ్లం గాదు మేము. మా నాన్న వొక సెనేటరు. ఆయనకి వెయ్యికంటే గూడా యెక్కువ బానిసలున్నారు. ప్రతిదఫా మాకు వెయ్యిరూబుళ్లు పంపుతారు. అందుకని ప్రతివాళ్లకీ మేమంటే యిష్టం. యింకోడు కేప్టన్ అయినప్పటికీ వాడికి డబ్బుండక పోవచ్చు. దానివల్ల ప్రయోజనమేంటి ?''

''యిక బైటకి పద. తాళంవేస్తున్నా'' ఆ పిల్ల అతన్ని మధ్యలోనే ఆపింది.

ఐవాన్, ఓలెనిన్ వద్దకి ద్రాక్షసారా తీసుకొచ్చి వెకిలినవ్వు నవ్వుతూ, ''నాటమెన పిల్ల !'' అన్నాడు.

# 13

ఈలోగా గ్రామ చౌకంలో మిలిటరీ బాకా మోగింది. జనం పనుల్లోంచి యిళ్లకి తిరిగొస్తున్నారు. బంగారపురంగు దుమ్ములేపుతూ,

గ్రామ గేటులవద్ద మూగుతూ, పశువులమందలు అరుస్తున్నాయి. వీధుల గుండా, పెరళ్లగుండా ఆడవాళ్లు హడావుడిగా పశువుల్ని యిళ్లకి తోలు కెళ్తున్నారు. దూరపు హిమశిఖరాలవెనక సూర్యుడెప్పుడో అస్తమించేడు. పాలిపోయిన వొక నీలినీడ ఆకాశానా, భూమిమీదా పరుచుకొంది. నల్లనొతూన్న తోటలపైన నక్షత్రాలు మకమకలాడసాగేయి. వీధుల్లో సద్దూరద్దీ తగ్గుతోంది. ఇక నారాత్రికి పశువుల్ని కట్టేసినాక ఆడవాళ్ళు వీధిమూలల్నీ యిళ్లముందున్న మట్టిదిబ్బలమీద చేరి గుమ్మడిగింజలు వొలవ సాగేరు. వయసొచ్చిన ఆడవాళ్ళూ, ఆడపిల్లలూ, వొక ముసలాడూవున్న మూతా వొకటి, ఆ అబ్రెక్కుని చంపిన తీరును గురించి మాటాడుకొంటు న్నారు. ఆ ముసలి కోసక్కు ఆ కథ చెబుతూంటే, ఆడవాళ్ళు ప్రశ్నలు వేస్తున్నారు.

"అతనికి పెద్ద బహుమతి వస్తుంది. కాదూ?" అని ఆడవాళ్లల్లో వొకను అడిగేరు.

"ఆఁ. తప్పకుండాను. పతకంగూడా యిస్తారు."

"మోసీవ్ అతన్ని దగాచెయ్యాలని చూశాడు—దురాశ ముండా కొడుకు! ఆ తుపాకిని తనదగ్గరుంచుకొంటే కిజ్లియర్ దగ్గరి ఆఫీసర్లు ఆ సంగతి విన్నారు."

"లూకా పట్నంలో వున్నాడని అంటున్నారు" ఆడపిల్లల్లో వొకరన్నారు. "అతనూ నాజరూ యామ్కా యింటిదగ్గిర వుత్సవంచేసు కొంటున్నారు. యిప్పటికి బొక్కెన్లో సగం సారా తాగారంటున్నారు."

(యామ్కా పెళ్లికాని స్త్రీ. పోకిరీమనిషి. ఆమె దగ్గిర రహస్యపు సారాబట్టీవుంది.)

"వూడబెరికేవాడు అదృష్టమంతా తానే వూడబెరుక్కొంటాడు. వూడబెరికే వాడన్నందుకు తగిపోయాడనుకో. కాని చక్కని కుర్రాడమ్మా. అందులో సందేహం లేదు. నీతీ నిజాయితీగల కుర్రాడు" అని ఆడ వాళ్ళల్లో వొకరన్నారు. "అట్లాగే వాడి తండ్రిగూడాను. ఆయన్ని చంపి నపుడు వూరువూరంతా యేడ్చిందనుకో. అదుగో చూడండి—వస్తున్నారు" వాళ్ళవంక చూపుతూ ఆమె అంది. "తాగుబోతు ఇర్గుషోవ్ వాళ్ల వెంట వేలుకొడుతున్నాడు."

బొంక్కెనలో సగం సారా తాగినాక, లూకా, నాజరూ, ఇర్గుషోవ్గూ ఆడపిల్లలవైపు వస్తున్నారు. ముగ్గురికీ మామూలు కంటే ముఖాలు యెర్రబడి వున్నాయి. బిగ్గరగా నవ్వుతూ, నాజర్ని పక్కటెముకల్లో పొడుస్తూ ఇర్గుషోవు తూల్తున్నాడు.

''పాడటం లేదెందుకే పిల్లలారా?'' అతనరిచేడు. ''ఆఁ. కాని వ్వండి. మాకో పాట పాడమన్నా.''

''జల్సా చేశావా!'' ఆడవాళ్ళల్లో వొకరన్నారు.

''మేమెందుకు పాడాలి? యిదేమీ సెలవురోజు కాదు'' మరొకావిడంది. ''నువ్వు పూటుగా తాగావు. కనక పాడటం నీ వంతే.''

ఇర్గుషోవు పగలబడి నవ్వి నాజర్ని మోచేత్తో పొడిచేడు.

''మీరు మొదలెట్టండి. నేనుగూడా పాడతా. అందులో మొనగాణ్ణిలే.''

''అంతా నిద్రపోయారా యేమే, అందాల బరిణల్లారా!'' నాజరు అన్నాడు.

''వుత్సవం చేసుకోటానికి మేమొచ్చాం. లూకాకి కలిగిన అదృష్టం కోసమని మేము తాగుతున్నాం.''

లూకా ఆ కూచున్న గుంపువద్దకొచ్చి టోపీ పైకెత్తేడు. వెడల్పాటి అతని దవుడయెముకలూ, మెడా యెర్రగా వున్నాయి. అతను కదలకుండా నుంచుని మృదువుగా గంభీరంగా మాటాడేడు. కాని, అతని ప్రశాంతతలో నాజరువాగుడూ సందడిలో కంటే చాలా జీవం, జవం వున్నాయి. ఆడుతూ ఆడుతూ, గురకధ్వనితో తోక వొక్కసారి ఝుళిపించి కాళ్ళు నేలలో పాతుకుపోయినట్లు అకస్మాత్తుగా ఆగిపోయే గుర్రపుపిల్ల అతన్ని చూస్తే జ్ఞాపకమొస్తుంది. వొకటో అరో మాట మాటాడుతూ, నవ్వుతూన్న కళ్ళతో ఆడపిల్లలవంకా తాగివున్న తన మిత్రులవంకా చూస్తూ అతను ప్రశాంతంగా ఆడపిల్లల ముందర నిలబడివున్నాడు. సరీగ్గా ఆ సమయాన్నే, మేరియానా అప్పటికి పాలు పితకటం పూర్తిచేసి ఆ గుంపులో వచ్చి కలిసింది. అందరూ మాట్లాడటం ఆపేసేరు. లూకా నిదానంగా తన టోపీయెత్తి, ఆమెకి దోవయిచ్చి, తర్వాత వెనక్కి అడుగువేసి, వొక కాలు కొంచెం ముందుకి వుంచి, చేతి బొటనవేళ్ళని బెల్టులో దోపి,

తక్కినవేళ్లతో పట్టా కత్తిని తాకుతూ, ఆమెముందు నుంచున్నాడు. అతని అభివందనానికి బదులుగా మేరియానా నెమ్మదిగా తలవంచి, తర్వాత దిబ్బ మీద కూచుని, తన వొదులుచొక్కా రొమ్ముజేబులోంచి గుమ్మడిగింజలు కొన్నింటిని బైటకి తీసింది. పళ్లతో గుమ్మడిగింజలు పగలగొట్టి పై పొట్టు వూసేస్తూ, లూకా ఆమెమీద దృష్టి నిలిపి నుంచున్నాడు.

"సరేగాని, యెంతకాల ముంటావు వూళ్లో?" నిశ్శబ్దాన్ని ఛేదిం చుతుం ఆడవాళ్లల్లో వొకరడిగేరు.

"రేపు పొద్దుటివరకు" అన్నాడు లూకా.

"దేముడి దయవల్ల ఆ కార్యంవల్ల నీకు మేలు కలుగ్గాక" ముస లాడు అన్నాడు. "నిన్నుజూస్తే నాకు చాలా ఆనందంగా వుందని నువ్వొచ్చేముందే వీళ్లతో అంటున్నా."

"నేనూ అదే అంటాను" తాగి మత్తుగా వున్న ఇర్గుషోవు అన్నాడు. "మన అతిథులవంక చూడండి" పక్కనే నొస్తున్న వొక సైనికుడివంక చూపుతూ అతనన్నాడు. "మిలిటరీవాళ్ల వోడ్కా-అంటే నాకు యిష్టం. అది మంచి వోడ్కా."

"అటువంటి భూతాలు మాయింట్లో ముగ్గురున్నారు" వొక స్త్రీ అంది. "మా ముసలాయన గ్రామపెద్ద దగ్గరకెళ్లేడు. వెళితే, దానికిక చేసేదేమీ లేదని ఆయనన్నాడు"

"ఆహా! అయితే నీకు కొంత యిబ్బంది కలిగిందన్నమాట?" ఇర్గుషోవు అన్నాడు.

"నీ కొంపంతా చుట్టపొగతో గబులుకంపు పుట్టించటల్లా వాళ్లూ?" మరో స్త్రీ అంది. "పెరట్లో యిష్టమొచ్చినట్లు తాగండి, యింట్లో తాగొద్దు, మాకాపొగ సరిపడదు" అని నేను అదేపనిగా వాళ్లకి చెపుతా. వుహూం. గ్రామపెద్ద వచ్చి చెప్పినాసరే నేనందు కొప్పుకోను. అదిన్నూ, వాళ్లు దొంగలు గావచ్చు. గ్రామపెద్ద యింట్లో వాళ్లొక్కళ్ళూ గూడా లేరు."

"వాళ్లంటే నీకిష్టంలేదు" ఇర్గుషోవు అన్నాడు.

"అంతేగాక, ఆడపిల్లలు వాళ్లకి పక్కలేసి, ఛిఛియా తేనే అందిం చాలని అంటున్నారు" వొక కాలు ముందుకి పెడుతూ, లూకా లాగా టోపీని వొక పక్కకి వంచుతూ నాజరు అన్నాడు.

''భలే భేష్!'' పగలబడి నవ్వుతూ, తనకి చాలా దగ్గరగా కూచున్న వొక ఆడపిల్ల నడుముచుట్టూ తన చేతులు పోనిస్తూ, ఇగ్రుషోవు వోంద్రపెట్టేడు.

''అదేమీ పనికిరాదు, యెద్దుమొద్దా'' అని ఆపిల్ల కీచురుమంది. ''వుండు. మీ ముసలిదాన్తో యీ సంగతి చెపుతానుండు.''

''పో చెప్పుకో, పో'' అత నరిచేడు. ''నాజరు చెపుతున్నది పూర్తిగా సత్యం. అలాగని వొక ఆర్డరులోవుంది. వాడికి చదువొచ్చు. అదంతా పూర్తిగా సత్యం.''

అని అతను ఆ పిల్ల పక్కనున్న ఉస్టెంకా అనేపిల్లను గట్టిగా కౌగలించుకోసాగేడు.

''చేతులు దూరంగా తగెత్తుకో, దున్నపోతా'' అని, కొట్టటానికా అన్నట్లు తనచేయి నెత్తుతూ, గులాబీరంగు పెదవులుగలిగి బొద్దుగా వున్న ఆపిల్ల కీచురుమంది.

ఇగ్రుషోవు వెనక్కితూలి, కింద పడ్డంతపని చేసేడు. ''భళిరా భన్నా! ఆడపిల్లలకి బలముండదంటారు, మరి యిది నిన్ను చంపినంతపనిచేసింది!''

''పో దూరంగా! యిక్కడి కెందుకొచ్చావ్ అక్కడ ఆఫీసునుంచి?'' అని అరిచి ఉస్టెంకా ముసిముసి నవ్వు నవ్వుతూ తల అటు తిప్పుకొంది. ''అయితే నువ్వు మొద్దుకుమల్లే నిద్రపోతుంటే ఆ అబ్రెక్కు నిన్నుపట్టుకొన్నంత పనిచేశాడన్నమాట? ఆ? శని వదిలిపొయ్యేది వాడు నిన్ను చంపేస్తే!''

''మరి నువ్వు గోలపెట్టేదానివి గాదూ?'' నవ్వుతూ నాజరు అన్నాడు.

''యేమాత్రంగాదు!''

''దానివంక చూడరా. నేనంటే దానికి ప్రేమలేనట్టు!'' ఇగ్రుషోవ్ అన్నాడు. ''కాని అది గోల పెడుతుందిరా. కాదు, నాజరూ?''

వీరి గొడవల్లోవుంటే అదేసమయంలో లూకా, మేరియానావంక చూస్తున్నాడు. ఆ పిల్ల తడబిడ పడుతున్నట్లు బాగా కనపడుతోంది.

''సరేగాని, మేరియానా, మిలిటరీ ముఖ్యుల్లో వొకరు మీ యింట్లో వున్నట్లు విన్నానే?'' ఆమె దగ్గరకొస్తూ అతనన్నాడు.

యెప్పటిమాదిరిగానే మేరియానా వెంటనే జవాబియ్యలేదు. మెల్లగా కళ్ళు పైకెత్తింది. యేదో ప్రత్యేకమైనది, యింతకుముందు చెప్పిన దానికంటే యేదో ప్రత్యేకమైనది, ఆ పిల్లమధ్యా తనమధ్యా వున్నట్టు లూకా కళ్ళు నవ్వుతున్నాయి.

''వాళ్ళకేం, వాళ్లకేం పర్వాలా. వాళ్లకి రెండు యిళ్ళున్నాయి'' వొక ముసలమ్మ అంది. ''యిక ఫోమ్యుష్కిన్ యింటి సంగతి చూడండి. వాడి యింట్లోగూడ వొక ముఖ్యుడున్నాడు. యిక వాడి సామాను గీమాన్తో ఆ యిల్లంతా నిండిపోయింది. యిక యెవరికీ అందులో ఖాళీలేదు. యింత మందని వొకవూరిమీద తోలటం యెన్నడైనా జరిగిందాంట? కాని, మనంచేసే దేమీలేదు దానికి. అసలీ మంద యెందుకొచ్చారంట యిక్కడికి?''

''వాళ్ళు టెరెక్ నది కడ్డంగా వంతెన కడతారని విన్నానేను'' అన్న దొక పిల్ల.

''నేనూ విన్నా'' ఉస్టెంకావద్దకు పోతూ నాజరు అన్నాడు. ''యేమ నంటే వాళ్లొక గొయ్యి తవ్వబోతున్నారట. మగపిల్లల్ని ప్రేమించని ఆడ పిల్లల్ని ఆ గోతిలో పెడతారట'' అని అతను కోతిపోజువేస్తే అందరూ నవ్వేరు.

మేరియానా పక్కగావెళ్లి ఇర్గుషోవు వొక ముసలమ్మని గట్టిగా వాటేసుకోసాగేడు.

''మేరియానాని వాటేసుకోరాదూ? అది నీ పక్కనే వుందిగా. వొక్కొక్కర్ని నువ్వు వాటేసుకొని తీరాలి'' అన్నాడు నాజరు.

''వుహూం. నాముసల్దే అంతకంటే దట్టమైంది'' పెనగులాడుతూన్న ఆ ముసలమ్మని ముద్దెట్టుకొంటూ ఇర్గుషోవు అరిచేడు.

''అమ్మో నన్ను వూపిరాడకుండా చేసి చంపుతున్నాడమ్మో'' అని ఆ ముసలమ్మ నవ్వుతూ కీచురుమని అరిచింది.

వీధి ఆ చివర్నుంచి వినపడిన తాళయుక్తమైన పాదధ్వని వారి నవ్వు లాటకి ఆటంకం కలిగించింది. వోవరుకోట్లు తొడిగి భుజాన మస్కెట్

తుపాకులు పెట్టిన ముగ్గురు సైనికులు మందుగుండు వేగను వగ్గర కాపలా కాస్తున్నవారిని పంపించేసి తాము కాపలా కాయటానికి పోతున్నారు. వారిలో వున్న కార్పొరల్ ఆశ్విక దళానికి చెందిన ముసలాడు. ఆ కూచున్న గుంపువంక కరుకుగా చూస్తూ రోడ్డుమీదనుంచున్న నాజరు లూకాలు తప్పకుండా దోవతొలగుతారనుకొంటూ అతను తనమనుషుల్ని సూటిగా రోడ్డుమీదగా నడిపేడు. నాజరు పక్కకి తొలిగేడు. కాని, లూకా కదల్లేదు.

''యిక్కడ మనుషులు నుంచున్నారయ్యా. మీరు అటు తిరిగి పోవాలి'' అని, తన వీపు సైనికుల వైపు తిప్పి, అసహ్యంతో తల యెగుర వేస్తూ కళ్లు చిట్లించుతూ, అతనన్నాడు.

ఆ సైనికులు నిశ్శబ్దంగా, తాళయుక్తంగా అడుగు వేసుకొంటూ, వెళ్లిపోయేరు.

మేరియానా నవ్వింది. తక్కిన ఆడపిల్లలంతా వంతుకలిపేరు.

''మొనగాళ్ళు, కాదూ?'' అన్నాడు నాజరు. ''పొడుగాటి గాగర్లు తొడిగే బృంద గాయకులకిమల్లే వున్నారు'' అని అతను ఆ సైనికుల్ని అనుకరించుతూ కొద్దిదూరం నడిచేడు.

మళ్లీ అందరూ విరగబడి నవ్వేరు.

లూకా నెమ్మదిగా మేరియానా వద్దకెళ్ళేడు.

''మీ ఆఫీసర్ని యెందులో వుంచారు?''

''కొత్తయింట్లో'' మేరియానా జవాబిచ్చింది.

''అతను కుర్రాడా, ముసలాడా?'' ఆమె పక్కన కూచుంటూ లూకా కొనసాగించేడు.

''ఆ సంగతి నే నడిగా ననుకొన్నావా? యింతకుముందే అతనికి ఛిఖిర్ తేబోతూ అతనున్న కిటికీపక్కగా వెళ్తూ అతన్ని వొక్కసారి మాత్రమే చూశా. అతనక్కడ ఇరోష్కాతో కలిసి కూచున్నాడు. యెర్రటి జుట్టుమనిషి. బండి సామాను తెచ్చాడు తనవెంట.''

అలా అని ఆమె రెప్పలు వాల్చింది.

''శెలవు దొరికినందుకు నాకు చాలా ఆనందంగావుంది'' ఆ పిల్లకి మరింత దగ్గరగా జరుగుతూ, సూటిగా యింకా ఆమెకళ్లల్లోకి చూస్తూ లూకా అన్నాడు.

''యెంతకాలం వుంటావు వూళ్లో?'' కొద్దిగా చిరునవ్వు నవ్వుతూ ఆమె అంది.

''రేప్పొద్దుటివరకూ. నాకొంచెం ఆ గింజలివ్వు'' చేయిచాచుతూ అతనన్నాడు.

వెంటనే మేరియానా చిరునవ్వునవ్వి తన చొక్కా మెడపట్టీని విప్పదీసింది. ''అన్నీ తీసుకోమాక'' అంది.

''అక్కడున్నంతసేపూ నీ ఆలోచనే. నిజం!'' లూకా ప్రశాంతంగా, చాలా మెల్లగా అన్నాడు, ఆమె రొమ్ము జేబులోంచి గుమ్మడి గింజలు తీసుకొని తింటూ. తర్వాత, నవ్వుతూన్న కళ్లతో, ఆమెకు మరింత దగ్గరగా జరిగి ఆమె చెవిలో యేదో రహస్యంగా చెప్పసాగేడు.

''నేను రానని నీకు చెప్పనేచెప్పా'' ముఖం అటు తిప్పకొంటూ హఠాత్తుగా ఆమె బిగ్గరగా అంది.

''చూడూ, నామాటవిను'' అని అతను మెల్లగా నణగసాగేడు. ''నేన్నీకు...చెప్పాలనుకొన్నా...దేముడితోడు...రా...మేరియానా.''

ఆమె కాదన్నట్లు తలనాడించింది. కాని ఆమె చిరునవ్వు నవ్వుతూవుంది.

''మేరియానా, అమ్మ పిలుస్తున్నది. అన్నం తయారైంది'' వారి వైపు పరుగెత్తివస్తూ ఆమె చిన్న తమ్ముడు కేకబెట్టేడు.

''వస్తున్నా'' అని ఆమె జవాబిచ్చింది. ''నువ్వు పరిగెయ్, నాన్నా, నాకోసం ఆగమాక. నేవస్తున్నాలే పద.''

లూకా నుంచుని తనటోపీ పైకెత్తేడు.

''నేనుగూడా యింటికెళితే మంచిదనుకొంటా. పొద్దుపోతున్నది'' వచ్చే వచ్చే చిరునవ్వును ఆపుకోటానికి ప్రయత్నిస్తూ తెచ్చికోలు వైరాగ్యంతో అన్నాడతను. తర్వాత ఆ యింటి మూలకెళ్లి అంతర్ధానమయ్యేడు.

ఈలోగా గ్రామంమీద అంధకారం అలముకొంది. మెరుస్తోన్న నక్ష త్రాల్లో ఆకాశం అలంకరించబడి వుంది. వీధులు చీకటిగా నిర్మానుష్యంగా వున్నాయి. నాజరు ఆడపిల్లల్తోపాటు అక్కడేవున్నాడు. లూకా వారి దగ్గర్నుంచి నెమ్మదిగా నడిచి వెళ్ళేడు. తర్వాత హఠాత్తుగా పిల్లిలాగా నక్కుతూ పట్టాకత్తి మోగకుండా వుండేందుకై చేత్తో పట్టుకొని, తన యింటివైపుకు గాకుండా, కార్నెట్ యింటివైపు, నిశ్శబ్దంగా పరుగెత్త సాగేడు.

అతను రెండువీధులుదాటి, వొక గొందిలోకి తిరిగి, కోటుని పైకి యెత్తి పట్టుకొని, వొక దడి చాటున నేలమీద కూచున్నాడు. ''నిజమైన కార్నెట్ కూతురు'' అని అతననుకొన్నాడు. ''కొంచెం కాలక్షేపం గూడా చెయ్యనియ్యదు ముండ. కాని, చెపుతానుండు.''

దగ్గరౌతున్న పాదాలధ్వని అతనిదృష్టి నాకర్షించింది. అతను చెవులు రిక్కించి విని నవ్వుకొన్నాడు. తల వంచుకొని, ఆ దడికంచెమీద తన బెత్తంతో టకటకమని ధ్వని చేసుకొంటూ, తొట్రుపాటు పడకుండా చర చరా సూటిగా మేరియానా అతనివైపు నడిచి వస్తోంది. లూకా లేచి నుంచున్నాడు. మేరియానా తుళిక్కిపడి ఆగి, తర్వాత విరగబడినవ్వింది.

''నన్ను ఝడిపించావుగద దున్నపోతా! అయితే నువ్వు యింటికి పోలేదన్నమాట ?'' ఆమె అనింది.

లూకా వొకచేత్తో ఆమె నడుము వాటేసుకొని, రెండోచేత్తో ఆమె ముఖాన్ని తనవైపు యెత్తేడు. ''నేన్నీకు చెప్పదల్చుకొన్న దేమిటంటే... హరిదేముడా!'' అతని కంఠం వణికింది. అతనికి మాటలు పెగల్లేదు.

''యిప్పుడు సంగతులు చెప్పేందుకు అవకాశంలేదు'' మేరియానా అనింది. ''అమ్మ నాకోసం చూస్తున్నది. నువ్వు నీ ప్రియురాలి దగ్గిరకి పోటం మంచిది.''

అతని పట్టువదిలించుకొని ఆమె పారిపోయింది. తమ కంచెవద్దకి చేరుకొన్నాక ఆగి, ఆమె తన వెంటవచ్చిన లూకావైపు వెనక్కితిరిగింది.

''ఆఁ. నువ్వింందాక నాకు చెప్పబోయిందేమిటి రాత్రించరుడా?'' నవ్వుతూ ఆమె అంది.

"దయచేసి నవ్వమాక, మేరియానా! నాకో ప్రియురాలుంటే యేమిటంట అది? దాన్ని గంగలో కలవనియ్యి. నువ్వూరికినే ఆమాటను; నేన్నిన్ను ప్రేమించుతా. నువ్వు చెయ్యమన్న దేదైనా చేస్తా. విన పడిందా?" తన జేబులోవున్న నాణేల్ని అతను గలగలమనిపించేడు. "మనిద్దరం హాయిగా వుండొచ్చు. అందరూ యెవరి కాలక్షేపం వాళ్ళు చేస్తున్నారు. నేనుమాత్రం యెందుకు చెయ్యగూడదు? నన్నెందుకు సుఖ పెట్టరాదు, మేరియానా?"

తన చేతుల్లో చరచరా తన శాల్తాన్ని తుంపులు తుంపులు చేస్తూ ఆ పిల్ల అతనిముందు నిశ్శబ్దంగా నుంచుంది. శ్రీ వేమన గ్రంథాలయము

లూకా తన పళ్ళనీ, పిడికిళ్ళనీ బిగబట్టేడు. తెలప్రోలు. (కృష్ణా జిల్లా.)

"నే నెప్పుడూ యెందుకని యింకాయింకా ఆగాలి? నిన్ను నేను ప్రేమించటంలేదా? నాతో నీ యిష్టమొచ్చింది చెయ్యి" ఆమె రెండు చేతులు గట్టిగా పట్టుకొంటూ, కోపంతో ముఖం చిట్లించుతూ, అతనన్నాడు.

మేరియానా ప్రశాంతంగానే నుంచుంది. ఆమె కంఠధ్వనిలో మార్పులేదు.

"గొడవ చెయ్యమాక, లూకా, నేచెప్పేదివిను" తన చేతుల్ని అతని చేతుల్లోనే వుండనిచ్చి తనకి కొంచెం దూరంగా అతన్నితోసి ఆమె అనింది. "నేనింకా చిన్నదాన్నన్నది నిజం. అయినా నామాట నువ్వు వినితీరాలి. నన్ను నువ్వు ప్రేమించితే నే నిదిచెపుతా. నాచేతులు వదులు. నువ్వు పట్టుకోకుండానే నేను చెప్పేది నేనుచెపుతా. నేన్నిన్ను పెళ్లి చేసు కొంటాను. కాని, నువ్వడిగింది మాత్రం యిప్పుడు సాధ్యపడదు" అని ఆమె తన ముఖం అతనివైపు తిప్పివుంచి చెప్పటం ముగించింది.

"పెళ్లనేది మన చేతుల్లోలేదు. ఊహూఁ. నన్ను నువ్వు యిప్పుడే ప్రేమించాలి, మేరియానా" మళ్ళీ వెంటనే చల్లబడి లొంగిపోతూ లూకా అన్నాడు. ఆమె కళ్ళల్లోకి దగ్గరగా చూస్తూ అతను చిరునవ్వునవ్వేడు.

మేరియానా అతన్ని గట్టిగా వాటేసుకొని వుద్రేకంతో అతని పెది మలమీద ముద్దుపెట్టుకొంది. "నా బంగారం" మైకంతో వణికిపోతూ అతని కతుక్కుంటూ ఆమె మెల్లగా అంది. తర్వాత దడాలున అతన్నుంచి

విడిపడి వెనక్కి తిరిగి చూడకుండా తమ యింటి గేటువద్దకి పరుగెత్తింది. ఆగి తాను చెప్పేది వినమని లూకా యెంతగా బతిమాలినా ఆమె ఆగలేదు.

"పో. లేకపోతే వాళ్లు చూస్తారు మన్ని. మా యింట్లో వున్న ఆ ఆఫీసరు భూతం పెరట్లో నడుస్తూన్నాడనుకుంటా" ఆమె అనింది.

"కార్నెట్ కూతురు!" అనుకొన్నాడు లూకా. "అయితే నన్ను పెళ్లిచేసుకుంటుందన్నమాట, చేసుకొంటుందా? పెళ్లికేం, పెళ్లి భేషైనదే. కాని, ముందు అది నన్ను ప్రేమించాలి."

యామ్కా యింట్లో అతనికి నాజరు కనపడ్డాడు. అక్కడ కొంచెం తాగినాక అతను దున్యాకా యింటికెళ్ళేడు. ఆమె నమ్మకద్రోహం చేస్తున్న మనిషైనప్పటికీ ఆరాత్రి కతను ఆ యింట్లో గడిపేడు.

# 14

నిజంగా ఆ పెరట్లో అప్పుడు నడుస్తూన్నది ఓలెనిన్నే. "మా యింట్లోవున్న ఆ ఆఫీసరుభూతం" అని మేరియానా అన్న మాటల్ని అతను విన్నాడు.

అతనా సాయంకాలమంతా ఇరోష్కాతో గలిసి ఆ తలవాకిటి వసారావద్ద గడిపేడు. అతను వొక మేజాబల్లా, కొవ్వొత్తీ, కొంత ఛిఖీరూ, టీపాత్రా తెప్పించి, టీ తాగుతూ, ముసలాడు తనకాళ్ళదగ్గిర మెట్లమీద కూచుని కథలు చెబుతూంటే శ్రద్ధగా విన్నాడు.

గాలి అసలేమీ కదలిక లేకుండా వున్నప్పటికీ కొవ్వొత్తి దీపపు జ్వాల రెపరెపమని వొకసారి అటూ వొకసారి యిటూ వంగుతూ వొకసారి వసారానీ మేజాబల్లనీ పాత్రసామాగ్రినీ, మరోసారి అంటగత్తిరించబడిన ముసలాడి తలనీ వెలిగించుతోంది. పురుగులు ఆ జ్వాలచుట్టూ తిరుగుతూ మేజాబల్లకీ గ్లాసులకీ కొట్టుకొంటూ తమ రెక్కల పొట్టు దులుపుతున్నాయి. కొన్ని ఆ జ్వాలలోకి దూరినాయి. మరికొన్ని వెల్తురు అవతల వున్న చీకట్లోకి మాయమైనాయి.

ఓలెనిన్, ఇరోష్కాలు కలిసి పదుసీసాల ఛిఖిర్ ఖాళీ జేసేరు. ఓలెనిన్ సారాతో గ్లాసు నింపి యిచ్చినపుడల్లా ఇరోష్కా అతని ఆరోగ్యం కోసమంటూ దాన్ని గుటుక్కుమనిపించేడు. వెనకటి కాలపు కోసక్కు జీవితంను గురించీ, "వెడల్పాటి వీపుగాడు" అని పిలువబడిన తన తండ్రిని గురించీ, అతను మూడు వందల పౌనుల బరువుండే అడవిపంది శవాన్ని తనవీపుమీద మోయగల శక్తిని గురించీ, వొక్కొక్క దఫాకీ అతనెలా రెండుబొక్కెన్ల సారా తాగగలిగిందీ, ప్లేగు వ్యాధి వ్యాపించిన రోజుల్లో తన మిత్రుడైన గిర్చిక్‌తో కలిసి అతనెలా యేటవతలనుంచి ఉన్ని వొదులు చొక్కాలు రహస్యంగా తెచ్చిందీ, ఇరోష్కా అంతులేకుండా వాగుతూ చెప్పేడు. తన వేటని గురించీ, తానెలా వొక వుదయాన వొక మగదుప్పిని చంపిందీ అతను ఓలెనిన్‌కి చెప్పేడు. తన ప్రియురాలిని గురించి ఆమె యెలా తాను ఆ ఆఫీసువద్ద వున్నపుడు రాత్రిపూట తన వద్దకి రహస్యంగా వచ్చేదో అతను చెప్పేడు. ఇదంతా యెంత వాక్చాతుర్యంతో, యెంత సజీవంగా చెప్పబడిందంటే, ఓలెనిన్ అసలు పొద్దెలా గడిచిందో గూడా గమనించలేకపోయేడు.

"అవును బాబూ, నువ్వు చాలా ఆలస్యంగా వచ్చావు. నా బంగారపు దినాలు చూసే అవకాశం పోగొట్టుకొన్నావు. అప్పుడైతే సంగతేంటో నీకు చూపివుండేవాణ్ణి. యివాళ నన్ను "సారాపాత్ర నాకిన యిరోష్కా" అంటారు. కాని, ఆ రోజుల్లో ఇరోష్కా పేరు రెజిమెంటంతా మారుమోగిందె. అందరికంటే మంచి గుర్రం యెవరికుండేది? కకేషియాలో కల్లా వాటమైన స్వర్దా ఖడ్గం యెవరిదగ్గరుండేది? యెప్పుడైనా వొకరికి తాగబోయించటానికి సిద్ధంగా వుండేదెవరు? జల్సా చెయ్యాలంటే అందర్లోకీ మంచి హుషారైన మనిషి యెవరు? అబ్మెత్ ఖానుని చంపటానికి పర్వతాల్లోకెవర్ని పంపేది? ఇరోష్కా, అన్నిటికీ ఇరోష్కా. ఆడపిల్లలు యెవర్ని అందరికంటే యెక్కువగా ప్రేమించేవాళ్ళు? ఇరోష్కాని. యెందుకంటే నేను నిజమైన జిఘిత్‌ని గనుక. నేను పాటగాణ్ణి, తాగుబోతుని, దొంగని. పర్వతాల నుంచి మందలకి మందలు గుర్రాల్ని తోలుకొచ్చేవాణ్ణి. నేను ముట్టంనీ, చెయ్యలేంనీ అంటూలేదు. నా వంటి కోసక్కు లెవరూ యీ రోజుల్లో లేరు. వాళ్లవంక చూస్తే నాకు అసహ్యమేస్తుంది. వాళ్ళు యింత మనుషులు (అని తనచేతిని భూమ్మీద గజమెత్తున యెత్తేడు). వాళ్ళు ఛండా

లపు బూట్లుతొడిగి నాటి నదేపనిగా పొగుడుకొంటూంటారు. జీవితంలో వాళ్లెరిగిన ఆనందమంతా అదే. యిక అదీ ఇదీ గాకపోతే తెగతాగుతారు; మనుషులకిమల్లే మాత్రంగాదు అంతా తప్పపుగా తాగుతారు. కాని నేను,ఇరోప్కాగ్ • పూల్లో నేగాకుండా పర్వతాల్లో గూడా పేరుపడివున్నా. తార్తారు యువరాజులు, వాళ్ళు నా స్నేహితులు, నాక్యునాక్యు, నన్ను చూడటాని కొచ్చేవాళ్ళు. నేను ప్రతివారితోనూ క్యునాక్‌గా వుండేవాణ్ణి. వాళ్ళు తార్తారులా, ఆర్మీనియన్లా, మామూలు సైనికులా ఆఫీసర్లా అనే భేదం మన కేమాత్రంలేదు. వాళ్ళు తాగుడు నేర్చివుంటే చాలు; నాకందరూ వొకటే. ''యిహంతో మీకుగల సంబంధాలు తెగగొట్టుకోండి. సైనికుడితో కలిసి తాగవద్దు. తార్తారుతో కలిసి తినవద్దు'' అని వాళ్ళంటారు.''

''అని యెవరంటారు ?''

''యెవరేమ్ముంది, మన మతగురువులు. పోతే యిక ముల్లాయో, లేక తార్తారు కాజీయో చెప్పేదేంటోవిను. ''అరే కిరస్తానీ ముండాకొడకల్లారా, పంది మాంసం తింటారెందుకురా ?'' అని అంటారు. అంటే ప్రతివాడికీ వాడి నమ్మకాలు వున్నయ్యన్నమాట. కాని, నాకన్నీ వొకటే. భగవంతుడు సృష్టిలోని ప్రతిదాన్నీ మానవుడి ఆనందంకోసం పుట్టించాడు. అందులో దేనిలోనూ పాపమనేదిలేదు. మచ్చుకి వొక జంతువుని తీసుకో. అది తార్తారు రెల్లుదుబ్బుల్లోనూ వుంటుంది;మనరెల్లుదుబ్బుల్లోనూ వుంటుంది. అదెక్కడుంటే అది దాని నివాసం. భగవంతుడు దానికేదిస్తే అది దాన్ని తింటుంది. కాని, అలాంటిపనులు చేస్తే మనం నరకంలో యెర్రగా కాలిన అట్లపెనం నాలికతో నాకాల్సివుంటుం దంటారు మనజనం. కాని, నేననుకొనే దేమంటే అదంతా వట్టిమోసమని'' అని కొంత విరామం తర్వాత అతను చెప్పటం ముగించేడు.

''మోసమంటే యేమిటి ?''

''మోసమంటే మతగురువులు చెప్పేది. చెర్వ్‌లెనాలో మాకో ఆర్మీ కెప్టెన్ వుండేవాడు. నా స్నేహితుడు. నాకుమల్లే మంచి ముండాకొడుకు. ఛెఛెన్యాలో అతన్ని చంపేశారు. మతగురువులు యీ సంగతులన్నీ తమ బుర్రల్లోంచే పుట్టిస్తారని అత నసేవాడు. ''నువ్వు చచ్చి పోతావు. నీ సమాధి

మీద పచ్చిగడ్డి పెరుగుతుంది. అంతే'' అనేవాడతను. ఇరోష్కా నవ్వేడు. ''అతను పొగరుబోతు, ఆ కెప్టెన్.''

''నీ వయస్సెంత?''

''భగవంతుడికే తెలియాలా సంగతి. నాకు కనీసం డెభ్భయ్యేళ్లున్నాయుంటయ్యి. రాణీగారు రాజ్యమేలేప్పటికి నేను చిన్నవాణ్ణేం గాదు. యిక దాన్నిబట్టి నువ్వు లెక్కవెయ్యవచ్చు. డెభ్భయ్యి అవుతుంది, కాదూ?''

''అవును. తప్పకుండా అంతేవుంటుంది. కాని, యింకా నువ్వు దుక్కలాగా, వుషారుగా వున్నావు.''

''అవును. నా ఆరోగ్యం బాగుంది—ఆ భగవంతుడిదయ. పోకచిల్లంగి ఆడముండ నన్ను దెబ్బ తీసిందనేది మినహాయిస్తే –''

''యెలాగు?''

''అబ్బ, దెబ్బతీసిందన్నాగా......''

''అయితే నువ్వు చచ్చిపోయినాక నీమీద పచ్చిగడ్డి పెరుగుతుందన్న మాట?'' ఓలెనిన్ అన్నాడు.

కాని, తన ఆలోచనని యింకా స్పష్టంగా వివరించాలనే ఆదుర్దాయేమాత్రమూ ఇరోష్కా చూపలేదు.

''మరి యెలావుంటుందని నీ వూహ?'' కొంత సేపైనాక అత నడిగేడు. తర్వాత హఠాత్తుగా యిలా అరిచేడు:

''వూఁ. రా. యింకా కొంచెం తాగు.''

అని చిరునవ్వు నవ్వుతూ మరో గ్లాసుడు ద్రాక్షసారా అతను ఓలెనిన్ కందించేడు.

# 15

''వుండు. నన్నాలోచించుకోనియ్యి. నేను చెబుతున్నదేమిటీ?'' ఇరోష్కా తిరిగీ ఆరంభించేడు. ''ఆఁ. ఆఁ. అవును—అలాంటి మనిషిని

నేను! నేను వేటగాణ్ణి. యీ సైన్యం హోల్ మొత్తంలో నావంటి వేటగాడు లేడు. యేజంతువునైనా నే నీకు చూపగలను. యే పక్షినైనా సరే. నాకంట బడకుండా యేదీ తప్పించుకుపోలేదు. నాకు కుక్కలూ, రెండు తుపాకులూ, వొక వలా, వొక తెరా, వొక డేగా వున్నయ్యి. భగవంతుడి దయువల్ల నాకన్నీ వున్నయ్యి. నువ్వు చెప్పేది బడాయిగాక నువ్వు నిజంగా వేటగాడి వైతే, నీకన్నీ చూపిస్తా, రా. నేనెలాంటి మనిషినో యెరుగుదువా? మొదట నేను జంతువుల జాడ కనుక్కొంటా. ప్రతిజంతువూ నాకు తెలుసు. అదెక్కడ నిద్రపోతుందో, నీళ్లు తాగటానికెక్కడి కొస్తోందో, యెక్కడ పడి దొర్లుతుందో నాకు తెలుసు. అప్పుడు నేను యే చెట్టుమీదో, యే పరవంజామీదో యెక్కి రాత్రంతా అక్కడే కూచుని కాపలా గాస్తా. యేమైనా, యింటికాడ వున్నందువల్ల ప్రయోజన మేంటి? తాగి పాపపు పనులు చేస్తావు. అంతే. కోడిపెట్టలకిమల్లే కేసుకొంటూ ఆడవాళ్లొస్తారు. లేదా పిల్లలు నిన్ను చూచి పెడబొబ్బలు పెడతారు. లేకపోతే పొగతో వుక్కిరి బిక్కిరై చస్తాం. కాని, రాత్రిపూట అడవిలో మరోరకంగా వుంటుంది. వొక చక్కని చోటు చూచుకొంటావు. రెల్లుదుబ్బుల్ని తొక్కేసి సరిజేసుకొంటావు. ఆపర్నే అక్కడ కాపలా గాస్తా కూచుంటావు. అడివిలో యేం జరుగుతుందో అదంతా నీకు తెలుసు. ఆకాశంవంక చూస్తావు. చుక్కలు కూకుతాయి. వాటినిబట్టి యెంత టైమైందో తెలుసు కొంటావు. చుట్టూ చూస్తావు. అడవి వూగుతూంటుంది. ఘెళఘెళధ్వని వినవచ్చే వరకూ ఆగి చూస్తావు. యింతలో వొక అడవిపంది బురదలోపడి దొర్లటానికి అటు వస్తుంది. డేగపిల్లలు అరవటం నీకు వినిపిస్తుంది. లేకపోతే వూళ్లోని కోళ్లు కూయటం మొదలెడతయ్యి. అవీగాకపోతే బాతులు అరుస్తయ్యి. బాతుల అరుపు వినపడిందంటే యింకా అర్ధరాత్రి కాలేదని అర్థం. అవును, ఆ సంగతులన్నీ నాకు తెలుసు. పోతే యిక దూరాన్నెక్కడన్నా తుపాకిధ్వని వినపడిందా ఆలోచించటం మొదలెడతా. ఆ కాల్చేదెవరా అనుకొంటా. బహుశా నాకుమల్లే యేదన్నా జంతువుకోసరం కాపలా గాచిన కోసక్కేమో? వాడు దాన్ని చంపాడా, లేక దానికి గాయం మాత్రమే తగిలిందా? పాపం, గాయంమాత్రమే తగిల్తే అది దుబ్బుల్లోగుండా పాకిపోతూ పాకినచోట నెత్తురు పూసుకొంటూ పోతుంది. అంతావృధాశ్రమన్నమాట. అలాంటి పనంటే నాకు

ద్వేషం. జంతువుని వూరికినే గాయపరచటమెందుకు బుర్రిలేకుండా! లేకపోతే యే ఛోటాకోసక్కానన్నా యే అబ్రికోక్క కాల్చాడా అని అనుకొంటా. యిదంతా నామనసులో మెదులుతుంది.''

''వొకసారి రాత్రి నేను యేటిపక్కన కూచునుంటే నాకొక ఉయ్యాల దిగువకి పోతూ కనపడింది. వుయ్యాలంతా చక్కగావుంది; వొకమూల మాత్రం కొంచెం విరిగిపోయింది. అప్పుడు నాకెన్ని ఆలోచనలు కలిగినియ్యన! యెవరి వుయ్యాలది? వాళ్ళు ఆ దున్నపోతులు; మీ సైనికులు తప్పకుండా అయ్యుంటారనుకొన్నా. మీ దున్నపోతుల్లో కొందరీ మధ్య వొక తార్తారు పల్లెకెళ్లి ఆడవాళ్లని బలవంతాన పట్టుకొని అందులో వొక దున్నపోతు వొక పసిబిడ్డని చంపాడు. యేముందీ, వూరికినే ఆ బిడ్డ కాళ్లుపుచ్చుకొని తల గోడకేసి కొట్టాడు. వాళ్ళు అలాంటి పనులు చెయ్యరూ? అబ్బా, మనుషులకి హృదయం లేదు! అలాంటి ఆలోచనలు కలిగి నాకు చాలా జాలి కల్గింది. అయితే వాళ్ళా వుయ్యాలని యెక్కడో పారేసి, తల్లిని బైటికి తరిమి వుంటారు; యిక ఆవిడ భర్త వొక తుపాకి తీసుకొని, మన్ని దోచెయ్యటానికి మనవేపుకి వస్తాడన్నమాట అని అనుకొన్నా. అవును తమ్ముడూ, కూచుని అలా అనుకొన్నా. తర్వాత వొక పొదగుండా ఫెళఫెళమంటూ దూసుకొస్తున్న అడివిపందుల మోత వినపడగానే నా మనసు మారిపోయింది. యిలారండే, నా ముద్దుల పట్టీల్లారా అని అనుకొన్నా. తర్వాత అవి నన్ను పసికడతై అనుకొన్నా. కదలకుండా కూచున్నా. గుండె దడదడ కొట్టుకుంటున్నది. యెంత బాగా కొట్టుకున్నదంటే అది నన్ను లేపేంతపని చేసింది. యీ వసంత కాలంలో వొకనాడు వొక మాంచి పందులమంద కనపడింది. నాకేదో నల్లగా అగపడింది. ''భగవంతుడిపేరుతో, యేసు క్రీస్తుపేరుతో'' అని కాల్చబోయేసరికి తల్లిపంది వాసనపట్టి, ''జాగర్త పిల్లలారా! అదుగో అక్కడొక మనిషి కాచుక్కూచున్నాడు'' అని గొణిగింది. అప్పుడు తుర్రుమని అవి పొదల్లోదూరి దూసుకు పోయినయ్యి. ఆ తల్లిపంది నాకు యెంతదగ్గరగా వుందంటే దాన్ని కాల్చేవాణ్ణి.''

''తల్లిపంది తన పిల్లలకి మనిషున్న సంగతెలా చెప్తుతుందీ?'' ఓలెనిన్ అడిగేడు.

"యేమిటనుకున్నావు మరి? అదంటే బుర్రలేనిదనుకొన్నావా? ఊహూం. అది పందని పిలువబడుతున్నప్పటికీ, అది మనిషికంటే తెలివి గలది. దాని కంతా తెలుసు. మాటవరసకో సంగతి చెపుతా విను. నువ్వు నడిచిన బాటమీదకి యే మనిషన్నా రావచ్చు. కాని అతను నీ జాడే గుర్తించలేడు. పంది అలాగాక వాసనపట్టి తుర్రుమంటుంది. అది మనిషి వాసన పసిగడుతుందిగనకా నువ్వు పసిగట్టలేవుగనకా నీకంటే అదే తెలివి గలదని తేలటల్లా? అంతేగాక యింకోమాటగూడా చెప్పాలి: నువ్వు చంపాలని చూస్తావు, కాని అది బతికుండి అడివిలో తిరగాలని చూస్తుంది. నీకొక విధానముంటే, దానికి మరొకటుంది. అది పందే; కాని నీకంటే యేమాత్రం చెడ్డదిగాదు. భగవంతుడి సృష్టిలో అదీ వొకటి. హబ్బా! మనిషి మందమతి, వొట్టి మందమతి!" ముసలాడు యీ మాటలు చాలా సార్లుఅని, తర్వాత తలవేళ్లాడేసి, నిశ్శబ్దంగా వూరుకొన్నాడు.

ఓలెనిన్ ఆలోచనా నిమగ్నుడయ్యేడు. అతను లేచి; మెట్లు దిగి వెళ్లి, చేతులు వెనక్కి పెట్టి పెరట్లో పైకీ కిందకీ పచారు చేయసాగేడు.

హఠాత్తుగా ఇరోష్కాలో కదలిక పుట్టింది. అతను తలెత్తి, ఆ కొవ్వొత్తిజ్వాల చుట్టూ తిరిగి ఆ మంటలో పడుతున్న పురుగులవంక చూసేడు.

"చిట్టి వెర్రి ముండల్లారా!" అని అతను మృదువుగా అన్నాడు. "మీరెగిరే దెక్కడికి మందమతుల్లారా?"

అతను లేచి నుంచుని వాటిని తోలివెయ్యసాగేడు. "మంటల్లో మాడి చస్తారే, చిట్టిముండల్లారా" తన మోటువేళ్ళతో మృదువుగా వాటి రెక్కల్ని పట్టుకోటానికి ప్రయత్నించుతూ అతను నణిగేడు. "ఇదుగో, యిటు యెగరండి. యిక్కడ చాలా ఖాళీవుంది. మీయంతట మీరు చస్తున్నారే, పిచ్చి ముండల్లారా."

లొడబిడమని వాగుతూ, సీసాల్లోంచి సారా పీల్చుతూ అతనక్కడ చాలాసేపున్నాడు.

ఓలెనిన్ పెరట్లో అటూ యిటూ పచారు చేస్తున్నాడు. అకస్మాత్తుగా గేటువద్ద యేవో గుసగుస ధ్వనులు అతనికి వినపడినాయి. అతను వూపిరి

బిగపట్టేడు. వొక స్త్రీ నవ్వూ, వొక పురుషుడి కంఠస్వరం, తర్వాత ముద్దుపెట్టుకొన్న ధ్వనీ. కావాలని పాదాల చప్పుడు చేస్తూ అతను పెరట్లో యెకటి భాగంవైపు వెళ్ళేడు. అప్పుడే గేటు కిర్రుమంది.

నల్లటి సిర్ కెషియన్‌కోటూ తెల్లటి వున్నిటోపీ ధరించిన వొక కోసక్కు కంచె పక్కగా వెళ్ళేడు. తలమీద తెల్లటి రుమాలు ధరించిన వొక పొడుగాంటి స్త్రీ ఓలెనిన్ పక్కగా వెళ్ళింది.

"నీతో నాకేం పనిలేదు; నాతో నీకేం పనిలేదు" అని ఆమె గంభీరమైన నడక చెబుతూన్నట్లుంది.

ఆమె తలవాకిటి వసారావరకూ వెళ్ళేదాక ఓలెనిన్ ఆమెని చూసేడు. ఆమె తన తలనున్న రుమాలు తీసేసి కూచోటాన్ని అతను కిటికీలోగుండా చూసేడు. అప్పుడు హఠాత్తుగా వొంటరితనం, యేవో ఆశలు, అస్పష్టమైన వాంఛలూ, యెవరి పట్లనో యెందుకో తెలీని అసూయా అతని హృదయాన్ని అలముకొన్నాయి.

గ్రామంలో అంతవరకూ ఆర్పేయకుండా వున్న దీపాలు ఆర్పేయబడినాయి; అంతవరకూ వినవొస్తూన్న ధ్వనులు ఆగిపోయినాయి. కంచెలూ, దొడ్లల్లోవున్న పశువుల తెల్లటి ఆకారాలూ, యిళ్ళకప్పులూ, యెత్తుగా అందంగావున్న పోప్లార్ చెట్లూ—ప్రతిదీ హాయిగా, ప్రశాంతంగా నిద్రపోతూన్నట్లుంది. దూరపు చిత్తడి నేలల వెనకనుండి కప్పల అరుపులు మాత్రం వినవస్తున్నాయి. తూర్పున, పెరుగుతూన్న కాంతిలో, నక్షత్రాలు కరిగిపోతున్నట్లున్నాయి. కాని ఆకాశం మధ్యన మాత్రం అవి యింతకు ముందుకంటే గుబురుగా, స్పష్టంగా కనపడుతున్నాయి.

తన చేతిమీద తలపెట్టుకొని ఇరోష్కా నిద్రిస్తున్నాడు. రోడ్డు కవతల వొక కోడి కూసింది. ఓలెనిన్ యింకా అటూయిటూ పచారు చేస్తున్నాడు. చాలామంది మనుషులు వుల్లాసంగా వొకపాట పాడటం అతనికి వినిపించింది. కంచెవరకూ వెళ్ళి అతను చెవులు రిక్కించేడు. అన్నిగొంతులకంటే వొకరిగొంతు బాగా వినపడుతోంది.

"అతను లూకా, ఆ జిఘిత్" నిద్ర మేల్కొంటూ ముసలాడన్నాడు. "తాను అబ్రెక్కు నొకణ్ణి చంపాడు గనక అతనికి సంతోషంగా వుంది. అయినా సంతోషించటాని కందులో యేముంది? కుర్ర వెధవ—"

"నువ్వెప్పుడైనా యెవర్నయినా చంపావా?" ఓలెనిన్ అడిగేడు.

ముసలాడు దడాలున లేచి కూచుని తన ముఖాన్ని ఓలెనిన్ ముఖానికి దగ్గరగా పెట్టేడు. "ఆరి భడవా!" అని అతనరిచేడు. "అలాంటి విషయాలు నువ్వడగ్గూడదు! ఆ విషయం యెత్తడం తప్పు. వొక మనిషిని చంపడమంటే తేలిక విషయమేమీగాదు. అవును. తేలికగాదు...సరే, యిప్పటికిక శెలవు" లేస్తూ అతనన్నాడు. "నా కడుపు నిండుగావుంది. నాకు తృప్తిగా వుంది. రేపు నిన్ను వేటకి తీసుకెళ్లనా?"

"ఆఁ. వచ్చి నన్ను తీసుకుపో."

"తయారుగా వుండు సమయానికి. అధికంగా నిద్రపోతే నీకు జుల్మానా పడుతుంది."

"యేం భయంలేదు. నేను నీకంటే ముందరే లేస్తాను" అన్నాడు ఓలెనిన్.

ముసలాడు వెళ్లిపోయేడు. పాట ఆగిపోయింది. వారిపాదాలధ్వనీ, సరసస్సల్లాపాలూ వినపడుతున్నాయి. కొంతసేపైనాక, కొంచెందూరాన, ఆ పాట తిరిగీ ప్రారంభమైంది. తక్కిన గొంతుల్తో ఇరోష్కా పెద్ద మంద్ర స్వరం కలిసింది.

"యెటువంటి ప్రజలు, యెటువంటి జీవితం!" తన మకాం యింట్లోకి వొంటరిగా వెళ్ళుతూ ఓలెనిన్ ఆశతో బెంగతో అనుకొన్నాడు.

# 16

ఇరోష్కా చాలాకాలంకిందటే సైన్యంలో వుద్యోగంనుంచి చాలించుకొన్నాడు. ఇప్పుడతను వొంటరిగా నివసిస్తున్నాడు. ఇరవై సంవత్సరాల కిందట అతని భార్య అతన్ని వొదిలేసి, సనాతన క్రిష్టియన్ మతం పుచ్చుకొని, వొకరష్యన్ సార్జంట్ మేజర్‌ని పెళ్లిచేసుకొంది. అతనికి పిల్లలేరు. తన యువకత్వంలో తాను గ్రామంలో చిచ్చరపిడుగు లాగా వుండేవాణ్ణని అతను ఓలెనిన్‌తో అన్నాడంటే అందులో బడాయి కొట్టుకోటం అనేదిలేదు. అతను అంతకుముందు చేసిన సాహసకృత్యాల్ని

గురించి రెజిమెంటులో ప్రతివాడికీ తెలుసు. చాలామంది ఛెఛెన్ల, రష్యన్ల మరణం అతని హృదయాన్ని పట్టి పీకుతోంది. అతను బందిపోటుగా, దొంగగా జీవించేడు. రెండుసార్లు జైల్లో కూడా పడ్డాడు. ఇప్పుడతను తన కాలంలో చాలా భాగం అడివిలో గడిపేస్తున్నాడు. వొక్క రొట్టె ముక్కతో అతను రోజులకొద్దీ అడివిలో గడిపేడు; అప్పుడు మంచి నీళ్ళు తప్పితే మరేమీ తాగలేడు. యికె వూళ్ళోకొచ్చినాక రేయింబగళ్ళు సారా తాగుతూ ఆ లోటు భర్తీచేసేనాడు.

ఓలెనిన్ దగ్గర్నుంచి వెళ్ళినాక అతను రెండు గంటలసేపు నిద్ర పోయి, తెల్లారకముందే నిద్రలేచి, తా నా సాయంత్రం కలిసికొన్న మని షిని గురించి ఆలోచిస్తూ మంచంమీద పడుకొన్నాడు.

ఓలెనిన్ అతనికి నచ్చేడు. అతని ''నిరాడంబరత్వం'' అతనికి ఆనం దం కలిగించింది. ఓలెనిన్ తనకి కావాల్సినంత సారా యిప్పించటాన్ని అతడు ''నిరాడంబరత్వం'' అని పేరు పెట్టేడు. రష్యన్లు అంత ''నిరాడంబ రంగా'' యెందుకుంటారా, వాళ్ళు బాగా చదువుకొన్నవాళ్ళయ్యినప్ప టికీ వాళ్ళకేమీ యెందువల్ల తెలవదా అని అతను వింతనొందేడు. వాటిని గురించి అతను దీర్ఘంగా ఆలోచించేడు. అదే సమయంలో ఓలెనిన్ నుంచి తానేమి రాబట్టుకోవచ్చునోగూడా ఆలోచించేడు.

ఇరోష్కా యిల్లు చాలా పాత యిల్లేమీగాదు. అది కొంచెం పెద్ద యిల్లే. కాని,ఆడమనిషి అనేది ఆ యింట్లో లేకపోవటం బాగా గమనార్హం గావుంది. కోసక్కులకి అలవాటైన పరిశుభ్రతా, నీటుతనాలకి భిన్నంగా అతని గది మురికిగా, నమ్మశక్యంగానంత అసహ్యాగాంవుంది. తినేసిన, పిండి రొట్టెముక్కలూ, తన డేగ కోసరం ఆహారంగా తెచ్చిన వొక బొచ్చుపీకి నజ్జునజ్జుగావున్న కాకీ, పక్కన వొక నెత్తురు మరకల్తోవున్న కోటు పడివుంది. చెప్పులూ, వొక పట్టాకత్తీ, వొక తుపాకీ, వొక చిన్న సంచీ, తడిసిన బట్టలూ, గుడ్డపేలికలూ బల్లలమీద చిక్కురొక్కురుగా పడివున్నాయి. వొక తుపాకీ వొక వేటతెరా పక్కన వొక జత చెప్పులు నానబెట్టిన గబులుకంపుగొట్టే మురికినీటి తొట్టి ఒకటుంది. చచ్చిన చాలా జీవంజీవకపక్షులున్న వలొకటి నేలమీద పారేసివుంది. కాలు మేజాబల్లకి కట్టేసి వున్న వొక కోడిపెట్ట ఆ గలీజులో అటూయిటూ తిరుగుతూ

ముక్కుతో పొడిచి తింటోంది. పాలలాంటి దేదో వున్న వొక మొరికలు పడిన కుండ వెలిగించని పొయ్యిలోవుంది. పొయ్యి *(Oven)* దిమ్మెమీద కట్టి వేసివున్న వొక డేగ కీచురుమని అరుస్తూ తనకు కట్టినతాడు తెంచుకుపోటానికిచూస్తోంది. ఆ డేగపక్కన ఈకలు రాల్చుతూన్న వొకగద్ద శాంతంగా కూచుని ఆ కోడిపెట్టవంక వోరగంట చూస్తూ తలని అటూ యిటూ వంచుతోంది.

పొయ్యికీ గోడకీ మధ్య తాను తయారుజేసిన వొక పొట్టి పడక మీద, చొక్కాతొడుక్కొని, కాళ్ళు పొయ్యి దిమ్మెమీద పడేసి, ఇరోష్కా పడుకొని వున్నాడు. తన బండవేళ్ళతో తన చేతులమీద గాయపుపొక్కుల్ని ఇరోష్కా యేరివేస్తున్నాడు. చేతి తొడుగులు లేకుండా డేగని చేతుల్లో పట్టుకెళ్తున్నందువల్ల ఆ గాయాలు యేర్పడినాయి. ఆ గదంతా, ప్రత్యేకంగా మంచంవున్నమూల, ఘాటుగావున్నా అసహ్యంగాలేని ఇరోష్కా శరీరంమీద యెప్పుడూ వుండే వాసనల్తో నిండివుంది.

"ఉర్యైడ్‌మా, మామా ? (యింట్లో వున్నావా ?)" అని కిటికీలోగుండా అతనికి స్పష్టంగా వొక గొంతు వినపడింది. అది లూకా గొంతని అతను వెంటనే గుర్తించేడు.

"ఉర్యైడ్; ఉర్యైడ్, లోపలికిరా" అత నరిచేడు. "లోపలికిరా, మార్కావో లూకావో! యేం పనిమీ దొచ్చావ్? నాకాకి వెళ్తున్నావా?"

ఆ అరుపులకి బెదరి డేగ తన రెక్కల్ని టపటప లాడించి తాడు తెగగొట్టుకోటానికి ప్రయత్నించింది.

ఇరోష్కాకి లూకా అంటే మక్కువ. యిప్పుడున్న క్రురకారు కోసక్కులంటే తన కున్న ద్వేషంనుంచి మినహాయించింది లూకా నొక్కణ్ణే. అంతేగాకుండా, లూకా అతని తల్లీ అతనికి చాలా దగ్గరి పొరుగువాళ్లు. ఇరోష్కాకి లేని మీగడా, ఛిఖిరూ యింకా తమ యింట్లో తయారుచేసినవీ ఆ యిద్దరూ అతనికి తెచ్చి యిస్తూండేవాళ్ళు తరచుగా. తన జీవితమంతా బుర్రిలో యేది తట్టితే అదిచేసిన ఇరోష్కాకి తన జీవితాన్ని యితరుల జీవితాన్ని చేతల్నిబట్టి లెక్క గట్టటమనేది యిష్టం.

''భేష్'' అని అశ ననుకొంటాడు. ''వాళ్ళు బాగా వున్నవాళ్ళు. వాళ్లకి నేను పిట్టల్నీ, తాజామాంసాన్నీ యిస్తే వాళ్ళు నాకు అప్పు డప్పుడూ పిండిరొట్టో, బజ్జీయో యెందుకు తెచ్చిపెట్టకూడదూ ?''

''గుడ్ మార్నింగ్, మార్క్ ! నిన్ను చూడటం నాకానందంగా వుందిరా'' అతను వుల్లాసంగా అరిచేడు. తర్వాత వెంటనే మంచంలోంచి యెగిరి కిందకి దూకేడు. రెండుమూడు అడుగులు గరగరమనే ఆ నేలమీద నడిచి, కిందకిచూసి, బయటికి తిరిగివున్న తన బొటన వేళ్లని చూసి అక స్మాత్తుగా వేడుక గలిగి పళ్లికిలించి, అతను తన వొట్టిమడమల్తో ఆ నేల మీద కాసేపు చిందులు తొక్కేడు. ''బాగావుంది. కాదూ ?'' తన చిన్ని కళ్ళు మెరుస్తుండగా, అతనన్నాడు.

లూకా చిరునవ్వు నవ్వేడు.

''భేష్. నాకాకి వెళ్తున్నావా ?'' ముసలాడడిగేడు.

''ఇదుగో నేనిస్తానన్న భిఖర్'' అని లూకా అన్నాడు.

''బంగారమంటి వాడివిరా !'' ముసలాడన్నాడు.

నేలమీదనుంచి పట్లామునీ, కోటునీ తీసికొని తొడిగి, నడుంచుట్టూ వొక పట్టీగట్టి, వొక మట్టి పాత్రలోంచి కాసిన్నీళ్ళ తనచేతులమీద పోసు కొని, తన పాతపట్లాంమీద ఆ చేతులు తుడుచుకొని, వొక చిన్నదువ్వెన్తో గడ్డందువ్వుకొని, అతను లూకాముందు తయారయ్యేడు. ''తయార్ !'' అన్నాడతను.

లూకా వొక గిన్నె తీసుకొని తుడిచి దాంట్లో ద్రాక్షసారా నింపి ముసలాడి కందించేడు.

''యిదుగో నీ ఆరోగ్యంకోసరం తాగుతున్నా'' గంభీరంగా ఆ సారానందుకొంటూ ఐకోష్కా అన్నాడు. ''నీ కోర్కెలన్నీ తీరుగాక, నువ్వు మంచి కోసక్కుగా వుండుగాక, నీకు బహుమతి వచ్చుగాక ! భగ వంతుడి కోసరం, యేసుక్రీస్తు కోసరం !''

లూకా ఆ ప్రార్థన పునరుచ్చరించి కొంచెం తాగి తక్కిన సారాని ఆ మేజాబల్లమీ దుంచేడు. ముసలాడు లేచి వొక యెండుచేపని తెచ్చి, అది మెత్తనవటం కోసం దాన్ని మండిగంమీద పెట్టి కర్రతో కొట్టేడు.

తర్వాత దాన్ని కాయలు గాచిన తన చేతుల్లో తీసికొని, వొక నీలిరంగు పళ్ళెంలో దాన్ని పెట్టి (అతనికున్న పళ్ళెం అదొక్కటే), దాన్ని మేజా బల్లమీదుంచేడు.

''భగవంతుడి దయవల్ల, నాకు కావల్సిన వన్నీ వున్నయ్యి— భోజన పదార్థాలూ అన్నీనూ'' అని అతను సగర్వంగా అన్నాడు. ''భేష్. సరేగాని, మోసీవ్ సంగతేంటి?''

దాన్ని గురించి ముసలాడేమంటాడో చూద్దామనే ఆసక్తి గలిగి, కార్పొరల్ ఆ అబ్రెక్కు తుపాకీని యెలా స్వంతం జేసుకొందీ లూకా అతనికి చెప్పేడు.

''మరేం ఫర్వాలేదు'' అన్నాడు ఇరోష్కా. ''దాన్ని అతని దగ్గరే వుంచుకోనియ్యి; లేకపోతే నీకు బహుమతి రాదు.''

''కాని, ఆ యిచ్చేదే బహుమతని? నావంటి కుర్రకోసక్కుకి యిచ్చేది పెద్దగా ఏమీ వుండదంటున్నారు. కాని, ఆ తుపాకి భలే యమ కంగా వుంది. అది సిసలైన క్రిమియన్ తుపాకి. యెనభై రూబుళ్ళు చేస్తుంది.''

''ఆఁ, పోనిద్దూ సింగినాదమూ! వొకసారి వొక కెప్టెన్‌తో వొక గుర్రాన్ని గురించి యిట్లాంటి తగాదేవచ్చింది. 'దాన్ని నాకివ్వు. నిన్ను కార్నెట్‌ని చేస్తాను' అన్నాడువాడు. నేనివ్వలేదు. కనక నాకేమీ దొరకలేదు.''

''అది నా కర్థమయ్యింది, మామా. నేనొక గుర్రాన్ని కొనాల్సుంది. యాభై వెండి రూబుళ్ళకి తక్కువగాకుండా పోస్తేగాని యేటవతల గుర్రం దొరకదంటున్నారు. మరి మా అమ్మ యింకా దాక్షసారా అమ్మనే లేదు.''

''ఆఁ. సింగినాదం. మా హయాములో మేము అలాంటి విషయాల్ని గురించి అసలు పట్టించుకొనే వాళ్ళమేగాదు'' అన్నాడు ముసలాడు. ''ఇరోష్కా మామయ్యకి నీయీడు వున్నప్పుడు మందలకి మందలు గుర్రాల్ని నోగే మైదానాలనుంచి యేరుదాటించి తోలుకొచ్చేవాడు! వొక్కొక్కప్పుడు మేము వొక చొక్కాకో, గ్యాలన్లో నాలుగోవంతు సారాకో మంచి గుర్రాన్ని గూడా అమ్మేసేవాళ్ళం.''

''అంత చాకగా యెందుకనీ ?''

''నువ్వు దద్దమ్మవిరా, మార్క్'' ఇరోష్కా అసహ్యంతో అన్నాడు. ''అసలు దొంగతనం చేసేదే అందుకురా—పీనాసిగా వుండ కుండేందుకు. యిక మీ కుర్రాళ్ళసంగతి: వొక మంద గుర్రాల్ని తోలుకు రావట మెట్లాగో మీ రెప్పుడూ చూచి వుండరనుకొంటా, ఆ ? మాట్లాడ వేమిరా ?''

''యేం మాట్లాడను ? మేము మీ యంటి మనుషులం గాదల్లేవుంది.''

''నువ్వు దద్దమ్మవిరా, మార్క్, అంతే నువ్వు!'' 'మీ యంటి మనుషులు !' వ్రహూంః. నిజంగా అలాంటివాళ్లుగాదు. నీవయస్సప్పుడు నేను నీలాంటి కోసక్కుని కానేకాదు. నేను నిరాడంబరంగా వుండేవాణ్ణి. యెవరేదడిగినా గొణుక్కునేవాణ్ణిగాదు. అందువల్లనే నేను ఛెఛెన్ జనం అందరితోనూ క్యునాక్ గా వుండేవాణ్ణి. వాళ్లెవరైనా నన్ను చూడటాని కొస్తే అతనికి బాగా తాగబోయించి అతనికి సంతోషంగా వుండేట్లుచేసి నా మంచంలో పడుకోనిచ్చేవాణ్ణి. యిక నేను అతన్ని చూడటానికెళ్తే వెంబడి యేదన్నా పట్టుకెళ్ళేవాణ్ణి. అసలు, మర్యాదంటే అదీ. అంటే యీ రోజుల్లో మీరు చేస్తున్నది గాదు. యీ రోజుల్లో మీ సంబడమంతా యేమిటంటే గింజలు వొలవటం పొట్టుని వూసెయ్యటం'' యీ నాడు కోసక్కులు గుమ్మడి గింజల పొట్టు నెలా వూస్తారో అనుకరించుతూ, ముస లాడు చెప్పటం ముగించేడు.

''అవును. నాకు తెలుసు'' అన్నాడు లూకా.

''భేష్. నువ్వు సరైన మనిషివవ్వాలంటే జిఘిత్ వవ్వు. అంతేగాని రైతు వవ్వమాక. రైతు గుర్రాన్ని సంపాదించే దలాగే: ముందు డబ్బిచ్చి తర్వాత తీసుకొంటాడు.''

ఇద్దరూ కాసేపు నిశ్శబ్దంగా వూరుకొన్నారు.

''అవును, మామా, వూళ్లోనూ ఆఫీసువద్దా యేమీ బాగుంటంలేదు. మరికొస్త జల్సా చెయ్యాలంటే పోయే చోటేలేదు. మనవాళ్ళంతా పిరికి రకం. నాజరు సంగతే చూడుమరి. మొన్నీమధ్య గుర్రాలు కొన్నిట్ని తోలటానికి గిరీఖాన్ తనతోపాటు యెవర్నన్నా నోగేకి రమ్మన్నాడు. యెంత చెప్పినా నాజరు వినలా. యిక నేనొక్కణ్ణే పోయేదెలాగు ?''

"అయితే నువ్వు నన్ను గురించి ఆలోచించలా. అంతేగా? నేను ముసలాణ్ణని నీ వుద్దేశ్యం. కాదురా అబ్బాయ్, నేను ముసలాణ్ణిగాదు. నా కో గుర్రాన్నివ్వు. వొక్క-దెబ్బని నోగకి పోతా."

"పోతావు, పోతావుగదూ?" చిరునవ్వు నవ్వుతూ లూకా అన్నాడు. "గిరీఖాన్ వ్యవహారంలో నన్నేం చెయ్యమంటావో చెప్పటం మంచిది. 'టెరెక్ వద్దకి గుర్రాలు కొన్నిటిన్ని పట్టుకురా. నే నాటిని తీసుకుంటా— వొక మంద మందని తోలుకొచ్చినాసరే' అని అతనంటాడు. కాని, బోడిబుర్ర ఛెఛెన్‌ని నమ్మేదెలాగు?"

"గిరీఖాన్‌ని నువ్వు నమ్మొచ్చు. యేంఫర్వాలా. అతని కుటుంబమంతా మంచివాళ్ళు. అతని తండ్రి నాకు ముఖ్య స్నేహితుడు. కాని, చెప్పేది విను. నే నీ్నకు చెడు అనేది చెప్పను: అతన్ని వొట్టు పెట్టుకొనేట్లు చెయ్యి. వొట్టుపెట్టుకున్నాడా యిక అంతా బాగా జరిగిపోతుంది. యిక అతన్తో కలిసి వెళ్ళేప్పుడు పిస్తోలు తయారుగా వుంచుకో. ప్రత్యేకంగా, గుర్రాల్ని పంచుకొనేప్పుడు మరీ జాగర్తగా వుండాలి. వొకనాడు వొక ఛెఛెన్ని గుర్రాన్ని కొకదానికి పది రూబుల్లియ్యమంటే వాడు నన్ను చంపినంత పనిచేశాడు. ధోకా లేకుండా గిరీఖాన్‌ని నమ్ము. కాని తుపాకి లేకుండా మాత్రం నిద్రపోమాక."

లూకా శ్రద్ధగా వింటున్నాడు.

"యిటుచూడు, మామా" అని అతను వొక్షణం ఆగి అన్నాడు. "నీ దగ్గిరేదో మంత్రపు మూలిక వుందంటున్నారు, నిజమేనా?"

"వొట్టిది. నా దగ్గరదేమీ లేదు. కాని దాన్ని సంపాదించే దెలాగో నీకు చెప్పగలను. నువ్వు మంచి కుర్రాడివి. నీ మామని మరిచిపోవు. చెప్పనా మరీ?"

"వూం. చెప్పు మరీ."

"భేష్. తాబేలంటే యేమిటో నీకు తెలుసుగామా? అది అద్భుతమైంది, తాబేలంటే."

"తాబేలంటే నే నెరుగుదును."

భేష్. పోయి దాని గూడు కనుక్కొని దాని చుట్టూ చిన్నకంచె అల్లు అది లోపలికి పోకుండా. అది గూడు దగ్గిర కొచ్చినపుడు దానిచుట్టూ తిరిగిచూసి, ఆ కంచెని పగలగొట్టటానికి మంత్రపు గడ్డికోసరం వెళ్ళుతుంది. కనక మర్నాటి పొద్దున్నే వెళ్లి చుట్టూచూడు. కంచె యెక్కడ విరిగి వుందో మంత్రపుగడ్డి అక్కడుంటుంది. దాన్ని తీసుకొని యెక్కడికెళ్ళాల నుంటే అక్కడికెళ్ళు. యిక తాళం గీళం, తలుపూ గిలుపూ నిన్నేది ఆపలేదు.''

''నువ్వెప్పుడైనా అది చేసి చూశావా ?''

''వుహూఁ. చూడలా. కాని, ఆ సంగతి నాకు నమ్మకంగలవాళ్ళు చెప్పారు. గుర్రమెక్కేప్పుడు 'నమస్కారం నీకు' అని ఆ వాక్యమంత్రం మాత్రం వుపయోగించేవాణ్ణి. యిక చూడూ, నన్నెవరూ యెప్పుడూ చంప లేకపోయారు.''

''అఁ. 'నమస్కారం నీకు' అంటే యేమిటి మామా ?''

''యేమిటీ, నువ్వెరగనే యెరగవూ ? యేం మనుషులంట, యేం మనుషులు ! అవును, నీమామ నడగటం మంచిపనే. భేష్. శ్రద్ధగా వింటూ నే నన్నాక అను.

నమస్కారము నీకు సియోన్ను నివాసి
నీరాజ్ఞ యిడుగోను నీవు గనవయ్యా
మా గుర్రములమేము మరి యెక్కేదాము
శోకిస్తు వున్నాడు సోఫోనియస్సూ
మాటాడుతున్నాడు మరి జక్కరయ్యా

... ... ... ... ... ... ... ... ...

అని ముసలాడు పాడి, ''యిప్పుడు తెలిసిందా అది నీకు ? నువ్వు కానీయ్ యిక.'' లూకా నవ్వేడు.

''అయితే మరి అందుచేతనే వాళ్ళు చంపలేదంటావా యేమిటీ ?''

''మీరంతా మహా తెలివిగలాళ్లయ్యారా అబ్బాయ్. దాన్ని నేర్చుకొని చూడు. దాని వల్ల మేలు జరక్కపోయినా కీడేమీ జరగదు.''

అని ముసలాడు తన వంతుగా తాను నవ్వేడు.

“ఆఁ. నీకు మరోవిషయం చెపుతారా, లూకా: గిరీఖాన్‌తో కలిసి పోమాక !”

“యెందుకనీ ?”

“కాలవఁంతా వొకటిగా లేదు. మీరూ వొకటిగా లేరు. మీరు దర్బీనుః మనుషులు, కోసక్కు లెంతమాత్రంగాదు. అంతేగాక, మనమీ దొచ్చి పడిన యీ రష్యాసాళ్లని చూడు. నిన్ను బొక్కలో తోస్తారు. నా మాట నమ్ము, లూకా, ఆ వ్యవహారం వదులుకో. ఆ పనులిప్పుడు నువ్వు చెయ్యలేవు. ఇక గిర్చిక్కు నేనూ—మేమూ...........”

అని ముసలాడు అంతూ పంతూ లేని తన కథల్లో వొక కథని యెత్తుకో బోయేసరికి, లూకా కిటికీలోంచి చూసి అతని మాటల కడ్డు వచ్చేడు.

“బాగా తెల్లారింది, మామా, నేను వెళ్ళిపోవాలి. మమ్మల్నొక సారొచ్చిచూడు.”

“భగవంతుడు నిన్నాశీర్వదించుగాక, మార్క్. నేను కూడా బైట కెళ్ళిపోతా. ఆ ఆఫీసర్ని వేటకి తీసికెళ్తానని మాట యిచ్చా. అతను మంచి వాడనుకొంటా.”

# 17

లూకా యింటి కెళ్ళేడు. భూమి నుంచి పైకి లేచిన మంచు పొగ లాంటి ఆవిరి ఆ గ్రామాన్ని కప్పేసింది. పెరళ్లలో పశువులు కదులుతూం డటం వినపడుతోంది. కోళ్ళు పోనుపోను బిగ్గరగా కూస్తున్నాయి. ఆవిరి పొగ క్రమంగా విడిలిపోతోంది. గ్రామస్థులు పడకలమీద నుంచి లేస్తూ న్నారు. లూకా తాను చాలా దగ్గరకొచ్చినాక గాని మంచుతో తడిసిన పెరట్నీ, తలవాకిటి వసారానీ, దడిలేని పాకనీ చూడలేక పోయేడు. గొడ్లల్లో కొయ్యని నరుకుతూన్న ధ్వని దొడ్లోంచి వినవస్తోంది.

లూకా యింట్లో కెళ్ళేడు. అతని తల్లి లేచి పొయ్యిలోకి పేళ్ళు విసురుతోంది. అతని చిట్టిచెల్లెలు యింకా మంచంమీద నిద్రపోతానేవుంది.

"ఆఁ. లూకా, కాలక్షేపం చేశావా ?" అతని తల్లి నెమ్మదిగా అడిగింది. "రాత్రెక్కడ గడిపావ్ ?"

"వూళ్లో." తన తుపాకీని పెట్టెలోంచి తీసి దాన్ని జాగ్రత్తగా పరీక్షజేస్తూ, లూకా అయిష్టంగా జవాబిచ్చేడు.

అతని తల్లి తలవూపింది. లూకా తుపాకి చెవి పళ్లెంలో తుపాకి మందు కొంతపోసి, వొకచిన్న సంచిలోంచి కొన్ని తూటాల డొలపరాలు తీసి, జాగర్తగా ఒక్కొక్క డొలపరంలోనూ గుడ్డపేలిక చుట్టిన గుండు వేసి, మూసివెయ్యసాగేడు. తర్వాత నాటిని తనపళ్లతో పట్టిచూసి సంచిని కిందబెట్టేసేడు.

"స చేలం బాగుచెయ్యమని చెప్పా నీకు. చేశావా ?" అని అతనడిగేడు.

"రాత్రి స్టెపాకా యేదో బాగుచేస్తూవుంది. యేం, నువ్వు సరాసరి వెళ్లిపోతున్నావా అక్కడికి? నిన్ను సరిగా చూడనేలేదుగందరా !"

"పనైపోయిన వెంటనే నేను వెళ్లిపోవాలి" మందు సంచి మూతి కట్టుతూ లూకా జవాబిచ్చేడు."స్టెపాకా యెక్కడుంది? అప్పుడే బయటికి వెళ్ళిందా? "

"అది షేళ్లు పగలేస్తూ వుండుండాలి. నిన్ను చూడలేనేమోనని పాపం రోజురోజంతా దానిపని కిందిట్టు మీదిట్టుగా వుంది. యిదుగో యిట్లా చేతిని ముఖానికి పెట్టుకొని నాలిక కలుక్కుమనిపించి, యెంత పాపిష్టిదాన్ని అన్నట్టుగా రెండు చేతులూ గుండెల కదుముకొంటుంది. పోయి దాన్ని తీసుకురానా? అదిన్నూ, ఆ అబ్బెక్కు సంగతంతా అది అర్థంచేసుకొన్నది."

"ఆఁ. తీసుకురా. కొవ్వుగూడా కొంతపట్టుకురా, పట్టా కత్తికి పూయాలిదాన్ని."

ఆమె బయట కెళ్లిపోయింది. కొద్ది నిమిషాల తర్వాత చెవుడూ మూగతనం వున్న లూకా అక్క కిర్రు కిర్రు మనే ఆ యింటి మెట్లెక్కి లోనికొచ్చింది.

ఆమె లూకాకంటే ఆరేళ్ళు పెద్దది. ఆమె ముఖంలోవున్న మాంద్యమూ, చెవిటి, మూగవాళ్లకి సహజమైన ముఖాన్ని అతిగా వికృతంగా

పెట్టటమూ లేకపోతే ఆమె అచ్చం అతనిలాగే వుండేది. ఆమె వేసుకొనే దుస్తులన్నీ వొక అతుకువేసిన ముతకచొక్కా, తలచుట్టూవున్న వొక పాత నీలిరంగు రుమాలు మాత్రం. ఆమె పాదాలు దిగంబరంగా, మురికిగా వున్నాయి. ఆమె మెడనీ, చేతుల్నీ ముఖాన్నీ మగనాడికిమల్లే నరాలున్నాయి. ఆమె రూపమంతా ఆమె యెప్పుడూ మగవాడు చేసే బండ చాకిరీ చేస్తూంటుందని తెలుపుతోంది.

ఆమె వస్తూ వస్తూ వొక వాటెడు పేళ్ళు తెచ్చింది. వాటి నామె పొయ్యిపక్కన పడేసింది. తన తమ్ముణ్ణి చూడగానే ఆమె ముఖం చిరునవ్వుతో ముడుతలు పడింది. అతని వద్దకి పరుగెత్తి, భుజంమీద చేత్తో తట్టి, చేతుల్తోనూ ముఖంతోనూ మొత్తం శరీరమంతటితోనూ ఆమె వడి వడిగా యేవో సైగలు చేయ నారంభించింది.

''సరేలే, సరేలే,'' అని లూకా తల నాడించేడు. ''స్టెపా మంచిపిల్ల. అన్నీ తెచ్చింది, అన్నీ బాగుచేసింది. చాలా మంచిపిల్ల. యిదుగో నీకో తాయం.''

తన జేబులోంచి రెండు అల్లపు మిఠాయి ముక్కలు తీసి ఆమె కిచ్చేడతను.

స్టెపా ముఖం ఆనందంతో జేవురించింది. వికారపు టరుపుతో ఆ ముక్కల్ని గట్టిగా పట్టుకొని, యెక్కువగా వొకదిక్కుకి చూపుతూ, మొద్దుపాంటి తన వేలితో ముఖానా కనుబొమలమీదా గీచుకొంటూ, మరింత వడిగా అభినయం చేయమొదలెట్టింది. ఆమె చెప్పేది లూకా, అర్థంచేసుకొని కొద్దిగా చిరునవ్వు నవ్వుతూ తల నాడించేడు.

ఆ మిఠాయిని ఆడపిల్లల కిచ్చి వుండాల్సిందనీ, ఆడపిల్ల లతన్ని ప్రేమిస్తున్నారనీ, అందర్లోకీ అందగత్తెయిన మేరియానాగూడా అతన్ని ప్రేమిస్తూందనీ, ఆమె అంటోంది. విసురుగా మేరియానా యింటిదిక్కుకు చూపి, తర్వాత తన కనుబొమల్నీ ముఖాన్నీ చూపి, పెదిమలు చప్పరించి తల ఆడించి, మేరియానా అన్నట్లు ఆమె సైగజేసి చెప్పింది. చేతుల్ని గుండె కదుముకొని, చేతిని ముద్దెట్టుకొని, యెవర్నో గట్టిగా కావలించుకొన్నట్లు చేస్తూ, ''ప్రేమ'' అనేదానికి సైగజేసి చెప్పింది.

తల్లి గదిలోకి తిరిగొచ్చి, ఆ పిల్ల యేం చెప్పటానికి ప్రయత్ని స్తోందో గమనించి చిరునవ్వు నవ్వి, తల వూపింది. స్టెపాక్కా ఆమెకి అల్లపు మిఠాయి చూపి, తిరిగీ ఆనందంతో బొబ్బరించింది.

"పెళ్లికుదిర్చే పెద్దల్ని పంపుతానని కొర్నెట్ భార్యతో అన్నా నేను. ఆమె దాన్ని బాగానే తీసికొంది."

లూకా మెదలకుండా ఆమెవంక చూసేడు.

"సరే. మరి సారా అమ్మేమాటేమిటి?" కొంచెంసేపైనాక అత నన్నాడు. "నేనో గుర్రాన్ని కొనాలి."

"వీలు చిక్కగానే దాన్ని తీసికెళ్తా. ముందు పీపాలు తయారుగా వుంచుకోవాలి" సంసారపు గొడవల్లో వేలు పెడుతున్నాడనే గుర్తింతో, అతనితల్లి ముక్తసరిగా సమాధాన మిచ్చింది. "నువ్వు బయటకి పోయే ప్పుడు నీకొక సంచి కనపడుతుంది. నువ్వక్కడికి పట్టుకెళ్ళేందుకని అవీ యివీ కొన్ని పక్కింటాళ్ళనుంచి బదులు తెచ్చాలే. నువ్వు పెడతావా, లేక నేనే పోయి దాన్ని జీను సంచిలో పెట్టనా?"

"యేంఫర్వాలా. నేనే తీసుకెళ్తాలే" అని లూకా అన్నాడు. "ఆఁ. సరేగాని, గిరీఖాన్ వస్తే అక్కడికి రమ్మని చెపుతావా? అతన్తో నాకు మాట్లాడాలిసిన పనుంది. నేనిక్కడే వుంటానికి నా కింకా శలవివ్వ రిప్పుడు."

వెళ్లిపోటానికి అతను తయారవ్వసాగేడు.

"సరే. అతన్ని పంపుతాలే" అతని తల్లి అంది. "అయితే యామ్కా యింట్లో తాగుతూ కాలమంతా వెళ్ళబుచ్చావన్నమాట? రాత్రి గొడ్లకి మేతదీ సర్దటానికి బయటకెళితే పాటలు పాడుతూ నీగొంతు వినిపించింది."

లూకా సమాధాన మేమీ యివ్వలేదు. నడవలోకెళ్లి, సంచులు భుజాన పడేసి, కోటు పైకి మడిచి, తుపాకి తీసికొని, సందేహిస్తూ అతను మండిగంమీద ఆగిపోయేడు.

"శెలవు, అమ్మా. నాజరుకిచ్చి నాకో చిన్నపీపాడుసారా పంపు. అక్కడి కుర్రాళ్ళ కిస్తానని మాట యిచ్చా. నాడొచ్చి అడుగుతాడులే అసలు."

''దేముడు నిన్ను చల్లని చూపు చూచుగాక లూకా! కొత్తపీపా లోది కొంత పంపుతాలే'' గేటువరకూ కొడుకుతో గలిసివెళ్తూ ఆమె జవాబిచ్చింది. ''ఆఁ, యింకోసంగతి'' అని, కంచెమీదకి వంగుతూ, ఆమె అంది.

లూకా ఆగేడు.

''నువ్వు జల్సా చేస్తున్నావు. సరే—అది మంచిదే. కుర్రతనంలో జల్సా తప్పదు. దేముడు దయవల్ల నువ్వు అదృష్టమంతుడివయ్యావు, అదీ మంచిదే. కాని, జాగ్రత్తరా అబ్బాయ్. అతిగా పోమాక. అన్నిటి కంటే ముఖ్యం మీఆఫీసరు మెచ్చుకునేట్లుగా నడుచుకో. యిక నేను సారా అమ్మేసి నువ్వు గుర్రాన్ని కొనటానికి కావాల్సినడబ్బు కూడబెడతా. పెళ్లిగూడా కుదుర్చుతా—''

''సరేలే, సరేలే'' ముఖం చిట్లిస్తూ లూకా ఆమె మాటల కడ్డు తగిలేడు.

అతని దృష్టి నాకర్షించటానికి ఆ చెవిటిపిల్ల అరిచింది. బోడిగుండును—ఛెఛెన్‌ని—చూపటం కోసం ఆమె తన తలచూపి తర్వాత తన అరచేతిని చూపింది. తర్వాత భయంకరంగా ముఖం చిట్లిస్తూ తుపాకితో గురిచూస్తున్నట్లు నటించుతూ, కీచురుమని అరిచి, తల అటూ యిటూ వూపుతూ, ఆమె హుమ్మన సాగింది. మరో ఛెఛెన్‌ని చంపమని ఆమె తన తమ్ముడికి సైగ చేస్తోంది.

లూకా చిరునవ్వు నవ్వి విసురుగా, సునాయాసంగా నడుస్తూ వెళ్ళిపోయేడు. చూస్తుండగానే అతను ఆ దట్టమైన పొగమంచులోకి అంతర్థాన మయ్యేడు.

అతని తల్లి ఆ గేటువద్ద కొంచెంసేపు నిలబడి, తర్వాత నిశ్శబ్దంగా యింటికి తిరిగొళ్లి, పనిచేయ మొదలెట్టింది.

# 18

అదేసమయంలో ఇరోష్కా-మామయ్య తన కుక్కల్ని ఈలవేసి పిలిచి, కంచె మీదగా దాటేడు. తాను వేటకెళ్ళేప్పుడు ఆడవాళ్ళ యెదు

రాటమనేది అతనికి అయిష్టం. అందువల్ల యిళ్ల వెనక భాగాల పక్కగా అతను ఓలెనిన్ మకాంలోకి చేరుకొన్నాడు.

ఓలెనిన్ నిద్రపోతున్నాడు. ఐవాన్ మేలుకొనే వున్నాడు గాని యింకా మంచంలోనే వున్నాడు. ఇరోష్కా వీపువెనకాల తుపాకి వేళ్లాడేసి, పూర్తి వేటగాడి దుస్తుల్తో సరంజాంతో తయారై తలుపు తెరిచేసరికి, ఐవాన్ మంచం దిగుదామా వద్దా అని మథన పడుతూ, చుట్టూ చూస్తున్నాడు.

''ఆయుధాలు పట్టండి!'' అని ఇరోష్కా వోండ్ర పెట్టేడు. ''ప్రమాదం! శత్రువులు వచ్చి పడ్డారు! ఐవాన్, మీ యజమానికి టీపాత్ర పొయ్యిమీద పడెయ్యవోయ్. యిక నువ్వు, దబ్బునిలెగువ్. ఆఖరికి ఆడపిల్లలుగూడా యెప్పుడో లేచారుగదోయ్. కిటికీలోగుండా కాస్త అటు చూడు. అదుగో ఒక పిల్ల నీళ్ళు తేబోతూంది. మరి మీరేమో యింకా నిద్రపోతూనే వున్నారు.''

ఓలెనిన్ గభీమని లేచి మంచంలోంచి కిందకు దూకేడు. ఇరోష్కా కంఠధ్వని వినగానే అతనికి హాయిగావుంది.

''త్వరగా. దబ్బున కానియ్, ఐవాన్'' అత నరిచేడు.

''అయితే నువ్వు వేటకెళ్ళేది యీరకంగానే నన్నమాట?'' అన్నాడు ముసలాడు. ''జనం అన్నాలు తింటున్నారు. మరి నువ్వేమో యింకా నిద్రపోతూనే వుంటివి. లాం! యెక్కడున్నావే?'' అని తన కుక్కని పిలిచేడు. ''నీ తుపాకి తయారుగా వుందా?'' అని అతను బిగ్గరగా అరవసాగేడు, ఆ గదిలో వొక గుంపెడు మంది వున్నట్లు.

''తప్పు నాదేనని వొప్పుకొంటా'' అన్నాడు ఓలెనిన్. ''తుపాకి మందూ ఆ తుక్కు కాగితా లన్నీ మరచిపోమాక!''

''జుల్మానా!'' అని కేకబెట్టేడు ఇరోష్కా.

దానిమీద ఐవాన్ ఫ్రెంచి భాషలో యేదోఅంటే, ''యేమిటా లొడబిడ? నువ్వు మాలో మనిషివిగాదురా భూతం!'' అని గొగ్గిపళ్లతో యికిలిస్తూ ఇరోష్కా అన్నాడు.

''నన్నొదిలెయ్యవా మరీ? యిది నా ప్రశ్నమ తప్పిదంలే'' బూట్లు తొడుగుతూ ఓలెనిన్ అన్నాడు.

''సరే. యీసారికి క్షమించి విడిచిపెడుతున్నా'' ఇరోష్కా అరిచేడు. ''యిదే పని మళ్ళీ యింకోసారి చేశావా అంటే వొక బొక్కెన్ల సారా నీకు జుల్మానా వేస్తా. చూడూ, పొద్దెక్కిందంటే యిక దుప్పులు కనపడవు.''

''ఐనా, మన కొకటి కనపడినా, అది మనకంటే తెలివి తేటల్తో తప్పించుకొంటుంది'' కిందటి సాయంత్రం ముసలాడన్న మాటల్ని ఉదహరించుతూ ఓలెనిన్ అన్నాడు. ''కనక యెలాగైనా దాన్ని మనం పట్టుకోలేం.''

''కానియ్ నవ్వు, నవ్వు నీ యిష్టమొచ్చినట్టు. ముందు వొకదాన్ని చంపు, తర్వాత కావాల్సినంత నవ్వు కుందువుగాని. కానియ్, పోదాంపద. ఆఁ. అటుచూడు. నీకు యిల్లు యిచ్చిన యింటి యజమాని నిన్ను చూడటాని కొస్తున్నాడు'' కిటికీలో గుండా చూస్తూ, ఇరోష్కాఅన్నాడు. ''అతనివంక చూడు. కొత్త బిష్మెత్ గిష్మెత్ వేసుకొని యెవరో ఆఫీసరనుకొందురుగానని ఫుల్ దరీసులో తయారయ్యేడు. ఛత్, యేం జనం, యేం జనమంట !''

కార్నెట్ విద్యావంతుడు. కొంతకాలం అతను రష్యాలో నివసించేడు. వొకప్పుడు బడి పంతులు వుద్యోగంచేసేడు.అన్నింటికీ మించి అతను మక్కులో వూహించుకొన్నట్లు-పెద్దమనిషి! పెద్దమనిషిగా అగుపించటానికి అతను తన శాయశక్తులా ప్రయత్నిస్తూవుంటాడు. కాని, డంబాచారంగా కనిపించటానికి అతను యెంత తంటాలు పడినప్పటికీ, నటనజేసి నప్పటికీ ఇరోష్కా మామయ్యకంటే అతనేమీ మొనగాడుగాడని అందరూ అనుకొంటారు.యెండకి నల్లబడిన అతని ముఖమూ చేతులూ,అతని యెర్రటి ముక్కూ అదే చూపుతున్నాయి గూడా. ఓలెనిన్ అతన్ని కూచోమని అన్నాడు.

''గుడ్‌మార్నింగ్‌సార్ !'' నుంచుని, ఓలెనిన్ అనుకొన్నట్లు పరిహాసంగా తల బాగావంచి, ఇరోష్కా నమస్కారం చేసేడు.

''గుడ్ మార్నింగ్, మామాయ్. అప్పుడే యిక్కడి కొచ్చావ్ !'' యాదాలాపంగా తలాడించుతూ కార్నెట్ బదులు పలికేడు.

అతనికి నలభై యేళ్ళుంటాయి షుమారు. కోసగా వున్న బూడిద రంగు గడ్డం. బక్కపలచగా, అందంగా వుంటాడు.

తననెక్కడ సామాన్య కోసక్కు అనుకొంటారోనని కార్నెట్ భయపడటం పైకి కనపడుతూనేవుంది. అందువల్ల తన ప్రాముఖ్యతని గురించి ఓలెనిన్‌కి నచ్చజెప్పాలని ఆదుర్దాపడ్డాడు.

''ఈయన మా ఈజిప్షియన్ నింరాడ్ ఆండ్రీ'' ముసలాడివంక చూపుతూ, ఆత్మ సంతృప్తితో చిరునవ్వు నవ్వుతూ అతనన్నాడు. ''భగవంతుడి సమక్షాన ఘనమైన వేటగాడు. మా అందరిలోకీ, అన్ని కార్యాలందూ ముందుంటాడు. తమరింతకుముందు యీయన్ని పరిచయం చేసుకొన్నారా?''

ఇరోష్కా తడిసిపోయిన తన కాలి ఇజారువంక తేరిచూస్తూ కార్నెట్ విద్యకీ,విజ్ఞతకీ ఆశ్చర్యపడినవాడికి మల్లే సాలోచనగా తలవూపుతున్నాడు.

''జిప్షియన్ నింరాడ్! ఆ తర్వాతి?'' అని అతను మెల్లగా సణిగేడు.

''మేమిద్దరం కలసి వేటకు పోతున్నాం'' అన్నాడు ఓలెనిన్.

''అవును సార్, అంతేనండీ'' అన్నాడు కార్నెట్. ''కాని నేను తమరితో వొక చిన్న వ్యవహారమై మాట్లాడాలిసుందండీ''

''యేమిటదీ?''

''మీరు పెద్దమనుష్యులని గ్రహించడంవల్ల,'' అంటూ ఆరంభించేడు కార్నెట్. ''నేను గూడా అద్విషంగానే ఆఫీసరుహోదాలోని వ్యక్తినవడంచేతా, మనమిద్దరం క్రమేణా, అభివృద్ధికరంగా, వొక నిర్ణయానికి రాగలం.'' (అతనిక్కడ ఆగి ఓలెనిన్‌వంక చిరునవ్వుతో చూచేడు) ''నా సమ్మతితో మీరలాంటి భావంతో వుండగలిగినప్పటికీ, మన హోదాకూ వర్గానికీ చెందనట్టి అవివేకురాలైన నా భార్య మన సంభాషణవేళకు, మీ రుచ్చరించిన గత దినం యొక్క తారీఖుయొక్క అర్థమేమిటో గ్రహింపలేకుండావున్నది. పశువుల శాలను మినహాయిస్తే శేషించిన నా గృహాన్ని రెజిమెంటల్ ఏజటంట్‌కి మాసమునకు ఆరురూబుళ్ళు చొప్పున అద్దెకుయివ్వబడవచ్చును. కాని, పెద్దమనిషినగుటవలన అద్దెతీసికొనకుండా యిచ్చేపద్ధతిని నేనాపగలను. కాని, తమరికోర్కె అట్టిదవడంవల్లనూ, నేనుగూడా ఆఫీసరుహోదాకలవానినవడంవల్లనూ, వ్యక్తిగతంగా తమరితో ప్రీతి సమస్యమీదా ప్రీతివిషయముమీదా వొక వొడంబడికకు రాగలను. ఈ ప్రదేశ నివాసి నవడంవల్ల-మా ప్రాంతీయకట్టుబాటులు, ఆచారవ్యవహార

నులు రీత్యాగాకుండా-సాధ్యమైన తలప శక్యమైన ప్రతిమార్గానా నేను తమరి కోర్కెల దీర్చగలను...''

''చాలా భాగా అన్నావ్ పో'' ఇరోష్కా సణిగేడు.

కార్నెట్ ఆ ధోరణిలో చాలాసేపు మాట్లాడేడు. తన గదుల్ని నెలకి ఆరు రూబుళ్ళచొప్పున అద్దె కివ్వాలనుకొంటున్నాడని, చివరికి అతి కష్టం మీద ఓలెనిన్ గ్రహించగలిగేడు. సంతోషంగా అతనందు కొప్పుకొని వొక గ్లాసుడు టీ తన అతిథి కివ్వబోయేడు. కార్నెట్ అక్కరలేదన్నాడు.

''మా బుద్ధిహీనపు ఆచారాల ప్రకారం,'' అని యెత్తుకొన్నాడు కార్నెట్.''ఐహిక సంబంధమైన గ్లాసులోనుంచి తాగడం అనేదిపాపము. నేను నా విద్యాజ్ఞానంవల్ల బాగానే గ్రహించగల్గి నప్పటికిన్నీ, మానవసహజమైన బలహీనతవల్ల నా భార్య—''

''యింతకీ తమరు టీ తాగుతారా లేదా?''

''తమరి అనుమతి తీసికొని నేను నా ప్రత్యేకమైన గ్లాసుతో పుచ్చుకుంటాను'' అని జవాబిచ్చి కార్నెట్ తలుపువద్దకెళ్ళేడు. ''నా గ్లాసు తీసికొనిరా'' అని అత నరిచేడు.

కొద్దిక్షణాల్లో యెండకి నలుపెక్కిన వొక యువతి చేయి వాకిటిగుండా అతనికొక గ్లాసు అందించింది. కార్నెట్ అది తీసికొని తన కూతురుతో యేదో రహస్యంగా చెప్పేడు.

కార్నెట్కి ''ప్రత్యేకమైన'' గ్లాసులోనూ, ముసలాడికి ''ఐహికమైన'' గ్లాసులోనూ ఓలెనిన్ టీ పోసేడు.

''యేది యెలాగైనప్పటికిన్నీ, తమపని కొటంకం గల్గించడం నా అభిమతంగాదు'' పెదిమలు కాలేంత హడావుడిగా ఆ టీ తాగి, కార్నెట్ అన్నాడు. ''నేనున్నూ చేపలు పట్టటమందు పక్షపాతినే. బడలిక తీర్చుకోనటానికి నేను శెలవుపైవున్నాను. టెరెక్ నదియొక్క ఉదారబహుమతి నాకు లభించగలదేమో నా అదృష్టాన్ని పరీక్షించి చూడాలెనని నాకు కోర్కెగాయుంది. తమరు మా గృహానికి విచ్చేసి మా గ్రామ ఆచారమైనట్లు ద్రాక్షసారాయములో లేక, ఛిఖర్‌లో, పాలో పుచ్చుకొందురని నే నాశించవచ్చునా?''

కొర్నెట్ వంగి నమస్కరించి, ఓలెనిన్‌తో కరస్పర్శచేసి, బయటి కెళ్ళేడు.

ఓలెనిన్ వేటకి తయారవుతూంటే, కొర్నెట్ అధికారపూర్వకమైన కంఠస్వరంతో తన కుటుంబానికి పనులు పురమాయించటం వినపడుతోంది.

కొది నిమిషాల తర్వాత, వొక చిరుగుల కోటుతొడిగి, పట్లాంను మోకాళ్లవరకూ మడిచి, వొకవల భుజానవేసి కొర్నెట్ కిటికీ పక్కగా పోతూండటం ఓలెనిన్‌కి అగుపించి.

"యెంత మాదర్చోదూ!" తన "ఐహికపు" గ్లాసులోని టీ పీల్చుతూ ఇరోష్కా అన్నాడు. "నువ్వు నిజంగా వాడికి ఆరు రూబుళ్లిస్తావా యేమిటీ? అంతకేటు యెక్కడైనా వుందా అసలు? రెండు రూబుళ్లిస్తే వూళ్లోకల్లా ఫస్టుక్లాసైన యిల్లు దొరుకుతుంది. ఆరి మాదర్చోదూ! అందాకాయెందుకూ, మూడు రూబుళ్లకి నాయిల్లిస్తా తీసుకో."

"వొద్దులే. నే నిక్కడేవుంటా" అన్నాడు ఓలెనిన్.

"ఆరు వెండి రూబుళ్ళు! నిప్పుపుల్లగీసి తగలేసేంత డబ్బు నీ దగరుండి వుండాలి" ఇరోష్కా గొణిగేడు. "హో, ఐవాన్, తాగటానికేదన్నాయివ్వు"

సుమారు యేడుగంటలకి, కొంచెం తిని కొంత వోడ్కా సారా తాగినాక, ఓలెనినూ ఇరోష్కాకలిసి బైటకెళ్ళేరు. గేటువద్ద వారికో యెడ్ల బండి యెదురైంది. కళ్లవరకూ రుమాలు తలకిచుట్టుకొని, యెత్తుపాంటి బూట్లు తొడుక్కొని, ఎదులు చొక్కామీద బిష్మెత్ తొడిగి, చేతితో వొక పొడుగాంటి కర్ర పుచ్చుకొని, యెడ్ల కొమ్ములకి గట్టిన తాళ్ళు పట్టుకొని, మేరియానా బండిని సాగదోలుకెళ్తోంది.

"ప్రియురాలా!" అని, తన చేతుల్తో ఆమెని వాటేసుకొన్నట్లు నటించుతూ, ముసలాడరిచేడు.

మేరియానా అతనివైపు తన కర్రయెత్తిచూపి, యిద్దరివంకా నవ్వుతూన్న కళ్లతో చూసింది.

ఓలెనిన్‌కి యెప్పటికంటేనూ వుల్లాసంగావుంది.

"సరే రా పోదాం" తుపాకిని భుజానవేస్తూ ఇరోష్కాని పిలిచేడతను. ఆ పిల్ల తననిచూస్తూండటం అతను గమనించేడు.

''ఛలో ఛలో!'' అని మేరియానా అంది. బండి సాగిపోతుంది, కిరకిరమంటూ.

పొగమంచులో సగం వదిలిపోయింది. మంచుకి తడిసిన యింటికప్పులు కనపడుతున్నాయి. తక్కినసగం మంచుబిందువులుగామారి రోడ్డుమీదా కంచెలపక్కనున్న పచ్చిగడ్డిమీద నిలిచివుంది. అన్ని పొగగొట్టాలనుండీ మబ్బులు, మబ్బులుగా దట్టమైన పొగలేస్తోంది. ప్రజలు వూళ్ళోంచి కొందరు పొలాలకీ. మరికొందరు నదికీ, రక్షణ ఆఫీసుకీ వెళ్తున్నారు.

ఓలెనిన్, ఇరోష్కాలు పచ్చిగడ్డి పెరిగి మంచుతో తడిసిన కాలి బాటమీదగా నడుస్తున్నారు. తోకలాడిస్తూ, తమ యజమానులవంక చూస్తూ, కుక్కలు వారి పక్కన పరుగెత్తుతున్నాయి. వేలకొద్దీ చిన్న యీగలు వారిచుట్టూ యెగురుతూ, వారి వీపులమీదా, ముఖాన్నా, చేతులమీదా ముసురుకొంటున్నాయి. పచ్చిగడ్డి వాసనతోనూ, అడివిచెమ్మ వనం వాసనతోనూ గాలి అంతా పరిమళంగావుంది.

కార్నెట్‌ని దుయ్యబట్టటం యింకా వదల్లేదు ఇరోష్కా.

''నువ్వంత కోపంగా వున్నావెందుకని?'' ఓలెనిన్ అడిగేడు.

''వాడొక పిసినిగొట్టు. అదంటే నాకు ద్వేషం. యేమైనా, వాడు చచ్చేప్పుడు అదంతా వొదిలేసి పోవాల్సిందేగదా. మరి యిదంతా యెవరికోసం కూడబెడుతున్నట్లు? రెండు యిళ్ళు కట్టాడు, వొక వ్యాజ్యంలో తన తమ్ముడినుంచి మరో పళ్ళతోట రాబట్టుకొన్నాడు. రాయటంలో గూడా మహా మొనగాడు వాడు! దస్తావేజులన్నీ రాయించుకోడానికి జనం యితర వూళ్ళనుంచి వీడి దగ్గరకొస్తారు. వీడు రాసినట్టుగానే అంతా జరుగుతుంది. అదంతా వాడు సరిగానే రాస్తాడు. మరి యీ డబ్బంతా యెవరికి పోగుచేస్తున్నట్లంట? వాడి కున్నదల్లా వొక్క చిన్న పిల్లాడు. పోతే పిల్లవుందనుకో, అది పెళ్లి చేసుకొని దాని దోవన అది పోతుంది.''

''అలాఅయితే అదంతా ఆ అమ్మాయి కట్నంకోసమయ్యుండ వచ్చు'' అన్నాడు ఓలెనిన్.

''అలాంటి రత్నమంటిపిల్లకి; కట్నం యెందుకు కూలబెట్టనూ? కట్నం లేకుండానే దాన్ని కళ్లు మూసుకొని చేసుకుపోతారు. కాని, అసలు విషయం అది కానేకాదు. షావుకారి కిచ్చి దాన్ని చెయ్యాలని ఆ మాద

ర్చేదు వుద్దేశ్యం. మాంచిబేరం కోసం చూస్తూన్నాడు. వూళ్లో వొక కోస క్కానాడు లూకా అని. వాడు నా మేనల్లుడుత్తే. రత్నంలాంటి కుర్రాడు, మంచి బుద్ధిగలాడు. మొన్న ఆ ఛెఛెన్ని చంపింది వాడే. సరే, వాడు చాలాకాలంగా దానివెంట పడుతున్నాడేగాని యింతమట్టుకి దాన్ని పెళ్లి చేసుకోలేకపోయాడు. యెప్పుడూ యేదోవొక సాకుచెపుతారు: పిల్ల చాలా చిన్నదనీ, అదనీ యిదనీనూ. కాని, ఆ మాదర్చేదు లోపలి వుద్దేశ్యమేంటో నాకు తెలుసు ఐనా, చివరికి లూకాయే నెగ్గుతాడు. వాడు వూళ్లో అందరి కంటే హాటమైన కోసక్కు. నిజమైన జిఘిత్. బందిపోటుని చంపాడు. మెడల్ కొట్టేస్తాడు.''

''అయితే మరి దీనికేం చెబుతావ్?'' అన్నాడు ఓలెనిన్. ''రాత్రి ఆ పిల్ల వొక కోసక్కుని దొడ్లో ముద్దుపెట్టుకోటం నేను చూశా.''

''పోపో!'' అంటూ, ముసలాడరిచేడు.

''ప్రమాణపూర్తిగా మరి!''

''ఆడపిల్లలు మాదర్చేదులు'' దీర్ఘాలోచన చేస్తూ, ఇరోష్కా అన్నాడు. ''యింతకీ యెవరంట?''

''నేను చూడలేదు.''

''వాడి టోపీ యెలావుంది? తెల్లగానా?''

''తెల్లగానే.''

''యెర్రకోటు తొడగలా? వాడు నీ యంత యెత్తున్నాడా?''

''నా కంటె కొంచెం యెత్తరి.''

''మరేం ఫర్వాలా వాడు వాడే!'' ఇరోష్కా పగలబడి నవ్వేడు. ''వాడే, మా మార్కా. అంటే లూకా అన్నమాట. వాణ్ణి మార్కాని పరిహాసానికంటా. వాడే! వాడంటే నాకు ప్రేమ. చిన్నప్పుడు నేనూ వాడికి మల్లే వుండేవాణ్ణి. వాళ్ల సంగతెత్తే అవసరమేంటి? నా సంగతేచూడు. నా ప్రియురాలు తన తల్లీ, వదినా పడుకొనే గదిలోనేపడుకొనేది. ఐనా నేను యెలాగో లోపల దూరేవాణ్ణి. వాళ్ళు పై అంతస్తులో పడుకొనేవాళ్ళు. దాని తల్లి వొక చిల్లంగిముండ—దాన్ని భూతంమింగ! దానికి నే నంటే యెంత మంటో చెప్పతరంగాదనుకో. భేష్, గిర్చిక్‌తో గలిసి వెళ్ళుతూండేవాణ్ణి.

నాడు నా క్స్యనాక్. కిటికీదాకా నక్కి వెళ్ళేవాళ్ళం. నేను వాడి భుజాల మీదెక్కి, కిటికీ తలుపుతోసేసి, లోపలదూరి, చీకట్లో తమషులాట ఆరంభించేవాణ్ణి. అది సరిగ్గా ఆ కిటికీ దగ్గరే వొక బల్లమీద పడుకొనేది. వొకసారి దాన్ని లెగ్గొడుతుంటే దాదాపు అరిచినంత పని చేసింది. అది నన్ను గుర్తుపట్టక "యెవరా మనిషి?" అంది. కానిమాట్లాడేదెలా? అప్పుడే దాని తల్లి కదలటం మొదలెట్టింది. నా టోపీ వెంటనే తీసి దాని నోట్లోకి తోసా. ఆ టోపీ కుట్టు తరహానిబట్టి అదెవరిదో అది గుర్తుపట్టి, నా దగ్గరకి యెగిరొచ్చిపడింది. ఆ రోజుల్లో నేను చెయ్యాని పనే లేదనుకో" చేతిల రీత్యా విషయాల్ని వివరించటమంటే యిష్టంగల ఇరోష్కా అది చెప్పేడు. "అది నా కప్పుడు మీగడా, ద్రాక్షపళ్ళూ, అన్నీ పట్టుకొచ్చింది. ఐనా, నేనుంచుకొన్నది దాన్నొక్కదాన్నే గాదు. అదీ జీవితమంటే!"

"మరి యిప్పుడు సంగతేమిటి?"

"యిప్పుడా? కుక్కపోయిన మార్గాన పోదాం. పక్షిని కొమ్మమీద కూచోనిచ్చి కాల్చి పారేద్దాం."

"నువ్వే నేనైతే, మేరియానా వెంట పడతావా?"

"కుక్కల్ని కనిపెట్టిచూడు. యీ రాత్రి చెపుతాలే ఆ సంగతి" తనకు మక్కువగల కుక్క లాం వంక చూపుతూ, ఇరోష్కా ముక్తసరిగా అన్నాడు.

నిశ్శబ్దంగా వాళ్ళిద్దరూ వోవంద అడుగులు నడిచేరు. తర్వాత ముసలాడు ఆగి బాటకడ్డంగా పడి వున్న వొక పుల్లని చూసేడు.

"యేమనుకొంటున్నావ్? అది వట్టి పుల్లని నీ వుద్దేశ్యం. కాదు. అది చెడుగా పడివుంది."

"చెడుగా యెందువల్ల?"

"హుః. వొక్క సంగతి గూడా నీకు తెలీదు! చెప్పేది విను. పుల్ల అనేది అలా పడివుంటే, దాన్ని దాటగూడదు. చుట్టు తిరిగన్నా పోవాలి, లేదా, దాన్ని తీసి అవతల పారేసి, "భగవంతుడికి, ఏసుక్రీస్తుకి..." అని ప్రార్థన చెయ్యాలి. తర్వాత భగవంతుడి దయవల్ల నువ్వు నీ దారిన

పోనవ్వు. యిక నీ కే ప్రమాదమూ జరుగదు. చాలా కాలం కిందట ముసలాళ్ళు నాకు నేర్పిందదీ.''

''వట్టి చెత్త!'' అన్నాడు ఓలెన్. ''మేరియానాని గురించి కొంత చెపితే అంత మంచిదింకా. అయితే ఆమె లూకాతో వ్యవహారం నడుపుతూందన్న మాట?''

''యిష్!...యిప్పుడు మాట్లాడమాక. చెప్పేది విను'' అని ఇరోష్కా చాలా మెల్లగా అన్నాడు. ''అడివిలో తిరుగుదాం.''

తన మెత్తని చెప్పుల్తో అడుగులేసుకొంటూ దట్టంగా, గుబురుగా పెరిగిన అరణ్యంలోకి పోయే వొక సన్నని బాటవెంట ముందు పోసాగేడు ఇరోష్కా. మధ్య మధ్య ఓలెనిన్ వంక చూడటం కోసం ఇరోష్కా ముఖం చిట్లించి వెనక్కి తిరుగుతున్నాడు. తుపాకీని నిర్లక్ష్యంగా పట్టుకొని బాట మీదకివున్న చెట్ల కొమ్మల్ని చేత్తో సరదాగా పట్టుకొంటూ, ఓలెనిన్ తన బరువుపాంటి బూట్లతో టకటకమంటూ నడుస్తున్నాడు.

''శబ్దం చెయ్యమాకవయ్యా. మెల్లగా నడువు, సిపాయ్!'' కోపగించుకొంటూ ఇరోష్కా పదేపదే రహస్యంగా చెబుతున్నాడు.

గాలి తరహానిబట్టి సూర్యుడు వుదయించాడనీ, అడివిలోకి చొరుచుకు రావటానికి చూస్తున్నాడనీ కనపడుతోంది. పొగమంచు విడిలి పోతోంది గాని అదంకా చెట్ల శిఖరాలమీద కప్పివుంది. అరణ్యం అతియెత్తుగా వున్నట్లు అగపడుతోంది. అడుగడుక్కీ మార్పులు కనపడుతున్నాయి. చెట్టని అనుకొన్నది పొద అవుతోంది, రెల్లుదుబ్బు చెట్టులాగా అగపడుతోంది

## 19

అరణ్యంలో అంతా ప్రశాంతంగా వుంది. వూళ్ళోని సందడేమీ ఆ వేటగాళ్ళ కిప్పు డెంతమాత్రం వినపడటంలేదు. పక్షుల కూతలూ, కుక్కలు పొదలోంచి పోతూంటే పొదచేసే చిటపటలూ మాత్రమే వినవౌతున్నాయి.

అరణ్యం సురక్షితమైంది కాదని ఓలెనిన్‌కి తెలుసు. అటువంటి చోట్ల అబ్రెక్కులు దాక్కొంటారు. అంతేగాదు, కాలినడకతో పోయే మనిషికి తుపాకి వుంటే మంచిరక్షణ అని గూడా అతనికి తెలుసు. అంటే తనకు తానై భయపడ్డాడనిగాదు దానర్థం; తన స్థానంలో యింకొకరుంటే భయపడి వుండేవారని అతననుకొన్నాడు. పొగమంచు ఆవరించివున్న అరణ్యంలోకి అతి కష్టంమీద చూస్తూ, తన చుట్టూ వింతగా అస్పష్టంగా మెల్లగా వినపడుతూన్న ధ్వనుల్ని వింటూ, వొక నూత్నోల్లాసంతో తన తుపాకీ నతడు గట్టిగా పట్టుకొంటున్నాడు.

జంతువుల పాదాలజాడ కనపడుతూన్న ప్రతి బురద నీళ్ల గుంటవద్ద పరిశీలించటానికి ఆగి, వాటిని ఓలెనిన్‌కి చూపుతూ, ఇరోష్కా యింకా ముందు పక్కనే నడుస్తున్నాడు. చాలా అరుదుగామాత్రమే అతను మాటాడుతున్నాడు మధ్యమధ్య మాత్రం మెల్లగా వొక మాట అంటు న్నాడు. వారు నడుస్తూన్న బాటని వొకప్పుడు యెడ్లబళ్ళు పోయేవి. యిప్పుడది పచ్చిగడ్డితో పెరిగివుంది. వారికి రెండు పక్కలా వున్న అరణ్యం చూడరానంత దట్టంగా వుంది. దాదాపు ప్రతిచెట్టునీ అడవి ద్రాక్షతీగెలు పైనించి కిందదాకా చుట్టుకొని వున్నాయి. నల్లటి తీగె పొదలు నేలనిండా వొత్తుగా కప్పివున్నాయి. చెట్లు లేకుండా ఖాళీగా వున్న ప్రతిచోటా వొత్తుగా వాకపళ్ళ పొదలూ, బూడిదవర్ణపు తలకుచ్చు లున్న రెల్లుదుబ్బులూ పెరిగివున్నాయి. అక్కడక్కడా లోతుగా దిగి వున్న పెద్దగిట్టల గుర్తులూ, జీబంజీవక పక్షుల కాలిజాడలూ కలిసి ఆ పొదల్లోకి పోయిన చిన్న సొరంగాల్లాగా వున్నాయి. అంతకు ముం దెన్నడూ యిలాంటివేమీ ఓలెనిన్ చూచివుండలేదు. యిప్పుడీ అంటీ ముట్టని అరణ్యంయొక్క విస్తారతనిచూసి అతను ఆశ్చర్యమొందేడు. దానిలో దాగివున్న ప్రమాదాలు, వింతగా గుసగుసమనే ముసలాడు, మేరియానాయొక్క అద్భుత ఆకారం, ఆ పర్వతాలు—అన్నీ అతని కొక స్వప్నంలాగా వున్నాయి.

''వొక పక్షి యిప్పుడే వచ్చి కూచుంది'' ఓలెనిన్ వంక తిరిగి చూస్తూ, తన టోపీని ముఖంమీదకి లాక్కొంటూ, ముసలాడు రహస్యంగా అన్నాడు. ''వూఁ. త్వరగా నీ ముఖం కప్పుకో. జీబంజీవక పక్షులకి మనిషి ముఖమంటే అయిష్టం.''

...హానంతో అతను చేయివూపి, కాళ్లూ చేతుల్లో ముందుకి పాకి పోసాగేడు. మళ్ళీ అంతలోనే హఠాత్తుగా నిలబడి వొక చెట్టుని పరీక్షగా చూడ మొదలెట్టేడు. చెట్టుమీద కూచున్న వొక మగ జీవంజీవకపక్షి తనని చూసి కింద మొరుగుతూన్న కుక్కకేసి కొక్కొ కొక్కొమని అరుస్తోంది. ఓలెనిన్ దానివంక చూస్తున్నంతలోనే ఇరోష్కా బ్రహ్మాండమైన తుపాకీను డి చెవులు దిబ్బెళ్ళు పడిపోయేంత మోత వినపడింది. ఆ పక్షి ఈకలు రాల్చి పైకి టపటపమని యెగిరి తర్వాత కింద పడిపోయింది. ఓలెనిన్ దానికోసం వెళితే మరో పక్షి యితన్ని చూసి కదిలింది. అతను గురిచూసి కాల్చేడు. అది పైకి యెగిరి కొమ్మలకి తగులుకొంటూ చివరికి నేలమీదపడింది.

"భల్ భేషుగ్గా కొట్టావుపో!" ఇరోష్కా అరిచేడు. యెగురుతూన్న పక్షిని అతనెప్పుడూ కింద పడగొట్టలేకపోయేడు.

వాళ్లు పక్షుల్ని తీసికొని ముందుకి సాగేరు. తన విజయానికీ, ముసలాడి పొగడ్తకీ బాగా వుత్సాహం గలిగి ఓలెనిన్ అదేపనిగా మాటాడ మొదలెట్టేడు.

"భేష్, భేష్." ఇరోష్కా అతని మాటల కడ్డు తగిలేడు. "యిక మన మిప్పుడు యిటువెళ్దాం. యిక్కడొక దుప్పి జాడ నిన్న చూశా."

వాళ్లు పొదల్లోకి తిరిగి తంటాలుపడి వొక మూడొందల అంగల దూరం పోయినాక చెట్లులేని వొక ఖాళీ ప్రదేశానికొచ్చేరు. అక్కడ కొంత భాగంలో నీరూ, కొంత భాగంలో రెల్లుదుబ్బులూ వున్నాయి. ఇరోష్కా ముందుకు వంగి, భావగర్భితంగా తల నాడించి తనకి చేత్తో సైగ జేసినప్పుడు, ఓలెనిన్ అతనికి యిరవై అంగల వెనకాల వున్నాడు. అతను ముసలాడి దగ్గరకి రాగానే, ముసలాడొక మనిషి కాలిగుర్తుని చూపేడు.

"చూశావా!"

"ఆఁ. అయితే యేమిటంట?" శాంతంగా వుండటానికి ప్రయత్నిస్తూ, ఓలెనిన్ అడిగేడు. "యిటుగా యెవరో మనిషి వెళ్ళాడు."

కూపర్ రాసిన "మార్గశోధకుడు" అనే గ్రంథంలోని విషయాలూ, అబ్రెకులూ ఓలెనిన్ మనస్సులో తళుక్కుమని మెరిసినాయి. కాని ఇరోష్కాయొక్క నిగూఢమైన ప్రవర్తన చూసి యేదైనా అడగటాని కతను

సందేహించేడు. అందువల్ల, యీ వింత ప్రవర్తన ప్రమాదం జరుగుతుందనే భయంవల్ల వచ్చిందా లేక వేట వుషారువల్ల వచ్చిందా అని సందేహిస్తూ అతను మెదలకుండా వూరుకొన్నాడు.

"యెజ్బ్. యిది నా కాలిగుర్తే." కొంచెమాగినాక ఇరోష్కా ప్రశాంతంగా అన్నాడు. తర్వాత వొక గడ్డికింద కనపడీ కనపడకుండా వున్న వొక జంతువు పోయిన జాడని చూపేడు.

ముసలాడు ముందుకు సాగుతూంటే, ఓలెనిన్ అతని ననుసరించేడు. వారికి యిరవై అంగల ముందున వొక చెట్లగుంపుంది. అక్కడ నలుపక్కలకీ పెరిగి వ్యాపించుతూన్న వొక పియర్ చెట్టుంది. ఆ చెట్టుమొదట్లో గడ్డీ గాదం యేమీ లేదు. అక్కడ నల్లటినేల మీద దేనిదో పేడ స్పష్టంగా కనపడుతోంది. అడవి తీగెలు చుట్టుకొని ఆ స్థలం హాయిగా, చీకటిగా, చల్లగా వున్న వొక లతాగృహంలాగా వుంది.

"అది యివాళ పొద్దున యిక్కడ కొచ్చింది" నిట్టూర్చుతూ ఇరోష్కా అన్నాడు. "చూడు అది పడుకున్న చోటింకా తడిగా, యిప్పుడే పడుకొని లేచి పోయినట్లుగావుంది."

హఠాత్తుగా, వారికి పది అంగలముందునే బ్రహ్మాండమైన ఫెళఫెళ శబ్దం వినబడింది. ఇదరూ వులిక్కిపడి తమ తుపాకులు గట్టిగా పట్టుకొన్నారు. కాని, వారికేమీ కనపడలేదు. చెట్లకొమ్మలు విరగటంమాత్రం వినపడుతోంది. ధడఫడమని విసురుగా పరుగెత్తుతూన్న గిట్టలధ్వని వారికో క్షణంపాటు వినపడింది. తర్వాత ఆ శబ్దం దూరపు వురుములాంటి ధ్వనిగా మారిపోయి నిశ్శబ్దంగావున్న ఆ అరణ్యంలో విశాల ప్రదేశంలో మారుమోగ సాగింది.

ఓలెనిన్ గుండెలో యేదో కళుక్కు మన్నట్లుంది. పచ్చగావున్న ఆ కీకారణ్యంలోకి అతను కళ్లు పొడుచుకొని చూసేడు. యేమీ కనపడలేదు. తర్వాత యిటు తిరిగి ఇరోష్కావంక చూసేడు. ముసలాడు నిశ్చేష్టుడై నుంచున్నాడు. తుపాకి అతని గుండెకదుముకొనివుంది. టోపీ వెనక్కి తోయబడివుంది. కళ్లు మహా ప్రకాశంగావున్నాయి. తెరచివున్న అతని నోరు భయంకరమైన అతని గారపట్టిన గొగ్గిపళ్లని చూపుతోంది.

"కొమ్ముల దుప్పి!" నిరాశతో అతను మెల్లగా అన్నాడు.

తర్వాత తుపాకీని కిందకిపారేసి, తన తెల్లటి గడ్డాన్ని పీక్కోసాగేడు.

"అది యిక్కడ నుంచుంది! నువ్వు చుట్టు తిరిగి రావాలనుకొంటే బాగుండేది దద్దమ్మా!" అని ముసలాడు గడ్డాన్ని తటాలున పట్టుకొన్నాడు.

"వోరి ముసలి వెధవా, వోరి పంది వెధవా!" అని అతను గడ్డం నొప్పి పుట్టేంతగా పీక్కుంటూ అదే పనిగా అనసాగేడు.

పారిపోతూన్న ఆ దుప్పి గిట్టలధ్వని రాను రాను తగ్గిపోతూ దూరానెక్కడో ప్రతిధ్వనించసాగింది. అరణ్యంపైన కమ్మివున్న దట్టమైన పొగమంచుగుండా యేదో దొంగిరి పోతున్నట్లుగావుంది.

అప్పటికి చీకటి పడింది. ఆకలై, అలిసివున్నా, ఓలెనిన్ మాంచి వుషారుగావున్నాడు. అతనా ముసలాడితో కలసి తన మకాం కొచ్చేడు. భోజనం తయారుగావుంది. వాళ్ళు వెచ్చబడి హృదయం చల్లబడేవరకూ ఆ యిద్దరూ తిని తాగేరు. తర్వాత యిదరూ తలవాకిటి వసారావద్ద కెళ్ళేరు. మరోసారి పర్వతాలు ఆ మసక చీకట్లో పైకి లేచి కనపడుతున్నాయి. మరోసారి వేటని గురించి, అబ్రెక్కులను గురించీ, తన ప్రియురాలిని గురించీ, నిర్లక్ష్యంగా పోకిరీగా తాను గడిపిన జీవితాన్ని గురించీ ముసలాడు అంతులేని కథలు చెప్పేడు. సన్నటి వదులు చొక్కా గుండా తన మనోహర రూపం కనపడుతుండగా, మరోసారి మేరియానా ఆ పెరట్లో అటూ యిటూ తిరిగింది.

# 20

మర్నాడు ఓలెనిన్ తానొక్కడే ఆ దుప్పి పారిపోయిన చోటికెళ్ళేడు. బజారుగుండా చుట్టు తిరిగి రాకుండా, ఆ గ్రామస్థులందరికిమల్లే అతను కంచెదాటి వెళ్ళేడు. తన కోటులో గుచ్చుకొన్న ముళ్ళని తీసివేసే అవకాశం లేకముందే, అతని కంటేముందున్న అతని కుక్క రెండు జీవంజీవక పక్షుల్ని బెదరకొట్టేసింది. అతనా చెట్ల గుంపులో కెళ్ళేసరికి అడుగడుక్కీ వొకపక్షి లేచిపోసాగింది. (ఇరోష్కా నిన్న యీస్థలాన్ని అతనికి

చూపలేదు యెందుకంటే తెరమాటునుంచి వాటిని కాల్చాలని ఆ స్థలాన్ని తడు విడిగా అట్టిపెట్టుకున్నాడు.)

పన్నెండు దఫాలు కాల్చి ఓలెనిన్ ఐదు పక్షుల్ని చంపేడు. ఆ ముండ్ల పొదల్లోగుండా పాకటం, చెయ్యటం మూలంగా అతను బాగా అలిసిపోయేడు. చెమట ముద్దయిపోయేడు తన కుక్కని వెనక్కి పిలిచి, తుపాకి గుర్రాన్ని తీసి, తాక బులెట్ దూర్చి, వెడల్పాటి కోటు చేతుల్తో దోమల్ని తోలేస్తూ, నిన్న తాము వెళ్లిన స్థలంవద్దకి అతను మెల్లగా నడిచి వెళ్ళేడు. కాని, కుక్కని ఆపటం అసాధ్యంగావుంది. అది ఆ బాటలో జంతువులజాడల్ని పసిగడుతోంది. ఓలెనిన్ మరో రెండు పక్షుల్ని కాల్చేడు. ఇదంతా చెయ్యటంలో చాలా ఆలస్యమైంది. తాను వెతుకుతూన్న స్థలం గుర్తుపట్టేసరికి మధ్యాన్నం అవుతోంది.

ఆవేళ వుష్ణంగానూ, ప్రశాంతంగానూ, చాలా నిర్మలంగానూవుంది. వుదయాన్నవుండే చల్లని పొగమంచు ఆఖరికి అడవి మారుమూలల్లోగూడా లేకుండా యిగిరిపోయింది. ఓలెనిన్ ముఖానా, వీపునా, చేతుల్నీ వేలకొద్దీ దోమలు ముసురుకొనివున్నాయి. అవి కుక్కమీద యెంత దట్టంగా ముసురుకొని వున్నాయంటే, దాని నలుపురంగల్లా బూడిద రంగుగా అగపడుతోంది. ఓలెనిన్ కోటూ అంతే. ఆ కోటు గుండా దోమ లతన్ని కుట్టుతున్నాయి వేసంగిలో యీ దేశంలో నివసించటం పూర్తిగా అసాధ్యమని ఓలెనిన్ నిరాశతో అనుకొని వెనక్కి తిరగబోతూ, తక్కిన ప్రజలు దీన్ని సహించగలుగుతున్నారు గదా అని అతను గుర్తించేడు. అక్కడేవుండి బలియై పోటానికి అతను నిశ్చయించుకొన్నాడు. వింతగా ఆ భావం అతని కానందం గలిగించింది. అతని శరీరమంతా పులకితమైంది. అతను చేత్తో ముఖాన్ని రుద్దుకొంటూంటే దోమలు తోపతోపై చెమటతో గలిసి ఆ జిగురు ముఖానికి పులుముకొంది. తన చుట్టూ దోమలతో నిండిన యీ వాతావరణం లేకపోతే యీ అరణ్యం తన సహజత్వాన్నీ, సొగసునీ కొంత పోగొట్టుకొంటుందని అతను అనుకోసాగేడు. అతి విస్తారంగా వృద్ధి చెందుతూన్న యీ తరుగుల్మాదులకీ, యీ పశుపక్ష్యాదులకీ, నల్లగావున్న యీ ఆకుల సముదాయానికీ, వుష్ణంగావున్న యీ సుగంధ సమీరానికీ, నేలగుండా ప్రవహించుతూ కిందికి వేలాడుతూన్న చెట్లకొమ్మలకింద పొంగి

లేస్తూన్న యీ చిన్న నాగులకీ, వేలకొద్దిగావున్న యీ పురుగుల వాతావరణం చాలా చక్కగా అతుక్కుపోయినట్లు కనపడింది. అందువల్ల మొదట ఘోరంగానూ, దుర్భరంగానూ అగుపించినదంతా యిప్పుడు ఆహ్లాదకరంగా కనిపించింది.

చివరికి, నిన్న తామున్నచోటికి చేరుకొనే సరికి అతని కక్కుడేమీ అగుపించలేదు. కాస్త విశ్రాంతి తీసుకోవాలనిపించిం దతనికి. సూర్యుడు ఆ అడవి నడి నెత్తిన వున్నాడు. అతను చెట్లులేనిచోటకో, బాటమీదకో వచ్చినపుడు తలమీదా వీపుమీదా చుర్రుమంటోంది యెండ. బరువుగా వున్న ఆ యేదు పక్షులూ అతని నడుముని దిగలాగుతున్నాయి నెప్పి పుట్టేట్లు. చివరికతను దుప్పి కాలి జాడలు కనుక్కొని, వాటివెంట ఆ చెట్ల గుంపులో గుండా వెళ్లి నిన్న అది పడుకొన్న చోటికి వచ్చి చాచుకు పడుకొన్నాడు.

తన చుట్టూ వున్న ముదురు రంగు చెట్ల ఆకులవంకా, నేలమీదున్న చెమట మరకలవంకా, యెండివున్న పేడవంకా, ఆ జంతువు మోకాలి గుర్తులవంకా, అది తన గిట్టల్తో గీరేసిన నల్లటి మట్టి సుద్దలవంకా అతను చూసేడు. అతని కక్కుడ చల్లగా, హాయిగావుంది. అతను దేన్నిగురించీ ఆలోచించలేదు, యేదీ కావాలని అతనికి కోర్కెగా లేదు. ఇంతలో హఠాత్తుగా అతనిక అమితానందమూ, కృతజ్ఞతా భావమూ కలిగేయి; తాను చిన్నతనంలో చేసినట్లు క్రాస్ చేసుకోసాగేడు.

అతనిలా అనుకొన్నాడు.

"నేను, డిమిట్రీ ఓలెనిన్ని, యెవరికంటేనూ చాలా దూరాన, యెక్కడో తెలీనిచోట వొంటరిగా, బహుశా మనిషి ముఖమెలాంటిదో చూడని యే ముసలిదుప్పో, సుందరమైన దుప్పో నివసించే యీ చోట, మానవుడనేవాడసలు యెన్నడూ అడుగుపెట్టనిచోట, యిలాంటి ఆలోచనలు ఆలోచించనిచోట, వున్నాను. నే నిక్కడున్నాను. నా చుట్టూ వయసుమళ్ళిన, వయసుమళ్లని చెట్లున్నాయి. అందులో వొక దాని నిండా అడివి ద్రాక్ష తీగెలు చుట్టుకొని వున్నాయి. బహుశా మరణించిన తమ సోదరుల్ని పసిగట్టి, వొక దాన్నొకటి తరుముకొంటూ, జీవంజీవక పక్షులు నా చుట్టూ యెగురుతున్నాయి."

తన దగ్గరున్న పక్షుల్ని తాకిచూసి రక్తపు మరకలంటుకొన్న తన చేతి నతను కోటుమీద తుడుచుకొన్నాడు.

"బహుశా నక్కలు కొన్ని యీ పక్షుల్ని వాసనపట్టి నన్నుచూసి చిరబుర లాడుతూ దొంగతనంగా జారిపోతూ వున్నాయేమో. వాటి దృష్టిలో విశాలమైన ఆకుపచ్చని దీప్యల్లాగా కనపడుతూన్న ఆకులపైన గాలిలో దోమలు బజ్ మంటున్నాయి. వొకేటి, రెండు, మూడు, నాలుగు, వొకవంద, వొక వెయ్యి, లక్షలకొద్దీ దోమలు, ప్రతిదీ తక్కినవాటికంటే వొక ప్రత్యేకమైనదగా, నేనొక ప్రత్యేకమైన డిమిటీ) ఓలెనిన్ ఐనట్లు వొక ప్రత్యేకమైనదగా, ప్రతిదీ యేదో ప్రత్యేకంగా బజ్ మంటోంది"

ఆ దోమలు తన మీద వాలుతూ యేమి ఆలోచిస్తూ బుఁయ్ మంటు న్నాయో అతను వూహించుకోసాగేడు.

"ఇదుగో, యిలారండే, చిట్టిపిల్లల్లారా. యిక్కడ తినటాని కొక మంచి వస్తువుంది!"

తాను జమీందారు వంశీకుణ్ణిగాననీ, మాస్కోలోనీ ఉన్నత కులీన సంఘంలో సభ్యుణ్ణిగాదనీ, ఫలానా ఫలానా వారి మిత్రుణ్ణీ బంధువునీ కాదనీ, తన చుట్టూ సజీవంగా వున్న వర్తి దోమలాంటి వాడినో, పక్షి లాంటివాడినో, దుప్పిలాంటి వాడ్నో అనీ, అతనికి స్పష్టమైంది.

"వాటిలాగా, ఇరోష్కాలాగా, కొంతకాలం బతికి చనిపోతాను. అంతేగాక ఇరోష్కా అన్నట్లు, ఖచ్చితంగా, నా సమాధిమీద గడ్డి పెరుగు తుంది. అంతే యిక. అంతే అయినప్పటికీ," అంటూ అతని ఆలోచనలు పరుగెత్తసాగేయి. "నేను జీవించి తీరాలి. సుఖపడాలి. అదొక్కటే నాక్కావాలిసింది. నేనేది ఐనప్పటికీ—తన మీద గడ్డి తప్పితే మరేమీ పెరగని జంతువునో, సర్వవ్యాపియైన భగవానుడి బొమ్మవున్న పటాన్నో ఐనప్పటికీ సాధ్యమైనంత సుఖంగా నేను బతకాలి. అయితే యింతకీ యెలా బతకాలి? సుఖంగావుండే దెలాగు? యింతవరకూ నేనెందుకని సుఖంగా లేను?"

అతను తన గత జీవితాన్ని సమీక్షించుకోటం ఆరంభించి, తాను దురాశాపరుడిగా, స్వార్థపరుడిగా బతికొనని అతను అసహ్యంతో అను

కొన్నాడు. నిజంగా తన కేదీ అవుసరం లేదని యిప్పుడతనికి స్పష్టంగా అగుపటిం ది. పైనున్న పచ్చని ఆకులవంకా, వాటిగుండా ప్రకాశించు తూన్న యెండవంకా, పశ్చిను దిక్కుకి దిగిపోతున్న సూర్యుడివంకా, నిర్మలాక శంవంకా చూసి అతను పరిపూర్ణానంద మొందేడు.

"నాకంత హాయి నిచ్చేదేది?" అని తనని ప్రశ్నించుకొన్నాడు. "ఇంతవరకూ నేను దేనికోసం జీవించాను? నేను యెంత కఠినుణ్ణి. నన్ను గురించి నే నెంత వ్యధపడ్డాను! ఐనా నే ననుభవించినదంతా దుఃఖం, అవమానం తప్పితే మరేమీ గాదు. సుఖంగా వుండాలంటే నాకేమీ అవసరం లేదని యిప్పుడు నాకెంత స్పష్టంగా కనపడుతూంది!"

హఠాత్తుగా యేదో నూత్న కాంతి అతనికి అగపడినట్లయింది. "సుఖమంటే యేమిటో నాకు తెలుసు" అని అతననుకున్నాడు. "ఇతరుల కొరకు బతకటంలోనే సుఖంవుంది. ఇది పూర్తిగా స్పష్టం. సుఖంగా జీవించాలనే కోర్కె ప్రతి మానవుడికీ సహజం. కనక అది న్యాయమైంది. ఐనప్పటికీ, మానవుడు దాన్ని స్వార్థ బుద్ధితో సంతృప్తిపరచాలనుకొంటే—అంటే అతడు ఐశ్వర్యం, కీర్తి, శారీరక సుఖాలు, లేక, ప్రేమ, వీటికోసం వేట మొదలెట్టితే—బాహ్య పరిస్థితుల ప్రభావంవల్ల యీ ప్రయిత్నాలు నిష్ఫలం కావచ్చు. కనక యిలాంటి ప్రయిత్నాలు చేయుటం అన్యాయం—కాని, సుఖించాలనే కోర్కె మంచిదే. అయితే, బాహ్య పరిస్థితు లేవైనప్పటికీ తీర్చుకో దగిన కోర్కెలెవ్వి? అవి ప్రేమ, ఆత్మార్పణ!"

తానాక నూత్న సత్యాన్ని కనుగొన్నానని అతననుకొన్నాడు, దానివల్ల అతనెంత వుద్రేకం చెందాడంటే అతను యెగిరి నుంచుని యెవరి కోసం తాను ఆత్మబలి చేద్దామా, యెవరికి సాయం చేద్దామా లేక యెవర్ని ప్రేమించుదామా అని అతను ఆలోచించ సాగేడు.

"నాకేమీ అవుసరం లేదుగనక నాజీవితాన్ని మానవసేవకి అంకితం చేస్తాను" అని తిరిగీ అత ననుకొన్నాడు.

ఇంటికి త్వరగా చేరుకొని పూర్తిగా ఆలోచించి మంచి అనేది చేసే అవకాశం చూసే వుద్దేశ్యంతో అతను తన తుపాకీ తీసుకొని ఆ చెట్ల గుంపులోంచి బైటి కొచ్చేడు. చెట్లు లేని ఖాళీస్థలాని కొచ్చినాక అతను

చుట్టూ చూసేడు. చెట్ల ఉపరి భాగాల వెనకాల సూర్యుడు దాక్కొని వున్నాడు. వాతావరణం చల్లగావుంది. ఆ గ్రామం చుట్టూవున్న ప్రదేశాని కంటే యీస్థలం కొత్తగానూ పూర్తి భిన్నంగానూ కన్పట్టింది. వాతావరణమూ, అరణ్యమూ—ప్రతిదీ హఠాత్తుగా మారిపోయింది.

ఆకాశం మబ్బుల్తో కప్పబడివుంది. గాలి చెట్ల ఉపరి భాగాల్లో మర్మరధ్వనులు చేస్తోంది. అతనిచుట్టూ రెల్లుదుబ్బులూ, పడి విరిగిపోయి కుళ్ళిపోతూన్న చెట్లూ తప్పితే అతని కేమీ కనిపించ లేదు.

యేదో జంతువు వెంట పరుగెత్తుకొనిపోయిన తన కుక్కని పిలిచేడతను. ఆ నిర్జన ప్రదేశమంతటా అతని కంఠధ్వని తిరిగి ప్రతిధ్వనించింది. హఠాత్తుగా అతనికి విపరీతమైన భయంవేసింది. అడవికుక్కల్నీ, వారి క్రూరకృత్యాల్నీ అతను గ్యాపకం చేసుకొన్నాడు. ప్రతి పొదవెనకాలా వొక అడవికుక్క తన మీదకి దూకటానికి తయారుగావున్నట్లు అతనూహించు కొన్నాడు. తన ప్రాణ రక్షణకై వాటితో పోరాడుతున్నట్లూ, లేక పారిపోటానికి ప్రయత్నించుతున్నట్లూ, లేక చచ్చిపోతున్నట్లూ అతను వూహించుకొన్నాడు.

భగవంతుణ్ణి గురించి, భవిష్యత్తుని గురించీ, అంతకుముందెన్నడూ తలుచుకోని రీతిగా అతను తలుచుకొన్నాడు. అతన్ని బెదరించుతూ అతని చుట్టూ అదే క్రూరమైన ప్రకృతి వుంది.

"నిజంగా, నా కోసం నేను బతకటం తగినపనేనా ?" అని అతననుకొన్నాడు. "యే క్షణంలోనైనా నేను యే మేలూ చెయ్యకుండానే చనిపోవచ్చు. నేను యిక్కడ, యీ క్షణాన, చనిపోవచ్చు. యీ సంగతి యెవరికి తెలీకనూ పోవచ్చు."

ఇక వేటాడాలనే ఆలోచన చెయ్యకుండా, తాను వూరు వుందనుకొన్న దిక్కుగా పోసాగేడు. అతనికి బాగా అలసటగావుంది.

యెవరేనావచ్చి తనను చంపవచ్చునని ప్రతిక్షణానా అమితంగా భయపడుతూ, అతను ప్రతిచెట్టువంకా పొదవంకా చూడసాగేడు.

దోవ కినపడక ఆ అరణ్యంలో కొన్నిచుట్లు తిరిగినాక వొక యేటిపాయవద్ద కొచ్చేడు. దానిలో చల్లని యిసుకనీరు ప్రవహిస్తోంది. ఆ పాయ

ధ్యాక్క డికి తీసికొని పోతుందో యేమో తెలియనప్పటికీ, అతను ఆ పాయ ననుసరించి పోదామని నిశ్చయించుకొన్నాడు. అకస్మాత్తుగా అతని వెన కాల రెల్లు దుబ్బుల్లోంచి కర కర కటపెటమనే ధ్వని వినపడింది. అతను చాలా ఉలిక్కిపడి తుపాకిని గట్టిగా పట్టుకొన్నాడు. కాని, వెనక్కి తిరిగి చూసి సిగుపడ్డాడు: ఆ ధ్వని చేసింది అతని కుక్క. అది రొప్పుతూ రోజుతూ దుబ్బుల్లోంచి నీటివద్దకి విరుచుకు పడి అతి దాహంతో ఆ చల్లటి నీరు తాగుతోంది.

ఓలెనిన్ గూడా కొంచెం నీళ్ళు తాగి, కుక్క తనని గ్రామానికి తీసుకెళ్తుందనే ఆశతో దాని వెనకాల నడవసాగేడు. తనకి కుక్క తోడుగా వున్నప్పటికీ తన చుట్టూవున్న ప్రతిదీ యెప్పటంత అపాయకారిగానూ కన్పట్టింది.

అరణ్యంలో చీకటిగావుంది. విరిగిపోయిన ముసలి చెట్ల వుపరి భాగాల్లో గాలి వికృతంగా బొబ్బరించుతోంది. తమ గూళ్ల చుట్టూ యెగురుతూ పెద్ద పెద్ద పక్షులు అరుస్తున్నాయి. అతను ముందుకు పోయిన కొలదీ వృక్షజాలం పల్చబడుతోంది; రెల్లు దుబ్బుల మోడులూ, జంతువుల కాలి గుర్తులున్న ఖాళీ ఇసుక ప్రదేశాలూ అతనికి తగుల్తున్నాయి బొబ్బ రిస్తున్న గాలితో గలిసి వొకవింతమూల్గుడు ధ్వని వినవొస్తోంది. అతను తన వీపు వెనకాల చెయ్యివేసి చూచుకొన్నాడు. వొక పక్షీ లేదు. అతని సంచిలో నెత్తురు కారుతూన్న మెడా, తలా మాత్రమే వున్నాయి. హఠాత్తుగా అతనికి అమిత భయంవేసింది. అతను భగవంతుణ్ణి ప్రార్థించ సాగేడు. అన్నిటికంటే మించి, తానేమీ మేలు చెయ్యకుండానే చనిపోతా ననే భయం కలిగిందతనికి. తాను ఆత్మ విరక్తి నొందేవరకూ, ఆత్మార్పణం చేసేవరకూ, తనను జీవించియుండ నియ్యమని అతను భగవంతుణ్ణి ప్రార్థించేడు.

# 21

అకస్మాత్తుగా అతని హృదయంలో సూర్యుడు ప్రకాశించేడు. రష్యన్ల మాటలు అతనికి వినిపించేయి. వడిగా, తాళయుతంగావున్న టెరెక్ ప్రవా హధ్వని అతనికి వినపడింది. కొన్ని అడుగులదూరం వెళ్లినాక, గోధుమవర్ణపు

టెరెక్ నదీ పరీవాహమూ, దాని వొడ్డు మీదున్న నల్లటి తడి యిసుక్కా, నదిలోని లోతులేని ప్రదేశాలూ, దూరానవున్న గడ్డిమైదానమూ. కావలా బురుజూ, ముండ్ల పొదల్లో మేస్తున్న కాపు బందాలేసివున్న వొక గుర్రమూ, వీటన్నిటికీ అవతల పర్వతాలూ, ఆతనికి కనపడిన యీ.సూర్యుని అరుణ బింబం వొక మబ్బు చాటునుంచి వొక క్షణం తొంగిచూసింది. నది నీటిమీదా, కెల్లుమీదా, కావలా బురుజుమీదా, ఆజానుబాహువైన లూకా వున్న వొక కోసక్కు గుంపుమీద తళుకు తళుక్కుని వుల్లాసంగా సూర్య కిరణాలు మెరిసేయి.

తిరిగీ, ఓలెనిన్‌కి పరిపూర్ణానందం కలిగింది. అతనా కోసక్కుల్ని మర్యాదగా పలకరించేడు. తర్వాత, యెవరికీ యేమేమీ చేసే అవకాశం దొరకక్క, అతను సిగరెట్ ముట్టించి అక్కడున్న గుడిసెలో దూరేడు. ఐనా, ఆ గుడిసెలో గూడా అతనికా అవకాశం దొరకలేదు.

కోసక్కులతని వుదాసీనంగా పలకరించేరు: మొదటి కారణ మేమంటే అతను చుట్టపొగ తాగుతున్నాడు. యిక రెండో కారణ మేమంటే ఆ సాయంత్రం యితని కంటే ఆసక్తి గలిగించే విషయం మరో టుంది వారికి.

చచ్చిపోయిన అబ్రేకు యొక్క బంధువు లిద్దరు సొమ్మిచ్చి శవాన్ని విడుదల చేయించుకొని పోవటంకోసరం కొండలనుండి వచ్చేరు. వూళ్లోంచి తమ కమాండింగ్ ఆఫీసరు రాక కోసరం కోసక్కులు యెదురు చూస్తున్నారు.

ఆ చనిపోయిన వాని సోదరుడు యెత్తుపాంటి మనిషి; మాంచి అవ యవ నిర్మాణంగలాడు; యెరుపురంగువేసిన పొట్టిగడ్డముం దతనికి; చిరు గుల గుడ్డలు తొడుక్కుని, మేకపిల్ల తోలుతో చేసిన వొక మురికి టోపీ పెట్టుకొన్నప్పటికీ, అతను రాజులాగా ఠీవిగా, గంభీరంగా వున్నాడు. అతని ముఖం చాలావరకు, చనిపోయిన అతని సోదరుడి ముఖంలాగావుంది. అతను యెవరి వంకా చూడ లేదు. ఆ శవం వంక గూడా అలా వొకసారి చూడనూలేదు. ఆ గుడిసె నీడలో మడమలమీద కూచుని వొక పొట్టి చిలుము నోట్లోపెట్టి తాగుతూ నేలమీద వుమ్మేస్తూ, మధ్య మధ్య యేదో కొంచెంగా గొణుగుతున్నాడు. అతనితో వున్నవాడు ఆ మాటల్ని జాగ్రత్తగా గౌరవంతో వింటున్నాడు.

విభిన్న పరిస్థితుల్లో అతను చాలాసార్లు రష్యన్లని చూసి వున్నటుగా అగపడుతున్నాడు అందువల్ల వారంటే అతనికి ఆశ్చర్యంగానీ, కనీసం ఆసక్తి గానీ కలగటంలేదు.

ఓలెనిన్ ఆ శవంవద్ద కెళ్లగానే, ఆ చచ్చినవాని సోదరుడు అతని వంక నరాలున అసహ్యంతో చూసి యేదో కోపంగా కరుకుగా తన మిత్రుడితో అంటే అతను త్వర త్వరగా ఆ చచ్చిన వాడి ముఖాన్ని వొక కోటుతో కప్పివేసేడు. కర్కశంగా, గంభీరంగావున్న ఆ జిఘిత్ ముఖం చూసి ఓలెనిన్‌కి ఆశ్చర్యం కలిగింది. ''నీ వేగ్రామం నుంచి వచ్చావు'' అంటూ ఓలెనిన్ అతనితో మాట్లాడ ప్రయత్నించేడు. కాని, అతను వుమ్మేనని ముఖం తిప్పుకొన్నాడు. ఆ మనిషిలో ఆసక్తి అనేది లేకపోవటం ఓలెనిన్‌కి చాలా ఆశ్చర్యం కలిగించింది. అందువల్ల అతను తల తిక్కమనిషో, రష్యన్ భాష తెలీనివాడో అయ్యుండాలని ఓలెనిన్ అనుకొన్నాడు; ఇక గత్యంతరం లేక దుబాషీగా పని చేస్తున్న అతని మిత్రుడి వంక తిరిగేడు.

ఇతను గూడా చిరుగుల బట్ట లేసుకొని వున్నాడు. కాని, గడ్డం మాత్రం యెర్రగా గాక నల్లగావుంది. అతని నల్లటికళ్ళు మెరుస్తూన్నాయి. అతని పళ్ళు చాలా తెల్లగావున్నాయి. మనః పూర్వకంగా అతను సంభాషణలోకి దిగి, వొక సిగరెట్ యిమ్మని ఓలెనిన్‌ని అడిగేడు.

''వాళ్ళు ఐదుగు రన్నాదమ్ములు వుండేవాళ్ళు'' అంటూ అతను వచ్చీ రాని రష్యన్ భాషలో చెప్ప నారంభించేడు. ''ఇతను, అఖ్మత్ ఖాను, రష్యన్లు కాల్చినవాళ్ళల్లో మూడోవాడు. వాళ్ళల్లో యిప్పు డిద్దరు మాత్రమే వుండారు. అతను జిఘిత్, గొప్ప జిఘిత్,'' అంటూ తన మిత్రుడివంక చూపుతూ అతనన్నాడు. ''మొన్న రాత్రి అఖ్మత్ ఖాన్‌ని చంపినపుడు యితను అవతలి వొడ్డుమీద రెల్లుదుబ్బుల్లో దాక్కొని వుండాడు. అతన్ని యెట్లా దోనెలో వుంచిందీ, యెట్లా వొడ్డుకి తీసుకొచ్చిందీ, అదంతా యితను చూశాడు. రాత్రి వరకూ యిత నక్కడే వుండాడు. కాల్చాలను కొన్నాడు గాని తక్కినవాళ్ళు కాల్చనియ్యలేదు.''

లూకా వచ్చి ఓలెనిన్ పక్కన కూచున్నాడు.

''మీ రేవూరినుంచి వచ్చారు?'' అత నడిగేడు.

"పోల్లదుగో ఆ కొండల దగ్గిర్నుంచి" అని, నీలిరంగు మంచుతో కప్పబడివున్న వొక సన్నని నీటిపాయుని కొండల్లో చూపుతూ, ఆ దుబాషీ అన్నాడు. "సువుకుమ్సు యెరుగుదువా ? అక్కడికది యెనిమిది మైళ్లుంది."

"సువుకుమ్సులోవున్న గిరీఖాన్‌ని నువ్వెరుగుదువా?" అతనితో తనకుగల సంబంధాలని గురించి సగర్వంతో, లూకా అడిగేడు. "అతను నా క్యునాక్!"

"అతను నా పొరుగింటివాడే" దుబాషీ సమాధాన మిచ్చేడు.

"చాలా గొప్పమనిషి" అని లూకా చాలా ఆసక్తితో అన్నాడు. తర్వాత ఆ మనిషితో తార్తారు భాషలో మాటాడసాగేడు.

పెద్ద ఆలస్యం కాకుండానే, యిద్దరు కోసక్కుల్తో గలిసి, వొక కోసక్కు కెప్టెనూ, ఆ గ్రామపెద్దా గుర్రాలెక్కి వచ్చేరు.

ఆ కెపెన్ అక్కడి కోసక్కుల్ని మర్యాదగా పలకరించేడు. కాని, రష్యన్ సైన్యంలో ఆచారమైనట్లు, "తమరు మంచి ఆరోగ్యంతో నుందురు గాక!" అని యెవరూ అరవలేదు. అక్కడక్కడా కొంత మంది సమాధానంగా తలాడించేరు. లూకాతో గూడా కొద్దిమంది అటెన్‌షన్‌లో నిలబడ్డారు.

నాకాలలో అంతా బాగుందని కార్పొరల్ రిపోర్టుయిచ్చేడు. ఇదంతా ఓలెనిన్‌కి అపహాస్యంగా కనపడింది: అక్కడికీ కోసక్కులు ఆడుకొంటున్నట్లు! యేమైనా, మామూలు మర్యాదలు సర్యాదలు త్వరగా ముగిసేయి. తర్వాత యెప్పటికిమల్లేనేవుంది. తక్కినవారికిమల్లే వుల్లాసమూ సూక్ష్మబుద్ధిగల కెప్టెన్ తార్తారు భాషలో ఆ దుబాషీతో ధారాళంగా మాటాడ నారంభించేడు.

కాగితం ఖరామత్తులు రాసుకొన్నారు. వాటిని ఛెఛెన్ల కిచ్చేరు. బదులుగా డబ్బు తీసుకొన్నారు. తర్వాత వారు శవాన్ని సమీపించేరు.

"మీలో లూకా గ్యావ్రిలోవ్ యెవరు ?" కెప్టెన్ అడిగేడు.

లూకా తనటోపీ తీసి ముందుకొచ్చి నుంచున్నాడు.

"నిన్ను గురించి కమాండరుకొక రిపోర్టు పంపాను. యేం జరుగుతుందో మాత్రం నేను చెప్పలేను. నీకు మెడల్ యిమ్మని సిఫార్సు చేశాను.

సారేటుని చేద్దామంటే నువ్వింకా చాలా చిన్నవాడివి. నీకు చదువొచ్చా?''

''రాదండి, సార్.''

''నువ్వు చక్కని కుర్రాడివి'' అన్నాడు కెప్టెన్. ''టోపీ పెట్టుకో ఫర్వాలేదు. యితను యే గావ్రిలోవ్‌లకి చెందనవాడు? ''వెడల్పు వీపు'' కా? ఆ?''

''అతని మేనల్లుడండీ'' అన్నాడు కార్పొరల్.

''తెలుసు, తెలుసు......సరే, కానివ్వండిరా అబ్బాయిలూ. వాళ్లకి కొంత చెయ్యి అందించండి'' కోసక్కుల వంకతిరిగి అతనన్నాడు.

లూకా మంచి వుషారుగా వున్నాడు. యెప్పటికంటే అతను అందంగా కనపడ్డాడు. తలపైన టోపీ పెట్టుకోని అతను ఓలెనిన్‌వద్ద కెళ్ళేడు.

శవాన్ని వాళ్ళు బోటువద్దకి తీసుకుపోయినాక, ఆ చచ్చినవాడి సోదరుడు యేటి వొడ్డు దగ్గ కెళ్ళేడు. తలవని తలంపుగా, కోసక్కులు తాము తప్పుకొని అతన్ని పోనిచ్చేరు. విసురుగా కొంక యెగురుతో అతనా బోటులోకి దూకేడు. మొదటి సారిగా అతను సరాలున ఆ కోసక్కులవంక తేరిచూసి యేదో దుబాషీతో చెప్పటం, దుబాషీ లూకాని చూపటం, ఓలెనిన్ గమనించేడు. ఆ ఛెఛెన్ లూకావంక కన్నార్పకుండా చూసేడు. అందులో ద్వేషంలేదు; అసహ్యతవుంది. తర్వాత అతను యేవో మరో రెండు మాటలని నెమ్మదిగా అవతల వొడ్డువైపుకి తిరిగేడు.

''అతనన్నదేమిటి?'' ఓలెనిన్ అడిగేడు.

''మీరు మావాళ్లనీ, మేము మీవాళ్లనీ చంపుతున్నాం. అట్లా అది సాగుతునే వుంటుంది'' అతనన్న మాటలకి తన సొంతమాటల్ని చేర్చుతూ దుబాషీ అన్నాడు. తర్వాత తన తెల్లని పళ్లని కనపరుస్తూ నవ్వి అతను బోటులోకి దూకేడు.

తన చూపుని అవతలి వొడ్డుమీద నిలిపి, ఆ చచ్చినవాడి సోదరుడు కదలకుండా కూచున్నాడు. అతనికి యెంత ద్వేషమూ అసహ్యతా వుందంటే నదికీ పక్కన తాను చూడదగిందేమీ అతనికి కన్పించలేదు.

దుబాషీ విరామం లేకుండా లొడలొడమంటూ పడవ వెనక భాగాన కూచుని, వొకసారి యిటువైపూ మరోసారి అటువైపూ తెడ్డు వేస్తూ, చలాకీగా పడవ నడుపుతున్నాడు. ప్రవాహం వారిని ఏమూలగా తీసుకుపోతూంటే, బోటు క్రమక్రమంగా చిన్నది కాసాగింది. మాటల ధ్వని వినరావటం దాదాపు ఆగిపోయింది. ఆఖరికి వారు అవతలి వొడ్డు చేరటం యివతలి వారికి కనపడింది. వొడ్డుమీద వారి కోసరం గుర్రాలున్నాయి.

వారాశనాన్ని రొయితు కెళ్ళి వొక గుర్రంమీద జీనుకడ్డంగా పడవేసేరు. గుర్రం బెదిరింది. వారు గుర్రాలెక్కి మెల్లగా నడిపించుతూ వొక కుగ్రామం పక్కగా వెళ్ళేరు. అక్కడొక గుంపు వీరిని చూడటానికి వచ్చింది.

ఇక రష్యన్ల వైపున, పూర్తిగా సంతృప్తిపడి కోసక్కులు వుల్లాసంగా సరసమాడుకోవటం నవ్వుకోటం సాగించుతున్నారు. కెప్టెనూ, గ్రామపెద్దా యేదైనా కొంచెం తినటంకోసం ఆ గుడిసెలో కెళ్ళేరు. కిల కిల లాడుతూన్న తన ముఖంలో గంభీరత్వం అగపడేట్లు చేయటం కోసం వృధాగా తంటాలుపడుతూ, తన మోకాళ్లమీద మోచేతులుంచి, వొక కర్రని చెక్కుతూ, లూకా ఓలెనిన్ పక్కన కూచున్నాడు.

"నువ్వు సిగరెట్ తాగుతావెందుకని ?" తెచ్చికోలు జిజ్ఞాసతో అతను దడాలున అడిగేడు.

ఓలెనిన్ యీ కోసక్కుల మధ్య చిరాకుతనం వొంటరితనంతో బాధపడుతున్నాడని గ్రహించి, లూకా అతన్ని సంభాషణలోకి దించాలని ప్రయత్నించుతున్నాడు.

"పూరికినే, అలవాటు" అన్నాడు ఓలెనిన్. "యెందుకలా అడిగావ్ ?"

"మావాళ్లు తాగటం మొదలెడితే యెంత గత్తర బిత్తరగా వుంటుందోనని నేను ఆలోచిస్తున్నా. యీ పర్వతాలవంక చూడు" అని కొండలగుండా ప్రవహించుతూన్న యేటిపాయవంక చూపుతూ అతను అన్నాడు. "అవి దూరానలేవు. ఐనా యెవరూ అక్కడికెళ్లలేరు. అది సరే గాని, నువ్వేంచేస్తావ్ ? వొంటరిగా యింటికిపోలేవు. చీకటి పడు

తున్నది. కావాలంటే నీతో గూడా నేనొస్తా. మరి కార్పొరల్‌ని అడుగు తానా యీసంగతీ?''

''యెంతచక్కని కుర్రాడు!'' అని వుల్లాసంగావున్న లూకా ముఖం వంక చూస్తూ ఓలెనిన్ అనుకొన్నాడు.

మేరియానానీ, ఆనాటిరాత్రి గేటువద్ద వారు ముద్దెట్టుకోవటం తాను చాటుగా వినటాన్నీ అతను గ్యాపకం చేసుకొన్నాడు. వొక్కసారిగా, లూకా అంటే అతనికి జాలి పుట్టుకొచ్చింది.

''యెంత అవివేకం, యెంత గందరగోళం!'' అని అత నను కొన్నాడు. ''యిక్క డొక మనిషి తోటి మనిషిని చంపి తానేదో అద్భుత కార్యం చేసినట్టు ఆనందిస్తున్నాడు! ఆనందించ దగిన పనేమీ తాను చెయ్య లేదని యితను గ్రహించ డెందువల్ల? చంపటంలో ఆనందంలేదనీ ఆత్మబలి అవటంలోనే అది వుందనీ గమనించ డెందుకని?''

''వొరేయ్, వాడి చేతుల్లోగిని పడేవురోయ్, లూకా!'' బోటు వెళ్ళే వరకూ వొడ్డుమీదుండి వచ్చిన వొక కోసక్కు అన్నాడు. ''వాడు నిన్ను గురించి అడగటం విన్నావంటావ్రి?''

లూకా తలెత్తేడు.

''నా ధర్మ పుత్రుడ్డా?'' అని, చచ్చిన అబ్రెకు నుద్దేశించి, లూకా అన్నాడు.

''నీ ధర్మపుత్రు డిక తిరిగొచ్చేదిలేదు. కాని ఆ యెర్రగడ్డపువాడు వాడి అన్న!''

''వాడు ప్రాణాల్తో పోగలుగుతున్నందుకు సంతోషించమను'' అని లూకా నవ్వుతూ అన్నాడు.

''నవ్వుతావెందుకు?'' ఓలెనిన్ అన్నాడు. ''నీ అన్నో తమ్ముడో చచ్చిపోతే యిలా నవ్వుతావా?''

లూకాకి ఆ ప్రశ్న వినోదం కలిగించింది. ఓలెనిన్ చెప్పదలచు కొన్న దేమిటో అతను బాగా గ్రహించినట్టే కనపడ్డాడు. కాని అలాంటి వెర్రి మొర్రి వూహలకి తాను అతీతుణ్ణని అనుకొన్నాడు.

''అవును. అలాంటిది గూడా జరుగుతుంటుంది, కాదూ?'' అని అతనన్నాడు. ''వొక్కోసారి మావాళ్ళుగూడా చచ్చిపోతుంటారు.''

# 22

కెప్టెనూ, గ్రామపెద్దా గుర్రాలెక్కి వెళ్లిపోయేరు. లూకాని సంతోష పెట్టటానికీ, ఆ చీకటి అడివిగుండా ఒంటరిగా పోయే అవస్థ తప్పటానికీ, లూకాని తన వెంట పంపమని ఓలెనిన్ కార్పొరల్‌ని అడిగేడు. కార్పొరల్ అందు కంగీకరించేడు.

మేరియానాని చూడటానికి లూకా సంబరపడతాడని ఓలెనిన్ అనుకొన్నాడు. లూకా సరదా మనిషీ, సంభాషణప్రియుడూ అవటంవల్ల అతనితో కలిసిపోవటమంటే ఓలెనిన్‌కి ఆనందంగావుంది. లూకా, మేరియానాలు అతని మనసులో సహజంగానే కలిసి కనపడుతున్నారు. అడవిలో అతనితో కలిసి నడుస్తూ, ఓలెనిన్ వారిని గురించే ఆలోచించసాగేడు.

"అతను మేరియానాని ప్రేమిస్తున్నాడు. నేనూ ఆమెని ప్రేమించవచ్చు" అపరిచితమైన మధురవాంఛతో అత ననుకొన్నాడు.

లూకా గూడా సంతోషంగా వున్నాడు. ప్రేమలాంటి దేదో యీ యిద్దరి విభిన్న వ్యక్తులమధ్యా పుట్టుకొస్తోంది. వారు వొకరొకరు చూచుకొన్నప్పుడల్లా వారికి నవ్వాలనిపిస్తోంది.

"మీ గేటేది?" ఓలెనిన్ అడిగేడు.

"మధ్యది. ఐనా ఆ చవిటినేల వరకే నీ వెంబటి వస్తాలే. యిక అది దాటితే భయమనేదే వుండదు."

"భయమెందుకు?" నవ్వుతూ ఓలెనిన్ అన్నాడు. "నువ్వు వెళ్లిక. నే నొక్కణ్ణీ పోతాలే. అభివందనాలు."

"యేం ఫర్వాలా. నా కింకేమీ పనిలేదులే. ఐనా భయపడకుండా యెలావుండగలవు? మాకూ భయమే" లూకా వోదార్పుగా అన్నాడు.

"అయితే నా మకాంవద్దకి రా. వస్తావా? కాసేపు మాట్లాడుకొందాం. కొంచెం తాగుదాం. యిక పొద్దున్నే వెళ్ళిపోదువుగాని."

"అయితే యీ రాత్రికి నా కెక్కడా పొడుకోటానికి చోటే దొరకదనుకున్నానా యేమిటీ? ఐనా అసలు, కార్పొరల్ వెంటనే తిరిగి రమ్మన్నాడు నన్ను."

"కిందటి రాత్రి నువ్వు పాడటం నేను విన్నా. తర్వాత... చూశాను గూడా..."

"మన మంతా మనుషులం."

"నువ్వు పెళ్ళి చేసుకోబోయేది నిజమేనా?"

"అమ్మ చెయ్యాలంటూంది. కాని, నాకు గుర్రం లేదు."

"నిన్ను పర్మనెంటుగా వుద్యోగంలో చేర్చుకో లేదా?"

"యింకా పూర్తి పర్మనెంటుగాదు. మొన్ననే చేరాను. నా కింకా గుర్రంలేదు. యెలా సంపాదించాలో తెలవడంలేదు. అందుకనే పెళ్లంటే నాకిష్టంలేదు."

"గుర్రం యెంత ఖరీదవుతుంది?"

"మొన్న మేము యేటవతల వొకదాన్ని బేరమాడాం. అది నోగే గుర్రమైనా, అరవై రూబుల్లియ్యబోతే వాళ్ళు పుచ్చుకోలా."

"నా తైనాతీగా వుండటం నీ కిష్టమేనా?" ఓలెనిన్ దడాలున అడిగేడు. "ఆ యేర్పాటు నేను చెయ్యగలను. యేది యేమైనా గుర్రం మాత్రం వొకటిస్తా నీకు. నాకు రెండున్నయ్యి. రెండు నాకు అవుసరం లేదు."

"అవుసరం లేదనటంలో నీ వుద్దేశ్యమేంటి?" నవ్వుతూ అన్నాడు లూకా. "నాకు బహుమతు లెందు కియ్యా లసలు? భగవంతుడి దయ వుంటే మేమెలాగో ఆ తంటాలు పడగలం."

"వుహుఁ. నిజంగా, నా తైనాతీగా వుండటం నీ కిష్టంలేదా?" లూకాకి గుర్రం యివ్వాలని అనుకొన్నందుకు చాలా ఆనందించుతూ, అతను పట్టుబట్టేడు.

అదే సమయంలో, వింతగా, అతనికి చిరాకుగావుండి సిగ్గుపడ్డాడు. తానేదో చేసితీరాలని అత ననుకొన్నాడుగాని అదేమిటో అతనికి తెలియ లేదు.

ముందు లూకాయే మాట్లాడేడు.

"రష్యాలో నీకు సొంత యిలుందా?"

తనకి వొక్కటియిల్లే గాదనీ, చాలా యిళ్ళున్నాయనీ ఓలెనిన్ అత నికి చెప్పకుండా వుండలేకపోయేడు.

"అవి మంచి యిళ్ళేనా ? మాయిళ్ళ కంటే పెద్దవేనా?" లూకా నిష్కాపట్యంతో అడిగేడు.

"అబ్బో చాలా పెద్దవి ! మీ యిళ్ళకి పదిరెట్లు పెద్దవి. యింకా పైన మూడేసి అంతస్తులుంటయ్యి!"

"మరి మా గుర్రాలంటి గుర్రా లున్నయ్యా నీకూ ?"

"నాకు వొక వంద గుర్రాలున్నయ్యి. వొక్కొక్కటీ రెండొం దలనుంచి మూడొందల వెండి రూబుళ్ళు ఖరీదు చేస్తుంది. కాని, అవి మీ గుర్రాలవంటివిగావు. అవి గులుకు నడక నడుస్తయ్యి...ఐనా, వాటి కంటే మీ గుర్రాలంటేనే నా కెక్కువ యిష్టం."

"మరి యిక్కడి కొచ్చా వెందుకు ? నీ యిష్టమయ్యే వచ్చావా, లేక, వాళ్ళు పంపారా?" యింకా నవ్వు గొంతుకతోనే లూకా అడిగేడు. "యిదుగో చూడు. నువ్విక్కడ దోవ తప్పావు" అని తాము దాటు తూన్న బాటని చూపుతూ లూకా అన్నాడు. "నువ్వు కుడిపక్కకి తిరి గుండాల్సింది."

"నా యిష్టమయ్యే నే నొచ్చాను" ఓలెనిన్ అన్నాడు. "మీ దేశం చూడాలనీ, కొన్ని దండయాత్రల్లో పాల్గొనాలనీ అనుకొన్నా."

"యెప్పుడైనా నేనూ వొక దండయాత్రలో పోతా" లూకా అన్నాడు. "నక్కల అరుపు నీకు వినపడుతున్నదా ?" వింటూ, అత నన్నాడు.

"యీ మాటకి సమాధానం చెప్పు. మనిషిని చంపటమంటే నీకు భయం పుట్టలా?"

"యెందుకంట భయం ?...ఆc. దండయాత్రలో పోవాలనుంది నాకు" లూకా తిరిగీ అన్నాడు. "భగవంతుడితోడు ! నా కెంత యిదిగా వుందని!"

"బహుశా నువ్వూ నేను కలిసే వెళ్ళొచ్చు. మాదళం సరిగ్గా శెలవు దినం ముందే పోతున్నది. మీదీ అంతే నను కొంటా."

''యేదియేమైనా, నువ్విక్కడకి రావటం వింతగావుంది.'' లూకా అన్నాడు. ''ఇళ్ళూ వాకిళ్ళూ, బానిసలు, గుర్రాలు! అవంతా నాకుంటే యేపనీ ముట్టను. సరదా చేసేస్తా. నీ హెూదాయేంటి?''

''నే నొక చిన్న వుద్యోగినే. కాని పైకి సిఫార్సుచేశారు.''

''సరే. నువ్వు నీయిళ్ళూ వాకిళ్ళని గురించి చెప్పింది బడాయి గాకుంటే, నేను నువ్వయితే అక్కడే వుండేవాణ్ణి. యిక నిప్పుడు యీ యిల్లు వదిలిపెట్టను. మాతో గలిసి యిక్కడుండటం నీకిష్టమేనా?''

''ఆఁ. చాలా యిష్టం.''

ఈలోగా బాగా చీకటి పడింది. అరణ్యంలోని గాఢాంధకారం వారిని కమ్ముకొంది. చెట్ల తలల్లో గాలి యీలవేస్తోంది. అరుస్తూ, కులుకు నవ్వు నవ్వుతూ, వెక్కెక్కి-యేడుస్తూ, నక్కలు సరీగ్గా వారి కాళ్ళపక్కనే వున్నట్లున్నాయి. కాని, వారి ముందున్న గ్రామంలోంచి స్త్రీల గొంతుకలూ, కుక్కల అరుపులూ వినపడుతున్నాయి. యిళ్ళ ఆకారాలు వారికి కనపడుతున్నాయి. కిటికీల్లో దీపాలు వెలుగుతున్నాయి. ప్రత్యేకమైన కిజ్యక్ పొగ కంపుతో గాలి నిండివుంది.

ఇక్కడ, యీ కోసక్కు గ్రామంలో, తన యిల్లూ, తన కుటుంబం, తన సుఖం వుందనీ, మరెక్కడా గూడా యింత సౌఖ్యంగా తను బతకలేననీ, యెప్పటికంటేగూడా చాలా గాఢంగా అనుకొన్నాడు ఓలెనిన్. ఆ సాయంత్రం అందరిమీదా—అందరికంటే యెక్కువగా లూకామీదా—అతనికి ప్రేమ గలిగింది.

వారు యింటికి చేరుకొన్నాక, ఓలెనిన్ పశువుల కొట్టంలో కెళ్ళి తాను గ్రోజ్నోలో కొన్న గుర్రాన్ని బైటికి తీసుకొచ్చేడు. లూకాకి ఆశ్చర్యం కలిగింది. ఆ గుర్రం తానెప్పుడూ యెక్కేదిగాదు, యింకోటి. పడుచుది కాక పోయినా పనికిరానిదేమీగాదు.

''నాకు బహుమతెందుకు?'' అన్నాడు లూకా. ''నీకింకా నేనేమీ మేలుచెయ్యలేదు.''

''నిజం చెప్పాలంటే, యిది నాకక్కర్లేదు'' అన్నాడు ఓలెనిన్. ''తీసుకో. యెప్పుడో వొకప్పుడు నువ్వు గూడా నాకేదన్నా బహుమతి యిద్దువు గానిలే.''

లూకా దిగ్భ్రమచెంది తత్తర పడ్డాడు.

"అరె! ఆఁ! నిజంగా యిదేంటంట? అదెందుకూ పనికిరాని చెత్త ఐనట్లు!" గుర్రంవంక చూడకుండా అతనన్నాడు.

"తీసుకోమంటే! యేం ఫర్వాలా. నువ్వు తీసుకోకపోతే నాకు బాధ కలుగుతుంది. ఐవాన్! యీ గుర్రాన్ని అతనింటికి తీసుకెళ్ళు."

లూకా దాని తాళ్ళు పట్టుకొన్నాడు.

"అయితే సరే. మంచిద! యిలా జరుగుతుందని నేను కలలోగూడా అనుకోలా. యెప్పుడూ..."

ఓలెనిన్ పసిపిల్లవానివలె ఆనందించేడు.

"యిప్పటి కిక్కడ కట్టిసెయ్యి. యిది మంచి గుర్రం. దీన్ని గ్రోజ్నోలో కొన్నా. యిది భలే అందంగా గ్యాలప్ కొడుతుంది. ఐవాన్, మాకు కొంచెం చిఖిర్ తెచ్చిపెడతావా? లోపలి కెళ్దాం;ద."

ద్రాక్షసారాయి వచ్చింది. లూకా కిందకూచుని సారాగిన్నె పుచ్చుకొన్నాడు.

"భగవంతుడు మేలుచేస్తే, నీ రుణం యేనాడైనా తీర్చుకొంటాను" గిన్నెలోని సారా ఖాళీచేస్తూ అతనన్నాడు. "నీ పేరేంటీ?"

"డిమిట్రీ ఆండ్రీయెవిచ్."

"ఆఁ. భగవంతుడు నిన్నాశీర్వదించుగాక, డిమిట్రీ ఆండ్రీయెవిచ్! మనం క్స్యునాక్కులుగా వుందాం. నువ్వు మా యింటికొచ్చితీరాలి. మేను వున్నవాళ్ళంగాదు. ఐనా వొక క్స్యునాక్ కి మర్యాదచెయ్యటమంటే మాకు సంతోషం. నీ కేది కావాలంటే అది యిమ్మని అమ్మకి చెపుతా— మీగడగానీ, ద్రాక్షపళ్లుగానీ. అక్కడ మా ఆఫీసుకొస్తే నువ్వేవి చెయ్యమంటే అది చేసిపెడతా. వేటకి తీసికెళ్తా. లేకపోతే యేరు దాటించి అవతలికి తీసికెళ్తా. అదీ యిదీ గాకపోతే నీ యిష్టమొచ్చిం దేదైనా సరే యిక. నువ్వు మొన్న తెలిసుంటే నాకూ! నేను చంపిన అడవిపందిని నువ్వు తప్పకుండా చూసుండాలిసింది! దాన్ని నేను మావాళ్లందరికీ పంచిపెట్టా. దాన్ని నీకిచ్చి వుండేవాణ్ణి."

"మంచిది. మరేం ఫర్వాలా. ఆఁ. వొకమాట. గుర్రాన్ని బండి కట్టమాక. దీన్నెప్పుడూ బండి కట్టలా."

"బండి కట్టటం! వద్దనే వద్దంట అసలు. ఆఁ. నీకింకో విషయం చెప్పాల్సుంది" గొంతు తగ్గించుతూ లూకా చెప్పసాగేడు. "బహుశా నీకు ఆసక్తి గలగొచ్చు. గిరీఖాన్ అని నాకో క్యునాక్ వున్నాడు. పర్వతాలనుంచి వచ్చేరోడ్డు మీద మాటువేసి వుండమని అతను నాతో అన్నాడు. నాతో వస్తానావురీ? నీకు ద్రోహం చెయ్యనులే. నేను నీ కాపలాదారుగా వుంటా."

"ఆఁ. యెప్పుడో వొకసారి తప్పకుండా వస్తా."

తనపట్ల ఓలెనిన్ యెలా ప్రవర్తించుతున్నాడో లూకా గ్రహించి నట్లగుపించేడు. యిప్పు డతనికి చాలా హాయిగా వుంది. అతని ప్రశాంతతా, నిర్లక్ష్యం ఓలెనిన్‌ని ఆశ్చర్యపరచింది. కొంచెం అసహ్యం కలిగించింది గూడాను.

వారు చాలాసేపు మాటాడుకొన్నారు. లూకా వెళ్ళిపోయేప్పటికి పొద్దుపోయింది. లూకా తాగి మత్తుగా లేడు. (అసలత నెప్పుడూ మత్తెక్కేట్లు తాగడు) చాలా వుషారుగా వెళ్ళిపోయేడు.

లూకా యేంచేస్తాడో చూద్దామని ఓలెనిన్ కిటికీవద్ద కెళ్ళేడు. తల వంచుకొని లూకా పెరటి కడ్డంగా నెమ్మదిగా నడిచి వెళ్తున్నాడు. తర్వాత, గుర్రాన్ని గేటుబైటకి తీసికెళ్ళినాక, అకస్మాత్తుగా తలెగురవేసి, పిల్లివలె చలాకీగా యెగిరి గుర్రం వీపు మీదెక్కి, వెర్రిగా అరిచి, బజార్న గ్యాలప్ వదిలి వెళ్ళిపోయేడు.

అతను మేరియానా వద్దకెళ్ళి యీ శుభవార్త చెబుతాడని ఓలెనిన్ అనుకొన్నాడు. అతనలా చేయనందుకు ఓలెనిన్‌కి ఆశాభంగంగా వున్నప్పటికీ, యెప్పటికంటే గూడా అతని హృదయం ప్రశాంతంగా వుంది. ఆ ఆనందంతో అతను యీ కథంతా చెప్పటానికని ఐవాన్‌వద్ద కెళ్ళేడు. లూకాకి గుర్రాన్ని యిచ్చాననే గాకుండా యెందుకిచ్చిందీ చెప్పి, సుఖమంటే తన నూత్న సిద్ధాంత మేమిటో వివరించి చెప్పటాని కెళ్ళేడు. అది వొట్టి వెర్రితనం తప్పితే మరేమీ గాదని ఐవాన్ ఆ సిద్ధాంతాన్ని ఖండించేడు.

లూకా యింటికెళ్లి, గుర్రాన్ని తన తల్లి కప్పగించి, గ్రామ పశువుల మందతో గలిపి దాన్ని మేతకు తోలమని చెప్పేడు. అతను వెంటనే అక్కడికెళ్ళి పోవాలి.

లూకా చెవిటి అక్క గుర్రాన్ని తాను తీసుకొంటానని అన్నది. ఆ గుర్రాన్ని యిచ్చిన మనిషి తనకి కనపడితే నేలమీదకి వంగి నమస్కరిస్తానని సైగలుజేసి చెప్పింది. అతని తల్లి పూరికినే లూకా చెప్పే కథకి తలూపి, అతనెక్కడో దీన్ని దొంగిలించాడని మనసులో అనుకొంది. కనక, పొద్దు పొడవకముందే దాన్ని మందకు తోలిఖమ్మని ఆమె కూతురుతో చెప్పింది.

వెళూ వెళూ, ఓలెనిన్ చేసిన యీ పనిని గురించి లూకా దీరంగా ఆలోచించేడు. అతని వుద్దేశ్యంలో ఆ గుర్రం పెద మంచిది గాకపోయినప్పటికీ, అది తప్పకుండా నలభై రూబుళ్లన్నా చేస్తుంది గనక అది దొరికినందుకు లూకాకి చాలా ఆనందంగావుంది. కాని, దాన్ని తనకెందుకు యివ్వటం జరిగిందో అతనికి అర్థంకాలేదు. అందువల్ల కొస్తంతగూడా అతనికి కృతజ్ఞతగాలేదు. తద్భిన్నంగా, ఆ రష్యనుకి యేవైనా కుటిల ఆలోచనలు వున్నాయేమోనని అతనికి కొంచెం అనుమానంగావుంది. ఆ ఆలోచనలేమిటో అతనికి బోధపడలేదుగాని, పూర్తిగా వొక కొత్తవాడు నలభై రూబుళ్ళ చేసే గుర్రాన్ని ప్రతిఫలమేమీ కోరకుండానే వొట్టి దయాధర్మంగా తనకిచ్చాడనే దానిలో అర్థంలేదు. అతను బాగా తాగివుంటే అది వేరే సంగతి. అప్పుడు ఆ మత్తులో, బడాయి కోసరం యిచ్చాడనుకొనేవాడు. కాని, అతను బాగా వున్నాడు. కనక యేదో భండాలపుపని తనచేత చేయించుకోటానికి తనకి, లూకాకి, యీ రూపేణా లంచం ముట్ట జెపుతూవుండి వుండవచ్చు.

"యేం ఫర్వాలేదు! నేనంత దద్దమ్మనుగాదు. మాలో తెలివిగలాడెవరో తొందర్లోనే తేలిపోతుంది. అదే సమయంలో నావద్ద గుర్రముంటుంది." తాను జాగర్తగా వుండాలనుకొంటూ, ఓలెనిన్‌ని గురించి అతి చెడ్డ ఆలోచనలుచేస్తూ, అత ననుకొన్నాడు.

తనకా గుర్రమెలా లభించిందో అత నెవరికీ చెప్పలేదు. కొందరితో దాన్ని కొన్నాననాన్నాడు. మరికొందరితో మాటలు దాటేసిచెప్పేడు.

ఐనప్పటికీ, అసలు కథేమిటో త్వరలోనే అందరికీ తెలిసిపోయింది. లూకా తల్లీ, మేరియానా, ఆమె తల్లి దండ్రులూ, తక్కిన గ్రామస్తులూ అత్యాశ్చర్య మొందేరు. వారంతా ఓలెనిన్‌ని అనుమానంతో చూడ సాగేరు. ఐనప్పటికీ, వారి కెన్ని భయాలూ అనుమానాలూ వున్నప్పటికీ, ఓలెనిన్ ఐశ్వర్యం సంగతీ, వాళ్లన్నట్టు అతని "నిరాడంబరత్వం" సంగతీ విని వారు ముక్కు-మీద వేలువేసుకోక పోలేదు.

"అట్లాంటి సంగతి యెన్నడైనా విన్నామా కన్నామా!" వొకరన్నారు.

"ఆరకంగా, యాభైరూబుళ్ళ చేసే గుర్రాన్ని యిచ్చి పారెయ్యటం చూడమంట! నిజంగా అతను డబ్బులోపడి దొర్లుతూ వుండుండాలి."

"అదేమిటో నాకు తెలుసు" మరొకరు సగర్వంగా అన్నారు. "లూకా అతని కేదో గొప్ప పని చేసిపెట్టుండాలి. అదృష్టవంతుడు, వూడ ఇరకేవాడు!"

"యీ రష్యా వాళ్లంతా జిత్తులమారి ముండాకొడుకులనుకో" మూడోవారన్నారు. "యిక వాడు మనయిళ్లకో దేనికో నిప్పుపెట్టక మానడు!"

# 23

ఓలెనిన్ జీవితం సాఫీగా, వొకేరీతిగా గడిచిపోతోంది. అతని కాంమ్రేడ్సుతోనూ, ఆఫీసర్లతోనూ అతనికి చిన్నమెత్తు పని గూడా లేదు. ఆఫీసరు కింది వుద్యోగి అవటం, ఐశ్వర్యవంతుడై యుండటం అనేవి వొక లాభకారి సమ్మేళనం. అతను పనిగానీ, డ్రిల్లుగానీ చేయాల్సిన అవుసరం లేదు. అతడు గడచిన దండయాత్రలో చేసిన సేవను గురించి అతణ్ని పై వుద్యోగంలోకి సిఫార్సుచేశారు. ఈలోగా వారతన్ని కదిలించ లేదు. ఆఫీసర్లు అతన్ని కులీనుడుగా చూసి గౌరవించేరు. వారి పేకాటా, తాగటం తందనాలాడటం అతన్నేమీ ఆకర్షించలేదు. సాధ్యమైనంతమట్టుకు అతను వారి జోక్యం పెట్టుకోకుండా వుండటానికి ప్రయత్నించేడు. పల్లెటూళ్లో

మకాంవేసిన మిలిటరీ ఆఫీసర్ల జీవితం మార్పులేకుండా వొకేవిధంగా వుండేది. కోటలో వుండే ప్రతి ఆఫీసరు క్రమం తప్పకుండా పోర్టరుసారా తాగి, పేకాడి, దండయాత్రలలో పాల్గొన్నందుకు తన కే బహుమతులు వస్తాయోనని యెలా కలలు గంటూ వుంటాడో, అలాగే యే కోనక్కా గ్రామంలోనో మకాంవేస్తే వాళ్లు క్రమం తప్పకుండా బీర్ తాగటం, ఆడపిల్లలకి మిఠాయిలూ తేనే తినబెట్టటం, వారి వెంట బడటం, వారిని ప్రేమించటం, కొన్ని సందర్భాల్లో వారిని పెళ్లిచేసికోటం చేసేవాళ్ళు. కాని, పదిమంది నడిచిన బాటని పోవటమంటే ఓతెలిన్‌కి అతనికి తెలీకుండానే అసహ్యతవుంది. అంతేగాక అతనెప్పుడూ తన మార్గమేదో తాననుసరిస్తూంటాడు.

పొద్దు పొడుస్తూండగానే నిద్రలేవటం అతనికి అలవాటైంది. పొద్దుటి భోజనం అయినాక తలవాకిటి వసారాలో కూచుని వుదయ సౌందర్యాన్ని, పర్వతాలనీ, మేరియానానీ మెచ్చుకొంటూ కొంతసేపు గడుపుతాడు. తర్వాత పేలికలైన యెద్దు చర్మపుకోటు తొడిగి, వొక జత ముతకచెప్పులు తొడుక్కుని, బెల్టుకి పటాకత్తిని తగిలించి, వొకతుపాకినీ సిగరెట్లూ భోజనంవున్న వొక సంచినీ తీసుకొని, కుక్కని వెంబటేసుకొని ఐదుగంటలవగానే అతను అరణ్యానికి పోతాడు. తర్వాత మళ్లీ సాయంత్రం ఆరుగంటలైనాక, అలిసిపోయి, ఆకలై, వొక అరడజను పక్షులుగానీ అడపాదడపా వొక జంతువునుగానీ తన నడుంబెల్టుకి వేళ్ళాడేసి, తీసికెళ్లిన సంచిని ముట్టకుండానే, యింటికి తిరిగొస్తాడు.

అతని సంచిలోని సిగరెట్లలాగా ఆలోచనలుగూడా కదలకుండా తలలో పడివుంటే, యీ పదమూడు గంటలకాలంలో వొక్క ఆలోచనగూడా బుర్రలో మెదలలేదని అర్థం. మంచి వుత్సాహంతో, నైతికంగా పునరుజ్జీవనం పొంది, అతను యింటికి తిరిగొస్తాడు. అయితే ఆ దినం దేన్ని గురించి ఆలోచించావని అడిగితే అతను సమాధానం చెప్పగలిగి వుండేవాడు గాదు. యేవో భ్రమలూ, స్వప్నాలూ, వాటి మిశ్రమం మాత్రమే అతనికి అస్పష్టంగా జ్ఞాపకముండేది. మధ్య మధ్య యీ లోకంలోకొస్తూ అతను దడాలున తన నిలా ప్రశ్నించుకొనేవాడు.

''నేను దేన్ని గురించి ఆలోచిస్తున్నానుని?''

అలా అనుకొని, తానొక కోసక్కు ఐనట్లూ, తన కోసక్కు భార్యతో గలిసి యే ద్రాక్షతోటలోనో పనిచేస్తున్నట్లో, లేక యే అబ్రెక్కు అయినట్లో, ఆఖరికి తన నుంచి పరుగెత్తుతూన్న యే అడవిపందో అయినట్లు అతని మనసులో వోక్షణం తళుక్కుమనేది. అదే సమయంలో జీవంజీవక పక్షికోసమో, దుప్పికోసమో కాపలాగాస్తూ చెవులు రిక్కించి వింటూం డేవాడు.

ప్రతి సాయంత్రమూ ఇరోష్కా అక్కడుండేవాడు. ఐవాన్ నాలు గోవంతు గ్యాలను ఛిఁర్ తెచ్చేనాడు. వారు ప్రశాంతంగా మాటాడుకొని, తాగి, యిద్దరూ సంతృప్తిపడి, తర్వాత విడిపోయేవాళ్ళు. మర్నాడు మళ్లీ వేట యిక అదే కమ్మని అలసట, అదే సంభాషణ, అదే తాగుడు, అదే సంతృప్తి.

అడపా దడపా అతను విశ్రాంతి తీసుకొని దినమంతా యింటివద్దే గడిపేవాడు. యికనప్పుడు అతని ప్రధానమైన పనేమిటంటే కిటికీనద్దో తల వాకిటి వసారావద్దో కూచుని మేరియానా చేస్తున్న ప్రతిపనినీ ఆదుర్దాగా చూస్తూవుండటం. ఆకాశం యొక్క అందాన్నీ, పర్వతాల సౌందర్యాన్నీ ప్రేమించినట్లే తాను మేరియానాని గూడా ప్రేమించాలని అత నను కొన్నాడు. ఐనా, ఆమెతో యేసంబంధమూ పెట్టుకోవాలని అతనెన్నడూ అనుకోలేదు. లూకాకీ ఆమెకీ మధ్యవున్న సంబంధంలాంటిది తనకీ ఆమెకి యెన్నడూ వుండబోదని అతనికి తట్టింది. అంత కంటే గూడా తక్కువగా, ధనికుడైన ఆఫీసరుకీ రైతుయువతికీ మధ్య సామాన్యంగావుండే సంబంధం గూడా వుండదని అతనికి అగపడింది.

తన కామ్రేడ్సులాగా తాను ప్రవర్తించటం మొదలెట్టితే, తనకున్న సుఖానికీ మనోశాంతికీ బదులుగా అంతులేని బాధా, నిరాశా, పశ్చాత్తాపం వస్తాయని అత ననుకొన్నాడు. అంతేగాకుండా, ఆ స్త్రీ విషయంలో తాను కొంత ఆత్మ విరక్తి చెందాననీ అది తనకి చాలా ఆత్మ సంతృప్తి నిచ్చిందనీ అత ననుకొన్నాడు. ఇక అన్నిటికంటే మించి ఆమె అంటే అతనికి చాలా భీతివుంది. యేనాడు గూడా అత నామెతో సరసమాడగల శక్తి అతనికిలేదు.

వొకనాడు, కేవలం తలవని తలంపుగా, మాస్కోలో తానెరిగున్న వొక యువకుడు అతన్ని చూడటాని కొచ్చేడు.

“అరే, మాన్‌ఛెర్, మైడియర్ మిత్రమా, నువ్విక్కడున్నావని విని చాలా ఆనందించానోయ్!” మాస్కో-నగరంలో ఫాషన్ అయినట్లు రష్యన్, ఫ్రెంచి భాషల మాటలు కలుపుతూ, ఆ మిత్రుడు ఆరంభించేడు. “నాకు చాలా ఆనందంగా వుందిరా! జీవితం మనిద్దర్నీ తిరిగి వొక చోటికి తేవటం చూడమంటి! సరే, యెలావున్నావ్? యిక్కడేం చేస్తున్నావ్? ఐనా అసలు యిక్కడి కెందుకొచ్చావురా?”

ఇక ఆ మీదట ప్రిన్స్ బెలెట్‌స్కీ తన కథ చెప్పేడు: తాను తాత్కాలికంగా యీ రెజిమెంటులో యెలా చేరిందీ, కమాండర్ ఇన్ ఛీఫ్ తనెలా అతని ఏజ్టంట్‌గా తీసుకొంటా నన్నదీ, అదంటే తనకి యిష్టం లేకపోయినా యీ దండయాత్ర గొడవ ఐపోయినాక తానెలా ఆ వుద్యోగం పుచ్చుకోవాలనుకొన్నదీ, అతను చెప్పేడు.

“యీ నరకంలో పడివున్నప్పుడే నేను నా జీవితం సంగతి చూసుకోవాలి: మెడలుగానీ, ప్రమోషనుగానీ కొట్టెయ్యాలి. అదీ యిదీ గాకపోతే గార్డ్సుదళంలో కన్నా మార్పించుకోవాలి. అది నేను చేసి తీరాలి. నాకోసమనిగాదు. నా కుటుంబం, నా స్నేహితుల క్షేమం కొరకు. ప్రిన్స్ నన్ను చాలా బాగా ఆహ్వానించాడు. వాడు చక్కని మనిషి,” అని బెలెట్‌స్కీ లొడ లొడ మనసాగేడు. “నాకు సెయింట్ అన్నా క్రాస్ యివ్వమని సిఫార్సు చేశారు. మరుసటి దండయాత్ర వరకూ మాత్రమే నే నిక్కడుంటాను. ఇక్కడ భల్ బాగావుంది, కాదూ? అరె, యెలాంటి ఆడవాళ్ళురా! వాహ్! సరేగాని నీ గొడవ యెలావుందిరా? మన కెపెను, స్టార్ట్‌సేవ్, ఆ మంచి సన్నాసి, నువ్వొక వొత్తి ఆడివి ముండాకొడుకులాగా బతుకుతున్నావనీ, యెవర్నీ కలిసికోటం లేదనీ చెప్పాడు. ఐనా, యిక్కడున్న ఆఫీసర్లతో కలిసి మెలిసి తిరగాలని నీకు లేదని నాకు బాగా తెలుసులే. యిప్పుడిక మనిద్దరం కొంచెం వొకర్నిగురించి వొకరం తెలిసికొనే వీలు దొరికినందుకు నాకు చాలా ఆనందంగా వుందిరా. సార్జంటువున్న యింట్లో నా మకాం. అరె నువ్వు ఆ యింటివాడి కూతుర్ని—ఉస్టెంకాని—చూసితీరాల్రా! వాహ్! చాలా అందంగావుంది!”

ఓలెనిన్ తాను యెల్లకాలానికీ వదిలేశాననుకొన్న ప్రపంచంలో నుంచి ఫ్రెంచి, రష్యన్ మాటలు ప్రవాహంలాగా దొర్లుకొచ్చినాయి.

పెద్ద పట్టింపుగల మనిషిగాదనీ, చక్కనివాడనీ బెలెట్‌స్కీని గురించి లోకం అభిప్రాయం. అయితే అవ్వొచ్చు. అతను చక్కని ముఖం గలాడూ, దయగలాడూ ఐనప్పటికీ ఓలెనిన్‌కి అతనంటే చాలా అసహ్యం వేసింది. ఓలెనిన్ తాను వదిలేసిన మురికిచెత్త నంతా యితను పట్టుకొచ్చి నట్లున్నాడు. ఓలెనిన్‌కి ప్రత్యేకంగా ఆగ్రహం పుట్టించిన విషయమేమంటే కుక్కకాటుకి చెప్పుదెబ్బలాగా యితనికి సమాధానం చెప్పాలనుకొన్నా తాను చెప్పలేక పోవటం అనేది. యేలోకంనుంచైతే తాను తప్పించుకొని వచ్చి దాన్ని గురించి మరిచిపోయాడో, ఆ లోకపు ప్రభావం యింకా తన మీద వున్నట్లనిపించిందతనికి. తనని గురించీ బెలెట్‌స్కీని గురించీ అతను కలవరపడ్డాడు. ఐనా తనకి తెలీకుండానే అతను ఫ్రెంచి సమాసాలు వుపయోగించటం, మాస్కో మిత్రులపట్లా, కమాండర్ ఇన్ ఛీఫ్‌పట్లా అతి ఆసక్తిని ప్రదర్శించటం, యిక ఫ్రెంచిభాష మాటాడిన ఫలితంగా ఆఫీసర్లని గురించీ కోసక్కుల్ని గురించీ లోడ బిడ మనటమూ జరిగింది.

బెలెట్‌స్కీతో అతను స్నేహపూర్వకంగానే మెలిగేడు. తనని వచ్చి చూడమని ఆహ్వానించి, తానుగూడా అతనివద్ద కొస్తానని వాగ్దానమిచ్చేడు. ఐనా, తన వాగ్దానం అతను నిలబెట్టుకోలేదు.

అతను సరైన పెద్దమనిషని చెబుతూ, ఐవాన్ బెలెట్‌స్కీని సమర్థించేడు.

ధనికుడైన ఆఫీసరు వొక కోసక్కు గ్రామంలో మకాం పెడితే యేంచేస్తాడో, బెలెట్‌స్కీ గూడా అదే చేయ నారంభించేడు. వొక్క నెలరోజుల్లో అతను యెన్నాళ్లనుంచో వుంటున్న ఆ గ్రామ నివాసిలాగా ఐపోయేడు. ముసలాళ్లకి తాగబోయించేడు, ఆడపిల్లలు యేర్పాటుచేసిన విందులకి వెళ్ళేడు, తానూ విందులు చేసేడు, చివరికి తన విజయాల్ని గురించి బడాయి కొట్టుకున్నాడు.

యెందువల్లనోగాని ఆడపిల్లలు అతన్ని ''తాతా'' అని పిలిచేవారు. ఇక స్త్రీలనీ సారానీ ప్రేమించే మనిషిని కనిపెట్టటం కోసక్కులకి పెద్దకష్టమైనపనిగాదు. వెంటనే వాళ్లకి యితనంటే మక్కువ యేర్పడింది. ఓలెనిన్ విషయం వాళ్లకి అంతుపట్టలేదు.

# 24

ఉదయం, ఐదుగంటలైంది. తన బూటుతో టీ పాత్ర పొయ్యిలోని నిప్పుకి గాలి విసురుతూ, ఐవాన్ తలవాకిటి వసారాలో వున్నాడు. ఓలెనిన్ టెరెక్ నదివద్దకెళ్లి వున్నాడు. అతను యిటీవలనే వొక కొత్త కాలక్షేపం కనిపెట్టేడు—గుర్రాన్ని నదిలో యీదించటం. ఇంటి యజమానురాలు బయటింట్లోవుంది. రాజు కొంటోన్న పొయ్యిలోంచి నల్లని దట్టమైన పొగ పొగగొట్టంనించి లేస్తోంది. ఆవుని పాలు పిండుతూ మేరియానా ఆవులశాలలో వుంది.

"కదలకుండా నుంచోవే, నిన్ను నాశనంజెయ్య!" అని, పాలు పితుకుతూన్న ధ్వనితోకలిసి ఆమె గొంతు రింగురుమంటూ వినిపిస్తోంది.

వీధిలో టక టకమని పరుగెత్తి వస్తూన్న గిట్టలధ్వని వినపడగానే, యెర్రటి రుమాలు చుట్టివున్న మేరియానా చిన్నారి శిరస్సు ఆ శాల ద్వారంవద్ద అగపడి మళ్లీ అంతర్ధానమైంది.

జీనూ గీనూ లేకుండా వొట్టి గుర్రంమీదనే యెక్కి ఓలెనిన్ స్వారీ చేసుకొంటూ గేటువరకొచ్చేడు. అందంగావున్న అతని ముదురు బూడిద రంగు గుర్రం యింకా తడిగావుండి నిగ నిగలాడుతోంది.

అతను యెర్రటి సిల్కుచొక్కా, తెల్లటి సిర్కేషియన్ కోటూ తొడిగివున్నాడు. పట్టా కత్తి బెల్టుకి తగిలించబడివుంది. పొడుగాంటి మేక చర్మపుటోపీ పెట్టుకొన్నాడు. కొంచెం డాబుసరి చూపుతో అతను ఆ గుర్రపు వెడల్పాంటి తడివీపుమీద కూచునున్నాడు. అతని జుట్టు తడిగా వుంది. అతని ముఖం యౌవ్వనంతో, ఆరోగ్యంతో ప్రకాశిస్తోంది.

తాను సొగసుగా, నీటుగా, జిఘిత్లాగా వున్నానని అతననుకొన్నాడు. కాని అతననుకొన్నది తప్పు. అనుభవం వున్న కోసక్కు యెవరేనా అతనివంక వొక్షణం అలాచూసి అతను వొట్టి రష్యన్ మాత్రమేనని తెలిసికొని వుండేవాడు. ఆ యువతి తన తల బైటికి పెట్టి చూసిందని అతను గమనించగానే, తుపాకీని వీపుమీద పెట్టుకొని ప్రత్యేకమైన నీటుతో వంగేడు. తర్వాత గేటు తోసేసి, కళ్ళేలు గట్టిగా లాగిపట్టి, కొరడాని ఛళ్ మనిపించుతూ పెరట్లో ప్రవేశించేడు.

''టీ తయారైందా, ఐవాన్?'' ఆవుల శాల వంక చూడకుండా, అతను హుషారుగా కేకబట్టేడు. శరీరంలోని ప్రతికండరం జల జల మంటుం డగా, తన పార్శ్వాల్లో కింది కొత్తుతూ కళ్ళేన్ని లాగుతూ, ఆ కంచె మీదగా యెగిరి దూకటానికి తయారై, రాయిలాగా వున్న పెరటినేలపై తన గుర్రం యెలా దుముకుతూ నడిచిందీ ఓలెనిన్ ఆనందంతో చూసేడు.

''తయ్యార్, సార్'' అన్నాడు ఐవాన్.

మేరియానా యింకా చూస్తూనే వుందని ఓలెనిన్ అనుకొన్నాడు. కాని, అతను వెనక్కి తిరిగి చూడలేదు: తర్వాత, అతను గుర్రం దిగ బోతుండగా కాలికి మెలికబడింది తుపాకీ; అప్పుడు పడిపోకుండా నిల దొక్కునే ప్రయత్నంలో అతను నికారంగా ప్రయత్నించేడు. నామోషీ భావంతో అతను సరాసున ఆవులశాలవైపు చూసేడు. ఆ తలుపువద్ద యెవరూ లేరు. లోపలినుంచి జుయ్‌మని పాలు పితకటం వినవస్తోంది.

అతను యింట్లోకెళ్ళి, వెంటనే వొక పుస్తకంతో చిలుము (పొగ గొట్టం) లో తిరిగొచ్చి యెండ తగలకుండావున్న తలవాకిటి వసారా మూలలో కూచున్నాడు, వొకగ్లాసు టీ ముందేసుకొని.

మధ్యాన్నంవరకూ యింటివద్దేవుండి చాలాకాలం నాయిదా వేసు కొంటూ వచ్చిన వుత్తరాలు కొన్ని రాయాలనుకొన్నా డతను. కాని, యిప్పుడతనికా వసారా వదిలిపెట్టి పోవాలనిలేదు. తన గది వొక జైలు ఐనట్లు ఆ గదిలోకి పోవటాని కతని కయిష్టంగావుంది.

ఇంటి యజమానురాలు పొయ్యి రాజేసింది. పాలు పితకటం పూర్తి జేసి మేరియానా వచ్చి పిడకలు తెచ్చి దడిమీద యెండబెడుతోంది. చదవాలని ఓలెనిన్ ప్రయత్నించేడు. కాని అందులో వొక్కమాటగూడా అతని కర్థంకావటంలేదు. తనముందు పెరట్లో పనిచేస్తున్న మేరియానా వంక అదే పనిగా చూడ సాగేడు. ఆమె ఆ యింటి దగ్గర చల్లటి నీడలో నుంచున్నా, పెరటిమధ్యలో కొచ్చినా, ఆమె చేసే పనుల్లో యే వొక్క పనైనా చూడకుండా పోతానేమోనని అతనికి భయంగావుంది.

జిగేల్ మంటూన్న ఉదయ సూర్యకాంతిలో నిగనిగలాడే ఆమె దుస్తులు మెరుస్తున్నాయి. సొగసుగా, చలాకీగావున్న ఆమె కదలికలు ఓలెనిన్ కానందం గలిగించేయి. ముడతలు ముడతలుగా ఆమె వక్షోజాలకి

చక్కని కాళ్ళకి అతుక్కొనిపోయిన ఆమె వొదులు చొక్కా తీరు; ఆమె నిఠారుగా నిలబడి నప్పుడు చొక్కాలోంచి కనపడిన ఆమె బిగివక్షోజాల ఆకారం; యెర్రటి పాతస్లిప్పర్లలో ఆ నేలమీద తీరు తప్పకుండా నడిచిన ఆమె పాదాలసొరు, అసహనంతో, దాదాపు ఆగ్రహంతో, ఆమె పార పుచ్చుకొని పనిచేసినపుడు ఆమె చేతి కండరాలు జిగిగా బిగిసిన వైనం; వొకొక్కప్పుడు ఆమె నల్లటి నేత్రాలు అతనివైపు చూసిన విధం—అతనికి ఆనందం కలిగించేయి. ఆమె సన్నటి కనుబొమలు చిట్లించి వున్నప్పటికీ ఆమెకి సంతృప్తిగానే వుందనీ, తానెంత అందంగావున్నానో తనకు తెలుసనీ ఆమె నేత్రాలు తెలుపుతున్నాయి.

"హల్లో ఓలెనిన్! యెంతసేపైందోయ్ లేచి?" అకస్మాత్తుగా వొక కంఠధ్వని పలికింది. కకేషియన్ ఆఫీసరు యూనిఫారం తొడిగి, బెలెట్స్కీ గేటులోపల కొచ్చేడు.

"అరె బెలెట్స్కీయా! యింత పెందరాడే బైలుదేరావేంటోయ్?" చేయి చాపుతూ ఓలెనిన్ అడిగేడు.

"నన్ను గెంటేశారు. యీ రాత్రికొక విందు వుంది. మేరియానా ఉస్టెంకా యింటికొస్తావుగదూ నువ్వు?"

మేరియానాతో అతనంత పరిచయంగా మాటాడటం ఓలెనిన్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఆ యువతి, తానదేమీ విననట్లుగా, తలవంచుకొని, పార భుజానవేసి మగవాడిలా నడుస్తూ ఆలశాలవైపు నడిచివెళ్ళింది.

"ఆమెకి సిగ్గేసింది. మేరియానాకి సిగ్గేసింది" ఆమె వెనకాల పిలుస్తూ బెలెట్స్కీ అన్నాడు. "నువ్వంటే ఆమెకి సిగ్గుగా వుందోయ్, ఓలెనిన్" అని నవ్వుతూ అతనన్నాడు. తర్వాత వుషారుగా ఆ తలవాకిటి వసారా మెట్లెక్కేడు.

"విందేమిటోయ్? నిన్ను బైటకి తన్నేసిందెవరు?"

"ఉస్టెంకా—నేనున్న యింటి యజమాని కూతురు—యీ విందు చేస్తున్నది. నీకు గూడా ఆహ్వానముంది. విందంటే బజ్జీలూ ఆడపిల్లలూ అని అర్థం!"

"అక్కడ మనమేం చెయ్యాలంట?"

మేరియానా వెళ్లినవైపు తలాడించుతూ, బెలెట్‌స్కీ చిరునవ్వుతో కన్నుగీటేడు.

ఓలెనిన్ సిగ్గుపడి భుజా లెగురవేసేడు.

"అరేయ్, నిజంగా నువ్వు వింతమనిషివిరా, బెలెట్‌స్కీ."

"యిక ఆపరా! నాకు చెప్పమాక అదీ......" ఓలెనిన్ ముఖం చిట్లించటం చూసి బెలెట్‌స్కీ అది సరిజెయ్యటానికి చిరునవ్వు నవ్వేడు. "నిజంగా చెబుతానూ, అలాంటి చక్కని పిల్లతో, అలాంటి అందమైన పిల్లతో గలిసి నాకే యింటో వుంటూ యిదంతా సాధ్యంగా కనపడదు మరి......"

"ఆమె చాలా అందంగలపిల్ల. అలాంటి స్త్రీని నే నింతకు ముం దెన్నడూ జూడలేదు."

"అయితే యేమిటంట?" అదేమిటో అర్థంగాక బెలెట్‌స్కీ నవ్వులు గొట్టేడు.

"నీకు వింతగా కనపడొచ్చు గాని, అసలు, విషయాలెలా వున్నాయో చెబుతా విను" అని ఓలెనిన్ సమాధాన మిచ్చేడు. "నేనిక్కడ వుండటం మొదలెట్టినప్పట్నుంచీ నేను ఆడవాళ్లంటే అసలు పట్టించు కోటమేలేదు. నిజంగా అది మంచిది. అంతేగాక, అయినా అసలు యీ ఆడ పిల్లలకీ మనకీ సంబంధమేమిటి? ఇరోష్కా అంటావూ—అది వేరేసంగతి. మా యిద్దరికొక సామాన్య సంబంధంవుంది—వేట."

"సామాన్యసంబంధమా? చెత్తరా చెత్త! మాస్కోలో వున్న నా ఎమేలియాల్తో నాకున్న సామాన్య సంబంధ మేమిటని నిన్నడుగు తున్నా. సరే, యిక్కడా అంతే. నిజం వొప్పుకోవాలంటే, యిక్కడి ఆడపిల్లలు అసలు మురికిగా వుంటారు. కాని చేసేదేమీ లేదు."

"నువ్వు పేరు బెట్టినట్లు, నీ ఎమేలియాల్తో నే నెప్పుడూ చనువుగా లేను" అన్నాడు ఓలెనిన్. "అసలలాంటి ఆడవాళ్లతో యెలా మెల గాలోగూడా నాకు తెలవదు. నాకు తెలిసిందంతా యేమిటంటే వాళ్లంటే నాకు గౌరవం లేదు. కాని యీ కోసక్కు ఆడపిల్లల్ని మాత్రం గౌర విస్తాను."

"భేష్. నీ యిష్టమొచ్చినట్లు గౌరవించుకో. అందుకు నేనేమీ అడ్డం రానులే."

కాని, ఓలెనిన్ ఆ సంభాషణ నంతటితో ముగిసిపోనియ్యలేదు. వారు మాటాడుతూన్న విషయం అతని హృదయానికి చాలా దగ్గరగా వుంది. తాను యెత్తుకొన్న విషయాన్ని పూర్తిగా చెప్పేసెయ్యాలని అతనికి ఆతుర్దాగా వుంది.

"నాది ప్రత్యేకమైన జీవితమని నాకు తెలుసు" అంటూ, తత్తర పడి, ఓలెనిన్ తిరిగీ అందుకొన్నాడు. "కాని, యిక్కడ నా జీవితానికి యెంత చక్కటి రూపు రేఖ లొచ్చాయంటే; దీన్ని మార్చుకోటానికి నాకేమీ కారణం కనపడటంలేదు సరిగదా అసలు నీ జీవితంలాంటి జీవితం నేను గడపలేను. యిక యింత సుఖంగా బతకటం అనేది అసలే అసాధ్యం. అంతేగాకుండా, వారిలో నేను చూడవల్చుకొన్నదీ, చూసేదీ నువ్వు చూసేదానికి పూర్తిగా భిన్నమైనట్టిది."

బెలెట్స్కీ తన చెవుల్ని తాను నమ్మలేనంత ఆశ్చర్యంతో కను బొమలెత్తేడు.

"అయినప్పటికీ నువ్వు విందుకి రావాలోయ్ ఓలెనిన్. మేరియానా గూడా అక్కడికొస్తుంది చెప్పొంటే! నీకు బాగోకపోతే అప్పుడెళ్ళిపోదువు గానిలే. వస్తావామరి?"

"రావాలనేవుంది. కాని, వున్నదున్నట్లు చెప్పాలంటే ప్రేమ గొడవలో పడిపోతానని నాకు భయంగావుంది."

"సీ హెూహెూ!" బెలెట్స్కీ అరిచేడు. "అయినా తప్పకుండా రావాలి. నీకోసం చూస్తుంటా. వస్తానని వాగ్దానం చెయ్యిమరి."

"కాని నిజంగా చెప్పాలంటే మనమక్కడేం చెయ్యాలో, యేం తాగు నపాలో నాకు బోధపడకుండా వుంది."

"నామాట విని ముందురారా!"

"సరే...బహుశా..."

"అరే బాబా, లోకంలో కెల్లా అందమైన ఆడవాళ్ళ మధ్య గోసాయి ముండాకొడుకల్లె బతకటంలో అర్థమేంటో నాకర్థం గావ

టల్లా. సుఖం అనుభవించే అవకాశ మున్నపుడు సుఖమెందుకు అనుభవించగూడదురా? ఆc. చూడూ, మన కంపెనీ తొందర్లోనే వెళ్ళిపోతుందనే సంగతి నువ్వు విన్నావా?''

''కాదే? ఎనిమిదో కంపెనీ పోతుందని విన్నానే?''

''కాదు. మనవంతు ముందు. ఏజ్జటంట్ నాకు వుత్తరం రాశాడు. ప్రిన్స్ తనంతట తానుగూడా యీ దండయాత్రలో పాల్గొంటాడని అత నంటున్నాడు. అతన్ని చూడగలగటం నా కానందం. యేమైనా, యీ ప్రదేశమంటే నాకు అసలు విసుగు పుట్టిందిలే.''

''దాడి అని విన్నానే?''

''యేమో నేను వినలా మరి. కాని, కిందటిసారి దానికి క్రినోవ్‌కి సెయింట్ అన్నా క్రాస్ యిచ్చారని విన్నా. పిచ్చి ముండాకొడుకు! తన్నీ లెఫ్టినెంట్ చేస్తారనుకొన్నాడు'' అన్నాడు బెలెట్‌స్కీ నవ్వుతూ.

సాయంత్రం చీకటి పడేవేళకి ఓలెనిన్ ఆలోచనలు విందు వైపుకి తిరిగేయి. తన మిత్రుడి ఆహ్వానం గురించి అతనికి వ్యాకులంగావుంది. అతనికి వెళ్ళాలనుందిగాని అదంటే సిగ్గుగా, దడగావుంది. అక్కడ ఆడపిల్లలు తప్పితే ముసిలీ ముతకా వుండరని అతనికి తెలుసు. అసలదెలా వుంటుంది? తానెలా ప్రవర్తించాలి? తానేంమాట్లాడాలి? పహిలాపచ్చీస్ మీదుండే ఆ కోసక్ యువతుల్తో తాను వేగేదెలాగు?

బెలెట్‌స్కీ వాక వింత సంబంధంగురించి తనకి చెప్పేడు. అన్నిం టికీమించి, తాను బహుశా మేరియానావున్న గదిలోనే వుండబోతాననేది, ఆమెతో మాట్లాడవచ్చును గూడా ననేదీ అతనికి నమ్మశక్యంగాకుండా వుంది. మళ్ళీ ఆమె గంభీర స్వభావాన్ని, బెట్టుగా వుండటాన్ని, గురించి ఆలోచిస్తే అలాంటి పని అసాధ్యంగా కనపడింది. ఐనా, బెలెట్‌స్కీ అక్కడి వ్యవహారమంతా చాలా సాఫీగా నడిచిపోతుందని నొక్కిచెప్పేడు. తన మామూలు ధోరణిలోనే బెలెట్‌స్కీ తాను మేరియానాతో మెలగటం సాధ్యమేనా? ''అదేమిటో మొత్తానికి గమ్మత్తుగానే వుంటుంది'' అని ఓలెనిన్ అనుకొన్నాడు. ''ఉహూc. నే నసలక్కడికి వెళ్ళకుండా దూరంగా వుండటమే మంచిది. అసలాసంగతంతా ఛండాలంగావుంది. రెందుకూ వుపయోగించేదిగాదు.''

ఐనా, అదెలావుంటుందో అనే ప్రశ్న అతన్నింకా పట్టి పీడిస్తోనే వుంది. అంతేగాక వస్తానని తాను వాగ్దానం చేసాడు గూడాను.

తన మనస్సులో ఆ విషయాన్ని గురించి అమీతుమీ తేల్చుకోకుండానే ఓలెనిన్ యిల్లు వదలి బైలుదేరి, బెలెట్‌స్కీ మకాంవేసిన యింటి వరకూ వెళ్లి ఆ యింట్లో కెళ్ళేడు.

ఆ యిల్లు అచ్చం ఓలెనిన్ వుంటున్న యిల్లు మాదిరిగానేవుంది. గుంజలమీద దాన్ని కట్టారు. భూమినుంచి ఆరడుగులయెత్తుంది. రెండు గదులున్నాయి. ఓలెనిన్ మెట్లెక్కి మొదటిగదిలో కొచ్చేడు. ఆ గదిలో ముందరి గోడ పక్కన వొక సోల్పు (వరస) గా పరుపులూ, రగ్గులూ, బొంతలూ, తలగడ దిండ్లూ వున్నాయి. యిక పక్కగోడల్ని ఆయుధాలూ, ఇత్తడి పళ్ళేలూ వేలాడుతున్నాయి. బల్లలకింద కర్బూజాపళ్ళూ, గుమ్మడికాయలూ వున్నాయి.

బెలెట్‌స్కీ మకాం వేసిన రెండోగదిలో వొక మంచం, యేవో చాలా పెట్టెలూ, ఇటుకల్తో గట్టిన వొక పెద్ద పొయ్యీ, వొక మేజాబల్లా, రెండు బల్లలూ, వున్నాయి. సనాతన మతానికి సంబంధించినట్లుగా చిత్రించిన కొన్ని పటాలు గోడల నున్నాయి. బెలెట్‌స్కీ ఆయుధాలు గోడనున్న వొక చిన్న రగ్గునుండి వేళ్ళాడుతున్నాయి. ఇక యేవో చాలా రకాల టాయిలెట్ వస్తువులూ, చిత్తరువులూ, మేజా బల్లమీద అమర్చబడివున్నాయి. బల్లమీదొక సిల్కు డ్రస్సింగ్‌గౌన్ పడేసివుంది.

పరిశుభ్రంగా, చక్కగావున్న బెలెట్‌స్కీ తన లోపలి దుస్తులు మాత్రం తొడుక్కుని మంచంమీద పడుకొని యేదో పుస్తకం చదువుతున్నాడు. ఓలెనిన్‌ను చూసి అతను మంచంలోంచి యెగిరి దూకేడు.

"నువ్వొచ్చినందుకు నాకు చాలా ఆనందంగా వుందిరా! నా మేడ యెలావుందంటావోయ్? చక్కగా లేదూ? ఆc. వాళ్ళు అద్భుతమైన యేర్పాట్లు చేస్తున్నార్రోయ్. వాళ్ళు బజ్జీల్ని దేంతో తయారు చేస్తారో నీకు తెలుసా? పిండీ, పందిమాంసం, ద్రాక్షపళ్లూ. కాని అసలు విషయం అదిగాదు. అదుగో అక్కడ వాళ్ళ ఆర్భాటం చూడు!"

నిజంగానే, వారా కిటికీలోంచి చూడగానే రెండో యింట్లో పేద్ద రభస వారికి కనపడింది. వొకసారి వొక వస్తువు పట్టుకొని, మరోసారి

మరోటి పట్టుకొని ఆడపిల్లలు యింట్లోంచి బైటికీ బైటినుంచి యింట్లోకీ దూసుకుపోతున్నారు.

''అదేమన్నా త్వరగా తయారౌతుందా?'' అని బెలెట్‌స్కీ అరిచేడు.

''వొక్క నిమిషంలో! యెందుకంట ఆ ఆరా? ఆకలిగా వుందా తాతా?'' ఆ యింట్లోంచి ఆడపిల్లలు పగలబడి నవ్వటం వినవచ్చింది.

యెర్రటి బుగ్గలుగలిగి, బొద్దుగా, చక్కగా వున్న ఉస్టెంకా తన చొక్కా చేతులు పైకి మడిచి పళ్ళేలు కొన్ని యెత్తుకొనిపోటానికి యింట్లోకి పరుగెత్తుకొచ్చింది.

''పక్కకి తప్పుకో. లేకపోతే యివి పడిపోతయ్యి'' బెలెట్‌స్కీని తప్పించుకొంటూ ఆమె కీచురుమని అరిచింది. ''వచ్చి కాస్తి మాకు పని చేసిపెట్టరాదూ?'' అని ఓలెనిన్‌కేసి అరిచింది, నవ్వుతూ. ''ఆం. ఆడ పిల్లలు తినటానికి తినుబండారా లేమైనా తేవటం మరిచిపోయేవుసుమా!''

(తినుబండారా లంటే అల్లపు మిఠాయీ, యితర తీపివస్తువులూ అని ఆమె అర్థం.)

''మేరియానా అక్కడుందా?'' బెలెట్‌స్కీ అడిగేడు.

''యేమనుకొంటున్నావు మరి? పిండి తెచ్చిందిగూడాను.''

''చూడూ,'' అంటూ, ఉస్టెంకా ఆ గది విడిచిపెట్టి వెళ్ళిపోయినాక బెలెట్‌స్కీ యెత్తుకొన్నాడు: ''ఆ పిల్లకి చక్కని బట్టలిచ్చి పరిశుభ్రంగా అలంకారంచేస్తే, మన అందాలబరిణె లందరికన్నా చాలా అందంగా వుంటుంది. కర్నల్ బోర్‌షివ్‌ని పెళ్ళి చేసుకొన్నపిల్లని నువ్వు చూశావంటరా? యెంత హుందాతనం! అది యీ కోసక్కు స్త్రీల కెక్కణ్ణుంచి వస్తుందో?''

''బోర్‌షివ్ పెళ్ళాం యెవరో నేనెరగను'' అన్నాడు ఓలెనిన్. ''కాని, యిప్పుడు వీళ్ళు కట్టుకొంటున్న బట్టలకంటే యే బట్టలూ అందంగా వుండవని నా వుద్దేశ్యం.''

''యే జీవితానికైనా నేనెలా తేలిగ్గా అలవాటు పడిపోగలనో చూస్తుంటే నాకు వింతగా వుందిరా!'' సంతృప్తితో నిట్టూర్చుతూ

షెలెట్‌స్కీ అన్నాడు. "సరే అక్కడికిపోయి వాళ్ళేం చేస్తున్నారో చూసివస్తా."

తన డ్రస్సింగ్ గౌనుని భుజంమీద పడేసి, "నువ్వీలోపల ఆ తినుబండారాల గొడవచూడు" అంటూ అరుస్తూ, అతను బైటికి పరుగెత్తేడు.

బెలెట్‌స్కీయొక్క త్రైనాతీని పిలిచి రొట్టెలూ, తేనే తెచ్చిపెట్టమని ఓలెనిన్ చెప్పేడు.

కాని, తానెవరికో లంచంపెడుతున్నట్లుగా ఆ త్రైనాతీకి డబ్బియ్యటానికి అతనెంత సిగ్గుపడ్డాడంటే, "పెప్పరమింట్ కలిసిన రొట్టెలేనా, తేనె గలిసిన రొట్టెలేనా?" అని త్రైనాతీ అడిగినప్పుడు అతనేమీ సమాధాన మియ్యలేదు.

"నీ యిష్టమొచ్చినట్లు కానియ్యి."

"యీ డబ్బంతా పెట్టి కొనుక్కురానా మరి?" అత నడిగేడు. "పెప్పరమింట్ కలిసిందైతే ఖరీ దెక్కువ. మొన్న వొక్కోదానికి పదహారు కోపెక్కులు తీసుకొన్నారు."

"ఆఁ. మొత్తం డబ్బంతా పెట్టికొను" ఓలెనిన్ అన్నాడు. అని అతను కిటికీవద్ద కూచున్నాడు. తానేదో ప్రమాదంతో కూడుకొన్న దుర్మార్గపు పని చేయబోతున్నట్లుగా అతని గుండె దడదడ కొట్టుకోటం చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది.

ఆడపిల్లల గదిలోంచి అతనికి పెద్ద కోలాహలం వినపడింది. తర్వాత కొద్ది నిమిషాలకి, ఆడపిల్లలు చెవులు గింగురు మనేట్లు అరుపుల్తో నవ్వుల్తో కేరింతాలు కొడుతుండగా బెలెట్‌స్కీ ఆ గదిలోంచి బైటకి దూసుకు రావటం అతను చూసేడు.

"వాళ్ళు నైటకి గెంటేశారోయ్" అన్నాడు బెలెట్‌స్కీ.

తర్వాత కొంచెంసేపటికి ఉస్టెంకా గదిలో ప్రవేశించి తన వెంట వారిని రమ్మని చాలా గంభీరతలో ఆహ్వానించింది.

వారాగదిలో ప్రవేశించేప్పటికి, గదిలో గోడపక్కన ఉస్టెంకా బొంతలీన్నా, దిల్లనీ మళ్ళీ వొక స్తోల్పుగా సర్దుతోంది. మేజాబల్లమీద చాలా చిన్నగుడ్డ నొకటి పరచబడివుంది. దానిమీద యెర్రటి ద్రాక్ష

సారా వున్న పాత్రో వొకటీ, కొన్ని ఎండు చేపలూ వున్నయ్యి. ఆ గదంతా పిండివాసనా ద్రాక్షపళ్ళవాసనా కొడుతోంది. అందంగా వున్న అరడజను ఆడపిల్లలు చక్కని బిష్మెత్‌లు తొడిగి, మామూలుగా కట్టుకొనే తలరుమాళ్లు కట్టుకోకుండా, పొయ్యి వెనకాల మూలలో గుమీకూడి కూచుని, గుసగుస లాడుకొంటూ ముసిముసి నవ్వులు నవ్వుకొంటున్నారు.

"నా సంరక్షకుడైన సెయింట్‌ని గౌరవించాల్సిందిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను" అన్నది ఉస్టెంకా తన అతిథుల్ని మేజాబల్లవద్ద కూచోమని ఆహ్వానించుతూ.

ఆ ఆడపిల్లల్లో మేరియానా గూడా వుండటం చూసి, యిలాంటి ఛండాలపు పరిస్థితుల్లో ఆమెని కలిసికొన్నందుకు ఓలెనిన్ కలవరపాటు చెందేడు. తన కిక్కడ స్థానం లేనట్టూ తన వ్యవహారం మోటుగా వున్నట్టూ అతను బాధపడ్డాడు. అందువల్ల బెలెట్‌స్కీని కనిపెట్టివుండి అతనేంచేస్తే అది చెయ్యాలనుకొన్నాడు.

బెలెట్‌స్కీ తాను బాగా హాయిగా వున్నట్లగుపించేడు. అతను గంభీరంగా ముందుకి అడుగువేసి, ఉస్టెంకా ఆరోగ్యం కోరుతూ వొక గ్లాసుడు ద్రాక్షసారా తాగి, తక్కినవాళ్లని గూడా అదేచేయమని ఆహ్వానించేడు. ఆడవాళ్ళు సారాతాగరని ఉస్టెంకా అన్నది.

"ఐనా, తేనె గలుపుకొని తాగొచ్చులే" ఆడపిల్లల్లో వొకరన్నారు.

అప్పుడే అంగడినుంచి తిరిగొచ్చిన బెలెట్‌స్కీ తైనాతీని లోపలికి పిలిచేడు. అతను ఆ పెద్దమనుషులవంక వోరగంట చూచినపుడు అతని చూపులో అసహ్యతో, అసూయో వున్నట్లు కనిపించింది. అతి జాగ్రత్తతో అతను బూడిదరంగు కాగితంలో చుట్టిన పొట్లం వొకటి వారి కందించేడు. అందులో తేనెతుట్టె వొకటి, రొట్టెలూ వున్నయ్యి. తర్వాత అతను వాటి ధరని గురించి వివరంగా వర్ణించటం మొదలెట్టేసరికి, బెలెట్‌స్కీ అతన్ని బైటకి పంపించి వేసేడు.

గ్లాసుల్లోవున్న ద్రాక్షసారాలో బెలెట్‌స్కీ కొంత తేనె కలిపి, తర్వాత దివ్యమైన పోజులో ఆ మూడుపౌనుల రొట్టెల్ని మేజాబల్లమీద అక్కడక్కడా పడవేసేడు. తర్వాత అతను ఆడపిల్లల్ని ఆ మూలనుంచి యీవ్చకు రాసాగేడు.

చివరికి వారంతా మేజాబల్లవద్ద కూచోగానే అతను వారికి ఆ రొట్టెల్ని పంచేడు. మేరియానా తన చిన్నచేతుల్లో రెండు తెల్లటి రొట్టెలూ, వొక గోధుమరంగు రొట్టే పట్టుకొని వాటి నేంచెయ్యాలో తోచక యెలా కూచున్నదీ ఓలెనిన్ గమనించేడు.

బెలెట్‌స్కీ, ఉస్తెంకాలు ఉల్లాసంగా వున్నప్పటికీ, వారు అతిథులకి వుత్సాహం యివ్వటానికి యెంత ప్రయత్నించినప్పటికీ, వారి సంభాషణ బలవంతపు బ్రహ్మాణార్థంగా మకమక లాడుతోంది. ఓలెనిన్‌కి చిరాకుగా వుంది. ఆడపిల్లల దృష్టిలో బహుశా తాను పరిహాసాస్పదంగా కనపడుతూ వుండవచ్చుననీ, తన భిడియం వారికిగూడా అంటవచ్చుననీ, అందువల్ల యేదైనా మాట్లాడటం మంచిదిగాబట్టి, యేం మాట్లాడాలా అని అతను తన బుర్రని బద్దలకొట్టుకొని ఆలోచించేడు. కాని, యేం మాట్లాడాలో అతనికి తోచలేదు. ప్రత్యేకంగా మేరియానా చిరాకుగా వున్నట్లు అతనికి అగపడింది.

''బహుశా వాళ్ళకి మేము డబ్బిస్తామని వాళ్ళు అనుకుంటున్నా రేమో ?'' అని ఓలెనిన్ అనుకొన్నాడు. ''కాని, ఆ పని చేసేదెలా ? అబ్బా, అదేదో తొందరగా ముగించి యిక్కణ్ణుంచి వెళ్ళిపోతే !''

# 25

''మేరియానా, మీ యింట్లో వున్న మనిషిని నువ్వెరక్కపోవట మేమిటి !'' బెలెట్‌స్కీ అడిగేడు.

''ఆయన మమ్మల్ని చూడటానికే రాకపోతే ఆయన్ని గురించి నాకు తెలిసేదెలా ?'' ఓలెనిన్ వంక చూస్తూ మేరియానా అన్నది.

ఓలెనిన్ వులిక్కిపడి సిగ్గుపడ్డాడు. తర్వాత అంతకంటే ఏం చెప్పాలో తోచక యిలా అన్నాడు.

''మీ అమ్మంటే నాకు భయం. మొదటిసారి నేను యింట్లోకొచ్చినపుడు యెలా యెగిరిందో నీకు తెలవదూ ?''

"అయితే అసలు సంగతి అదన్నమాట!" ఆమె పగలబడి నవ్వి తలని అటు తిప్పుకొంది.

ఓలెనిన్ ఆమె ముఖాన్ని పూర్తిగా చూడటం అనేది యిదే ప్రథమం ఇంతవరకూ ఆమె యెప్పుడూ కళ్లవరకూ వచ్చేట్లు తలకి రుమాలు చుట్టు కొనేది. ఆమె ఆ గ్రామ అందాల రాణిగా గుర్తించబడిందంటే అందులో వింత యేమీలేదు. ఉస్టెంకా చక్కనిది; కొద్దిపాటి మనిషి; బొద్దుగా వుంటుంది. గులాబీరంగు చెక్కిళ్ళు; గోధుమరంగు కళ్ళు; బాగా యెర్రగా వుండే పెదిమలు. కాని, మేరియానా అలాగాదు. ఆమె చక్కని దనటా నికి వీల్లేదు; ఆమె అందాలరాణి! ఆమె యెత్తుగా వుంటుంది; చక్కని శరీర సౌష్టవం, దివ్యమైన భుజాలు. ప్రత్యేకంగా, ఆమె చిరునవ్వు నవ్వి నపుడు మృదువుగా మధురంగా భావ ప్రకటన చేసే ఆమె నోరూ, కఠినత్వం వున్నప్పటికీ మధురమైన ఆమె నల్లని పెద్దకళ్ళూ లేక పోయినట్ల యితే ఆమె రూపురేఖలు మగవాడిలాగా, దాదాపు గరుకుగా, వుండి వుండేవి.

ఆమె అరుదుగా చిరునవ్వు నవ్వుతుంది. కాని, ఆమె చిరునవ్వు వూహించనంత మధురంగా వుంటుంది. తక్కిన ఆడపిల్లలంతా చక్కని వాళ్ళే. కాని, తామూ, బెలెట్స్కీ, లోపలికి రొట్టెలు తెచ్చినపుడు అతని తైనాతీ, మేరియానావంక చూడకుండా వుండలేకపోతున్నారు. ఆ ఆడపిల్లల్లో యెవరు మాటాడినా ఆమెలో తప్పకుండా మాటాడి తీర తారు. ఆమె వారిమధ్య ప్రకాశించుతూన్న వొక రాణిలాగావుంది.

బెలెట్స్కీ అతిథుల్ని సంతోషపెట్టే ప్రయత్నంలో విరామం లేకుండా లొడలొడ మని వాగేడు; ఆడపిల్లల్తో సరసమాడేడు; అందరూ తాగేటట్లు చేసేడు; ఫ్రెంచి భాషలో మేరియానాని గురించి ఛండాలపు ఛలోక్తులు విసిరేడు; ఆడవాళ్ళతో యెలా మెల్లగాలో తననుంచి నేర్చు కోవాలిసిందని ఓలెనిన్ని పట్టుబట్టేడు.

ఎప్పటికంటే గూడా ఓలెనిన్కి చిరాకుగావుంది. పండగ చేసుకొం టూన్న ఉస్టెంకా తన అతిథుల్ని ప్రతివారినీ ముద్దుపెట్టుకొని ద్రాక్షసారా అందిస్తుందని బెలెట్స్కీ చెప్పే సమయాన, యే వంకతో బైటికి పారి పోదామా అని ఓలెనిన్ మథనపడుతున్నాడు. పెళ్ళిళ్ల సందర్భాల్లోలాగా

తన పళ్ళెంలో డబ్బువుంచే షరతుమీదనే తాను అలా ముద్దెట్టుకొంటానని ఉస్టెంకా అన్నది.

"యీ ఛండాలపు విందుకు అసలు నే నెలావచ్చానంట ?" అని ఓలె నిన్ అనుకొని లేచి నుంచున్నాడు.

"యెక్కడికోయ్ నువ్వు పోయేదీ ?" బెలెట్స్కీ అడిగేడు.

"పోయి సిగరెట్లు తీసుకొస్తా" తప్పించుకు పోవటానికి ప్రయ త్నించుతూ ఓలెనిన్ అన్నాడు. కాని, బెలెట్స్కీ అతని చేయి పట్టు కొన్నాడు.

"నావద్ద కొంత డబ్బుందిలే" అని ఫ్రెంచి భాషలో అన్నా డతను.

"డబ్బిచ్చే వరకూ పోనిచ్చేట్టు లేరాప్రి బాబూ" ఓలెనిన్ బాధగా అనుకొన్నాడు. కాని, అంతలోనే అతనికి తననీ గురించి వ్యాకులంకలిగింది. "బెలెట్స్కీ లాగా నే నెందుకని ప్రవర్తించలేక పోతున్నాను ? సరే, అస లింతకీ నే నిక్కడికి రావాల్సిందేగాదు. యిక తీరా వచ్చినాక వారి సరదా చెడగొట్టనేకూడదు. నే నొక కోసక్కులా తాగటానికి నేను కనీసం ప్రయ త్నించితీరాలి."

అలా అనుకొని ఛాపురా అనే ఒక కొయ్యపాత్ర పట్టుకొని, దాన్ని ఛిఖర్‌తో నింపేసి, దాదాపు అదంతా తాగివేసేడతను. ఆడపిల్ల లిది చూచి నివ్వెరగొని పోయేరు: అది వింతగానూ, అనుచితంగానూ వుందని వాళ్ళనుకొన్నారు. ఉస్టెంకా వారికి చెరో గ్లాసు తెచ్చియిచ్చి ఆ యిద్దర్నీ ముద్దు పెట్టుకొంది.

"అదీ సంగతి, అమ్మాయిల్లారా, యిక మనం జల్సా చేసె య్యొచ్చు" వారు తనపళ్ళెంలో వేసిన నాలుగు వెండి రూబుళ్ళనీ గల గల మనిపించుతూ, ఆమె అనింది.

ఓలెనిన్ కిప్పుడు చాలా హాయిగావుంది. అతను అదీ యిదీ వాగ సాగేడు.

"ఆం. మేరియానా, యిక యిప్పుడు మాకు ఛిఖర్ అందించి మమ్మల్ని ముద్దు పెట్టుకోటం నీవంతు" అన్నాడు బెలెట్స్కీ.

''నిన్ను ముద్దు పెట్టుకొంటా మరి!'' అని మేరియానా అతన్ని కొట్టటానికా అన్నట్లు పరిహాసానికి చేయియెత్తింది.

''డబ్బు పుచ్చుకోకుండా తానికి వూరికినే ఆ ముద్దు యిచ్చితీరాలి'' అని ఆడపిల్లల్లో వొకరన్నారు.

''అదీ మర్యాద తెలిసిన పిల్లంటే!'' అని, పెనగులాడుతూన్న ఆ పిల్లని పట్టుకొని బెలెట్స్కీ ముద్దెట్టుకొన్నాడు. ''నువ్వది చేసితీరాలి'' అని అతను మేరియానా వంక తిరుగుతూ అన్నాడు. ''కానియ్ మరి. మీ యింట్లో అద్దెకున్న మనిషికోగ్గానివ్వుమరి'' ఆమె చేయి పుచ్చుకొని ఆమెని తీసికెళ్ళి ఓలెనిన్ కూచున్న బల్లమీద అతని పక్కన ఆమెని కూచుండబెట్టేడతను.

''అందాలరాణి గాదూ?'' ఆమె ముఖాన్నతనికి చూపించటానికి ఆమె ముఖం తన చేత్తో తిప్పుతూ బెలెట్స్కీ అన్నాడు.

మేరియానా అందు కభ్యంతరపెట్టలేదు. మెల్లగా ఆమె తన పెద్ద కళ్ళని ఓలెనిన్ వైపు తిప్పింది. ''అవును, నే నందంగావున్నా'' అని ఆమె చూపు చెపుతున్నట్లుగావుంది.

తాను చేస్తున్నదేమిటో తనకి తెలీకుండా ఓలెనిన్ గభాలున ఆమె నడుముని గట్టిగా పట్టుకొని ఆమెని ముద్దెట్టుకోబోతుంటే, ఆమె వొక్క వూపులో అతన్నుంచి తప్పించుకొని పొయ్యివైపు యెగిరిదూకింది. ఆ దూకటంలో మేజాబల్ల పడిపోయింది. అందరూ నవ్వేరు. తర్వాత బెలెట్స్కీ ఆడపిల్లల్తో యేదో గుసగుస లాడేడు. హఠాత్తుగా అందరూ బైటికి పరుగెత్తి తలుపు తాళం వేసేరు. లోపల ఓలెనిన్, మేరియానాలున్నారు.

''నువ్వు బెలెట్స్కీని ముద్దుపెట్టుకొని నన్ను ముద్దుపెట్టుకోవెందుకని?'' ఓలెనిన్ అడిగేడు.

''నా కిష్టంలేదు. అంతే'' మూతి ముడుచుకొంటూ ఆమె అనింది. ''అతను తాతలాంటివాడు'' చిరునవ్వు నవ్వుతూ చెప్పింది.

తర్వాత ఆమె తలుపువద్దకెళ్ళి దాని. మీద బాదింది. ''తలుపు తాళంవేశారెందుకు పందివెధవల్లారా?''

''ఏమేం ఫర్వాలా. వాళ్ల నక్కడ వుండనియ్యి. మన మిక్కడుం దాం'' ఆమె వద్ద కొస్తూ ఓలెనిన్ అన్నాడు.

కోపంతో ముఖం చిట్లించుతూ ఆమె అతన్ని దూరంగా తోసేసింది. మరోసారి ఆమెలో గంభీరత్వం, ఘనత్వం అతని కగుపించేయి. అతను తాను చేసేదేమిటో గుర్తించి సిగ్గుతో బాధపడ్డాడు. తలుపువద్దకెళ్ళి దాన్ని గుంజ సాగేడు.

''బెలెట్‌స్కీ! తలుపు తెరువ్! యీ వెధవసరసం ఆపరా!''

మేరియానా తిరిగీ ఆనందంతో నవ్వింది. ''అయితే నన్ను జూసి భయపడ్డావన్నమాట?'' అన్నది.

''భయపడ్డా. నువ్వూ మీ అమ్మంత గయ్యాళిదానివి.''

''విను. వొక విషయం చెపుతానుండు: నీ జీవితమంతా ఇరోష్కా మామయ్యతోటి గడిపెయ్యి. ప్రతిరోజూ మరింతగా నిన్ను ఆడపిల్లలు ప్రేమిస్తారు.''

తన ముఖాన్ని అతని ముఖం దగ్గరపెట్టి అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ ఆమె చిరునవ్వు నవ్వింది.

అందుకేం సమాధానం చెప్పాలో అతనికి తెలువలేదు.

''అయితే మరి అప్పుడప్పుడూ మిమ్మల్ని చూడటానికొస్తేనో?'' తడబడుతూ, అతనారంభించేడు.

''అప్పటి సంగతివేరులే'' తల సెగరవేస్తూ ఆమె అన్నది.

ఆ సమయాన బెలెట్‌స్కీ తలుపు తెరచేడు. మేరియానా హడావుడిగా పక్కకి దూకటంలో ఆమె తొడ అతని కాలికి తగిలింది.

''చత్. నేనెంత వెధవపనిచేశాను!'' అనుకొన్నాడు ఓలెనిన్. ''ప్రేమ...ఆత్మబలి...లూకా...సుఖం పరిధానం. సుఖంవున్న వాడిది న్యాయం.''

తనకే ఆశ్చర్యం కలిగించినంత బలంతో సుందరి మేరియానాని గట్టిగా పట్టుకొని కణతలమీదా చెక్కిళ్లమీదా అతను ముద్దుపెట్టుకొన్నాడు. ఆమె పగలబడి నవ్వి బైటకి ఆడపిల్లలవద్దకు పరుగెత్తింది.

దాంతో విందు వ్యవహారం ముగిసింది. ఉస్టెంకా తల్లి దాక్షిణ్యతోట లనుంచి వచ్చి వారందర్నీ బైటికి గెంటేసింది.

# 26

"అవును. వెంటనే తగు జాగ్రత్త తీసుకోపోతే నేను వెర్రిగా మోహంలో పడిపోవచ్చు" యింటికి నడిచివెళ్తూ ఓలెనిన్ అనుకొన్నాడు. అదంతా యెగిరి పోతుందనీ, మర్నాటి వుదయంనుంచీ తాను యింతకు ముందులాగా జీవించటం ఆరంభిస్తాననీ, అదే ఆలోచనతో అతను నిద్ర పోయేడు.

కాని గత జీవితం తిరిగి రాలేదు. మేరియానాకీ అతనికీ మధ్యవున్న సంబంధం మారిపోయింది. వారిద్దర్నీ వేరుచేసిన అడుగోడ కుప్పగా కూలి పోయింది.

యింటి అద్దె వసూలుచేసుకోటానికి యింటి కొచ్చిన కార్నెట్‌కి అతని యింట్లో అద్దెకున్నవాని సంపదని గురించీ ఔదార్యాన్ని గురించీ అతనికి వూళ్లోవాళ్ళు చెప్పేరు. అందువల్ల అతను ఓలెనిన్‌ని తన యింటి కాహ్వానించటానికి త్వరపడ్డాడు.

కార్నెట్ భార్య ఓలెనిన్‌ని సాదరంగా ఆహ్వానించింది. సాయం కాలంపూట ఆ కుటుంబంతో కాలక్షేపం చేయటం త్వరలోనే అతనికి అల వడి పోయింది. ఇదివరకటిలాగానే జీవిస్తున్నట్లు తను అగుపించేడు గాని, అతనిలోన మాత్రం అంతా మారిపోయింది. మామూలుగానే వేటకు వెళ్ళేవాడు. కాని, యెనిమిదయ్యేసరికి, చీకటి పడేవేళ, అతను కార్నెట్ యింటికివెళ్లాడు. అతని రాకపోకలకి ఆ కుటుంబం యెంత అలవాటుపడి పోయిందంటే యేనాడన్నా అతను రాకపోతే వారు ఆశ్చర్యపడేవారు. వారిచ్చే ద్రాక్షసారా కతను డబ్బు బాగా ముట్టజెప్పేవాడు. ఇంటి యజ మానురాలు అతన్నేమీ పట్టించుకోక తన పని తాను చేసుకొనేది.

ఇక టీయో, ఛిఖిరో తాగుతూ వారు స్థానిక విశేషాల్ని గురించీ, యిరుగు పొరుగు వాళ్లని గురించీ, లేక రష్యాని గురించో మాటాడుకొనే వారు. ఓలెనిన్ మాటాడుతుంటే వారు ప్రశ్నలడిగేవారు. వొకో్కసారి అత నేపుస్తకమో తీసుకొచ్చి చదువుతూ కాలం గడిపేవాడు.

మేరియానా పొయ్యి దిమ్మెమీదో, యే చీకటి మూలనో కాళ్ళు ముడుచుకొని అడవి జంతువుకిమల్లే వొదిగొదిగి కూచునేది. వారి సంభా

షణలో ఆమె యేమీ కల్పించుకొనేది గాదు. కాని ఓలెనిన్ కెప్పుడూ ఆమె అక్కడున్న సంగతి తెలుసు. ఆమె కదలటమో, నోటితో గుమ్మడి గింజల్ని వొలుస్తుండటమో అతనికి వినపడుతుండేది. తాను మాటాడేప్పుడు ఆమె అతి శ్రద్ధగా వింటూ వుందని గూడా అతనికి తెలుసు.

వొక్కొక్కప్పుడు ఆమె తన వంక చూస్తూందని అత ననుకొనేవాడు. అప్పుడతను ఆమె చూపులో తన చూపు కలిసినపుడు నిశ్శబ్దంగా వూరుకొనే వాడు. అప్పుడామె తన ముఖాన్ని పక్కకి తిప్పుకొనేది. అతను తాను సం భాషణలో మునిగిపోయినట్లు నటిస్తూ ఆమె గాలి పీల్చటాన్నీ ఆమె ప్రతి కదలికనీ శ్రద్ధగా వింటూ ఆమె యిటు తిరిగే వరకూ వేచివుండేవాడు. యితరులున్నపుడు ఆమె వుల్లాసంగా స్నేహభావంగా వుండేది. కాని తామిద్దరూ వొంటరిగా వున్నపుడు ఆమె సిగ్గుపడుతూండేది.

ఆమె పనిలోంచి తిరిగి రాకనుండే వొక్కోసారి అతను వచ్చే వాడు. అప్పుడు, ఆకస్మికంగా, నడవలో ఆమె పాదాల చప్పుడు అతనికి వినపడేది; తెరిచివున్న తలుపుగుండా ఆమె నీలిరంగుచొక్కా కొద్దిగా అతని కగుపించేది. ఆమె లోన కొచ్చేది. కనపడీ కనపడని చిరునవ్వుతో ఆమె ముఖం వెలిగేది. ఓలెనిన్‌కి ఆనందంగా భయంగా వుండేది.

అతడేమీ అడగనూలేదు యేదో జరుగుతుందని అనుకోనూలేదు. కాని, ఆమె అతనికి కనపడుతూ వుండటం అనేది అతనికి రాను రాను చాలా అవసరం కాసాగింది.

ఓలెనిన్ తన కోసక్కు జీవితాని కెంత అలవాటుపడిపోయాడంటే తన గత జీవితం అతనికి పూర్తి అన్యంగా అగుపించింది. ఇక తన భవిష్యత్తు సంగతి—తాను జీవించుతూన్న జీవితంకాని భవిష్యత్తు—అతనికేమీ పట్టలేదు.

ఇంటివద్ద నుంచి వుత్తరా లొచ్చినపుడు, తనలాగా జీవించనివాళ్ళు చెడిపోయారని తా ననుకొంటూంటే, తన బంధువులూ మిత్రులూ తానేదో చెడిపోయినట్లు ఆ వుత్తరాల్లో యేడవటం అతనికి మహా మంటగావుండేది. తన గత జీవితాన్ని ఛేదించుకొనివచ్చి నిరాడంబరంగావున్న యీ మారు మూల ప్రాంతంలో తాను నివసించటాన్ని గురించి తానెప్పుడూ విచారించ నని అతనికి గట్టిగా తెలుసు.

దండయాత్ర సందర్భంలో కోటలో తాను గడిపిన జీవితం అప్పుడ తనికి సంతృప్తిగా వుండేది. కాని యిప్పుడు మాత్రం వూరి చివర్న యీ యింట్లో వుంటూనో, లేక అడివిలో ఇరోష్కా అదుపాజ్నల్లో వుంటూనో, ప్రత్యేకంగా మేరియానాని గురించీ లూకాని గురించీ తెలుసుకొన్నపుడూ తన గత జీవితంయొక్క కపటత్వం అతనికి పూర్తిగా అర్థమైంది. అసల ప్పుడే ఆ జీవితమంటే అతనికి అసహ్యంగా వుండేదిగూడా. ఇప్పుడది వర్ణింప నలవిగానంత నికృష్టంగా, నీచంగా అతనికి అగపడింది. ఇక్కడే గ్రామంలో మరింత స్వేచ్ఛాజీవిగా, నిజమైన మానవుడుగా తాను తయారవుతున్నా నని అత ననుకొన్నాడు.

తాను వూహించుకొన్నదానికంటే, చదివిన దానికంటే కకేషియా అతనికి పూర్తి భిన్నంగా అగు పట్టింది.

"గర్జించే నిర్ఝరాలూ, అద్భుతంగా వుండే చొక్కాలు తొడిగిన అమాలత్ బేగ్‌లూ, వీరులూ ధీరులూ, ఖిలులూ గిలులూ యిక్కడెంతమాత్రమూ లేరు" అని అత ననుకొన్నాడు. "ప్రకృతివలే యిక్కడి ప్రజలు జీవిస్తారు. మార్చరాని విధంగా ప్రకృతి సూర్యుడిమీదా గడ్డి గాదంమీదా, చెట్టూ చేమలమీదా, జంతువులమీదా విధించిన నిర్బంధాలు తప్ప మరే నిర్బంధాలూ లేకుండా యీ ప్రజలు చస్తారు, పుడతారు, సంభోగిస్తారు, పోరాడతారు, తాగుతారు, తింటారు, నవ్వుతారు, పేల్తారు, తిరిగీ చస్తారు. అంతే. వారికి మరేవిధమైన కట్టుబాటూ లేదు. వారు సుందరాకారులు. శక్తిమంతులు, స్వేచ్ఛాజీవులు."

తనని వారితో పోల్చుకొన్నపుడు అతనికి సిగ్గూ, విచారమూ కలిగేవి. కోసక్కుగాచేరి, వొక యింటినీ పశువుల్ని కొన్నింటినీ కొనుక్కొని, వొక కోసక్కుపిల్లని పెళ్లి చేసికొని (మేరియానాని మాత్రంగాదు; ఆమెని లూకాకి వదిలి పెడుతున్నాడు గనక), ఇరోష్కాతో గలిసి వేటాడుతూ చేపలు పట్టుతూ, కోసక్కుల్తో వారి దండయాత్ర లప్పుడు కలిసివెళ్లటం అత్యుత్తమమైన పని అని అతను వొక్కొక్కసారి చాలా లోతుగా ఆలోచించేవాడు.

"నే నదెందుకు చేయగూడదు? యెందుకింకా ఆగుతున్నాను?" అని అనుకొని, తనతో తాను తర్కించుకొని తనని ప్రోద్బలపరుచుకోటాని

కతను ప్రయత్నించేడు. "మంచిదనుకొన్నదాన్ని న్యాయమనుకొన్న దాన్ని నే నెందుకని చేయలేక పోతున్నాను ? ప్రకృతికి దగ్గరగావుండి కోసక్కులాగా జీవించటం, యెవరికీ హాని చెయ్యకుండా వుండటం, నన్ను నేను వుపయోగకారిగా చేసుకోటం—నేను మాస్కోలో వున్నప్పుడు నా కున్న కోర్కెల కంటే అదేమైనా అసంగతమైనదా ? ఉదాహరణకి కర్నల్ అవుదామనుకొన్న దానికంటేనో లేక మంత్రి అవుదామనుకొన్న దానికంటేనో ?"

అయినప్పటికీ, అంతిమ నిర్ణయం తీసుకొనే ముందు వేచి చూడమని యేదో కంఠస్వరం అతనికి చెవిలో వూదసాగింది అదేపనిగా. సుఖమంటే వారి అభిప్రాయంకంటే తన అభిప్రాయం భిన్నమైందిగనక తాను లూకా లాగానో ఇరోష్కాలాగానో జీవించలేననే అనిశ్చితమైన భావం అతన్ని వెనక్కి లాగి పట్టుతోంది. ఆత్మ బలి అవటంతోనే అతనికి సుఖముంది.

లూకాకి తానేమిచేసిందీ అతను సంతృప్తితో గ్యాపకం చేసు కొన్నాడు. మరింత త్యాగం చేయటానికి అవకాశాలు వెతికేడు. కాని నిష్ఫలం. ఆ అవకాశాలు లభించలేదు.

సుఖపడటానికి తాను కొత్తగా కనిపెట్టిన మందునుగురించి వాక్కొ క్కప్పుడతను మరిచిపోయి ఇరోష్కా జీవితంలో తన జీవితం కలిపేసే ఆలోచనలో ఆడుకొనేవాడు. కాని, త్వరలోనే యెప్పటి మనిషై త్యాగ మంటే తనకున్న ఆశయానికి మరింత గట్టిగా అంటిపెట్టుకొనేవాడు. ఆ నిర్ణయాన్ని తిరిగి స్థిరపర్చుకొంటే, తాను ప్రశాంతంగా, సగర్వంగా యితరుల సౌఖ్యాన్ని చూసి ఆనందించగలడు.

# 27

సరీగ్గా ద్రాక్షకాయలు కోతగోసేముందు లూకా, ఓలెనిన్‌ని చూడ టాని కొచ్చేడు. అతనెక్కివచ్చిన గుర్రం కొంచెం యెరుపాంటిది. అతను యెప్పటికంటే మహాజోరుగా వున్నాడు.

"భేష్. పెళ్లి చేసికొనే దెప్పుడుమరి ?" ఓలెనిన్ వుల్లాసంగా అడిగేడు.

లూకా సూటిగా సమాధానమేమీ యివ్వలేదు.

"చూడు, నీ గుర్రానికి బదులు యే మొచ్చిందో నాకు!" అతనన్నాడు. "యెలాంటి గుర్రం! సిసలైన లోవ్ గుర్రం! చూడగానే మంచి గుర్రమేదో నేను కనిపెట్టగలను."

(కకేషియాలో కల్లా గుర్రాల పెంపకంలో "లోవ్‌స్టడ్‌ఫారం" అత్యుత్తమంగా పరిగణించబడుతోంది.)

వారా గుర్రాన్ని పరీక్షచేసి పెరట్లో గులుకు నడక నడిచేట్లుచేసేరు. దాన్ని పిత్తుకొట్టేరు. అది చాలా అందంగావుంది. వెడల్పుగా, పొడుగ్గా వుంది. నునుపుగా మెరుస్తూన్నజుట్టు, దట్టమైనతోక, సిల్కులాగావున్న చక్కని జూలూ తలకుచ్చూనూ. అది యెంత పెద్దగుర్రమంటే, దాన్ని యెంతబాగా పెంచారంటే, లూకా అన్నట్లు దానివీపుమీద వొక మనిషి నిద్రపోవచ్చు పడుకొని. దాని గిట్టలూ, కళ్ళూ, పళ్ళూ చక్కగా కుదిరికగా వున్నాయి. అలాంటివి ఫక్తు స్వచ్ఛమైన గుర్రపుజాతిలో మాత్రమే కనపడతాయి. లోలోన మెచ్చుకొంటూ ఓలెనిన్ దాని వంక చూసేడు. కకేషియాలో అతనలాంటి అందమైన గుర్రాన్ని యెన్నడూ చూడలేదు.

"యిక అది పరుగెత్తడం. నువ్వు చూసితీరాలి!" అతని మెడపై చరుచుతూ లూకా అన్నాడు. "అబ్బా, యేమినడక! యేమి వయ్యారం! తెలివిగలది కూడాను—నే నెక్కడికిపోతే అక్కడి కొస్తుంది."

"అదనంగా చాలా యిచ్చావా యేంటీ?"

"నేను లెక్కపెట్టలా" చిరునవ్వు నవ్వుతూ లూకా అన్నాడు. "ఆ డబ్బు నా కొక స్నేహితు డిచ్చాడు."

"నిజంగా అద్భుతమైన గుర్రం! దీని కెంత కావాలంటావో చెప్పు."

"నూటయాభై రూబుల్లిస్తామన్నారు దీన్నమ్మితే. కాని నువ్వు మాత్రం దాన్ని వూరికినే తీసుకోవచ్చు" లూకా వుల్లాసంగా అన్నాడు. "కావాలని అను; యిక యీ గుర్రం నీదే. దాని జీను తీసేస్తాను. నువ్వు తీసుకోయిక. కాని యేదైనా మరో గుర్రాన్ని—ముసలిదైనాసరే—యివ్వు నాకు."

"హరి భగవంతుడా! వద్దు. భలేవాడివే మొత్తానికి! నాక క్కర్లా" ఓలెనిన్ అన్నాడు.

"సరే అయితే. యిదుగో నీకిది తెచ్చా" అని లూకా తన బెల్టు తీసి దాన్నుంచి వేళ్లాడుతూన్న రెండు పట్టా కత్తుల్లోనూ వొకదాన్ని తీసేడు. "దీన్ని యెటవతల నీ కోసమని సంపాదించా."

"భేష్. చాలా చాలా అభివందనాలు."

"అమ్మ నీకు ద్రాక్షపళ్లు తెస్తానని చెప్పింది."

"అదేమీ అక్కర్లా. నువ్వూ నేను యెప్పుడో వొకప్పుడు వ్యవహారం పరిష్కారం చేసుకొందాం. అంతేగాక, యీ కత్తికి బదులు నీకేమన్నా యిస్తున్నాను కనకనా? ఆ?"

"యివ్వనక్కర్లేదంటా నేను. మనం మిత్రులం. నేనుగూడా దాన్ని అలాగే వూరికినే సంపాదించా. గిరీఖాన్ నన్ను తన గుడిసెకి తీసి కెళ్లి నీకేం కావాలో తీసుకోమన్నాడు. అప్పుడు నేనీ కత్తిని తీసుకొన్నా. అది మా ఆచారం."

వారు ఓలెనిన్ గదిలో కెళ్ళి కొంచెం తాగేరు.

"కొంతకాలం వూళ్లో వుంటావా?" ఓలెనిన్ అడిగేడు.

"వుహూం. నేను చెప్పిపోటానికొచ్చా. టెరెక్ అవతలవున్న కంపెనీకి నన్ను పంపుతున్నారు. నా మిత్రుడు నాజర్‌తో గలిసి నేనివ్వాళే పోవాలి."

"మరి పెళ్ళి సంగతేంటి?"

"లగ్నం పెట్టుకొనేనాడు యింటి కొస్తాలే" అయిష్టంగా లూకా అన్నాడు. "తర్వాత మా కంపెనీకి తిరిగి పోతాను."

"అయితే మరి యివాళ నీ కుర్రదాన్ని చూసుకోవేంటీ?"

"ఆవిడవంక చూడటంవల్ల కలిగే లాభమేంటీ? సరే. శెలవ్. మీరు దండయాత్రలో వెళ్లినపుడు మా కంపెనీలో లూకా సంగతి అడగటం మరిచిపోమాక. అడివిపందులున్నయ్యి మా కక్కడ. నువ్వు నమ్మవు చెపితే! నేను రెంటిని చంపా. ఆ స్థలం నీకు చూపుతాలే."

''సరే. శెలవు లూకా. భగవంతుడు నిన్నాశీర్వదించుగాక !''

లూకా తన గుర్రమెక్కి, మేరియానా యింటి కెళ్లకుండానే, నాజరున్న చోటికి వీధిగుండా విలాసంగా స్వారీ చేస్తూ పోయేడు.

''వొక గుక్కెడు పుచ్చుకొందామా మరి ?'' అని యామ్కా యింటివైపు కన్నుకొట్టుతూ నాజరు అన్నాడు.

''ఆ తర్వాతేమిటంట ?'' చిరునవ్వు నవ్వుతూ లూకా అన్నాడు. ''భేష్. నా గుర్రాన్నక్కడికి తీసుకుపో. నేను రావటం ఆలస్యమైతే దానికేదన్నా పెట్టు తిండి. యేమైనా నేను పొద్దున్నే మన కంపెనీ వద్ద వుంటాను.''

''ఆ రష్యావాడి నుంచి మరింకేదన్నా రా బట్టావా ?''

''జీలకర్ర మరేదన్నా ! చాకబేరంలో తిరిగొచ్చేసినందుకు అదృష్టవంతుణ్ణనుకో. అతను గుర్రమివ్వమని అడగటం మొదలెట్టాడు. కాని, అతనికి దక్కిందల్లా ఆ కత్తి'' గుర్రాన్నిదిగి తాళ్ళు నాజరు కందిస్తూ లూకా అన్నాడు.

అతను వెనక్కు తిరిగి పెరట్లోకి గంతేసి, ఓలెనిన్ గది కిటికీ దాటేప్పుడు వంగి నడిచి, మేరియానా యింటివరకూ చాటు చాటుగా పోయేడు. అప్పటికే చీకటి పడింది. మేరియానా వొక వదులు చొక్కా మాత్రమే తొడుక్కొని వుంది. తల దువ్వుకొంటూ నిద్రపోవటానికి తయారవుతోంది. ఆమె ముఖం ప్రశాంతంగా గంభీరంగా వుంది.

''నేనే'' అని మెల్లగా అన్నాడు లూకా.

ఆమె తులిక్కిపడింది. అంతలోనే ఆమె ముఖం ఆనందంతో వెలిగింది. త్వరగా ఆమె కిటికీ తెరిచింది.

''యేమిటది ? యేం కావాలి ?''

''వొక్క నిమిషంసేపు నన్ను గదిలోకి రానియ్యి. చూసీ చూసీ విసుగుబుట్టి చచ్చిపోతున్నా'' ఆమె తలపట్టుకొని అతను ముద్దెట్టుకొన్నాడు. ''దయచేసి నన్ను లోపలికి రానియ్యి.''

''నువ్వు అడగటం కేవలం దండగ. రానివ్వనని చెప్పాను. యెంతసేపైంది నువ్వొచ్చి ?''

అతను సమాధాన మియ్యకుండా ఆమె నదేపనిగా ముద్దెట్టుకోసాగేడు. ఆమె మరే ప్రశ్నలూ అడగలేదు.

"చూడు. యీ కిటికీలోగుండా నా చెయ్యి నీ నడుంచుట్టూ సరిగా పోనియ్యటానికి గూడా వీలులేకుండావుంది" అన్నాడు లూకా.

"అక్కడ నీతో మాట్లాడే దెవరే అమ్మాయ్?" అంటూ ఆమె తల్లి గొంతు వినవచ్చింది.

లూకా తాను పెట్టుకొన్న పొడుగాంటిటోపీ తీసేసి కిటికీ కింద నక్కేడు.

"పో. త్వరగా పో" మేరియానా మెల్లగా అంది.

"లూకా, అమ్మా" అని ఆమె తల్లికి కేకేసి చెప్పింది. "నాన్నని చూడాలని వచ్చాడు."

"అయితే మరి అతన్ని లోపలకి పంపలేదేం?"

"టైం లేదంటున్నాడు."

లూకా వంగి నడుస్తూనే పెరడు దాటి పరుగెత్తి యామ్కా యింటికి చేరేడు. అతన్ని చూసింది ఓలెనిన్ వొక్కడు మాత్రమే. యామ్కా యింటివద్ద నాజరు, లూకాలు చెరివొక ఛాపురాడు ద్రాక్షసారా తాగేసి వూరువిడిచి బైలుదేరేరు.

ఆ రాత్రి వెచ్చగా, ప్రశాంతంగావుంది. వారికి వినపడే ధ్వనల్లా వారి గుర్రాల గిట్టల చప్పుడు మాత్రమే. లూకా వొకపాట యెత్తుకొని పాడటం మొదలెట్టి మొదటి చరణం పూర్తి గాక ముందే నాజరువైపు తిరిగేడు.

"అది నన్ను లోపలికి రానియ్యలేదురా."

"రానివ్వదని నాకు తెలుసు" అన్నాడు నాజరు. "యామ్కా యేం చెప్పిందో తెలుసా? ఆ రష్యావాడు వాళ్ళింటికి వెళ్ళటం మొదలెట్టాడంట. మేరియానాని వాడి కప్పగించినందుకు వాడు తనకు తుపాకీ వొకటిచ్చాడని ఇరోష్కా బడాయి కొట్టుకుంటున్నాడు!"

"ఆ ముసలి తొత్తుకొడుకు వట్టి అబద్ధాలకోరు వెధవ" లూకా ఆగ్రహంతో అన్నాడు. "అది అలాంటి పిల్లగాదు. వాడు కాస్త వళ్ళు దగ్గి

రుంచు కోటం మంచిది. లేక పోతే వాణ్ణి యెముకల్లోకి సున్నం లేకుండా విరగ్గొట్టేస్తా.''

అని అతను తన కింపైన పాట పాడటం మొదలెట్టేడు:

ఇజ్మేలోవ్ గ్రామం నుంచి
అక్కడి యజమాని అందాలవనం నుంచి
వొక నాడొక చక్కని డేగ
యెగిరొచ్చింది బాగ
వెంటనె గుర్రాన్నెక్కి యజమాని
వచ్చి చూశాడు దాన్ని
మరలి రమ్మని దాన్ని మరిమరీ పిలిచాడు
కుడిచేతితో సైగలెన్నిటినో జేశాడు
కాని యీ డేగ
యిలా అంది బాగ
''నీ బంగరు పంజరం నన్నాప లేదోయ్
నీ దక్షిణ హస్తమ్ము నన్నడ్డ బోదోయ్
యెగిరిపోతాను ఆ సముద్రపు వైపు
తెల్లహంస వొక దాన్ని తన్ని చంపేస్తాను
కడుపార యద్దాన్ని కమ్మగా తింటాను''

# 28

ప్రధానం నాడు కార్నెట్ యింట్లో వుత్సవంగా వుంది. లూకా తాను ఓలెనిన్ వద్ద కెళ్లలేదు. కార్నెట్ ఆహ్వానించి నప్పటికీ ఓలెనిన్ విందుకి వెళ్లలేదు. ఆ గ్రామంలో నివసించటం మొదలెట్టినప్పటినుంచీ ఆనాడున్నంత విచారం అతని కెప్పుడూలేదు. లూకా మంచి బట్టలు తొడిగి తల్లి వెంట రాగా కార్నెట్ యింట్లో ప్రవేశించటం ఓలెనిన్ ఆ సాయంకాలాన చూసేడు. లూకా తనపట్ల అంత నిర్లక్ష్యంగా యెందు కున్నాడో అతని కర్థంగాలేదు. అతను తన గదిలోనే కూచుని తన డైరీలో యిలా రాసేడు.

"నేను చాలా విషయాల్ని గురించి ఆలోచించాను. నాలో మార్పు వచ్చింది. కాని, వ్యవహారమంతా మళ్ళీ మొదటికే వచ్చింది. సుఖంగా వుండాలంటే వొక్కటిమాత్రం చాలు. ప్రేమించటం, ఆత్మవైరాగ్యంతో ప్రేమించటం, ప్రతిదాన్నీ ప్రతివ్యక్తినీ ప్రేమించటం, ప్రేమ అనేటువంటి సాలెగూడును వ్యాపింపజేసి దాని కందుబాటులో కొచ్చినవారి నల్లా అందులో పట్టేసెయ్యటం. ఈరకంగా నేను ఐవాన్, ఇరోష్కా, లూకా, మేరియానాలను పట్టివేశాను."

ఈ వాక్యం అతను పూర్తి చేస్తుండగా, ఇరోష్కా తూలుకొంటూ యింట్లో కొచ్చి పడ్డాడు. అతను బాగా హుషారుగా వున్నాడు. కొద్దిరోజుల క్రితం ఓలెనిన్ అతన్ని చూడటానికి అతనింటికి పోయినపుడు, ఇరోష్కా విజయోత్సాహంతో వున్న ముఖంతో పెరట్లో వొక పంది శవంమీదికి వంగి వొక చిన్న కత్తితో నేర్పుగా దాని తోలు వొలుస్తున్నాడు. అతని కెక్కువ యిష్టమైన కుక్కలాంతో సహా అతని కుక్కలు తోకలాడిస్తూ అతనివంక చూస్తున్నాయి. కొంతమంది పిల్లలు దడిమీదగా తొంగిచూస్తున్నారు. యీ వ్యవహారం వాళ్ళకెంత ఆసక్తి గలిగించిందంటే యెప్పటికి మల్లే ముసలాణ్ణి వేధించకుండా వూరుకొన్నారు వాళ్ళు. సామాన్యంగా అతనితో యెప్పుడూ మిత్రభావంగా వుండని అతని యిరుగు పొరుగు అమ్మలక్కలు కొంచెం పిండో, వొక కూజాడు ద్రాక్ష సారాయో, వొక ముంతెడు గడ్డకట్టిన మీగడో అతనికి బహుమతులుగా తీసుకొస్తున్నారు.

మర్నాటి వుదయాన, నెత్తురు మరకలు కొట్టుకొన్న ఇరోష్కా డబ్బుగానీ సారాగానీ తీసుకొని పౌనుల ప్రకారం ఆ పంది మాంసాన్ని అతని సరకుల గదిలో కూచుని పంచిపారేసేడు.

"భగవంతుడి దయవల్ల నా అదృష్టం పండింది. అడవిపందిని చంపాను. ఇప్పు డందరికీ ఇరోష్కా మామయ్యే కావాలి" అని అతని ముఖవైఖరి స్పష్టంగా చెబుతోంది.

ఇక దీని తర్వాత అతను తాగటం మొదలెట్టి నాలుగురోజుల వరకూ దమ్ము తిరక్కుండా తాగేసేడు. అన్నిటికీమించి ప్రధానంనాడు కార్నెట్

యింటోగూడా తాగేడు. తాగినాక అతను కొర్నెట్ యిల్లు విడిచిపెట్టి ఓలెనిన్‌వద్ద కొచ్చేసరికి చచ్చేంత మత్తుగా వున్నాడు.

అతనిముఖం యెర్రగావుంది. గడ్డం చిక్కుపడివుంది. అతను బంగారు జరీతో అలంకరించిన యెర్రటి బిష్మెత్ తొడుక్కొని వున్నాడు. తాను యేటవతల నుంచి సంపాదించిన బేలలైకా *(Bela laika)* అనే వాయిద్యం అతని చేతుల్లో వుంది. యీ వాయిద్య సంగీతం వినిపిస్తానని అతను చాలకాలంగా ఓలెనిన్‌కి వాగ్దానం చేస్తూవచ్చాడు. సంగీతమంటే యిప్పుడతనికి మతి కుదిరి అది తెచ్చాడు గాని ఓలెనిన్ హడావుడిగా రాస్తూండటంచూసి అతనికి ఆశాభంగం కలిగింది.

“రాయి, రాయిరా అబ్బాయ్” అని, ఆ కాగితానికీ తనకీ మధ్య గాలిలో యేదో భూతం యెగురుతూన్నట్లూ దాన్ని బెదరగొట్టకుండా వుండటానికి తాను జాగ్రత తీసుకొంటున్నట్లుగా, అతను రహస్యంగా అన్నాడు.

తర్వాత అతను మెళ్ళకువగా, నిశ్శబ్దంగా నేలమీద కూచున్నాడు. తాగి వున్నప్పుడు నేలమీద కూచోటం అతనికి చాలా యిష్టం.

ఓలెనిన్ చుట్టూచూచి, ఛిఖిర్ తెమ్మని ఇవాన్‌కిచెప్పి, తిరిగి రాయటం మొదలెట్టేడు. కాని నొక్కడే తాగటం అంటే ఇరోష్కాకి విసగడగా వుంది. అతనికి వాగుడు కావాలి.

“నేనా విందుకెళ్ళా” అని అతను మెల్లగా అన్నాడు. “కాని అఖిమండలేదు. వాళ్ళు పందివెధవలు. యిక్కడ నీతో కలిసి కూచుంటే సాలా బాగుంటది.”

“ఆ బేలలైకా యెక్కడ సంపాదిచ్చావ్ ?” ఓలెనిన్ అడిగి రాసుకో సాగేడు.

“నేనూ యే రవతల కెళ్ళారా అబ్బాయ్. వెళ్ళీ అక్కడ తెచ్చా యిదీ” అని ఇరోష్కా ఆ వింత గొంతుకతోనే అన్నాడు. “దీన్ని వాయించ టంలో నేను మొనగాణ్ణి. తార్తారు, కోషక్కు పాటలుగానీ, పెద్దమనుషుల సైనికుల పాటలుగానీ—యేపాటైనా నేను వాయించగలను.”

ఓలెనిన్ తలెత్తిచూసి, కొద్దిగా చిరునవ్వునవ్వి, తిరిగీ రాసుకో సాగేడు.

అతని చిరునవ్వుని చూసి ముసలాడికి వుత్సాహంగలిగింది.

"అదావు, అదావరా అబ్బాయ్" అత నన్నాడు వెంటనే వొక నిర్ణయాని కొచ్చి. "సరే. వాళ్ళు నిన్ను నొప్పించారు. అయితే యేమి టంట ? వాళ్ల ముఖాన వుమ్మేసి యిక ఆ సంగతి మరిచిపో. అంతేగాని యిలా కాగితంమీద బరకటంవల్ల వుపయోగమేంటి ?"

నేలమీద తన మొద్దువేళ్లతో గీరుతూ, అసహ్యాం చూపించేందుకు ముఖం చిట్లించి, అతను ఓలెనిన్ని అనుకరించేడు. "ఫిర్యాదులు రాస్తే ప్రయోజన మేమీలేదు. రా. బుద్ధిగలిగి కొంచెం తాగు !"

రాయటమంటే ఫిర్యాదులు రాయటం తప్ప మరోటి లేదని ఇరోష్కా అభిప్రాయం.

ఓలెనిన్ విరగబడి నవ్వేడు. ఇరోష్కాకూడా అంతే చేసేడు. తర్వాత అతను యెగిరి నుంచుని బేలలైకా వాయించటంలోనూ తార్తారు పాటలు పాడటంలోనూ తన నైపుణ్యాం చూపసాగేడు.

"రాయటం కంటే యిది మంచిది గాదురా అబ్బాయ్ ? అవకాశ ముండగానే నా పాటలు విను. చచ్చిపోయావంటే యే పాటలూ విన లేవు. వుషార్ ! విను."

అతను మొదట తాను రాసిన పాటపాడేడు:

అబ్బా, డిడ్‌డీ, డీడిడీ, డిడిడ్డీ
మేము చూసే సరికి మనిషెక్కడున్నాడు ?
మార్కెట్టు అంగట్లో మెదలకను కూచునీ
అందరికి పిన్నులను అమ్ముతున్నాడోయ్ !

తర్వాత అతను తన పాతస్నేహితుడైన సార్జంట్—మేజర్ వద్ద నేర్చు కొన్న పాట పాడేడు:

సోమవారమునాడు చక్కగా ప్రేమించి
మంగళవారం బంత మరి బాధ పడ్డాను
బుధవారమూనాడు ప్రేమ వెలిబుచ్చాను

గురువారమంతయును కాచుకొని చూశాను
శుక్రవారమునాడు చెలియ పలికిందండి
అయ్యో ! నన్నామె వలదు పొమ్మనెనండి
శనివారమందునా చాల నిరాశతో
మరణింత మనుకొంటి మరి తప్పకుండా
కాని, నరకములోన గురితప్పకుండా
పడిపోదునను భీతి పట్టి పీడించా
ఆదివారమునాడు అది మార్చుకొంటి

ఆ తర్వాత మళ్లీ :

అబ్బా, డిక్‌డీ, డీడిడీ, డిడిడ్డీ
మేము చూసే సరికి మనిషెక్కడున్నాడు

అటు తర్వాత కన్నుగీటుతూ, భుజాలు కుదుపుతూ, పాటకి తాళంగా అడుగువేస్తూ, అతను పాడ సాగేడు:

ముద్దెట్టుకొంటాను మురిపెంగ జూస్తాను
యెర్రెంటి రిబ్బనూ యిస్తాను నీకూ
చిట్టి ఆశని నిన్ను చక్కగా పిలుస్త
చిట్టి ఆశా నన్ను చేరి ప్రేమిస్తావ ?

అలా పాడుతూంటే అతనికెంత హుషారెత్తిందంటే, హఠాత్తుగా అతను ముందుకురికి బేలలైకా వాయిస్తూనే ఆ గది చుట్టూ నృత్యం చేయ సాగేడు.

''అబ్బా, డిడ్‌డీ'' అనేపాటలు — ''పెద్దమనుషులపాటలు'' — అతను ప్రత్యేకంగా ఓలెనిన్ కోసరం పాడేడు. కాని మరి కొన్ని గ్లాసుల చిఖిర్ తాగగానే అతనికి గడిచిన దినాలు గ్యాపకమొచ్చేయి. అతను కోసక్, తార్తారుపాటలు పాడ నారంభించేడు. తనకి బాగా యిష్టమైన పాటల్లో వొక పాట పాడేప్పుడు హఠాత్తుగా అతని కంఠం వణికింది. అతను పాడటం ఆపేసి బేలలైకా మాత్రమే వాయించేడు.

''అబ్బా నా ప్రియమిత్రుడా !'' అతనన్నాడు.

అతని గొంతు వింతగా వినిపించింది. ఓలెనిన్ చుట్టూ చూసేడు: ముసలాడు యేడుస్తున్నాడు. అతని కళ్ళు నీళ్ళతో నిండివున్నాయి. వొక కన్నీటిబొట్టు అతని బుగ్గమీదుగా కిందకి జారుతోంది.

"నా రోజులు ఐపోయినాయి. యిక నవి తిరిగిరావు!" వెక్కి యేడుస్తూ అతను చెప్పేడు. హఠాత్తుగా, కన్నీళ్ళు తుడుచుకోకుండా, అతను గర్జించేడు: "తాగు! తాగ వెందుకని?"

అన్నిటి కంటే అతన్ని వొక తార్తారుపాట కదిలించినట్లుంది. ఆ పాటలో కొద్దిమాటలు మాత్రమే వున్నాయి. కాని, శోకతప్తమైన దాని పల్లవిలో "అయ్యో యెలాంటిరోజు, డా—లా—లే" మంత్ర శక్తి వుంది. ముసలాడా పాటని అనువదించి చెప్పేడు:

"వొకనాడొక యువకుడు తన గొర్రెల్ని మేతకై పర్వతాల్లోకి తోలుకుపోయాడు. అప్పుడు రష్యన్లువచ్చి అతని కుగ్రామాన్ని తగలబెట్టేసి మగాళ్లని చంపేసి, ఆడవాళ్లని తమతోపాటు తీసుకుపోయారు. ఆ యువకుడు పర్వతాలనుంచి తిరిగొచ్చాడు. యిది వరకి గ్రామమున్నచోట యిప్పుడు స్మశానంగావుంది. అతని తల్లి అక్కడలేదు; తమ్ములులేరు; యిల్లులేదు. వొక్కచెట్టు మాత్రం వొంటరిగా నుంచునుంది. ఆ యువకుడా చెట్టుకింద కూచుని దుఃఖించాడు. "నీవలే నేను గూడ వంటరివాణ్ణయ్యాను. అయ్యో యెలాంటిరోజు, డా—లా—లే."

శోకతప్తమై గుండెలు పగలగొట్టే ఆ పల్లవిని ఇరోష్కా చాలా సార్లు పాడేడు. తర్వాత హఠాత్తుగా అతను తన తుపాకీ పట్టుకొని పెరట్లోకి దూసుకుపోయి దాన్లోవున్న గుండ్లన్నీ గాలిలోకి పేల్చివేసేడు. తర్వాత మళ్లీ యిదివరకటి కంటే శోకంతో, ఆ పల్లవి పాడేడు.

ముసలాడు బైటికిపోయేప్పుడు ఓలెనిన్ అతనివెంట తలవాకిటి వసారావరకూ వెళ్లి చుక్కలు మిణుకు మిణుకుమంటూన్న ఆకాశంలోకి జిగేల్ మని గుండ్లు దూసుకుపోవటం చూసేడు. దీపాలు వెలిగించివున్న కార్నెట్ యింటి కిటికీలనుండి మాటలధ్వని వినవచ్చింది. పెరట్లో తలవాకిటి వసారా వద్ద ఆడపిల్లలు గుమిగూడుతూ యింటికీ పాకకీ మధ్య ముందుకీ వెనక్కీ పరుగెత్తుతున్నారు. చాలామంది మగవాళ్ళు యింట్లోంచి అరుస్తూ పాడుతూ బైటికి పరుగెత్తుకొచ్చి ఇరోష్కా పల్లవితో తమ గొంతు కలిపేరు.

''నువ్వక్కడుండలే దెందుకనీ?'' అనడిగేడు ఓలెనిన్.

''వాళ్ల సంగతి పట్టించుకోమాకసలు'' అని ముసలాడన్నాడు. అత నెందుకో నొచ్చుకొన్నట్లున్నాడు. ''వాళ్లంటే నాకిష్టంలేదు. యేం మనుషులంట యేం మనుషులు! నీ గదిలో కెళ్లాంపద. వాళ్ల సంగతలా వదిలెయ్యి. నువ్వూ నేనూ కలిసి వుత్సవం చేసుకోగలంలే.''

ఓలెనిన్ అతని వెంట లోనకెళ్ళేడు.

''లూకా యెలావున్నాడో? అతనికి సంతోషంగావుందా? అతను నన్ను చూడటానికి రాడా?''

''లూకాయా?'' ముసలాడు మెల్లగా అన్నాడు. ''వాళ్లు లూకాతో యేంచెప్పారో నీకు తెలుసా? నేనా పిల్లని నీ కప్పగించటానికి చూస్తున్నానని చెప్పారు! ఐనా, ఆవిడలో అంత ప్రత్యేకత యేమున్న దంట? కావాలంటే ఆవిడగారు మనకాళ్లదగ్గిరొచ్చి పడుతుంది: డబ్బివ్వు, మన దవుతుంది. అదంతా నేనేర్పాటు చేస్తాలే, చేస్తాగా.''

''వద్దు మామా. ఆమె నన్ను ప్రేమించకపోతే డబ్బేమీ చెయ్యలేదు. యిక ఆ విషయం వదిలేద్దాం పట్టు.''

''నువ్వన్నది నిజం: వాళ్ళు మన్ని ప్రేమించరు! అసలు మన నెవరూ ప్రేమించరు'' అని ఇరోష్కా మళ్లీ యేడ్వసాగేడు.

ఆ సాయంత్రం మామూలుకంటే యెక్కువగా తాగేడు ఓలెనిన్.

''అయితే నా లూకా సంతోషంగా వున్నాడన్నమాట యిప్పుడు'' అని అతను అనుకొన్నాడు. కాని, అతని హృదయం బరువుగావుంది. ఇరోష్కా యెంత తాగేడంటే చివరికతను నేలమీద కుప్పగా కూలిపోయేడు; అతన్ని యింట్లోంచి బైటికీడ్వటంకోసం ఐవాన్ సైనికుల్ని పిలిచి సహాయం తీసుకోవాల్సి వచ్చింది. ముసలాడి ప్రవర్తన అతని కెంత అసహ్యం కలిగించిందంటే అతను ఫ్రెంచి భాషలో వొక్కముక్కగూడా అనలేదు.

# 29

అది ఆగస్టునెల. చాలారోజులుగా ఆకాశంలో వొక్క మబ్బు గూడా అగుపించలేదు. ఉదయాన్నుంచే యెండ మండిపోవటం మొద

లేచింది. వెచ్చటి గాలి యిసుక దిబ్బలనుంచీ, రోడ్డునుంచీ యిసుక మబ్బులు లేగొట్టి గిరగిర తిరుగుతూ రెల్లుదుబ్బులమీదా చెట్లమీదా దాన్ని పడేస్తున్నది. పచ్చిగడ్డీ, ఆకులూ దుమ్ములో కప్పబడి వున్నాయి. రోడ్లూ, వుప్పుసౌడు భూములూ యెంతగా యెండిపోయాయంటే కాళ్లకింద అవి ఖరాఖరామని మోగుతున్నాయి. చాలా కాలంనాడే టెరెక్ నది యెండిపోవటం మొదలెట్టింది. అందువల్ల యిప్పుడు కాలువలూ, యేటిపాయలూ, యెండిపోయి వున్నాయి. గ్రామం దగ్గరున్న నీటిగుంట యెండిపోతూ, గొడ్లు బాగా తొక్కిన దాని బురదవొడ్లు బయట పడుతున్నాయి. రోజంతా పిల్ల లక్కడ అరపటం, యీదులాడటం ఆదీ వినబడుతోంది. గడ్డి మైదానాల్లోవున్న రెల్లుదుబ్బులు యెండి వంకరలు తిరిగేయి. గొడ్లు అరుస్తూ పొలాల్లోకి పోతున్నాయి. అటూ ఇటూ తిరుగుతూ, టెరెక్ అవతల వున్న కొండల్లోకి అడవిపందులు లేచి పోతున్నాయి. చెడుగబులు కంపుగొట్టే ఆ గాలిలో గ్రామంమీదా మైదానాల్లోనూ గుంపులకొద్దీ దోమలూ యీగలూ జుంమంటూ యెగురుతున్నాయి. పర్వతాల తెల్లటి శిఖరాలు బూడిదవర్ణపు ఆవిరిపొగచాటున దాక్కున్నాయి. అబ్రెకుక్కలు నదిని లోతులేనిచోట దాటారనీ కోసక్కుప్రాంతంలో తిరుగుతున్నారనీ పుకారు పుట్టింది. ప్రతి సాయంత్రమూ సూర్యబింబం యెర్రగా మండుతూ కూకుతోంది.

సంవత్సరంలో ఆ నెల మాంచి హడావుడిగా వుండే పనులకాలం. గ్రామజనాభా అంతా గూడా పుచ్చకాయలచేలల్లోనూ, ద్రాక్ష తోటల్లోనూ ముసురుకొంది.

ఆ సంవత్సరం ద్రాక్షపంట బాగా పండింది. కాయలు చాలా ఘనందుగా వున్నాయి. మెలికలు చుట్టుకొంటోన్న పచ్చని ఆకుల్తో పెరిగివున్న ద్రాక్ష తోటలు చల్లని నీడలో వున్నాయి. ఆ ఆకులమధ్య బరువుగా వున్న నల్లటి పళ్లగుత్తులు అంతటా వేళ్ళాడుతున్నాయి. చొక్కాలనిండా ద్రాక్షరసం కొట్టుకొన్న పిల్లలు తమ చేతుల్లోనూ నోళ్లల్లోనూ పళ్ళగుత్తులు పట్టుకొని తమ తల్లుల వెనకాల పరుగెత్తుతున్నారు. చిరుగులగుడ్డలు తొడిగిన నోగే కూలివాళ్ళు తమ భుజాలమీద బరువాంటి పళ్లగంపలు మోస్తున్నారు. కళ్లవరకూ తలచుట్టూ రుమాళ్ళు చుట్టుకొని ఆడపిల్లలు బళ్ళు పొర్లిపోయేట్లు నిండా పళ్ళు వేసుకొని యెడ్లని తాళ్ళు బట్టుకొని

బళ్లు తోలుకెళ్తున్నారు. రోడ్డువెంట పోతూన్న సైనికులు పళ్ళు అడుగుతూంటే ఆడపిల్లలు బండి ఆపకుండా బండిపై కెగబాకి గుప్పెళ్లకొద్దీ పళ్లు తీసి సైనికుల వొడుల్లో పడవేస్తున్నారు.

కొన్ని పెరళ్లల్లో పళ్ళు వత్తేసి రసంతీయటం యెప్పుడో ఆరంభమైంది. ఖాళీ ద్రాక్ష తోళ్లవాసనతో గాలి నిండివుంది. తమ పంట్లాములు పైకిమడిచి రసంకొట్టుకొన్న కాళ్లతో, రక్తవర్ణంగావున్న పళ్లరసపు తొట్టెలవద్ద నోగే కూలివాళ్ళు హడావిడిగా వున్నారు. పందులు గుర్రు గుర్రుమని అరుస్తూ ఆ ఖాళీతోళ్ళు కడుపునిండా తిని అక్కడేపడి దొర్లుతున్నాయి. చదునుగా వున్న పాకలమీదా క్షీరశాలలమీదా యెర్రటి గుత్తులు వొత్తుగా యెండ కొట్టబడివున్నాయి. కొండకాటిగాడి పక్షులూ, కాకులూ నాటికప్పుల మీద మూగి గింజలు పొడుచుకొని తింటూ వొకచోటినుంచి మరోచోటికి రెప రెప లాడుతు యెగురుతున్నాయి.

వొక సంవత్సరపు శ్రమ ఫలితం వుల్లాసంగా పోగుచేయబడుతోంది. ఆడవాళ్ల గొంతుల్తో, నవ్వుల్తో, పాటల్తో నీడగావున్న ఆ తోటలు మారు మోగుతున్నాయి. ద్రాక్ష తీగెల ముదురాకు పచ్చరంగు పక్కన వారి రంగుల రంగుల దుస్తులు జిగేల్‌మని ప్రకాశిస్తున్నాయి.

మేరియానా, మధ్యాహ్నం తమ తోటలోని వొక పీచ్ చెట్టునీడని కూచుని వొక కట్టని బండికిందనుంచి తమ కుటుంబానికి అన్నపు కుండ లవీతీస్తోంది. బడినుంచి శెలవు మీదొచ్చిన కార్నెట్ ఆమె కెదురుగా గుర్రపుజీను గుడ్డమీద కూచుని వొక చిన్న కూజాలోంచి తన చేతులమీద నీళ్ళు పోసుకుంటున్నాడు. యింతకుముందే ఆవూరి దగ్గరి నీళ్ల గుంటలో యీతలు గొట్టి వచ్చిన ఆమె చిన్న తమ్ముడు ముఖాన్ని తన చొక్కా చేతుల్తో తుడుచుకొంటూ, భారంగా గాలి పీలుస్తూ, తిండికోసమై తల్లి వంకా అక్కవంకా ఆదుర్దాగా చూస్తూ నుంచున్నాడు. తన బలమైన, యెండకి నల్లబడిన చేతులమీద చొక్కా చేతులు పైకి మడచి అతని తల్లి వొక పొట్టి తార్తారు మేజాబల్లమీద యెండుచేపలూ, ద్రాక్షపళ్ళూ, గడ్డకట్టిన మీగడా వడ్డిస్తోంది.

కార్నెట్ తన చేతుల్ని పొడిగా తుడుచుకొని, టోపీ తీసేసి క్రాస్‌చేసుకొని, మేజాబల్లకి దగ్గరకి జరిగేడు. తమ కాళ్ళు తమ కింద

మడుచుకొని, తల్లీ కూతురూ కూచున్నారు. పిల్లవాడు ఆ చిన్న కూజా పట్టుకొని గట గట తాగేసేడు. ఆఖరికి చెట్టు నీడలో గూడా భరించ రానంత వేడిగావుంది. తోటలపై నున్న గాలి అసహ్యంగా, వాసనగావుంది. చెట్లకొమ్మలగుండా పయనించుతూన్న వెచ్చని, బలమైన గాలివల్ల చల్ల దన మేమీ రావటంలేదు; తీగెల మధ్యనున్న పళ్లచెట్ల తలలు మాత్రం వంగుతున్నాయి.

కార్నెట్ మరోసారి క్రాస్ చేసుకొని తన వెనకాల వొక ద్రాక్ష ఆకు కప్పివున్న వొక చిన్న ఛిఖర్ కూజా పట్టుకొని దాన్ని నోటికి కరుచు కొని కొంతతాగి కూజాని తన భార్య కందించేడు. అతని చొక్కా మెడ వద్ద తెరిచివుంది; కండలుతేరి వెంట్రుకల్తో నిండివున్న అతని యెదురు రొమ్ము కనపడుతోంది. అతని చక్కని, జిత్తులమారి ముఖం వుల్లాసంగా వుంది. అతని చేతల్లోగానీ మాటల్లోగానీ యిప్పుడు నటన అనేదే లేదు. అతను వుషారుగా, సహజ బుద్ధితో వున్నాడు.

"ఆఁ. పాక వెనకాలున్న ఆ కాస్తా మనం యీ రాత్రికి పూర్తి చేస్తామనే నమ్మకం నీకుందా ?" తన తడి రొట్టెని తుడుచుకొంటూ అత నడిగేడు.

"గాలి సరిగా వుంటే చేసేస్తాంమరి" అన్నాది అతని భార్య. "చూడూ, డెమ్కిన్ వాళ్ళు యింకా సగం పనన్నా పూర్తి చెయ్యానే లేదండీ. ఉస్టెంకా వొకర్తేవుంది. వొక్కర్తే చచ్చేంత పని చేస్తూంది పాపం."

"సరిగ్గా వాళ్లకి మల్లేనే" భుజాలెగరేస్తూ కార్నెట్ అన్నాడు.

"యిదుగో, చిట్టీ, కొంచెం తాగు" మేరియానాకి కూజా నందిస్తూ ఆమె అనింది. "దేముడు దయ తలిస్తే, మనం చక్కగా పెళ్లికార్యం జరపగలుగుతాం."

"అదెందు కిప్పుడు ? ముందు యీ పని సంగతేదో ఆలోచించు దాంపట్టు" అన్నాడు కార్నెట్.

మేరియానా తల వంచుకొంది.

"యేం, ఆ సంగతిని గురించి యెందుకని మాటాడగూడ దంట ?" అన్నది ఆమె తల్లి. "యికె నెంతో దూరంలేదు."

"పూరిఖే ముందు జరగబోయే వాటిని గురించి ఆలోచించి ప్రయోజనంలేదు" అన్నాడు కార్నెట్. "ముందు యీ పంట సంగతి తేలాలి."

"చూడు, లూకా తెచ్చిన కొత్త సుద్రాన్ని చూశావా?" అని ఆమె అడిగింది.

"మనింట్లో వున్న మనిషి యిచ్చింది యిప్పుడతని దగ్గిరెంత మాత్రం లేదండోయ్. దాన్ని వ్వేసీ కొత్తదాన్ని తెచ్చాడు!"

"వుహూం. నేను దాన్నింకా చూడలేదులే. కాని యివాళ ఐనాన్‌తో మాట్లాడా. వాళ్లకి మరో వెయ్యి రూబుళ్ళు వచ్చినయ్యని అతనన్నాడు."

"వాళ్ళు బంగారంలోపడి దొర్లుతున్నారనుకోండి యిన్ని మాటలెందుకింకా."

ఆ కుటుంబానికి సుఖంగా సంతృప్తిగావుంది. పని బాగా జరిగిపోతోంది. వాళ్ళు అనుకొన్నదానికంటే ద్రాక్షపళ్ళు మరింత యెక్కువగానూ మరింత మేలురకంగానూ వున్నాయి.

అన్నం తిన్నాక మేరియానా యెడ్లకి కొంత పచ్చిగడ్డి పడేసి తన బిష్మెత్‌ని దిండుగా మడిచి పిసరు పిసరుగా నలిగున్న గడ్డిమీద, బండి కింద, పడుకొంది. ఆమె వొంటి నొక నీలిరంగు పాదులు చొక్కా, నెత్తిమీ దొక యెర్రటి రుమాలు తప్పితే మరేమీలేవు. ఐనా ఆమెకి భరించ రానంత వేడిగావుంది. ఆమె ముఖం భగ భగ మంటోంది. తన కాళ్ళెక్కడ పెట్టాలో ఆమెకి తోచలేదు. కళ్ళు నిద్రమత్తుతో అలసటతో బరువుగావున్నాయి. పెదిమలు తెరుచుకు నున్నాయి. ఆమె ప్రయత్నంచేసి భారంగా గాలి పీలుస్తోంది.

వొక పక్షం రోజులుగా పంట కోత జరిగి పోతోంది. మేరియానా అదే పనిగా చాలా కష్టపడి పనిచేస్తోంది. చీకటితో నిద్రలేచి, మంచంలోంచి సరాలునదూకి, చల్లటి నీళ్లతో ముఖంకడుక్కొని, కాళ్లకి చెప్పులు గిప్పులు లేకుండానే గొడ్లవద్దకి పరుగెత్తుతుంది. తర్వాత బూట్లుతొడిగి, బిష్మెత్ వేసుకొని, యెడ్లని బండికట్టి పనికోసరం ద్రాక్షతోటకి పోతుంది. తినటానికి కొంచెం రొట్టె మాత్రం తీసికెళ్తుంది మూటగట్టి. ఆ మీద ద్రాక్షపళ్ళు

కోసి గంపల్లోనింపి మోస్తుంది. మధ్యలో యిక వొక గంట మాత్రమే విశ్రాంతి. తర్వాత, సాయంత్రం, వుల్లాసంతో, యే మాత్రం అలిసి పోకుండా, బండికట్టి యింటికి తోలుకొస్తుంది. పొద్దుగూకేవేళ, గొడ్ల పనదీ చూసినాక, గుమ్మడిగింజలు కొన్ని తీసికొని, నలుగురూ చేరే బజారుమూల కెళ్తుంది, అక్కడి ఆడపిల్లల్తో అదీ యిదీ కబుర్లు చెప్పుకోటానికీ నవ్వటానికీ పేలటానికీనూ. చీకటి పడగానే యింటికెళ్ళి, తల్లి దండ్రుల్తోనూ తమ్ముడి తోనూ కలిసి అన్నంతిని, స్టోవ్‌మీద కెక్కుతుంది. కులాసాగా దిలాసాగా నిద్రమత్తుతోనే వుంటూ ఓలెనిన్ వాళ్ల సంభాషణ వింటుంది. అతను వెళ్లి పోంగానే తన మంచమెక్కి పడుకొని వుదయం అయ్యేవరకూ హాయిగా నిద్రపోతుంది. మళ్ళీ మర్నాడు మళ్ళీ అదేవరస.

పెండ్లి నిర్ణయమైనప్పట్నుంచీ ఆమె లూకాని చూడ లేదు. పెండ్లి దినంకోసం ఆమె ప్రశాంతంగా యెదురుచూస్తోంది. తమ యింట్లో అద్దె కున్న ఓలెనిన్‌తో మాట్లాడటం మొదలైన వాటికి ఆమె అలవాటు పడింది. అతని కళ్ళు తన మీద వున్నాయని ఆమెకి తెలుసు. అలావుండటం ఆమెకి ఆనందంగా గూడా వుంది.

# 30

వేడిగా వుక్కగా వున్నప్పటికీ, తన చుట్టూరా దోమలు జుంమ్ మంటూన్నప్పటికీ, పక్కన చిన్నపిల్లాడు దొర్లుతూ తనని తోస్తున్నప్పటికీ, ముఖం మీదకి జేబురుమాలు లాగి, మేరియానా నిద్ర పోబోతుంది. సరీగ్గా ఆ సమయానికే హఠాత్తుగా ఉస్టెంకా బండికిందదూరి వచ్చి ఆమె పక్కన పడుకొంది.

''యిక నిద్రపొండే అమ్మాయిలూ, నిద్రపొండి'' పడుకొంటూ ఉస్టెంకా అంది. ''వుహూఁ. ఆగాగు!'' అంటూ ఆమె యెగిరి లేచి నుం చుంది. ''యెబ్బే, యిదేమీ బాగోలా.''

కొన్ని పచ్చటి కొమ్మలు విరిచి, బండికి రెండు పక్కలా చక్రాల్లో వాటిని గుచ్చి, వాటిమీద తన బిష్మెత్ పరిచింది.

''అరే. బైటికి నడవరా నువ్వూ'' అని ఆమె ఆ చిన్నపిల్లాడికేసి అరిచింది. ''మగపిల్లాడికి ఆడాళ్లతో యేంపనిరా? పరిగెయ్ బైటికి!''

ఆ కుర్రాడు బైటికి పోగానే ఉస్టెంకా అటూ యిటూ చూసి మేరియానాని గట్టిగా కావిలించుకొని ఆమె బుగ్గలూ మెడమీదా ముద్దు పెట్టుకోసాగింది. ''నా ప్రియేసీ! నా డార్లింగ్!'' గలిబిలిగా విరగబడి నవ్వుతూ మధ్య మధ్య ఆమె అనింది.

''యిదంతా నువ్వు ఆ తాత దగ్గిర్నుంచి నేర్చుకొన్నావు! చాలు గాని ఆపిక!'' ఆమె కౌగిలినుంచి విడివడటానికి ప్రయత్నించుతూ మేరియానా అన్నది.

వాళ్ళు విషయం మీద యెంత పక పక మని బద్దలైపోయారంటే వారి పక పకలు మేరియానా తల్లికి వినిపించగా ఆమె నోరు ముయ్యండే అని కేక బెట్టింది.

''నన్ను జూసి నీవు అసూయగా వుందంటే?'' అని ఉస్టెంకా మెల్లగా అడిగింది మేరియానాని.

''అబ్బ, యేం వెధవ్వాగుడు! ఐనా, నువ్విక్కడి కెందుకొచ్చినట్టు? నిద్రపోదాం పట్టవే.''

కాని, ఉస్టెంకా వూరుకో లేదు.

''మేరియానా! నే నీకేం చెప్పాలనుకొన్నానో చెప్పుకోమరి!''

మేరియానా తన మోచేతిమీద కొంచెం లేచి జేబురుమాలు సరి జేసుకొంది.

''యేమిటంట అదీ?''

''మీ యింటో అద్దెకున్నవాణ్ణి గురించి నాకూ కొంచెం తెలుసేవ్!''

''తెలుసుకోవాల్సిం దేమీలేదు'' అన్నాది మేరియానా.

''నువ్వు టక్కులాడి తాబేటిబుర్రవి కాదంటే? ఆ?'' తనమోచేత్తో ఆమెని పొడుస్తూ అన్నాది ఉస్టెంకా. ''నువ్వు నాకేం చెప్పక్కర్లేదు. అయితే అతను నిన్ను చూడటంకోసరం వస్తూవున్నాడన్నమాట? కదూ?''

''వస్తూన్నాడనుకో. అయితే యేమిటంట ?'' అన్నాది మేరి యానా, సిగ్గుతో ముఖం జేవురించుతుండగా.

''యిదుగో నా సంగతే చూడవే మాటవరసకీ. నేను మామూలు పిల్లని. నా విషయం యేవీ నేను దాచుకోను. అందరికీ చెప్పేస్తాను'' అన్నాది ఉస్టెంకా. వుల్లాసంగావున్న ఆమె యెర్రటి చెక్కిళ్ళుగల ముఖం సాలోచనతో గంభీరముద్ర దాల్చింది. ''నే నెవ్వరికీ హాని చెయ్యటంలేదు. అతనంటే నాకు ప్రేమ, అంతే.''

'' తాత సంగతా నువ్వనేది ?''

''అవును.''

''కాని, అది పాపం సుమా.''

''ఆం. పోదూ. మేరియానా, కాస్త స్వేచ్ఛ దొరికినప్పుడు తప్పితే ఆడపిల్ల జల్సాచేసే దెప్పుడే ? ఆ ?. పెళ్లి జేసుకుంటే పిల్లల్ని కంటాను. యిక అక్కణ్ణుంచీ వుందనీ లేదనీ, అదనీ యిదనీ, నానా బాదర బందీనూ. నువ్వుగూడా అంతే. లూకాని పెళ్లి జేసుకునే దాకా ఆగమ్మాయ్ కొంచెం. యిక జల్సా సంగతే యెత్తవు. యెప్పుడూ పనీ, పిల్లలూనూ !''

''అయితే యేమిటంట ? పెళ్లయినవాళ్ళు కొంతమంది చాలా హాయిగా బతుకుతున్నారు.''

''అదంతా ఆపేసి, మేరియానా, లూకాకీ నీకూ సమ్మంధం యెలా వుందో చెప్పు కొంచెం.''

''నీకు తెలిసినదానికంటే యితరం యేమీ లేదు. అతను నన్ను పెళ్ళిచేసికోవాలనుకున్నాడు. మరి నాన్నేమో నాక యేడాదికి వాయిదా వేశాడు. యిప్పుడిక ఆకులురాలు కాలంలో పెళ్లిజరగాలని నిర్ణయమైంది.''

''అది సరే. అతను నీతో యేమన్నాడూ ?''

''యేమంటాడంటా ? నన్ను ప్రేమించానన్నాడు. అదీనూ మనిద్దరం కలిసి ఆ ద్రాక్షతోటల్లో కెళ్దాంపద అని అదే పనిగా అడిగాడు.''

''అరి వుండాకోరూ ! అయితే నువ్వు వెళ్ల లేదుగదూ ? వెళ్ళావా? కాని, యెంత చలాకీ ముండాకొడు కయ్యాడో చూడు ! మొత్తం వూళ్లో

అందరికంటే మొనగాడి జిఖిల్ ! సైన్యంలోగూడా నిజంగా సరదా చేస్తు న్నాడని అంటున్నారు. మొన్న మా కిర్కా యింటి కొచ్చాడు. వచ్చీ, లూకా కొత్త గుర్రాన్ని చూడాలన్నాడు. అది మహా పసందైన దన్నాడు. యే దెలావున్నా నువ్వు లేక పోతే అతనికి బాధగానే వుండి వుండాలను కొంటా. ఆః. యింకా యేమన్నాడూ ?''

''అయితే ప్రతిదాంటోనూ నీ వేలు దూర్చక తప్ప దన్నమాట ?'' మేరియానా నవ్వుతూ అడిగింది. ''సరే. వొకనాటి రాత్రి బాగా తాగి నా కిటికీ దగ్గర కొచ్చి తలుపు తియ్యమన్నాడు.''

''తలుపు తీసావా మరీ ?''

''వుహూఁ. తియ్యలా. నే నొక మాటన్నానంటే యిక చచ్చినా ఆ మాట తప్పేదిలేదు'' అని మేరియానా గంభీర స్వరంతో అంది.

''కాని, యెటువంటి వాటమైన కుర్రాడు ! యీ వూళ్ళో ఆడ పిల్లల్ని అత నేదడిగినా కాదనలేరే !''

''అలా అయితే అతన్ని ఆ ఆడపిల్లల దగ్గరకే పొమ్మను.''

''అయితే నీకు జాలి లేదంటే ?''

''వుంది. కాని నా దగ్గర పిచ్చి పిచ్చి వేషాలు పనికిరావు. అది మంచి పద్ధతిగాదు.''

ఉస్టెంకా హఠాత్తుగా తనముఖాన్ని స్నేహితురాలి రొమ్ముల మధ్య దాచుకొంది. ఆమెని కౌగలించుకొని వొళ్లంతా వూగిపోయేట్లు నవ్వింది. ''ఆసి వెర్రిదానా !'' అని రొప్పుతూ అంది. ''నీకు సుఖం అంటే యిష్టంలేదు,'' అని మేరియానాకి చక్కలిగింతలు పెట్టసాగింది.

''ఆపవే, నన్ను వొత్తి చంపేస్తున్నావే'' అంటూ మేరియానా నవ్వుతూ కీచురుమంది.

''ఆహా, ఆ కుర్రముండల కాలక్షేపం చూడమంట'' అని నిద్ర మత్తుగా మేరియానా తల్లి అనటం వినపడింది. ''మీకింకా అలుపు రాలే దంటే ?''

''నీకు సుఖమంటే యిష్టంలేదు'' లేచి కూచుంటూ, ఉస్టెంకా మెల్లగా మళ్ళీ అదేమాట అనింది. ''కాని నువ్వు భలే అదృష్టమంతు

రాలివి—వాళ్లంతా నువ్వంటే పడి చస్తున్నారు. మరి నిన్ను తాకితే చురుక్కుమని ముళ్ళగుచ్చుకొంటునయ్యి. ఐనా వాళ్లకి నువ్వంటే ప్రేమ. నేనే నువ్వయితే మీ యింట్లో అద్దెకున్న మనిషిని ముక్కుకి తాడుగట్టి ఆడించేదాన్ని. మొన్న మా యింటో నేను విందు యిచ్చిన సమయంలో అతన్ని కనిపెట్టిచూశా. అతను తనకళ్లతో నిన్ను మింగేశాడనుకో. మా తాత నాకు యే మే మిచ్చాడో నువ్వు చూసి వుండాల్సింది! యిక నీ వాడు నావాడి కంటే బాగా వున్నవాడు. రష్యా అంతట్లోకీ ధనికుడంట! అతనికి స్వంత బానిసలు గూడా వున్నారని అతని సైనాతీ అంటున్నాడు.''

మేరియానా లేచి కూచుని సాలోచనగా చిరునవ్వు నవ్వింది. ''వొకసారి అతను నాతో యేమన్నాడో తెలుసా?'' వొక గడ్డిపరకని పంటితో కొరుకుతూ ఆమె అనింది. ''యే మన్నాడంటే, నేను లూకాన్నో నీ తమ్ముడు లజుట్కానో అయిపుడితే యెంత బాగుండేది అన్నాడు. మరి అతనా మాట యెందుకన్నాడంటా?''

''పొగరెక్కి'' అన్నాది ఉస్టెంకా. ''వొక్కోసారి మా తాత యే మంటాడో నువ్వు విని తీరాలి. వింటే, పిచ్చెక్కిందని అనుకుంటావు.''

మేరియానా తన బిష్మెత్ మీద దడాలున పడుకొని, ఉస్టెంకా భుజాల మీద తన చేతులువేసి, కళ్ళుమూసింది.

''యివాళ యిక్కడి కొచ్చి పనిచేస్తానన్నా డతను. నాన్న అతన్ని రమ్మని పిలిచాడు'' కొంత సేపటి తర్వాత ఆమె అలా చెప్పి త్వరలోనే నిద్రపోయింది.

## 31

బండికి నీడనిస్తోన్న పియర్ చెట్టు వెనకాలనుంచి సూర్యుడు పైకి లేచేడు. ఉస్టెంకా బండి చక్రాల్లో అమర్చిన కొమ్మలగుండా తన కిరణాల్ని జొనుపుతూ నిద్రపోతూన్న ఆ ఆడపిల్లల ముఖాల్ని చుర్రుమని పిస్తున్నాడు.

మేరియానా లేచి, చే రుమాల్ని తలకి కట్టుకో సాగింది. పియర్ చెట్టు వెనకాల, భుజంమీద తుపాకి పెట్టుకొని నుంచుని తమ యింట్లో అద్దె కున్న మనిషి నాన్నతో మాట్లాడుతూండటం ఆమెకి హఠాత్తుగా అగుపించింది. ఆమె ఉస్టెంకాని నిశ్శబ్దంగా మోచేత్తో పొడిచి చిరునవ్వు నవ్వింది.

"నిన్న నేనక్కడి కెళ్ళానండీ. ఐనా నా కొక్కటీ కనుపించ లేదు" చుట్టూ ఆదుర్దాతో చూస్తూ ఓలెనిన్ అంటున్నాడు. కొమ్మల గుండా మేరియానా అతని కగుపించటంలేదు.

"అదుగో ఆ దిక్కుగా పోయి మీరు ప్రయత్నించి తీరాలండీ" అన్నాడు కొర్నెట్. "అక్కడొక పాడుబడిన ద్రాక్షతోటుంది. దాన్ని మామూలుగా బీడని పిలుస్తారు. అక్కడ కుందేళ్లు తప్పకుండా వుంటాయి."

"యింత పనితొందరలోనా కుందేళ్ల వెంట పరుగెత్తటం! మీ రెక్కడుండి ఆడపిల్లలకి కొంచెం చెయ్యి అందిస్తే మంచిదిగాదూ?" అని అతని భార్య సరసంగా అంది. "యిదుగో, పిల్లల్లారా, యిక లేవండమ్మా, లేవండి!" అని కేక పెట్టింది.

బండి కింద మేరియానా, ఉస్టెంకాలు గుస గుసలాడుకొంటూ ముసి ముసి నవ్వులు నవ్వుకొంటున్నారు.

లూకాకి యాభై వెండిరూబుల్లు ఖరీదుచేసే గుర్రాన్ని ఓలెనిన్ యిచ్చాడని తెలిసి నప్పట్నుంచీ కొర్నెటూ, అతని భార్యా ఓలెనిన్ పట్ల ప్రత్యేక గౌరవం చూపసాగేరు. మేరియానాకీ ఓలెనిన్‌కీ మధ్య పెరుగుతూన్న స్నేహితాన్ని జూసి కొర్నెట్ పూర్తిగా సంతృప్తి జెందిన ట్లగుపించు తున్నాడు.

"కాని యెలా పని జెయ్యాలో నాకు తెలవదు" మేరియానా యొక్క నీలిరంగు చొక్కా, యెర్ర రుమాలు కొంచెం అలాచూసి, యిక ఆ బండివంక చూడకుండా ప్రయత్నించుతూ, ఓలెనిన్ అన్నాడు.

"మీరిక్క డాగితే మీకు కొన్ని పీచ్‌పళ్ళయిస్తాం," అన్నాది మేరియానా తల్లి.

"ఆ చిలిపిదాని మాటలు మీరు లెక్కజెయ్యమాకండి" అని హడావుడిగా అందుకొన్నాడు కార్నెట్, అతన్నుంచి క్షమాపణ కోర టానికి. "పురాతన కోసక్కు ఆచారం ప్రకారం ఆవిడ మర్యాదలు సర్యా దలుచేస్తూవున్నది, అంతే. రష్యాలో—పీచ్ పళ్ళేగాక అనాసపళ్ళు జాం మొద లైనవాటిని బాగా తినటానికి మీరు అలవాటుపడివున్నారనుకొంటా."

"అయితే ఆ పాడుబడిన ద్రాక్షతోటలో కుందే ళ్ళుంటయ్యంటా రన్నమాట?" అన్నాడు ఓలెనిన్. "యిప్పు డక్కడి కెళ్తా మరి" తటా లున ఆ పచ్చటి కొమ్మలగుండా వోసారిచూసి, ద్రాక్షచెట్ల సోల్పులగుండా అతను మాయమయ్యేడు.

అతను మళ్లీ తిరిగొచ్చేప్పటికి చేనుయొక్క కంచెకిందకి సూర్యుడు దిగిపోయేడు. నిర్మలంగావున్న ఆకులగుండా సూర్యకాంతి మెరుస్తోంది. చల్లని సాయంసమయ వాతావరణం ఆ ద్రాక్షతోటలమీద వ్యాపించు తోంది. ఆ తోట సోల్పులమధ్య మేరియానాయొక్క నీలి చొక్కా నతడు గుర్తించేడు. ఆమెవద కెళ్ళేడు, వెళ్తూ ద్రాక్షపళ్ళు కోస్తూ. రొప్పుతూ రోజుతూన్న అతనికుక్క బాగా కిందకి వేలాడుతూన్న ద్రాక్షగుత్తిని మధ్యమధ్య తన చొంగ నోటితో పట్టుకొంటోంది.

మేరియానా చొక్కాచేతులు పైకి మడిచివున్నాయి. రుమాలు గడం కిందగా తలకి కట్టబడివుంది. బరువాంటి ఆ ద్రాక్షగుత్తుల్ని ఆమె చకచకాకోసి గంపలో వేస్తోంది. ఓలెనిన్ని చూడగానే ఆమె ముఖం సిగ్గుతో జేగురించింది. అతనికేసి చిరునవ్వు నవ్వి మళ్ళీ తనపని చేసుకో సాగింది. రెండు చేతులూ స్వేచ్ఛగా వుండటం కోసరం ఓలెనిన్ తన తుపాకి వీపుమీద వేళ్ళాడేసేడు. "భగవంతుడు నీకు సాయపడుగాక! తక్కిన వాళ్ళేరీ? నువ్వొక్కదానవే వున్నావా?" అని అనాలనుకొన్నా డతను. కాని ఆ మాటలు అనలేకపోయేడు. నిశ్శబ్దంగా తన టోపీని పైకెత్తేడు. మేరియానాతో వొంటరిగా వుండటంవల్ల అతనికి యిరకాటంగావుంది. ఐనా తనని బాధించుకోటానికా అన్నట్టు అతను అక్కడే వున్నాడు పోకుండా.

"అలా నువ్వు ఆడపిల్లల్లో వొకర్ని కాల్చివేసెయ్యొచ్చు."

"వుహూ. నేనెవర్నీ కాల్చను."

కొంతసేపు యిద్దరూ నిశ్శబ్దంగా వూరుకొన్నారు. తర్వాత ఆమె యిలా అంది: ''కాస్త నాకు చెయ్యందించవూ?''

వెంటనే అతను తన చాకు బైటికి తీసి ద్రాక్షగుత్తులు కోయసాగేడు. అలాచేస్తూ అతను ఆకులకిందనుంచి వొక పెద్ద గుత్తి లాగేడు. అది మూడు పౌనుల బరువుంది. పళ్ళు ఒకదాని కొకటి యెంతదగ్గరగా వున్నాయంటే ఖాళీలేక వొకదాని కొకటి వొత్తుకొని మెత్తగిలిపోయి వున్నాయి. అత నా గుత్తిని మేరియానాకు చూపించేడు.

''అన్నిటిన్నీ కోసేస్తారా, లేక యిది మరీ పచ్చిదని ఆపారా?''

''ఏది యిలా యివ్వు.''

వారి చేతులు వొకదాని కొకటి తాకినాయి. ఓలెనిన్ ఆమె చేతిని పట్టుకొన్నాడు. ఆమె చిరునవ్వుతో అతనివంక చూసింది.

''నీ పెళ్ళెప్పుడు?'' అతనడిగేడు.

అతనివంక ఆమె గంభీరంగా చూసి మారు పలక్కుండా ముఖం తిప్పుకొంది.

''లూకాని నువ్వు ప్రేమించావా?''

''ఆ విషయం నీ కెందుకు?''

''అతనంటే నాకు అసూయగా వుంది.''

''అంతే మరి!''

''నిజం! నువ్వు అంత అందంగా వుండటమే కారణం.''

ఆ మాటలు మోటుగా అసహ్యంగా ధ్వనించినాయి. అందుకు ఓలెనిన్ సిగ్గుపడ్డాడు. ముఖం సిగ్గుతో యెర్రబడింది. తన చేతుల్లోకి ఆమె చేతుల్ని తీసుకొన్నాడు.

''నే నెటువంటి దాన్నయినప్పటికీ, నీకూ నాకూ లతకుదరదు. కనక నన్ను వేళాకోళం పట్టించటం మానేసెయ్యి'' అన్నాది మేరియానా. కాని, అత నామెని వేళాకోళం చెయ్యటం లేదనే సంగతి ఆమె కెంతబాగా తెలుసునో ఆమె ముఖవైఖరే చెబుతోంది.

''వేళాకోళమా? అరి భగవంతుడా! నేను నిన్నెంత......''

యీ మాటలు యింకా మోటుగా, అసహ్యంగా కన్పట్టినాయి; ఐనా, అతను చెప్పుకు పోతూనేవున్నాడు:

''నీకోసం యేదిచెయ్యమంటే అది చేస్తాను...''

''వదులు, పిచ్చాడా'' అని ఆమె అంది. కాని, ఆమె ముఖమూ, మెరుస్తూన్న ఆమె కళ్ళూ, పూగుతూన్న ఆమె వక్షోజాలూ మరో విష యాన్ని తెలుపుతున్నాయి.

తనమాట లెంత అసహ్యంగా వున్నాయో ఆమె అర్థంచేసుకొన్నట్లు ఓలెనిన్ కగపడింది. కాని, ఆమె నాటి కతీతురాలు. తాను ఆమెతో చెప్పదలచుకొన్నదంతా ఆమెకి కొంతకాలంగా తెలుసుననీ, కాని తానా మాటల్ని ఆమెతో యెలా చెబుతాడో ఆమెకి వినాలని వుందనీ అత ననుకొన్నాడు. ''ఆమె నిజంగా యెటువంటిదో తాను చెప్పే సంగతై నపుడు ఆమెకి తెలీకుండా యెలావుంటుంది? కాని ఆమెకి అర్థంచేసికోనా లని లేదు. అందుకు సమాధాన మియ్యాలని లేదు'' అని అత ననుకొన్నాడు.

''ఒహోయ్! యెవ రక్కడ?'' దగ్గర్లోవున్న వొక ద్రాక్షచెట్టు వెనకాల హఠాత్తుగా ఉస్టెంకా గొంతు రింగురుమని మోగింది. ''వచ్చి నాకు సహాయపడండి. నేనొక్కదాన్నే ఐపోయా'' అని ఆమె ఓలెనిన్ని పిలిచింది, కీచురుమంటూ నవ్వుతూ, తన గుండ్రటి చిలిపి ముఖాన్ని ద్రాక్ష తీగెల గుండా కనపరుస్తూ.

ఓలెనిన్ యేమీ మారుమాటాడకుండా నిశ్చలంగా నుంచున్నాడు.

మేరియానా కోత మొదలెట్టింది. కాని ఓలెనిన్వంక చూస్తోనే వుంది. అతనేదో చెప్పటం మొదలెట్టి, మధ్యలోనే ఆపేసి, భుజాలెగరేసి, తుపాకిని భుజంమీదకి లాక్కుని, ఆ తోట విడిచిపెట్టి విసవిసా బైలుదేరి వెళ్ళేడు.



మేరియానా, ఉస్టెంకాల కేకలూ వారి గింగురుమనే నవ్వూ విన టానికై ఓలెనిన్ నడుస్తూ వొకటి రెండు సార్లు ఆగి తర్వాత అరణ్యంలో

ప్రవేశించేడు. యిక సాయంత్రంవరకూ వేటాడుతూ అక్కడే కాలం గడిపేడు. యింతసేపు వేటాడినా అతను దేన్నీ చంపనేలేదు. అతనికేదీ దొరకనేలేదు. చీకటిపడేవేళ కతను యింటికి చేరుకొన్నాడు. యింటి ఆవరణలో నడుస్తూండగా ఆవుల కొష్టంయొక్క తెరిచివున్న వాకిటిగుండా నీలిచొక్కా అతనికంట బడింది. తను వెనక్కి తిరిగొచ్చేసేడనే సంగతి మేరియానాకు తెలవటం కోసరం అతను ఐవాన్‌ని చాలా బిగ్గరగా కేకబెట్టి పిలిచేడు. తర్వాత యింటి వసారాలో తాను మామూలుగా కూచునేచోట కూచున్నాడు.

కొర్నెటూ, అతని భార్యా చావిట్లోంచి యింట్లోకెళ్ళేరు గాని అతన్ని రమ్మని ఆహ్వానించలేదు. మేరియానా రెండుసార్లు గేటువరకెళ్ళింది. ఆ సంజ వెలుగులో వొకసారి మేరియానా తనకేసి చూస్తున్నట్లగపడింది గాని ఆమెతో మాట్లాడటాని కతనికి సిగ్గేసింది. ఆమె యింట్లోకి మాయమైనాక అతను లేచివచ్చి ఆ యింటిముందు అటూయిటూ పచారు చేయనారంభించేడు. కాని ఆమె బైటికి రానేలేదు, రాత్రికి రాత్రంతా, కొర్నెటు యింట్లోంచి వస్తూన్న ప్రతి ధ్వనినీ వింటూ, అతనా ఆవరణలోనే గడిపేడు. వారు సంభాషించుకోవటమూ, భోంచెయ్యటమూ, వారు తమ ఈకపరుపుల్ని లాగి మంచాలమీదేసి మంచా లెక్కటమూ అతను శ్రద్ధగా విన్నాడు. మేరియానా యెందుకో నవ్వటంగూడా అతనికి వినపడింది. అంతే. తర్వాత మళ్ళీ అంతా నిశ్శబ్దం.

కొర్నెటూ, అతని భార్యా గుసగుసలాడు కొంటున్నారు. యెవరిదో వూపిరిపీల్చటం వినవస్తోంది.

ఒలెనిన్ తన గదిలో కెళ్ళేడు. బట్టలు విడవకుండానే హాయిగా నిద్రపోతోన్న ఐవాన్‌ని చూసి అతను అసూయిపడ్డాడు. దేనికోసరమో యెదురు చూస్తున్నట్లుగా, ఆ ఆవరణలో అటూ యిటూ పచారు చేయటం కోసం అతను మళ్ళీ బైటికెళ్ళేడు. కాని, యెవరూ రాలేదు. యేదీ కదల్లేదు. అతను వినగలిగిందల్లా ముగ్గురు చక్కగా వూపిరి పీల్చుతూండటం మాత్రం. మేరియానా యెలా వూపిరి పీల్చుతుందో అతనికి తెలుసు. దాన్ని అతను శ్రద్ధగావిన్నాడు. తన గుండెకొట్టుకోటం గూడా విన్నాడు.

గ్రామమంతా నిశ్శబ్దంగావుంది. చంద్రుడు పొద్దోయి పొడిచేడు. పశువులా ఆవరణలో పడుకొని రొప్పటమూ, లేవటమూ తిరిగి పడుకోటమూ యిప్పుడు కనపడసాగింది. ''అసలు నాకేంకావాలంట ?'' అని అతను విసగడగా అనుకొన్నాడు. కాని, అక్కణ్ణుంచి అతను కదల్లేక పోయేడు.

హఠాత్తుగా అతనికి అడుగుల చప్పుడూ, కార్నెట్ యింటి నేల కిర్రు కిర్రుమనటమూ వినపడినాయి. అతను తలుపు వద్దకి పరుగెత్తేడు. కాని, మళ్లీ అంతా నిశ్శబ్దం. తర్వాత వొక పొడిఆవు, భారంగా గాలి పీలుస్తూ, ముందు మోకాళ్లమీద లేచి, ఆ తర్వాత నాలుగుకాళ్లమీదా లేచి నుంచుని, తోక నాడించి, వొక్షణంబాటు పొడిగావున్న ఆ బంకమట్టి నేలమీద నట్టవతొక్కి, బరువుగా నిట్టూర్చి, తిరిగీ పడుకొంది.

''నే నేం చెయ్యాను ?'' అని ఓలెనిన్ తనని ప్రశ్నించుకొని పడుకోవాలని నిశ్చయించుకొన్నాడు. కాని, అంతలోనే తనకేదోమళ్ళీ ధ్వని వినిపించిందని అతననుకొన్నాడు. వెంటనే పొగమంచుతో గూడివున్న వెన్నెల వెలుగులోకి వస్తూన్న మేరియానా రూపం అతని మనసులో అగుపించింది. మళ్లీ ఆమె కిటకీవద్దకి పరుగెత్తి వేచి చూసేడు. చిట్టచివరికి, తెల్లవారేసరికి, తలుపువద్దకెళ్ళి మృదువుగా తట్టేడు. యీ సారి అతనికి నిజంగా మేరియానా అడుగుల చప్పుడు వినిపించింది. గొళ్ళెం పట్టుకొని తలుపు తన్నేడు. జాగర్తగా మృదువుగా తలుపు దగ్గిరికి నడుస్తూన్న పాదాల కింద నేల కిర్రు కిర్రుమంది. గడిక్లిక్‌మంది. తలుపు తెరుచుకొంది. గుమ్మడి కాయల వాసనా, కమ్మటి పూలగంధమూ వచ్చేయి. మేరియానా ఆకారం ఆ చంద్రకాంతిలో అగుపించింది. వొక్షణంపాటు మాత్రమే ఓలెనిన్ ఆమెని చూడగలిగేడు. యేదో గొణుక్కుంటూ దభీలున తలుపుమూసి తిరిగీ వెనక్కి పరుగెట్టింది. దానిమీద చాలా సార్లతను మెల్లగా తలుపు తట్టేడు గాని సమాధానమేమీ రాలేదు. కిటకీవద్దకెళ్లి శ్రద్ధగా విన్నాడు. అంత అకస్మాత్తుగా రింగురుమనే వొక మగ మనిషి కంఠస్వరం విని అతను తుళ్లిక్కిపడ్డాడు.

''వహ్వా ! భలే, భలే !'' అని ఓలెనిన్ దగరకొస్తూ వొక పొట్టి కోసక్ యువకు డరిచేడు. అతని నెత్తిన తెల్ల మేకపిల్ల చర్మంతో చేసిన టోపీవుంది. ''నే నంతా చూశాలెండి.''

ఓలెనిన్ అతన్ని గుర్తించేడు. అతను నాజరు. యేం చెప్పాలో యేం చెయ్యాలో తోచక ఓలెనిన్ మెదలకుండా వూరుకొన్నాడు.

"భేషైన పని! పోయి ఆఫీసులో వాళ్లకి చెపుతా. వాళ్ల నాన్నకి గూడా చెపుతా. భలేపిల్ల, కార్నెట్ కూతురు! దానికి వొక్కడు చాలడు."

"నీకేం కావాల్రా బాబూ? యేమిటి నీగొడవ?" అని ఓలెనిన్ సణిగేడు.

"అహఁ. యేమీలేదు. వాళ్లకి చెపుతా. అంతే."

కావాలని, నాజరు చాలా బిగ్గరగా మాటాడేడు.

ఓలెనిన్ వొణికిపోయేడు. తెల్లబోయేడు.

"యిలారా. నాతో రావయ్యా" అతను నాజరుచేయి బట్టుకొని తన గదివైపు లాక్కెళ్ళేడు. "యేమీ జరగలేదనీ, ఆవిడ నన్ను లోపలికి రానియ్యలేదనీ, నీకు తెలుసు. నేనది...చెయ్యలేదు...ఆవిడ నీతిగల పిల్ల..."

"ఆ సంగతెలా చెప్పగలం? ఆ గొడవంతా వాళ్ళు విచారించరు" అన్నాడు నాజరు.

"ఐనా, నీకేదన్నా యిస్తానుండు. వొక్క నిమిషమాగు."

నాజరేమీ అనలేదు. ఓలెనిన్ తన గదిలోకి పరుగెత్తుకెళ్లి పది రూబుళ్ళు పట్టుకొచ్చేడు.

"యిదుగో, యిదతీసికో. యేమీ జరగలేదని తెలిసికో. ఐనా, తప్పంతా నాదే. అందుకనే నీకిది యిస్తున్నా. యిదుగో బతిమాలుతున్నా. యీ సంగతెవరికీ తెలియనియ్యమాక. అసలేమీ జరగనేలేదు..."

"శెలవ్!" అని నాజరు నవ్వుతూ వెళ్ళిపోయేడు.

దొంగిలించిన వొక గుర్రాన్ని దాచే చోటు చూడమని లూకా చెప్పినమీదట అతనా రాత్రి వూళ్ళోకొచ్చేడు. యింటికి అటుగా వెళ్తూంటే అతనికి అడుగుల చప్పుడు వినిపించింది.

ఉదయాన తన దళం వద్దకి తిరిగెళ్లినాక తాను యెంత తెలివితేటల్తో పది రూబుళ్ళు సంపాదించిందీ అతను లూకాతో బడాయిగా చెప్పేడు.

మర్నాడు మేరియానా తల్లిదండ్రుల్నీ ఓలెనిన్ చూసినపుడు యేంజరిగిందో వారికి తెలవలేదని అతననుకొన్నాడు. మేరియానాతో అతను మాటాడలేదు. అతనివంక చూచినపుడు మేరియానా పూరికే నవ్వి పూరుకొంది. ఆ ఆవరణలో ఫలితమేమీలేకుండా నిద్ర లేకుండా అతను మరోరాత్రిగూడా గడిపేడు. మర్నాడు వుద్దేశ పూర్వకంగా అతను వేటాడుతూ అరణ్యంలో కాలక్షేపం చేసేడు. సాయంత్రం, తన అంతరాత్మ వ్యథనుంచి తప్పించుకొనేందు కతను బెలెట్‌స్కీ మకాంకి వెళ్ళేడు. అతనికి తనంటే తనకే భయం వేసింది. యిక నేమాత్రం తాను మేరియానా గదికి వెళ్లగూడదని అతను నిశ్చయించుకొన్నారు.

ఆ రాత్రి అతన్నొక సార్జంట్ మేజర్ నిద్రనుంచి లేవగొట్టేడు. అతనికంపెనీ (దళం) తక్షణమే దాడి చేయబోతోంది. అదివిని అతను ఆనందించేడు. యిక నెన్నటికీ తిరిగి యీవూరు రానని అతననుకొన్నాడు.

దాడి నాలుగురోజులు జరిగింది. కమాండరు అతనిచుట్టం. తన స్టాఫులో వుంచుకొంటానని అతనన్నాడు. కాని ఓలెనిన్ నిరాకరించేడు. ఆ పూరినుంచి విడివడి తాను జీవించలేనని యిప్పుడతను అనుకొన్నాడు. వెనక్కి తిరిగి వెళ్లటానికి తన కనుమతి యిమ్మన్నాడు. దాడిలో అతను చూపిన ప్రతిభకి అతనికి మెడల్ యిచ్చేరు. అలాంటిది కావాలని అతని కంతకుముందు చాలా కోర్కెగా వుండేది. కాని యిప్పుడతనికి అదంటే నిర్లక్ష్యం కలిగింది. అంతకంటే యెక్కువ నిర్లక్ష్యం తన ప్రమోషన్ అంటే కలిగింది. (ఆ ప్రమోషన్ యింకా రాలేదనుకోండి.)

ఐవాన్ వెంటరాగా అతను గుర్రమెక్కి బైలుదేరేడు. తన కంపెనీ కంటే చాలా గంటలనుందే అతనావూరు చేరుకొన్నాడు. ఆ సాయంత్రి మంతా వసారాలో కూచుని మేరియానా వంక చూస్తూ గడిపేసేడు. రాత్రింతా అర్థం పర్థం లేకుండా ఆవరణలో అటూ యిటూ తిరుగుతూ వెళ్లబుచ్చేడు.

## 33

మర్నాటి ఉదయాన్న ఓలెనిన్ చాలా పొద్దెక్కి లేచేడు. మేరియానా వాళ్ళు అప్పటి కెప్పుడో పనుల్లో కెళ్ళేరు. అతను వేట కెళ్లలేదు.

తనగదికీ ఆవరణకీ మధ్య వెర్రెత్తినట్లు తిరుగుతూ, పుస్తకం వొకటి తీసి మళ్ళీ దాన్ని కిందపెట్టేస్తూ, వసారాలోకెళ్ళి మళ్ళీ గదిలోకొచ్చి మంచం మీదపడుతూ, గడిపేడుకాలం. అతనికి సుస్తీ చేసిందని ఐవాన్ అనుకొన్నాడు. సాయంత్రానికి దడాలున వొక నిర్ణయానికొచ్చి, కూచుని పొద్దుపోయేవరకూ రాసుకొన్నాడు. వొక వుత్తరం రాసి, అది రాయటం ముగించినాక పోస్టు చెయ్యగూడదని నిశ్చయించుకొన్నాడు. యెందుకంటే తా నేదైతే చెప్పడానికి ప్రయత్నించుతున్నాడో దాన్నెవరూ అర్థంచేసికోలేరనీ, అంతేగాక ఆ విషయాన్ని తాను గాక మరెవరన్నా అర్థంచేసికొనేదీ లేందీ అనవసరమనీ అతననుకొన్నాడు. యింతకీ అతను రాసింది యిదీ:

"నాపట్ల సానుభూతీ విచారమూ తెలిపే ఉత్తరాలు నాకు వస్తున్నాయి. ఈ అధ్వాన్నపు అడివి ప్రదేశంలో నేను నశించిపోతానేమోనని వాళ్ళభయం. వాళ్ళనే దేమంటే, అతను మోటుమనిషై పనికిమాలినవాడవుతాడు. తాగటం నేర్చుకొంటాడు. యే కోసక్కు-పిల్లనో పెళ్ళిచేసుకోవచ్చుగూడాను? యీ సందర్భంలో వాళ్ళు జనరల్ ఎర్మొలోవ్ మాటల్ని వుదహరించుతున్నారు. "వొక ఆఫీసరు పది సంవత్సరాలపాటు కకేషియాలోగడిపాడంటే తాగుడు నేర్చి వెర్రి వెధవన్నా అవుతాడు లేకపోతే వ్యభిచారపు స్త్రీనన్నా పెళ్ళిచేసుకుంటాడు." అవును, అది భయంకరంగా లేదుమరి? యే ఫలానా యువరాణీగార్నో వివాహమాడే ఘనయోగ్యత కలిగే అవకాశంవున్నపుడో, దర్బారులో దొరయ్యే అవకాశమున్నపుడో మాజిల్లాకి మార్షల్ ఆఫ్ ది నోబిలిటీ *(Marshal of the Nobility)* అయ్యే ఛాన్సువుంటేనో, నేను నా జీవితం నాశనం జేసుకుంటే నిజంగా మరి అది సిగ్గుచేటు పనిగాదాంట? అబ్బ మీరు యెంత నీచమైన అసహ్యమైన మనుషులుగా నాకగపడుతున్నారూ! సుఖమంటే యేమిటో మీకు తెలీదు. జీవితమంటే యేమిటో మీకు తెలీదు. జీవితాన్ని దాని సహజ సౌందర్యకోణాలన్నింటి నుంచీ మీరు వొకసారి అనుభవించినాక, నాకళ్ళ ముందర రోజూ నేను దేన్నిచూస్తున్నానో మీరు చూసి అర్థం చేసికొన్నాక—స్థిరమైన దుర్గమమైన పర్వతాలమీది తెల్లని మంచునీ, పురాతన సౌందర్యంతో ప్రకాశించుతూన్న వొక స్త్రీనీ, భగవత్ సృష్టి ఆరంభంలో వెలిసిన ఆ స్త్రీ సౌందర్యాన్ని—చూసినాక, నాశనమయ్యేది మీరా నేనా అనే

సంగతీ, యెవరు సత్యంలో జీవించేదీ యెవరు అసత్యాలలో జీవించేది పూర్తిగా స్పష్టమవుతుంది.

''మీ వెర్రిభ్రమలూ మీరూ యెంత అసహ్యంగా వున్నారో మీకు తెలిసికొంటే! నే నున్న పూరికొంపా, నా అరణ్యమూ, నా ప్రియురాలూ వీటికి బదులుగా మీ డ్రాయింగ్ రూములన్నీ (అతిథుల గదులన్నీ), వాసనైలైను పూసుకొన్న మీ కులీన స్త్రీలనీ, అసహజంగా కదుల్తూన్న ఆ చిన్న నోళ్లనీ, నీరసంగా వుండే ఆ కాలి వేళ్ళనీ, సంభాషణలాగా అగపట్టుతూ నిజంగా సంభాషణ అన దగని మీ ఫ్యాషనబుల్ వాగుడునీ నేను వూహించుకొంటే నాకు పరమ అసహ్యం కలుగుతుంది. ఆ మకిల మకిల లాడేముఖాలు, 'నేను ధనికురాల్నయి నప్పటికీ నాదగ్గిరా' అని చెప్తూన్నట్లుండే ఆ ఆడపిల్లలు, సిగ్గూ యెగ్గూలేని ఆ జంటలు, ఆ కూచోటాలూ ఆ చోట్లు మార్చటాలూ, యెడతెగని ఆ వాగుడూ ఆ పచ్చి మోసమూ, ఆ రూల్సులూ—వేటితో ఐతే మీరు కరస్పర్శ చేయాలో, దేనికైతే మీరు తలలూపాలో, వేటితో ఐతే మీరు సంభాషించి తీరాలో ఆ రూల్సులు—యిక ఆఖరికి, రక్తంలో యింకిపోయి వొక తరంనుంచి మరో తరానికి అంటురోగం లాగా వ్యాపించే ఆ సోమరిపోతుతనం, ఆ యేమీ తోచకపోవటం అదంతా నాకు అగపడుతూనేవుంది. నా మాట నమ్మండి. వొక్క విషయం అర్థంచేసికోటానికి ప్రయత్నించండి. వొక సారిగిని మీరు యథార్థ సత్యాన్నీ సౌందర్యాన్నిగిని చూసేరంటే సుఖాన్ని గురించిన మీ స్వప్నాలన్నీ మట్టిలో గలిసి పోతాయి. యథార్థమైన సుఖమేదంటే ప్రకృతి మాతతో గలిసి జీవించటం, ఆమెని చూడటం, ఆమెతో కలిసి మాటాడటం. 'అరె—దేవుడు వాణ్ణి రక్షించుగాక!—వాడొకవేళ మామూలు కోసక్కు పిల్లని పెళ్ళిచేసికొంటే! యిక వాడీ లోకంలో యెందుకూ పనికిరానివాడై పోతాడు!' నిజమైన సానుభూతితో మీరలా అనటాన్ని నే నూహించుకొనగలను. కాని, నాకోర్కె అంతా యేమిటంటే మీరు ''చెడిపోవటం'' అని యే అర్థంలో అంటున్నారో ఖచ్చితంగా అలాగే చెడిపోనాలని! వొక మామూలు కోసక్కు పిల్లని చేసుకోనాలని నాకుంది. కాని, దమ్ముల్లేవు. యెందుకంటే అంత మహోన్నతమైన సుఖానికి నేను అనర్హుణ్ణి.

''మేరియానా అనే కోసక్కు పిల్లని మొదట చూసి నప్పట్నుంచీ యిప్పటికి మూడు నెలలు గడిచినాయి. నేను యింతకుముందే విసర్జించిన ఐహిక కావేషాలు నాలో యింకా జీవించేవున్నాయి. ఆమెని ప్రేమించ గలనని నేను విశ్వసించలేదు. పర్వతాలనూ, ఆకాశాన్నీ ప్రస్తుతించినటుగా నే నామెను ప్రస్తుతించాను. యెందుకంటే ఆమె నాటంత సౌందర్యరాశి గనక. ఆమె సుందర విగ్రహ దృశ్యం నాకు దినమూ అవుసరమని త్వర లోనే అనుకోసాగేను. నిజంగా ఆమెని నేను ప్రేమించేనా లేదా అని నన్ను నేను ప్రశ్నించుకోటం మొదలెట్టేను. కాని, నాలో నే చూసింది, ప్రేముంటే నే నూహించుకొన్న దానికంటే భిన్నమైనట్టిది. యేకాంతం వల్ల గలిగే బాధ కంటే, పెళ్ళాడాలనే కోర్కెకంటే అది విభిన్నమైనది. అంతకంటేనూ గూడా అంతవరకూ నే ననుభవించిన శారీరక ప్రేమకంటే వేరైనట్టిది. ఆమెని నేను చూసినంత సేపూ, ఆమె మాటల్ని విన్నంత సేపూ, ఆమె నాదగ్గరున్నదని తెలిసి కొన్నంత సేపూ, నాకు పూర్తిసుఖం లేకపోయినా, శాంతి మాత్రం వుండేది. విందు వొకటి జరిగినాక, ఆమెతో వొకనాటి సాయంకాలం కభుర్ల కాలక్షేపంచేసి ఆమెని తాకినపుడు, పైకి చెప్పుకోకపోయినా మా యిద్దరి మధ్యా దృఢమైన బంధన వొకటి యేర్పడి నట్లు నేను గ్రహించేను. ఆ బంధనని తెంచి వేయటం యిప్పుడు సాధ్యం కానేకాదు. ఐనా శతధా ప్రయత్నించేను. ''నా హృదయాంతరాళం లోని భావాల్లో భాగం పంచుకోని స్త్రీని నేనెలా ప్రేమించగలను? కేవలం సౌందర్యం చూసే స్త్రీని ప్రేమించటం సాధ్యమా? వొక బొమ్మని ప్రేమించటం సాధ్యమా?'' అని నన్ను నేను ప్రశ్నించుకొన్నాను. కాని, నా ప్రేమలో నాకే నమ్మకం లేక పోయినప్పటికీ ఆమెని నేనప్పటికే ప్రేమించేను.

''ఆ విందు తర్వాతి సంఘటన తర్వాత నా వైఖరి మారిపోయింది. అంతవరకూ ప్రకృతివలే మేరియానాగూడా వింతగా గంభీరంగా వుండే వస్తువు. ఆ సాయంకాలం తర్వాత ఆమె మామూలు మానవమాత్రురాలై పోయింది. ఆమెతో సంభాషించేను. నొకొక్కసారి ఆమె తండ్రి ద్రాక్ష తోటలో పని చెయ్యటాని కెళ్ళాను. సాయం సమయాల్లో పూర్తిగా ఆమె యింటివద్దగడిపేను. ఐనా, యిప్పుడామె నాకు మరింత దగ్గరగా వున్నప్పటికీ యెప్పటివలే నిర్మలంగా, గంభీరంగా, అందని పండుగావుంది.

ఆమె ప్రవర్తన యెప్పుడూ వొకేరీతిగా, నిర్లక్ష్యంగా, గర్వంతో గూడి వుంటోంది. వొక్కొక్కప్పుడామె సఖ్యతగా, ఉల్లాసంగా వుంటుంది. కాని మొత్తంమీద ఆమె ప్రతిచూపూ, ప్రతిమాటా, ప్రతిఅభినయం నిర్లక్ష్యతని చూపుతూంటుంది—అందులో ద్వేషంలేదు; నలిబిలి చేసేట్లుగా, సమ్మోహనంగా వుంటుంది. తెచ్చికోలు చిరునవ్వు చాటున నా భావాల్ని దాచేసెయ్యడానికి ప్రయత్నించేను. వుద్రేకమూ, కోర్కె నా హృదయాన్ని చీల్చివేస్తున్నప్పటికీ ఆమెతో సరసాలాడేను. నా మోసాన్ని ఆమె గ్రహించింది. కాని, ఆమె వైఖరిమాత్రం యెప్పటిలాగా నిబ్బరంగా, ఉల్లాసంగా, సూటిగావుండింది. నే నిది సహించలేకపోయేను. రుజువర్తనుడుగావుండాలనుకొన్నాను. నే నాలోచించేదీ; అనుభవించేదీ అంతా ఆమెకి చెప్పాలనుకొన్నాను. వొకసారి ద్రాక్షతోటలో బైటపడ్డాను. గ్యాపకం పెట్టుకోటానికి సిగ్గేసేటువంటి మాటల్లో నా ప్రేమని గురించి ఆమెకి చెప్పసాగేను. ఆ విధంగా ఆమెతో నేను చెప్పివుండాల్సింది గాదు. యెందు కంటే ఆ మాటలు ఆమెని కొలవలేవు. ఆ మాటలు వెలిబుచ్చే భావాలకి ఆమె అతీతం. యిక నేమీ నేను చెప్పలేదు. కాని, ఆ నాటినుంచీ నాస్థితి దుర్భరమైంది. ఇది వరకటి సరసధోరణినే కొనసాగించటంద్వారా నన్ను నేను హైన్యపరుచుకోవాలని నా కెంత మాత్రంలేదు. కానైతే సూటిగా నిరాడంబరంగా వుండే మిత్రత్వం నిభాయించటానికి నేనింకా తగిలేనని నాకు తెలుసు. నేనేం చేయాలిమరి? ఆమెను వొక క్షణంలో మిత్రురాలిగా మరోక్షణంలో నా భార్యగా వూహించుకొన్నాను. కాని, ఆ రెండు ఆలోచనలూ నాకు భీతీ, అసహ్యమూ కలిగించినాయి. రెంటినీ తోసిపారేసేను. ఆమెని వ్యభిచారానికి దింపటమంటే ఖూనీ చేయటం వంటిది. ఆమెను "గౌరవనీయ స్త్రీగా, ఓలెనిన్ భార్యగా—యీ మధ్య వొక ఆఫీసరొక కోసక్కు యువతిని చేసినట్లుగా—అంతకంటే హానికరం. అవును, నేనే లూకాసై గుర్రాల్ని దొంగిలించి, పాటలు పాడి, ఖూనీలుచేసి, ఛిఖిర్ తాగి, తాగినప్పుడు రాత్రిపూట జిల్లాసకోసరం—నే నెవర్నో, యెందుకోసం జీవిస్తున్నానో ఆలోచననేదే లేకుండా—ఆమె కిటికీలోకి యెగబాకి గదిలో దూరగలిగితే అప్పుడు విషయం వేరుగా వుంటుంది. అప్పుడు మేము కలిసి జీవించవచ్చు; వొకర్నొకరు అర్థంచేసికోవచ్చు.

‘‘అలాంటి జీవితం గడపాలని నేను ప్రయత్నించేను. కాని నా బలహీనతని గురించి నాకు బాగా తెలుస్తూ వచ్చింది. నాగరికత అనేది నన్ను చెడగొట్టింది. అసహ్యాకరమైన నా గత జీవితాన్ని నేను మరచి పోలేక పోయేను. యిక నిప్పుడు నా భవిష్యత్తు మరింత నిరాశాకరంగా అగుపిస్తోంది. నాకళ్ల ముందర, దూరంగావుండే హిమనగాలూ, రాజఠీవిగల ఆ స్త్రీ మూర్తీ కనిపిస్తున్నాయి. కాని, ఆమె, నాకు కావాల్సిన ఆ వాంకే హాకసుఖం, నాదిగాదు. అత్యంత విషతుల్యమైనదీ, అత్యంత మధురమైనదీ యేమిటంటే ఆమెని నేను అర్థంచేసికొన్నాననే సంగతీ, కాని ఆమె మాత్రం నన్ను యెన్నటికీ అర్థంచేసికోలేదు అనే సంగతీనూ. అది ఆమె నాకంటే తక్కువ ఐనందువల్లగాదు. అందుకు భిన్నంగా ఆమె అసలు నన్ను అర్థం చేసికోనేరాదు. ఆమె సుఖంగా ఆనందంగావుంది. ఆమె, ప్రకృతిలాగా, నికరత్వమూ ప్రశాంతతా గంభీరతా గల మనిషి. అసలు నాలాంటి బలహీనుడి, నాలాంటి చెడిపోయినవాడి, బాధా అసహ్యమూ ఆమె అర్థంచేసికోవాలని యెలా అనుకోటం ? ఆమె కిటికీ కింద నిద్రలేని రాత్రుల్ని గడిపేను. 18వ తేదీన మాకంపెనీ దాడికోసరం పంపబడింది.

‘‘మూడు రోజులపాటు నేనీ వూరికి దూరంగావున్నాను. నేను ఖిన్నుణ్ణయ్యేను. ప్రతిదానిపట్లా నాకు నిర్లక్ష్యం కలిగింది. మామూలుగా పాడే పాటలూ, పేకాటలూ, తాగుడూ, ప్రమోషన్లని గురించిన [illegible] వాగుడూ యెప్పటికంటేగూడా నాకు పరమ అసహ్యం కలిగిం[illegible] యింటికి వచ్చేను. ఆమెనీ, నాయింటినీ, ఇరోష్కానీ చూసేను. [illegible]ంటి వసారాలోనుంచుని ఆ హిమనగాల్ని తిలకించేను. ఆనందంతా ఆక[illegible] చేసికొన్నాననే మహత్తరానందం కలిగింది నాకప్పుడు. నా హృదయంలో యేముందో యిప్పుడు నాకు తెలుసు: నే నామెని ప్రేమిస్తున్నాను. నా జీవితంలో ప్రప్రథమమైన యథార్థ ప్రేమ అదే. ఆ భావనతో నన్ను నేను హైన్య పరచుకొంటాననే భయం నాకు లేదు. నేను సిగ్గు పడటంలేదు. నా ప్రేమంటే నాకు గర్వంగా వుంది.

‘‘ఆమెని ప్రేమిస్తున్నానంటే అది నా తప్పుగాదు. అది నా యిష్టం లేకుండానే జరిగింది. నా ప్రేమనుంచి తప్పించుకొని ఆత్మ విసర్జనచేసికోవాలని ప్రయత్నించేను. ఆమెకీ లూకాకీ మధ్యవున్న సంబంధంలో ఆనం

దం యేమీ లేదని నాకు చెప్పుకో ప్రయత్నించేను. కాని, అందుమూలంగా నా ప్రేమనీ, అసూయనీ ఆగ్రహానికి ప్రేరేపించటం మాత్రమే జరిగింది. ఇది నేనంతకు ముందెరిగిన ఆదర్శప్రాయమైన, "మహోన్నతమైన" ప్రేమ కానేకాదు. అంతేగాదు. నీ ప్రేమలో నువ్వు ఆనందిస్తూ, ఆ ప్రేమకి కారణభూతం నువ్వే ననుకొనేదిగూడాగాదు. దాన్నిగూడా నే ననుభవించేను. అది శారీరక వాంఛకాదు. అది వాటన్నిటికంటె పూర్తి విభిన్నమైనట్టిది. బహుశా నేను మేరియానాలో ప్రకృతిని, ప్రకృతిలోవున్న సౌందర్య మంతటియొక్క రూపాన్ని, ప్రేమిస్తూవుండి వుండవచ్చు. నాకు మనోబలం లేదు. నాగుండా ప్రకృతిశక్తి యేదో ఆమెని ప్రేమిస్తోంది. భగవంతుని జగత్తు, సంపూర్ణ ప్రకృతి, ఆ ప్రేమని నా హృదయంలో హత్తుకొనేట్లు చేసి ఆమెని ప్రేమించమంటోంది. అలాగే నేను ప్రేమిస్తున్నాను. కాని, మనస్సులోగానీ వూహా ప్రపంచంలోగానీ కాదు; నా మూర్తి అంతటితోనూ ప్రేమించుతున్నాను. ఆమెని ప్రేమించటంలో నేను భగవానుడి ఆనంద జగత్తులో వొక రేణువు నయ్యేను.

"నా యేకాంత జీవితం నన్నే నూత్న విశ్వాసాలకి దారి తీసిందో నేనింతకు ముందే చెప్పేను. కాని, వాటి కొక రూపం యివ్వటం యెంత దుస్తరంగావుందో, అవి నాలో యేర్పడి వొక నూత్న జీవిత శకం [illegible] విప్పారుతూ కనిపించినపుడు యెంత ఆనందంతో వాటిని [illegible]రో యెవరికీ తెలీదు. అవినూత్న విశ్వాసాలకంటే నాకు ప్రియమైందేది [illegible]దు...సరే; తర్వాత యేర్పడింది. అవి వెళ్లిపోయినాయి. అందుకు నేను విచారించటంలేదు. ఇక అదిగాక సంకుచితమూ, రూపరహితమూ, నిర్జీవమూ ఐన మరొకదాన్ని యెలా ప్రేమించగలనా అనేది అర్థం చేసికోటం మరింత దుస్తరంగా వుంది. సౌందర్యం అనేది ప్రవేశించి అదివరకు యెంతో శ్రమతో నిర్మించిన కట్టడాన్ని తుక్కు తుక్కుజేసి గాలి కెగిరిపోయేట్లు చేసింది. అలాపోయిన దానికి నేనే మాత్రం విచారించటం లేదు. ఆత్మ విసర్జననేది వొట్టి చెత్తవాగుడు. అది అహంకారం; అనుభవించదగిన బాధలనుంచి పారిపోవటం; యితరుల సుఖాన్ని జూసి తమకు గలిగిన అసూయని కప్పిపెట్టుకోటానికి అవలంబించే మార్గం. "ఇతరులకొరకు జీవించటం, మేలు చేయటం!" నా హృదయంలో నా మీద నాకు మాత్రమే ప్రేమవున్నపుడు, ఆమెని ప్రేమించాలనే కోర్కె వున్నపుడు,

ఆమెతో కలిసి జీవించాలనీ ఆమె జీవితం జీవించాలనీ వున్నపుడు అలా యెందుకు చేయాలీ? యితరులకోసంగానీ, లూకా కోసంగానీ యిప్పుడు నేను సుఖాన్ని కోరటంలేదు. ఆ యితరుల్ని నే నిప్పుడెంత మాత్రం ప్రేమించటం లేదు. ఇంతకు ముందైతే యిలాంటివైఖరి తప్పని నన్ను బాధించుకొని ప్రశ్నించుకొనేవాణ్ణి: ఆమె యేమవుతుంది? నే నేమవుతాను? లూకా యేమవుతాడు? యిప్పుడు నే నలాంటి చెత్త నేమీ లక్ష్యపెట్టను. నాకు నేనే జీవించటం లేదు: నా కంటేగూడా బలవత్తరమైన శక్తి యేదో నన్ను నడిపిస్తోంది. నేను బాధ ననుభవించుతున్నాను. వొకప్పుడు నేను మృతుణ్ణి, కానిప్పుడు సజీవుణ్ణి. యినాళ్ళ ఆమెవద్దకెళ్లి అంతా చెప్పేస్తాను.''

# 34

ఓలెనిన్ రాయటం ముగించేసరికి చీకటి పడింది. తర్వాత అతను కార్నెట్ యింట్లో కెళ్ళేడు. మేరియానా తల్లి పొయ్యివెనకాల వొక బెంచీమీద కూచుని పట్టుదారం వడుకుతోంది. మేరియానా తలమీదేమీ లేకుండా వొక కొవ్వొత్తి దీపంవద్ద కూచుని యేదో కుట్టుతోంది. ఓలెనిన్ లోనికి రాగానే ఆమె యెగిరి నుంచుని, తన జేబురుమాలు తీసుకొని, పొయ్యి దిమ్మె మీద కెక్కింది.

''మాతో కూచోవంటే, చిట్టీ?'' అన్నది ఆమె తల్లి.

''వుహూ. నా తలమీదేమీ లేకపోతేను!''

పొయ్యి అరుగుమీదినుంచి వేలాడుతూన్న వొక చక్కని కాలూ వొక మోకాలూ మాత్రమే ఓలెనిన్ చూడగలిగేడు. మేరియానా తల్లికి అతను కొంత టీ పొడుం యిచ్చేడు. దానిమీదఆమె కొంత గడ్డకట్టిన మీగడ తమ అతిథికి తెమ్మని మేరియానాని పంపింది. మేరియానా మీగడ పళ్ళెం తెచ్చి మేజాబల్లమీదపెట్టినాక వెంటనేపోయి మళ్లీ పొయ్యి అరుగెక్కింది.

ఆమె తనవంక చూడటం ఓలెనిన్ గమనించేడు. వారు కుటుంబ వ్యవహారాల్ని గురించి మాటాడుకొన్నారు. క్రిమేణా మేరియానా తల్లికి

వుల్లాసం యెక్కువైంది. కొన్ని ద్రాక్షపళ్లనూ, తన ఛిఖిరూ, దాక్షిక్షఖజ్జీ తన అతిథికి తెచ్చింది. తమ చెమటతో ఆహారం సంపాదించేవారి కుండే సగర్వంతో ఆమె అతన్ని అది తినమని పట్టుబట్టింది. మొదట్లో తన మోటుతనంతో ఓలెనిన్‌ని ఆవిడ తికమక పెట్టింది. కాని, ఆమె తన కూతురి పట్ల చూపుతున్న ప్రేమచూసి, అతని కిప్పుడు ఆమె అంటే జాలి కలుగుతోంది.

"అవును మరి. లేదు లేదోఅని యేడ్చి భగవంతుడికి కోపం తెప్పించట మెందుకు? మాకు అన్నీ సరిపడా వున్నాయి, దేముడి దయవల్ల. వూరగాయలూ, ఛిఖిరూ వున్నాయి. కావాలంటే మూడు పీపాలు గాదు యింకా పైన అమ్మగలం. ఐనా మాకు తాగటానికి సరిపడా వుంది. అప్పుడే వెళ్లమాకండి. పెళ్లిసమయాన మనమంతా కలిసి తాగుదాం."

"పెళ్లెప్పుడూ యింతకీ?" ముఖం జేవురించుతుండగా, గుండె బాధతో టపటప కొట్టుకొంటూండగా ఓలెనిన్ అడిగేడు. పొయ్యి అరుగు మీద యేదో కదిలిన చప్పుడూ, గుమ్మడి గింజలు పళ్లతో పగలగొట్టుతూన్న ధ్వనీ వినవచ్చేయి.

"వచ్చేవారంలో జరిగినా మరేంఫర్వా లేదు" ఓలెనిన్ అసలు లేడా అనే ధ్వనితో ఆమె మామూలుగా అన్నది. "అంతా తయారుగా వుంచాను. మా పిల్లకి బాగా చెయ్యాలనుకొంటున్నాను. కాని, వొక చిన్న చిక్కొచ్చి పడింది. యీ మధ్య మా లూకా చెడు తిరుగుడు ఆరంభించాడు. తెగతాగుతున్నాడు. మొత్తానికేదో చిక్కుల్లో పడతాడు. మొన్న అతని కంపెనీనుంచి వొక మనిషొచ్చి లూకా నోగేకి వెళ్ళాడని చెప్పాడు."

"అతను జాగర్త తీసుకోటం మంచిది" అన్నాడు ఓలెనిన్.

"అదే నేనూ అంటున్నానండీ. 'లూకా, జాగర్త. వెర్రివేషాలు మానెయ్యి' అంటున్నా. అతను కుర్రాడు. కుర్రాడంటే యేదో చెయ్యాలని వుంటుంది. కాని దేనికైనాగూడా వొక వేళాపాళా మంచీ చెడూ అంటూ వుంది. 'సరే నువ్వు గుర్రాల్లోన్ని గట్టనో దొంగతనం చేశావు. వొక అబ్రెక్కుని చంపావు—భేష్. నువ్వు ధైర్యంగల కుర్రాడివి. కాని నువ్వాపనులు మానేయటం మంచిది. లేకపోతే చిక్కుల్లో పడతావు' అంటానండీ నేనూ."

"అవునవును. సరిహద్దుమీద అతన్ని నేను వొకటి రెండు సార్లు చూశాను. తెగతాగుతున్నాడు" అన్నాడు ఓలెనిన్.

రెండు నల్లని పెద్దకళ్లు అతనివంక ఆగ్రహంతో చూసేయి. తాను చెప్పిందాని కతడు లజ్జపడ్డాడు.

"అయితే యేమిటంట అందులో ? అత నెవరికీ యేకీడూ చెయ్యాటం లేదు. తన డబ్బుపెట్టి తాను కొనుక్కొని తాగుతున్నాడు. లేమూ ?" అని మేరియానా చటాలున అన్నది. తర్వాత అరుగుదిగి బైట కెళ్లింది దభీమని తన వెనకాల తలుపుమూస్తూ.

ఓలెనిన్ తన కళ్లతో ఆమె ననుసరించేడు. తర్వాత, ఆమె వెళ్లిపోయినాక, తలుపువంకచూస్తూ లేచి చూసేడు. ఆ గోడవలో, ఆమెతల్లి అంటూన్న దేమిటో అతనికి వినపడలేదు. కొన్ని నిమిషాల తర్వాత కొంతమంది అతిథులు వచ్చేరు: వొక ముసలి కోసక్కు, మేరియానా మామ, ఇరోష్కానూ. తర్వాత ఉస్టెంకా, మేరియానాతో కలిసివచ్చింది.

"యెలావున్నారయ్యా అంతానూ ?" ఉస్టెంకా కీచురుమంది. "యింకా శెలవమీదేనా ?" అని ఆమె ఓలెనిన్‌వంక తిరుగుతూ అడిగింది.

"ఆఁ. యింకా శెలవుమీదే" అకస్మాత్తుగా అతనికి అసహ్యమూ చిరాకూ గలిగి అన్నాడు.

అక్కణ్నుంచి వెళ్లిపోవాలనుకొన్నాడు. కాని, వెళ్లలేకపోయేడు. యేమీ మాటాడకుండా అక్కడ కూచోటం గూడా అసంభవంగా కన్పటింది. సారా అడిగి ముసలాడతన్ని రక్షించేడు. ఓలెనిన్ అతనితో కలిసి తాగేడు. తర్వాత ఇరోష్కాతో, ఆ తర్వాత మళ్ళీ ఆ ముసలికోసక్కుతో. తాగినకొందీ అతని హృదయం బరువెక్కసాగింది. కాని, ఆ యిద్దరు ముసలాళ్లూ వుషారుగా తయారయ్యేరు. ఆడపిల్లలు అరుగుమీది కెక్కి తమలో తాము మాటాడుకోసాగేరు, తాగుతూన్న మగవాళ్లవంక చూస్తో. ఓలెనిన్ నిశ్శబ్దంగా వున్నాడు. అతనే అందరికన్నా యెక్కువ తాగేడు. ఆ ముసలాళ్ళేదో అరుచుకొంటున్నారు. మేరియానా తల్లి వాళ్లని బైటకి గెంటెయ్యాలని ప్రయత్నించింది. యిక వాళ్లకి ఛిఖిర్ యేమీ యివ్వ లేదు. ఆడ పిల్లలు ఇరోష్కావంకచూసి నవ్వుతున్నారు.

వాళ్లు లేచేసరికి పదిగంటలయ్యింది. ఓలెనిన్ యింటివద్ద ఆ రాత్రి జల్సా చేద్దాంరమ్మని ముసలివాళ్లిద్దరూ వాకళ్ల వాకళ్లు ఆహ్వానించుకొన్నారు. ఉస్టెంకా యింటికి పరుగెత్తింది. ముసలికోసక్కా, ఇరోష్కా యిద్దరూ ఐవాన్‌ని వెతకటానికి బైలుదేరేరు. చావడిలో పని చూడటానికి మేరియానా తల్లి బైటకెళ్లింది. మేరియానా వొక్కర్తే యింట్లోవుంది.

అకస్మాత్తుగా ఓలెనిన్‌కి వుత్సాహం గలిగింది. అతనికళ్లు తెరుచుకొన్నాయి. అంతా అర్థం చేసికొన్నాడు. ముసలాళ్లని ముందు పోనిచ్చి తర్వాత తాను మేరియానా గదికి వెళ్ళేడు. పడుకోటాని కామె పక్క సర్దుకొంటోంది. ఆమె దగ్గరకెళ్ళేడు. మాటాడాలనుకొన్నాడు. కాని గొంతు పెగల్లేదు. ఆమె మంచం చివరి భాగాన కూచుని, కాళ్లు పైకి మడిచి, అతనివంక నిశ్శబ్దంగా చూసింది. అతన్నిచూసి ఆమె భయపడుతున్నట్లుంది. ఆమెపైన ఓలెనిన్‌కి విచారం గలిగింది. తననిజూసి లజ్జ గలిగింది. కాని, ఆమెలో భావాన్నన్నా తాను కలిగించినందుకు అతనికి సంతృప్తి గలిగింది.

''మేరియానా'' అని అతనన్నాడు. ''నామీద యిక జాలి తలచనే తలచవా? నేను నిన్నెంత ప్రేమిస్తున్నానో వర్ణించలేను.''

ఆమె యింకా దూరంగా జరిగింది.

''తాగినమాటలు ! నానుంచి నువ్వేమీ తీసుకోలేవు !''

''వుహూం. తాగుడుగాదు. లూకాని పెళ్లిచేసుకోమాక. నేను నిన్ను పెళ్లిచేసికొంటాను.'' (''నేను మాటాడేదేంటి ?'' అని తాను మాట్లాడుతూనే అనుకొన్నాడు. ''రేపుగూడా యీ మాటలంటానా ? అవును, అంటాను. యిప్పుడు మళ్లీ అదేమాట లంటాను.'') ''నన్ను పెళ్లి చేసికొంటావా ?'' అని అతను బిగ్గరగా అన్నాడు.

ఆమె అతనివంక గంభీరంగా చూసింది. యిక నేమాత్రం అతనంటే భయపడుతున్నట్లగుపించలేదు.

''మేరియానా ! నాకు పిచ్చెక్కుతోంది. నేను, నేనుగాదు. నువ్వేది చెయ్యమంటే అదిచేస్తా !'' వాటంతటవే అర్థంలేని మాటలు అతని పెదవులమీది కొచ్చేయి.

"యేం వెర్రివాగుడంట!" అని, అతను తనకి సాచిన చేతి నామె గట్టిగా పట్టుకొంది. అతనిచేతిని తోసివేయలేదు. తన బలమైన మోటు చేతుల్తో దాన్ని గట్టిగా నొక్కింది. "కోసక్కుపిల్లల్ని పెద్దమనుషు లెప్పట్నుంచి పెళ్లి చేసుకోవటం మొదలెట్టారూ? పదపద!"

"మేరియానా, నువ్వు...నేను—"

"యిందులో లూకా వ్యవహార మేముందంట?" అని ఆమె నవ్వింది.

ఆమె పట్టుకొనివున్న తన చేతిని లాక్కొని ఆమె నడుంచుట్టూ చేతులు పోనిచ్చేడు. ఆమె యెగిరి తప్పించుకొని లేడిలాగా తన వట్టి పాదాలతో బైటికి పరుగెత్తింది. ఓలెనిన్‌కి తెలివివచ్చింది. తనమీద తనకి పరమ అసహ్యం కలిగింది. ఆమెతో పోలిస్తే తాను నీచుణ్ణనేసంగతి మళ్లీ అతనికి తట్టింది. కాని ఆమెతో అనిన మాటలపట్ల అతనికి కొంచెంత విచారం గూడా వెయ్యలేదు. అతను యింటికెళ్లి, తనగదిలో తాగుతూన్న ముసలాళ్లవంక అలా వొకసారి చూడనన్నా చూడకుండా, తన మంచంమీద పడి, చాలాకాలంగా యెప్పుడూ పోనంతగా మత్తునిదరపోయేడు.

# 35

మర్నాడు శెలవురోజు. సాయంకాలం గ్రామస్థులంతా వీధుల్లోకొచ్చేరు. అస్తమించుతూన్న సూర్యకాంతిలో వారి కొత్తబట్టలు తళుక్కుమని మెరుస్తున్నాయి. ఆయేడు యెప్పటికంటేగూడా యెక్కువ ద్రాక్షసారా తయారుచేసేరు. ప్రజల కిప్పుడు పనిలేక తీరికగా వుంది. వొక నెలలో మగవాళ్ళు వెళ్ళిపోతారు. అదే సమయంలో చాలా కుటుంబాలు పెళ్లి ప్రయత్నాలు చేసుకొంటున్నాయి.

చాలా గ్రామస్థులు గవర్నమెంటు ఆఫీసుముందున్న చౌకులోనూ, మిఠాయీలూ గుమ్మడి గింజలూ అమ్మే చిన్నంగడివద్దా, రుమాళ్ళూ ప్రింటు గుడ్డలూ అమ్మే చిన్నపాపువద్దా చేరేరు. ఆఫీసు చుట్టూవున్న మట్టిదిబ్బమీద, యే అలంకారమూలేని బూడిదరంగుకోట్లో, నల్లకోట్లో

తొడిగి ముసలాళ్లు చతికిల బడ్డారు. వారు పంటనిగురించీ, పడుచువాళ్లని గురించీ, వూళ్లో వ్యవహారాల్ని గురించీ, వెనకటిరోజుల్ని గురించీ ప్రశాంతంగా మాటాడుకొన్నారు. ఈ తరంవాళ్లపట్ల హుందాగా నిర్లక్ష్యత కనబరిచేరు. వారి పక్కగా వెళ్ళే ఆడపిల్లలూ, స్త్రీలూ సగౌరవంగా తమ తలలువంచి నమస్కరించేరు. యువకులు తమ నెత్తిమీద టోపీలనెత్తి వో క్షణంపాటు గౌరవ సూచకంగా అలాగే యెత్తిపట్టి వుంచేరు. అప్పుడు ముసలాళ్లు తమ సంభాషణ ఆపి, పక్కగా వెళ్తూన్న వాళ్లవంక చూసి, కొందరు కరుకుగానూ మరికొందరు ప్రేమతోనూ మెల్లగా తమ టోపీలుతీసి పైకెత్తి మళ్లీ పెట్టుకొన్నారు.

ఆడపిల్ల లింకా నాట్యం చేయటం ఆరంభించలేదు. మెరిసే రంగుగల బిష్మెత్‌లు తొడిగి, తెల్లని రుమాళ్లు తమ కళ్లమీదివరకూ లాగి, చిన్న చిన్న గుంపులుగా నేలమీదా యిళ్లచుట్టూవున్న మట్టిదిబ్బలమీదా కూర్చుని, తమ రింగురుమనే గొంతుల్లో నవ్వుతూ పిచ్చాపాటీ చెప్పుకుంటున్నారు. పిల్లలు చౌకంలో గెంతుతూ కేరుతూ నిర్మలంగా వున్న ఆకాశంలోకి యెత్తుగా బంతుల్ని విసురుతున్నారు. ఆడపిల్లల్లో పెద్దవాళ్ళు చౌకం ఆ చివర్న, తమ సన్నని కీచురుగొంతుల్లో పాడుతూ, గుండ్రని ఆకారంలో నృత్యంచేస్తున్నారు. శెలవురోజు గాబట్టి యింటి కొచ్చిన యువకులూ యింకా మిలటరీలో చేరని యువకులూ బంగారు జరీ అంచుకట్టిన సిర్‌కేషియన్ కోటుల్ని తెల్లటివాటినో యెర్రటి వాటినో తొడుక్కొని, ముఖాల్లో ఆనందం తాండవిస్తూండగా, యిద్దరు ముగ్గురు ముఠాలుగా వొక గుంపు ఆడపిల్లల వద్దనుంచి మరో గుంపువద్దకి సరదాగా నడిచి వెళ్తున్నారు. బట్టలషాపువాడైన ఆర్మీనియను జాతివాడు బంగారు జరీ పనిచేసిన చక్కని నీలిరంగు కోటుతొడిగి, తన ప్రాముఖ్యమేమిటో గ్రహించిన పాగ్రేశపు వ్యాపారివలె సగర్వపు దృక్కుల్లో తన ఖాతాదార్లకోసం యెదురుచూస్తూ తెరిచివున్న తన అంగడివాకిటివద్ద నుంచున్నాడు. అంగట్లో బొత్తులు బొత్తులుగా పేర్చిన చక్కని రుమాళ్లున్నాయి అమ్మకానికి సిద్ధంగా. టెరెక్‌నది అవతలిప్రాంతంనుంచి యిద్దరు యెర్రగడ్డాల ఛెఛెన్లు వచ్చేరు. వాళ్లు పాదాలకేమీ తొడుక్కోలేదు. యిక్కడి వుత్సవం చూడటానికొచ్చేరు. వొక క్యునాక్ యింటిగేటు, మడమలమీదకూచుని, సోమరిగా తమ చిలుం గొట్టాలనుంచి పొగ పీల్చుతూ,

వుమ్మలూస్తూ, వాళ్లు తమ మంద్రస్వరాల్లో మధ్య మధ్య మాటాడుకొంటున్నారు. మామూలు డ్రస్సు వేసుకొన్న వొక సైనికుడు అప్పుడప్పుడూ మెరిసే బట్టలు ధరించిన ఆ జనం గుంపుగుండా త్రోవచేసుకొని గబగబా వెళ్తున్నాడు. అక్కడక్కడా కొంతమంది కోసక్కులు, అప్పటికే కైపు యెక్కి, పాట లంకించుకొంటున్నారు. ఇళ్ల తలుపులన్నీ మూసివున్నాయి. కిందటిరోజునే వసారాలన్నీ శుభ్రంగా అలికివేసేరు. ఆఖరికి ముసలమ్మలు గూడా బైటికొచ్చేసేరు. పొడిగా, దుమ్ముగావున్న ఆ వీధుల్లో గుమ్మడి గింజలపొట్టూ, పుచ్చకాయలపొట్టూ యెక్కడి తొక్కడిగా పడివున్నాయి. గాలి వెచ్చగా నిశ్చలంగావుంది.

ఆకాశం నీలంగా, వినిర్మలంగావుంది. యిళ్లమీదగా కనపడుతూన్న హిమనగ శిఖరాలు అస్తమించే అరుణ కిరణకాంతిలో యెర్రగా అవుపించుతూ చాలా దగ్గరగా వున్నట్లున్నాయి. మధ్య మధ్య టెరెక్ అవతలి నుంచి దూరపు ఫిరంగి వురుము వినవస్తూ, వుల్లాసంగా యెడా తెరిపీ లేకుండావున్న ఆ వీధుల్లోని రణగొణ ధ్వనితో మిళితమవుతోంది.

మేరియానాని చూసే ఆశతో ఓలెనిన్ ఆ వుదయమంతా యింటి ఆవరణలో గడిపేడు. కాని, ఆమె చర్చికి ప్రార్థనకెళ్లింది. తర్వాత చాలా భాగం మట్టి దిబ్బమీద ఆడపిల్లల్తో కలిసికూచుని గింజలు నమలటంతో కాలం గడిపింది. తక్కిన ఆడపిల్లల్తో గలిసి ఆమె పొద్దున్న చాలాసార్లు యింటికొచ్చింది. వచ్చిన ప్రతిసారీ ఓలెనిన్ వంక వుల్లాసంతో ఆనందంతో దృక్కులు సారించింది. కాని, ఆమెతో సరసమాడటానికిగానీ పరాయి వాళ్లముందు ఆమెతో మాట్లాడటానికిగానీ అతనికి సిగ్గేసింది. క్రితం రోజున తాను చెప్పటం మొదలెట్టి ఆపేసిన విషయాన్ని ఆమెకి చెప్పి ఆమెనుంచి ఖచ్చితమైన సమాధానం రాబట్టాలనుకొన్నాడు. కిందటి సాయంత్రం దొరికినటువంటి అవకాశం దొరుకుతుందేమోనని చూసేడు. కాని, అలాంటి అవకాశం రానేలేదు. ఇలాంటి అసందిగ్ధావస్థని తాను భరించలేనని అతను గ్రహించేడు. మరోదఫా ఆమె బజారుకెళ్లినపుడు ఆమె వెనకాల కొంత దూరంలో ఆమె ననుసరించేడు. ఆమె వొక వీధి మలుపువద్ద కూచుంది. ఆమె తొడిగిన లేత నీలిరంగు బిష్మెత్ సూర్యకాంతిలో మెరుస్తోంది. అత

నావీధిమలుపు తిరిగి వెళ్తూంటే ఆడపిల్లలు పగలబడి నవ్వటం వినిపించింది. అతని హృదయం కళుక్కుమని తీపులు పెట్టింది.

బెలెట్‌స్కీ యిల్లు చౌకానికి యెదురుగావుంది. ఓలెనిన్ అది దాటి వెళ్తూంటే తనని పిలుస్తున్న బెలెట్‌స్కీ కంఠస్వరం వినిపించింది. వెనక్కి తిరిగి ఆ యింట్లో కెళ్ళేడు.

వా రిద్దరూ కిటికీ పక్కన కూచున్నారు. కొత్త బిష్మెత్ తొడిగి, త్వరలోనే, ఇరోష్కావచ్చి వారితో కలిసేడు. అతను వారి పక్కన నేల మీద కూచున్నాడు.

"అదిగో అక్కడొక పెద్దమనుషుల గుంపుంది" వీధి మలుపువద్ద రంగుల రంగుల బట్టలు తొడిగి కూచున్న వొక గుంపు వంక తన సిగరెట్టుతో చూపిస్తూ బెలెట్‌స్కీ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "నాది గూడా అందులోనేవుంది. యెర్రబట్టలు కట్టుకునుంది. నీకు కనపడుతూందా? అది కొత్త బిష్మెత్తోయ్! ఓహోయ్, మిమ్మల్నే! యింకా నృత్యం చేయటం లేదేం?" కిటికీలోగుండా తొంగిచూస్తూ అతనరిచేడు. "చీకటి పడేదాకా ఆగుదాం" అని ఓలెనిన్ వంక తిరుగుతూ అన్నాడు. "అప్పుడు మనం పోయి వాళ్ళతో కలుద్దాం. ఉస్టెంకా యింటికి రమ్మందాం. వొక నృత్యం యేర్పాటు చేద్దాం తప్పకుండాను."

"నే నొస్తా" అని ఓలెనిన్ దృఢనిశ్చయంతో అన్నాడు. "మేరియానా గూడా వస్తుందా అక్కడికి?"

"ఆఁ. నువ్వు తప్పకుండావచ్చి తీరాలోయ్" యే మాత్రం ఆశ్చర్యపడకుండా బెలెట్‌స్కీ అన్నాడు. "ఆ గుంపు నిజంగా చాలా చూడ ముచ్చటగా వుంది సుమా!" అని ఆ గుంపువంక చూపుతూ అన్నాడతను.

"అవును. చాలా యిదిగావుంది" తనకేమీ పట్టనట్లగుపించటానికి ప్రయత్నించుతూ ఓలెనిన్ అన్నాడు. "యిలాంటి పండగరోజులంటే నాకు వింతగావుంది సుమా. ఫలానా రోజో ఫలానా రోజో అయినంత మాత్రంచేత—ఉదాహరణకి యివాళ్టిలాగా 15వ తేదీ అయినంత మాత్రం చేత—ప్రతివాడికీ వొక్కసారిగా వున్నపాళాన అంత వుత్సాహం యెక్కణ్ణుంచివస్తుందో నాకు వింతగా వుంటుంది. ప్రతిదీగూడా యిది శెలవురోజని

చెబుతూంది—ముఖాలు, కళ్ళు, గొంతులు, కదలికలు, బట్టలు, ఆఖరికి గాలీ, సూర్యుడూ కూడాను! మరి మనకేమో యిక శెలవు లేదు!''

''అవును'' అని బెలెట్‌స్కీ ముక్తసరిగా అన్నాడు; అతనికి వేదాంతం మాటాడటం యిష్టంలేదు. ''అరే. నువ్వు తాగటం లేదేం తాతా?'' ఇరోష్కా వంక తిరిగి అత నడిగేడు.

''అతను పొగరుబోతు, నీ స్నేహితుడు'' అన్నట్లుగా ఇరోష్కా ఓలెనిన్ వంక కన్ను గీటేడు.

బెలెట్‌స్కీ తన గ్లాసు యెత్తేడు. ''అల్లాబిర్డీ!'' అని దాన్ని ఖాళీ జేస్తూ అన్నాడు. (తాగేప్పుడు కకేషియావారు ''అల్లాబిర్డీ''—అంటే, ''భగవద్బహుమతి''—అని అంటారు.)

''సౌ బుల్! (నీ ఆరోగ్యంకోసం)'' అని చిరునవ్వు నవ్వుతూ ఇరోష్కా సమాధాన మిచ్చేడు.

''దీన్ని మీరు శెలవురోజంటున్నారు'' అని అతను నుంచుని కిటికీలోనుండా చూస్తూ అన్నాడు.'' కాని; మా హయాంలో శెలవురోజంటే యెలావుండేదో మీరు చూసి వుండాల్సింది! బంగారు జరీపనిచేసిన సారఫాన్లు తొడిగి, బంగారపు నాణేల్ని మెడలో రెండువరుసల్లో వేసుకొని, తలమీద జరీ పని చేసిన తలగుడ్డలు వేసుకొని ఆడవాళ్ళు బైటకొచ్చేవాళ్ళు. వాళ్ళు నడుస్తూంటే అవి 'ఫ్రిష్ ఫ్రిష్' మని ధ్వని చేసేవి. ప్రతి ఆడదీ వొక రాచకుమారిలాగా వుండేదనుకోండి. వొక మందగా బైటికొచ్చిపడి వాళ్ళు రాత్రింతా పాటలు పాడుతూంటే గాలిమారుమోగేది. యిక మగాళ్ళు ఛిఖిర్ పీపాల్ని యింట్లోంచి యింటిముందుకి దొర్లించుకొచ్చి పొద్దుపొడిచేదాకా తెగతాగేవాళ్ళు. లేకపోతే చెట్టపట్టాలుపట్టుకొని ప్రవాహంలాగా వీధుల్లో కొచ్చి పడేవాళ్ళు. దారిలో యెవరు కనపడితే వాళ్ళని లాక్కెళ్ళేవాళ్ళు' వంతులు వారీగా వొకళ్ళింటో వొకళ్ళు తాగటాని కొంగుతూ. వొక్కోసారి అలా మూడురోజులపాటు జల్సా జరిగేది. మానాన్న తెగతాగి ముఖం కందగడ్డయి, టోపీ గీపీ లేకుండా, యింటికొస్తుండేవాడు. ఆ సంగతి నాకింకా గ్యాపకముంది. ఆయనొచ్చి మంచంమీద పడుకునేవాడు. అప్పుడేం చెయ్యాలో మా అమ్మకి తెలుసు. చేపకూరా, వొక జాడీడు ఛిఖిరూ తెచ్చి

యిచ్చేది కుదట బడటంకోసం. తర్వాత పోయిన టోపీ వెతకటానికి బజార్లోకి పరుగెత్తేది. యిప్పుడాయన రెండురోజులపాటు నిద్రపోయేవాడు. ఆ కాలంలో అలాంటి మనుషులువాళ్లు. మరి వాళ్లతో పోలిస్తే మనమే మాత్రం?''

''సరేగాని, ఆడపిల్లలో—వాళ్లంతట వాళ్ళు జల్సా చేసుకొనే వాళ్ళేనా'' అనడిగేడు బెలెట్‌స్కీ.

''ఆఁ. అవును. వొకోక్కసారి మగాళ్లొచ్చిపడి వాళ్ల నృత్యాల్ని చెడగొట్టాలని చూసేవాళ్ళు. కాని, ఆడపిల్లలు వాళ్లని దుడ్డుకర్రల్తో ఎదురు తిరిగి పోట్లాడేవాళ్ళు. వుత్సవ వారాన ప్రత్యేకంగా, యే డాబుసరి కుర్రాడో గుర్రమెక్కి ధూసుడుగా రావటమూ, ఆడవాళ్ళు తమ దుడ్డుకర్రలు తీసుకొని గుర్రాన్నీ వాణ్ణీ గూడా బాది వొదిలిపెట్టేవాళ్ళు. యికవాడు గిని వాళ్లలోపలకి జొరబడగలిగాడా తాను ప్రేమించిన కుర్రదాన్ని లంకించుకొని లగువు తీసేవాడు. అవును, ఆ రోజుల్లో ఆడపిల్లలంటే నిజంగా రాసకన్యలే!''

# 36

సరిగ్గా అదే సమయంలో యిద్దరు గుర్రపురౌతులు చాకంలో కనిపించేరు. వారు నాజరూ, లూకానూ. నులి మెరుపుగా, పుష్టిగావున్న లూకా గుర్రం, పట్టుకుచ్చెల్లాగావున్న తన జూలును యెగరేసుకొంటూ, కటువుగావున్న ఆ రోడ్డుమీద సులాగ్గా నడుస్తోంది. తొడుగులో జాగర్తగా వుంచిన తుపాకీ, వీపునవేళ్ళాతూన్న పిస్తోలూ, జీను వెనకాల నీటుగా మడిచిన వొదులు చొక్కా అతను ప్రశాంతంగా వుండేచోటునుంచి యేమీ రాలేదని తెలుపుతున్నాయి. బడాయిపోజులో, అతను జీనుమీద కొంచెం వొక పక్కకి వొరిగి కూచుని తన కొరడాతో నిర్లక్ష్యంగా గుర్రపు కడుపుని నిమురుతున్నాడు. సగం మూసివున్న అతని నల్లనికళ్లు అతనుచుట్టూ చూస్తూంటే తళుక్కుమని మెరుస్తూ అతని యువశక్తిలో ఆత్మస్థైర్యంలో అతనికిగల విశ్వాసాన్ని చూపుతున్నాయి. ''వూరికినే అలా వొకసారి

నా వంక చూడండి!'' అని అంటున్న ట్లగపడ్డాడతను. నిజంగా గూడా వెండి అలంకారాల్లోవున్న ఆ సుందరాశ్వమూ, మెరుస్తూన్న ఆ ఆయుధాలూ, ఆ చక్కని కోసక్కూ ప్రతివారి దృష్టినీ ఆకర్షించేయి. పొట్టిగా, సన్నగావున్న నాజరు అంత యిదిగానూ లేడు. తాము వొక గుంపు ముసలాళ్ల పక్కగాపోతూ, లూకా గుర్రాన్నాపి తన గొర్రెతోలుటోపీని తన నల్లని క్రాపుచేసిన తలపైన యెత్తున యెత్తేడు.

''సరే. యీసారి నోగేనుంచేం తోలుకొచ్చేవోయ్?'' అని వొక సన్నటి చిన్నటి ముసలాడు చిర బురలాడే చూపుతో అన్నాడు.

''యేం, నువ్వే వాటి నెందుకు లెక్కవెయ్యరాదూ యెన్నో?'' అని లూకా అన్నాడు తల తిప్పకొంటూ.

''హారే, నా కుర్రాణ్ణి మాత్రం నువ్వు యిందులో కీడవకుండా వుండటం మంచిది!'' అని ఆ ముసలాడు కోపంగా అన్నాడు.

''ఆ ముసలి లంబ్డీకొడుక్కి అంతా తెలుసు!'' కొంచెం కలవరపడి లూకా ముఖం చిట్లిస్తూ సణిగేడు వినపడకుండా. కాని అంతలోనే వొక గుంపు ఆడపిల్లల్నీ పెద్ద స్త్రీలనీ చౌకంలో వోమూల వుండటంచూసి తన గుర్రాన్ని వారివైపు తిప్పేడు.

''గుడ్ యీవెనింగ్, ఆడపిల్లలూ!'' అని అతను తన రింగురు మనే గొంతుతో అరిచేడు. ''నేను లేకుండా మీరు పెద్దాళ్లవుతున్నారే ముండల్లారా!''

''గుడ్ యీవెనింగ్, లూకా. గుడ్ యీవెనింగ్, కొడకా!'' అని చాలా గొంతు లరిచేయి. ''బాగా డబ్బు తెచ్చావా? మాకు మిఠాయీలు తేవూ మరీ? నిన్నుచూసి చాలా కాలమైంది...''

''నాజరూ నేనూ యీ వొక్క రాత్రి యిక్కడ గడపటానికి వాడు తీసుకొచ్చాం'' తన కొరడాని ఝుళిపించుతూ, సూటిగా ఆడపిల్లలవద్దకి గుర్రాన్ని నడుపుతూ, లూకా అన్నాడు.

''యెంతో కాలమైంది నువ్వొచ్చి. మేరియానా నిన్ను మరిచిపోయింది,'' మేరియానాని తనమోచేత్తో పొడుస్తూ, కీచురుమని నవ్వుతూ ఉస్టెంకా అన్నాది.

వచ్చే వచ్చే గుర్రంనుంచి మేరియానా పక్కకి తొలిగి తల వెనక్కి పెట్టి మెరుస్తోన్న తన పెద్దకళ్లతో లూకా వంక చూసింది.

"నిజంగా చాలాకాలమే అయింది. అది సరే గాని మా మీదగా తోలబోతున్నా వెందుకూ?" మేరియానా పుల్లవిరుపుగా అని ముఖం తిప్పుకొంది.

ఆమె నిర్లక్ష్యతచూసి లూకా ఆశ్చర్యపడ్డాడు. అతని ముఖంలోని వుల్లాసం, ఆత్మ సంతృప్తీ మటుమాయమైనాయి.

"రా, గుర్రమెక్కు. నిన్ను పర్వతాల్లోకి తీసుకెళ్తా!" అని, బాధ గలిగించే ఆలోచనల్ని పోద్రోలడానికా అన్నట్లు అతను కొంతసేపటి తర్వాత హఠాత్తుగా అరిచేడు. తర్వాత ఆడపిల్లలమధ్య తిరుగుతూ మేరియానా వైపుకి వంగేడు. "ఐనా నా ముద్దు మాత్రం నేను వదలను" అని అన్నాడతను.

అతని కళ్లలోకి చూస్తూ మేరియానా సిగ్గరిల్లింది.

"అబ్బ, పోపో! నాకాళ్ళు తొక్కేస్తావిప్పుడు" వెనకడుగువేస్తూ మేరియానా అన్నాది. తర్వాత తన చక్కని నీలిరంగు మేజోళ్లవంకా సన్నని వెండిపనిచేసిన యెర్రటి బూడ్సులవంకా చూసుకొంది.

లూకా, ఉస్తెంకావంక చూసేడు. వాడిలో చంటిపాపవున్న వాకావిడ దగ్గర మేరియానా కూచుంది. చంటిపాప తన గుండ్రని చిట్టిచేతులుసాచి మేరియానా మెడలో వేలాడుతూన్న నాణేలదండని గట్టిగా పట్టుకొంది. దొంగచాటుగా లూకా వంక చూస్తూ, మేరియానా ముందుకు వంగింది. అతను తన కోటులోపలకు చేయిదూర్చి తన నల్ల బిష్మెత్ జేబులోంచి వాక పొట్లాం మిఠాయీలూ గుమ్మడిగింజలూ బైటికిలాగేడు.

"యివిగో!" ఆ పొట్లాన్ని ఉస్తెంకాకిచ్చి, మేరియానా వంకచూసి నవ్వుతూ అతనన్నాడు. "మీ కందరికీ అవి బహుమతిగా యిస్తున్నా!"

మేరియానా కలవరపడినట్లుగా అగుపించింది. తనకళ్లమీద యేదో పొర గమ్మినట్లయింది. ఆవేశంతో తనరుమాలుని నోటికిందవరకూ లాగి చంటిపాప యెర్రటి చిన్న ముఖంవద్దకి వంగి ముద్దుల వర్షం కురిపించ సాగింది. ఆ చంటిపాప మేరియానా యొక్క యెత్తుపాంటి రొమ్ములకేసి తన ముఖం వత్తిపట్టి పళ్ళులేని తన చిన్నినోరు తెరచి కీచురుమంది.

''ఆవు. వాడు వూపిరాడక చచ్చిపోతాడు'' అని ఆ పాప తల్లి అన్నాది బిడ్డను లాక్కొంటూ, స్తన్యం యివ్వటానికి తన రొమ్ము మీద ముసుగుతీసేస్తూ. ''నువ్వు నీ చెలికాడి దగ్గరకెళ్లి మంచి చేసుకోటం వుత్తమం.''

''మేము అలావెళ్లి గుర్రాల్ని కట్టేసి మళ్ళీవచ్చి సరదాచేస్తాం'' గుర్రాన్ని తన కొరడాతో తాకుతూ లూకా అన్నాడు.

అతనూ నాజరూ కలిసి వొక పక్క వీధిలోకి తిరిగి వొకదానిపక్క వొకటున్న రెండుయిళ్లవద్ద కొచ్చేరు.

''వచ్చేశాం! ఆలస్యం చెయ్యమాకరా'' అన్నాడు లూకా. తర్వాత గుర్రాన్ని దిగి తనయింటి గేటుగుండా దాన్ని నడుపుకొని వెళ్ళేడు.

''యెలావున్నావు, స్టెప్కా?'' అని అతను తన మూగ చెల్లెల్తో అన్నాడు. ఆమె తనకున్న మంచి బట్టల్ని తొడిగివుంది. అతని గుర్రాన్ని తీసుకోటానికి బజార్లోంచివస్తోంది. గుర్రానికి కొంచెం మేత పడెయ్యమనీ, జీను విప్పదీయవద్దనీ అతనామెకి సైగచేసి చెప్పేడు.

ఆ పిల్ల నోటితో మకారధ్వనిచేసి, పెదిమల్ని చప్పరించి, గుర్రం వంకచూపి అది మంచి గుర్రమనీ అదంటే తనకి ప్రేమనీ చెప్పటానికి దాని ముక్కుని ముద్దుపెట్టుకొంది.

''యెలావున్నావు, అమ్మా? యింకా నువ్వు బైటికిపోలేదేం?'' తుపాకిపట్టుకొని వసారా మెట్లెక్కుతూ లూకా కేక బెట్టేడు.

అతని తల్లి తలుపు తెరిచింది.

''హబ్బ! నువ్వొస్తావని నేను అనుకోనేలేదురా! నువ్వురావని కిర్కా అన్నాడు గూడాను.''

''పోయి మాకు కొంచెం ఛిఖిర్ తెచ్చిపెట్టమ్మా, నాజరొస్తున్నాడు. మేము సరదా చెయ్యాలనుకొన్నాం.''

''యిప్పుడే, లూకా, యిప్పుడే తెస్తా!'' అన్నదామె. తన తాళపు చెవులు తీసికొని బైటికెళ్లింది ఆపాళాన.

తన గుర్రాన్ని కట్టేసి తుపాకి తీసి దాచినాక నాజరు వెనక్కి తిరిగొచ్చేడు.

# 37

"నీ ఆరోగ్యం కోసం!" తల్లి చేతుల్లోంచి నిండా భిఖిర్ వున్న వాక గిన్నెని తీసుకొంటూ, జాగ్రత్తగా దాన్ని తన వంచిన తలవద్ద కెత్తుతూ లూకా అన్నాడు.

"అరే అది వెధవ పనిరా" అన్నాడు నాజరు. "ఆయ నన్నదేమిటో విన్నావుగదూ? యెన్ని గుర్రాల్ని దొంగతనం చేశావురా అన్నాడు. ఆయన కెలా తెలుసంట?"

"మంత్రిగాడురా" అన్నాడు లూకా కటువుగా. "సరే, అయితే యేమిటంట?" అని తలెగరేస్తూ తిరిగీ అన్నాడు. "యిప్పుడవి నది కవతలవున్నయ్యి. పోయిచూడు."

"ఐనా అది వెధవపనిలాగా వుందిరా."

"యేమిటంట వెధవపనిలాగా వుండేది? పోయి చెప్పు ఆయనకి కొంచెం భిఖిర్ పట్టుకెళ్ళు. యిక దాంతో నోరుమూస్తాడు. యిలాంటి వ్యవహారాల్లో అలాగే జరగాలి. యిక మనం జల్సాచేద్దాంపట్టు. తాగరా!" అచ్చం ఇరోష్కా గొంతులాగావుండే గొంతుతో అత నరిచేడు. బజార్లోకెళ్లి ఆడపిల్లల్తో కొంచెం జల్సాచేద్దాం. నువ్వు పోయి కొంచెం తేనెపట్టుకురా. తెస్తావా? లేకపోతే మా మూగమ్మాయిని పంపమంటావా? యిక రాత్రంతా తెగతాగి పారేద్దాం!"

"యిక్కడ మనం యెంతసేపుంటామంటా?" చిరునవ్వుతో నాజరు అడిగేడు.

"ఆ సంగతి పట్టించుకోనేమాక. పరుగెత్తుకుపోయి వోడ్కాపట్టుకురా. యిదుగో డబ్బు."

నాజరు విధేయత్తో లేచి యామ్కా యింటికి విసవిసా వెళ్ళేడు.

ఇరోష్కా, ఇర్గుషోవులు వేటాడే పక్షుల్లాగా యెక్కడ తాగుతున్నారాఅనే వాసనపట్టి యీ యింట్లోకి తూలుకొంటూ వచ్చిపడ్డారు. యిద్దరూ తాగి వున్నారు.

"మాకు యింకో అరబొక్కెన సారా తీసుకురా!" అని లూకా వారు పలకరించిన దానికి సమాధానంగా కేకపెట్టేడు.

"ఆ:. చెప్పు. వాటిని నువ్వెక్కడ దొంగతనం చేశావో మాకుచెప్పరా వెధవాయి!" అని ఇరోష్కా వొండ్రపెట్టేడు. "నువ్వు మంచి కుర్రాడి విరా. నువ్వంటే నాకు ప్రేమ."

"నేనంటే నీకు ప్రేమా?" అన్నాడు లూకా నవ్వుతూ. "యిళ్లల్లో అద్దెకున్నవాళ్ల దగ్గిర్నుంచి ఆడపిల్లలకి మిఠాయీలు తీసికెళ్లి యిస్తున్నావుగదూ? ముసలితొత్తుకొడకా!"

అది విని ఆ ముసలాడు పగలబడి నవ్వేడు.

"అది నిజంగాదురా, మార్క్. అది నిజంగాదు! కాని ఆ వెరి ముండాకొడుకులు అవి తీసికెళ్లి యిమ్మని నన్నెంత దేబిరించారో నువ్వు వినితీరాల్సింది. "పో. పోయి ఆ యేర్పాటు చెయ్యి" అని వాడన్నాడు! అది చేస్తే నాకు తుపాకీ బహుమతి యిస్తానన్నాడు. కాని, వుహూ! అది నేను యేర్పాటుచేసివుండే వాణ్ణేగాని నిన్ను గురించి ఆలోచించి వూరుకొన్నా. ఆc. కానియ్. యెక్కడికెళ్లావో యేమిటో చెప్పు మాకు" అన్నాడు ముసలాడు తార్తారు భాషలో మాటాడుతూ.

లూకా ధారాళంగా సమాధానమిచ్చేడు. ఇరుష్కోవుకి తార్తారుభాష ఆట్టే తెలీదు. అందుకని అతను మధ్య మధ్య రెండు రష్యనుమాటలు కలిపేడు.

"నేను చెప్పేదేంటంటే నువ్వు ఆ గుర్రాల్ని తోలుకొచ్చావూ ఆ సంగతి నాకు తెలుసూ అని" అని అతను అదే పనిగా అన్నాడు.

"సరే, నేను గిరీతో కలిసివెళ్లా" తాను పేరు ప్రఖ్యాతులుగల గిరిఖానుతో యెంత దోస్తీగా వుంటున్నాడో చూపేందుకని లూకా "ఖాను" అనేపదం వదిలేసి చెప్పటం మొదలెట్టేడు. "మేము నది దాటంగానే స్టెప్పీని గురించి తాను యెంతబాగా యెరిగున్నాడో బడాయిలు చెప్పటం సాగిచ్చాడు. కాని ఆ చీకట్లో ముందుకు పోయినకొందీ దోవ తప్పి గుండ్రం గుండ్రంగా తిరగటం మొదలెట్టాం. అతనికా శివారు కన పళ్ళేదు. అది మాత్రం ఖాయం. మేము తొందరపడి కుడిపక్కకి తిరిగామనుకొంటా. యిక అలా అర్ధరాత్రియ్యేవరకూ తిరిగాం. తర్వాత అదృష్ట వశాత్తూ కుక్క లరవటం విన్నాం."

"మీ యిద్దరూ యిద్దరే వెర్రిముండాకొడుకులుగాదూ ?" అన్నాడు ఇరోష్కా. "నాకూ అంతే జరిగింది. స్టెప్పీలో దోవ తెలిసికోటమంటే తాడు తెగేంత పనవుతుందిరా. యికప్పుడేం చేస్తానంటే దగ్గరున్న మిట్టయెక్కి యిదుగో యిలా తోడేళ్లాగా అరుస్తా" నోటివద్ద తన చేతులుపెట్టి వొక శ్రుతిలో అతను అరవసాగేడు వొక తోడేళ్లగుంపులాగా. "అప్పుడిక కుక్కలు యెదురు అందుకుంటయ్యి...ఆఁ. భేష్. యిక కానియ్యి ! అయితే చివరికి వాటిని చూశారన్నమాట ?"

"ఆఁ. ఆఁ. వెంటనే వాటిని తోలుకెళ్లాం. కాని నాజరు మాత్రం కొంతమంది నోగే ఆడాళ్ల చేతుల్లోపడినంతపని చేశాడు."

"భేష్. మరి నే నిక్కడున్నా. కాదూ ? అయితే వాళ్లింతకీ నన్ను పట్టుకోలేదన్నమాట ?" అని నాజరు నొచ్చుకున్న ధ్వనిగా అన్నాడు.

"సరే. మేము స్వారీ చేసుకొంటూ బైలుదేరాం. గిరీ మళ్లీ దోవ తప్పాడు. మమ్మల్ని దాదాపు యిసుక దిబ్బల్లోకి దింపాడు తీసికెళ్ళి. యింతాచేసినా యింకా టెరెక్ నది సరీగ్గా మా ముందర వుందంటూ అదే పనిగా చెప్పాడు. కాని మేము పోయేదేమో నది వైపు వీపుతిప్పి !"

"చుక్కల్ని గుర్తుపెట్టుకొని మీరు ప్రయాణంచేసి వుండాల్సింది" అన్నాడు ఇరోష్కా.

"నే నెప్పుడూ ఆమాటే అంటానయ్యా" అన్నాడు ఇర్గుషోవు.

"ఆఁ. అవునవును. చుక్కలు కనపడకపోయినా చుక్కల్ని బట్టే నడవాలి మరి ! వినండి, అన్నివిధాలా నేను ప్రయత్నించిచూశాను. ఆపర్నే ఆఖరికి ఆడ గుర్రాల్లో వొకదానికి కళ్ళెం తగిలించి నాగుర్రాన్ని వదిలిపెట్టాను, అది మాకు దోవచూపిచ్చవచ్చుననే ఆశతో. ఆపర్నే యేం జరిగిందనుకొన్నారు ? అది భేషుగ్గా దోవ చూపించింది ! గుర్రుమని అరిచి ముక్కుతో నేలని వాసనచూస్తూ సూటిగా ఫూరికేసి పరుగెత్తింది. అందులోనూ సరైన సమయంలో. యెందుకంటే అప్పుడే తెల్లవారుతున్నది. వాటిని అడివిలో దాయటానికి మాకు కావాల్సిన టైముదొరికింది గూడాను. తర్వాత నగీం వచ్చి వాటిని తోలుకుపోయాడు."

‘‘ఫేష్టైనవని !’’ తల నాడిస్తూ ఇరుషోవు అన్నాడు. ‘‘సరేగాని నాటివల్ల మీకెంత వచ్చిందిరా అబ్బాయ్ ?’’

‘‘అంతా యిదుగో యిక్కడుంది...’’ అని తన జేబుమీద చేత్తో కొడుతూ లూకా ఆరంభించేడు. కాని అదే సమయాన అతని తల్లి గదిలోకి రాగా అతను చెప్పటం ఆపేడు. ‘‘తాగండి !’’ అని అరిచేడు.

‘‘చూడూ, గిర్చిక్కూ నేనూ సరిగ్గా అదే చేసేవాళ్లమోయ్’’ అని మొదలెట్టేడు ఇరోష్కా. ‘‘వొక రాత్రి మేము గుర్రాలెక్కి బైలుగేరాం—’’

‘‘తగు తగు ! తగ్గరా ముసలాడా ! నీ గొడవంతా వినటానికి మే మిక్కడుండకేం’’ అని లూకా అడ్డు తగిలేడు. ‘‘నే పోతున్నా’’ గిన్నెలోని ఛిఖిర్ తాగేసి, బెల్టు బిగించి, బజార్లోకెళ్ళేడు.

# 38

చీకటి పడింది. ఆ ఆకులురాలుకాలపు రాత్రి నిర్మలంగా, ప్రశాంతంగావుంది. చౌకం చివర్న వున్న నల్లని పోప్లారుచెట్ల వెనకాలనుంచి బంగరు పూర్ణచంద్రబింబం పైకి తేలియాడుతూ వచ్చింది. యిళ్లకున్న పొగగొట్టాలనుండి పొగ పైకిలేచి గ్రామంమీద లోతట్టున వ్యాపించుతూ మంచుపొగలో మెలికలు మెలికలు తిరుగుతోంది. కొన్ని యిళ్లల్లో దీపాలింకా వెలుగుతూనేవున్నాయి. మాటలూ, పాటలూ, నవ్వులాటలూ, గుమ్మడి గింజల్ని పగలగొట్టటాలూ యింకా వొక దానితో వొకటి మిళితమవుతూనే వున్నాయి. కాని ఆ ధ్వనులు పగటిపూటకంటే బాగా స్పష్టంగా వినపడుతున్నాయి. ఆ చీకట్లో కంచెలవద్దా యిళ్ల దగ్గిరా గుత్తులు గుత్తులుగా తెల్లటి మేకపిల్ల తోలుటోపీలూ, రుమాళ్లూ కనపడుతున్నాయి. చౌకంలో, యింకా తెరిచేవున్న అంగడి ముందర, అటూ యిటూ కదుల్తూన్న స్త్రీ పురుషులనల్లటి ఆకారాలు ఆ అంగడి దీపపు వెల్తుర్లో అగుపించుతున్నాయి. ఆ దుమ్ముగనేలమీద తాళయుక్తంగా మనోహరంగా అడుగులువేస్తూ వొక ఆడపిల్లలగుంపు గుండ్రని ఆకారంలో నాట్యంచేస్తున్నారు. వాళ్లందర్లోకీ

నిరాడంబరంగావున్న వొక నన్నని యువతి పాట పాడటం మొదలెట్టగా తక్కినవాళ్ళు అందుకున్నారు:

నల్లని వొక అడవినుంచి
చల్లని వొక అడవినుంచి
వొక్కనాడు యిద్దరండి
చక్కని యువకులండి
వచ్చి రండి అవివాహితుల్
నడచి నడచి నడచి రండి
గడపి రండి సంభాషణను
ఆగినారు వొక్కచోట
అంతలోనె పోట్లాట
అంతలోనె సుందరాంగి
యింతవరకు కన్యకండి
వచ్చినాది అచ్చోటికి
ముచ్చటను యిట్లన్నాదీ
''మీ యిద్దరిలోన సామి
నే నొక్కరి దానవంది''
యిద్దరిలో అందగాడె
పెద్ద అదృష్టవంతుడు
పసిడిరంగు వేషములూ
మిస మిసమనె యవ్వనమూ
మనోహరనూ ముఖమునాడు
ఆ యువతీ కుడిహస్తం
ఆబెపట్టి పట్టేసేస్తం
''నాకు భార్య అవబోయే
సుందరాంగి జూడండోయ్!''
అని తన ఘన మిత్రులకూ
చనెను చూపగా నామెను.

ముసలిస్త్రీలు పక్కన నుంచుని శ్రద్ధగా విన్నారు. వొకరొక్కకరు తరుముకొంటూ పిల్లలు ఆ చీకట్లో పరుగులుతీసేరు. ఆ వలయాకారం

చుట్టూ మగవాళ్ళు నిల్చుని ఆడపిల్లలు గిర్రున తిరుగుతుండగా వారిని పట్టుకోటానికి ప్రయత్నించేరు. వొకొక్కసారి వారిలోకి జొరబడ్డారు గూడాను. అందరిలాగా సిర్‌కేషియన్ కోట్లూ, మేకపిల్లతోలు టోపీలూ ధరించి ఓలెనినూ, బెలెట్‌స్కీ చీకట్లో నుంచున్నారు. కాని వారు ఉచ్చరించేతీరు కోసక్కుల ఉచ్చారణకంటే విభిన్నంగా వుంది. అందువల్ల తాము మెల్లగా మాటాడుకొంటున్నప్పటికీ యితరులదృష్టిని ఆకర్షించుతున్నామని వారు గ్రహించేరు. వలయాకారంలోవున్న ఆ నృత్యబృందంలో, పొట్టిగా బొద్దుగా వున్న ఉస్టెంకా యెర్రటి చొక్కా తొడిగి వుంది; నీలిరంగు బిష్మెత్ తొడిగివున్న మేరియానా చేతిని పట్టుకునుంది. ఆ వలయంలోంచి ఆ యిద్దరి యువతుల్నీ బైటకి లాగటానికి మంచి మార్గమేదా అని ఓలెనిన్, బెలెట్‌స్కీలు ఆలోచించుతున్నారు. పూరికినే సరదాకోసరం ఓలెనిన్ ఆ పనిచేయాలనుకొంటున్నాడని బెలెట్‌స్కీ మొదట అనుకొన్నాడు. కాని ఓలెనిన్ మాత్రం తన భవిష్యత్తు తెలిపోవటంకోసం కాచుకుక్కూచున్నాడు. యెలాగైనాసరే అతను వొంటరిగా మేరియానాను కలిసికోవాలనుకొన్నాడు. ఆమెతో అంతా చెప్పేసి తనని పెళ్లిచేసుకొంటుందేమో అడగాలనుకొన్నాడు. ఆమె చేసుకోనని సమాధానం యిస్తుందని అతనికి తెలిసినప్పటికీ, కనీసం తాననుకొనేదేమిటో ఆమెకి చెప్పేధైర్యమన్నా వస్తుందనీ, ఆమె తనని అర్థం చేసికొంటుందనీ అతనాశించేడు.

"అరే! యీ సంగతి యింతకుముం దెందుకని నాతో చెప్పలేదోయ్!" అన్నాడు బెలెట్‌స్కీ. "అదంతా నేను ఉస్టెంకాద్వారా యేర్పాటు చేసి వుండేవాణ్ణి. నువ్వు వింత మనిషివోయ్!"

"యెప్పుడో ఒకప్పుడు అదంతా నీకు చెబుతాలే. కాని యిప్పుడా గొడవెత్తకుండా ఆమెని ఉస్టెంకా యింటికి తీసుకొచ్చే మార్గమేదో చూడు."

"అది తేలికపనే. యిప్పుడే చేస్తావుండు" పాట ఆగిపోయి నాట్యబృందం నిలబడే సమయానికి బెలెట్‌స్కీ అన్నాడు. "సరే, మేరియానా, అయితే ఆ మనోహరముఖం గల కుర్రాడిదన్నమాట అదృష్టవంతుడు యింతకీనూ. ఆఁ? లూకా గాదన్నమాట?" తర్వాత జనాబు

కోసరం యెదురుచూడకుండా ఉస్సెంకొావంక తిరిగి మేరియానాను యింటికి తీసుకురమ్మని చెప్పబోయేడు. కాని అతనది చెప్పకముందే ఆ నాట్య బృందం నాయకురాలు మరోపాట యెత్తుకొంది. ఆమీద వొకరిచేతు లొకరు లాగుతూ ఆడపిల్లలు చుట్టూ తిరగ సాగేరు.

పచ్చన్ని యాతోట పక్కగానేమీ
పోయెనో యువకుండు పరగషికారుకై
ఆవూరి వీధిలో అటు నిటూ తిరగగా
అటునిటూ యిటుసటూ వాహ్యాళి కొరకై
తిరుగుచును తిరుగుచును దాను మూడవసారి
ఆగియును వొకచోట వీధి దాటాడు
కమ్మనీ ప్రియురాల్ని కలిసికొనగాను
ప్రియురాల్ని కలిసికొని పలికె నిట్లాతండు :
"నా హృదయ రాణిరో నారీమణిరో నీవు
నామాట వినియునూ నాతోటి గలిసియును
చక్కగా తోటలో షికారు చేయంగ
చానరో బైటకూ సాగిరావేలా ?
నచ్చలేదా నీకు నేనేమియునుగూడ ?
నీమనసు మార్చుకొని నన్ను ప్రేమించా
మనపెళ్ళి మాటకై మనుషుల్ని పంపుతా
నా భార్యగా నిన్ను నే జేసికొంటా
నావల్ల నీవు కన్నీరు గార్చెదవపుడు."
నే చెప్పకలచినది నాకు తెలుసమ్మ
కాని యదిచెప్పంగ కరవాయె ధైర్యమ్ము
అందుకని తోటలో కెళ్ళాను నేను
అక్కడను ఆతణ్ణి ప్రియుస్నే హితుణ్ణి
కలిసికొన్నానమ్మ కడుప్రేమతోటీ
తీరుగా మీకిపుడు తలవంచుచున్నట్లు
ఆయనకు ఆనాడు వంగి వందనమిస్తి
"తెల్లన్ని చేతితో తీసికొను రుమాలు
దయయుంచి దీనినీ తీసికో ప్రియుడా

పేర్మించగా నీవు బాగుగా నన్నూ
యింకేమి బహుమతీ యివ్వాలో నీకూ
పాలుపోకున్నాది నా పాణ పియుడా
చివరియత్నముగాను యీ శాలువానూ
బహుమతిగయిస్తాను పియతమా నీకూ
బదులుగా మూడు ముద్దులనివ్వు నాకూ.''

నాజరు, లూకాలు ఆ వలయంలోకి జొరబడ్డారు. తన రింగురు మనే గొంతుతో లూకా వారితో కలిసి పాడుతూ తన చేతులూపుతూ ఆ వలయం మధ్యలో తాళయుక్తంగా నడిచేడు. ''రండి. మీలో వొక ర్రొండి యిలా!'' అని అతను అరిచేడు. అంత ఆ ఆడపిల్లలు మేరియానాను ముందుకు తోయటం మొదలెట్టేరు కాని, ఆమె ముందుకురాలేదు. ఆ పాట మధ్యగుండా పగలబడి నవ్వటమూ, చేతుల్తో చరచటం, గుసగుసలూ విన నొతున్నాయి.

ఓలెనిన్ పక్కగా వెళ్తూన్నపుడు లూకా అతనివైపు స్నేహపూర్వకంగా తల నాడించేడు.

''హల్లో, డిమిట్రీ ఆండ్రీ యెవిచ్! చూసిపోటాని కొచ్చావా యేంటీ?''

''ఆఁ'' అన్నాడు ఓలెనిన్ బిగదీసుకొంటూ.

బెలెట్స్కీ, ఉస్తెంకావద్దకెళ్లి ఆమె చెవిలో యేదో చెప్పేడు. కాని ఆమె సమాధానం చెప్పకముందే వలయంతో గిరుక్కిన తిరుగుతూ వెళ్లిపోయింది. మళ్ళీ తిరిగొచ్చినపుడు యిలాఅంది :

''సరే. వస్తాంలే''

''మేరియానా గూడానా?''

ఓలెనిన్, మేరియానావైపు వంగేడు. ''నువ్వు వస్తావుగదూ? దయ యుంచి తప్పకుండా రావాలి. వచ్చి నొక్క క్షణమున్నా చాలు. నీతో మాట్లాడాల్సిన పనుంది.''

''ఆడపిల్లలంతా వస్తే, నేనూవస్తా.''

"నా ప్రశ్నకి సమాధాన మిస్తావామరీ?" ఆమెకు మరింత దగ్గరగా జరుగుతూ అతనన్నాడు. "యివాళ కొంచెం వుషారుగా వున్నట్లునాన్నవు."

ఆమె అతని పక్కగా సాగి వెళ్లింది. అతనామె ననుసరించేడు.

"సరే, నాకు సమాధాన మిస్తావా మరీ?"

"దేనికంట సమాధానం?"

"మొన్న నిన్నడిగిన ప్రశ్నకు సమాధానం" అని ఓలెనిన్ ఆమె చెవిలో వూదేడు. "నన్ను పెళ్లిచేసికొంటావా?"

వోక్షణం మేరియానా నిశ్శబ్దంగా వూరుకొంది.

"ఆ సంగతి తప్పకుండా చెపుతాను" అన్నదామె. "యీరాత్రి చెపుతాను."

ఆ చీకట్లో ఆమె కళ్ళు దయతో ప్రకాశమానంగా మెరిసేయి.

ఐనా ఓలెనిన్ యింకా ఆమెను అనుసరిస్తూనే వున్నాడు. ఆమెకి దగ్గిరసా వుండటం అతనికి హాయిగా వుంది. అంతలో హఠాత్తుగా, తన పాట ఆపకుండానే, లూకా మేరియానా చెయ్యి లంకించుకొని ఆమె నావలయం మధ్యలోకి లాగేడు. "ఉస్టెంకా యింటికిరా" అని చెప్పే అవకాశం ఓలెనిన్‌కి లేక పోయింది. పాట ముగిసింది. లూకా తన పెదిమలు తుడుచుకొన్నాడు. మేరియానా గూడా అదేచేసింది. వారు ముద్దు పెట్టుకొన్నారు. "అహం. అదిగా. దదిగాదు! నా రుసుం మూడు ముద్దులు!" అన్నాడు లూకా. పాడటమూ, తాళయుక్తంగా నడవటమూ ఆగిపోయింది. దాని స్థానంలో లొడ లొడ వాగుడూ, తోసుకోటాలు గుంజటాలు, నవ్వులూ వచ్చిపడినయ్యి. బాగా మస్తుగా తాగి నట్లున్నాడు లూకా. అతను ఆడపిల్లలకి మిఠాయీలు పంచిపెట్టసాగేడు.

"మీ కందరికీ యిది నావిందు" అని అతను సగర్వంగా, సరసంగా, బడాయిగా అనసాగేడు. "కాని యెవరు సైనికుడి వెనకాల పడతారో వారు యీ వలయంలోంచి బైటికిపోతారు!" అని అతను ఓలెనిన్‌వంక చూసి హఠాత్తుగా అరిచేడు.

ఆడపిల్లలు లూకా చేతుల్లోంచి మిఠాయిల్ని లాక్కొని మళ్ళీ తమలో తాము వొకరివద్దనుంచి వొకరు లాక్కోటం మొదలు పెట్టటంతో మరింత గింజులాటా నవ్వులాటా సాగింది. ఓలెనిన్, బెలెట్‌స్కీలు వొక పక్కకి తొలిగేరు. హఠాత్తుగా తన యీవిబుద్ధిమీద తనకే సిగ్గుకలిగి నట్లుగా లూకా ఆ ఆడపిల్లలగుంపు నుంచి దూరంగా తొలిగేడు. టోపీ తీసేసి చొక్కా చేతితో నుదురుమీది చెమట తుడుచుకొని అతను మేరి యానా, ఉస్టెంకాలవద్ద కెళ్ళేడు.

"నచ్చలేదా నీకు నే నేమియునుగూడ ?" అని వారంతకు ముందు పాడినపాటలోనుంచి వొక చరణం పుదహరించుతూ అతనన్నాడు. "నచ్చ లేదా నేను ?" అని అతను భయంకరంగా పునరుచ్చరించేడు.

"నా భార్యగా నిన్ను నే జేసికొంటా. నావల్ల నీవు కన్నీరు గార్చె దవపుడు !" మేరియానా, ఉస్టెంకాల యిద్దరి నడుముల చుట్టూ తన చేతులు పోనిస్తూ అతనన్నాడు.

ఉస్టెంకా అతని చేతుల్లోంచి గుంజుకొని ఛటపడి అతని వీపుమీద బలంగా గుద్దింది. కాని ఆమె చెయ్యే నెప్పి పుట్టింది.

"ఆఁ. యిక మీరు యింకోసారి నాట్యం చేయరుమరీ ?" అత నడిగేడు.

"యెవళ్ళ యిష్టమొచ్చినట్లు వాళ్ళని చేసుకోనియ్యి. కాని నేను మాత్రం యింటికిపోతున్నా. మేరియానా గూడా నాతోనే వస్తూంది" అన్నాది ఉస్టెంకా.

లూకా తానింకా మేరియానా నడుమును వదిలిపెట్టకుండానే ఆమె నా గుంపులోంచి వొక యింటి వెనకాల చీకట్లో వొకమూలకి తీసుకెళ్ళేడు.

"దానితో కలిసివెళ్ళమాక. రా. మీ యింటికి పోదాంపద" అని అన్నాడతను.

"అక్కడ నే చేసేదేముంది ? యిక్కడ కొంచెం సరదాగా కాల క్షేపం చెయ్యాలనుకొంటున్నా. శెలవు రోజంటే అందుకేగా మరీ సి ఉస్టెంకా యింటికెళ్తున్నాలే" అన్నాది మేరియానా.

"పినా, నిన్నే పెళ్లిచేసికుంటా చూడుమరి !"

''చూద్దాంలే ఆ గడియ వచ్చినపుడు.''

''సరే—వస్తావా రావా?'' అని లూకా గద్దించి అడిగేడు. తర్వాత ఆమెని తనకేసి వత్తుకొని ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకొన్నాడు.

''నన్ను పోనియ్యి! నన్నొదులు!'' మేరియానా అరిచింది. అతని చేతుల్లోంచి గింజుకొని బయటపడి దూరంగా నడిచిపోయింది.

లూకా కదల్లేదు.

''అసె నాపిల్ల, దీనిమూలంగా మంచేమీ జరగదు'' తలవూపుతూ నిందాపూర్వకంగా అతనన్నాడు. ''నావల్ల కన్నీరు నీవు గార్చేదవూ... సరేగానీ యిక పాటలేమీ పాడరటే?'' అని అతను ఆడపిల్లలవైపు తిరిగి కేకబెట్టేడు.

అతని మాటలకి మేరియానా బెదిరినట్లగపడింది. దడాలున ఆగి అతనివైపు తిరిగింది.

''దేనివల్ల యేంమంచి జరగదంటా?''

''దానివల్లే!''

''దానివల్లేమిటి?''

''మీ యింట్లో అద్దెకున్నవాడితో వ్యవహారం సాగిస్తూ నా మాట యేమీ వినకపోవటంవల్ల.''

''నా యిష్టమొచ్చినంతకాలం నీమాట వింటాను. నువ్వేం నా అమ్మవిగానీ నాన్నవిగానీ కాదు! నా యిష్టమొచ్చిన వాళ్ల మాట నే వింటాను!''

''స్సరే'' అని నెమ్మదిగా అన్నాడు లూకా. ''కాని మరిచిపోమాక!...'' తక్కిన మాటలు పూర్తి చెయ్యకుండానే అతనా అంగడి వైపు నడిచివెళ్ళేడు. ''హేయ్ అమ్మాయిలూ! దేనికలా నుంచున్నారు? మరోసారి నాట్యంచెయ్యండి. నాజర్! నువ్వుపోయి కొంచెం ఛిఖిర్ తేరా...''

''సరేగాని వాళ్లొస్తున్నారా లేదామరీ?'' అని ఓలెనిన్ అడిగేడు బెలెట్స్కీని.

''యిక వొక్క నిమిషంలో వచ్చేస్తారోయ్. రాపోదాం. ముందు పోయి అన్ని యేర్పాటులూ చేద్దాం'' అన్నాడు బెలెట్‌స్కీ.

# 39

బెలెట్‌స్కీయొక్క యిల్లు వదిలిపెట్టి ఓలెనిన్ ఆ యిద్దరు యువతుల్తో గలిసి బైలుదేరేసరికి పొద్దుపోయింది. మేరియానా తలమీది తెల్ల రుమాలు ఆ చీకట్లో మెరుస్తూంది. బంగారు చంద్రబింబం స్టెప్పీల వెనకాలకి దిగిపోతున్నాడు. వెండిలాంటి తెల్లని పొగమంచు ఆ గ్రామంమీద గాలిలో నిలిచివుంది. అంతా ప్రశాంతంగావుంది. కిటికీల్లో దీపాలు ఆరిపోయునాయి. ఆ యిద్దరి యువతుల పాదాలచప్పుడు తప్పితే అతనికేమీ వినరావటంలేదు. అతనిగుండె దడ దడ వేగంగా కొట్టుకొంటోంది. వేడిగా వున్న అతని ముఖానికి ఆ చల్లని పొగమంచు హాయి గలిగించింది. వెనక్కి తిరిగి బెలెట్‌స్కీ యొక్క యింటివైపు చూసేడు. ఆ యింట్లోని కొవ్వొత్తి దీపం అప్పటికే ఆర్పేయబడింది. తర్వాత అతనా చీకటిగుండా ఆ యువతుల ఆకారాలవంక కళ్ళు చికిలించి చూసేడు. తెల్లరుమాలు చూస్తూండగానే పొగమంచులోకి మటుమాయమైంది. అతనికి యెంత ఆనందంగా వుందంటే వాళ్ళు తనని వొంటరిగా విడిచేసి పోతారేమోననే భీతిగలిగింది.

అతనా వసారానుంచి కిందకిదూకి ఆ యువతులకేసి పరుగెత్తేడు.

''జాగర్త! యెవరన్నా నిన్ను చూస్తారేమో!'' అన్నాది ఉస్టెంకా.

''యేం ఫర్వాలే.''

అతను మేరియానా నడుం పట్టుకొన్నాడు. ఆమె కాదనలేదు.

''మళ్ళీ ముద్దులు! పెళ్ళయ్యేదాకా ఆగటం మంచిదిగాదూ?'' అన్నాది ఉస్టెంకా.

''గుడ్‌నైట్, మేరియానా'' అన్నాడు ఓలెనిన్. ''రేపు మీ నాన్నని చూడటానికి కొస్తాలే. ఐనా ఆయనకప్పుడే యీ సంగతి చెప్పమాక.''

''ఐనా యేసంగతైనా ఆయనతో నేనెందుకు చెప్పాలసలూ?''

ఆ యువతు లిద్దరూ పరుగెత్త సాగేరు. ఓలెనిన్ తానొక్కడే పైలు దేరేడు అంతకుముందు జరిగిన సంగతుల్ని గురించి ఆలోచించుతూ. ఆ సాయంకాలమంతా వొక పొయ్యిదగ్గర వొక మూలని అతను మేరియానాతో గడిపివేసేడు. ఉస్టెంకా ఆ గదిని విడిచిపెట్టలేదు. కాని బెలెట్స్కీతోనూ తక్కిన ఆడపిల్లల్తోనూ గలిసి గోలగోలగా ఆడుకొంది. మేరియానా, ఓలెనిన్‌లు గుసగుసలాడుకొన్నారు.

"నన్ను పెళ్ళి చేసికొంటావా ?" అనడిగేడతను.

"నేను నీకు అందనే అందను" అన్నాదామె నవ్వుతూ.

"నన్ను ప్రేమిస్తున్నావో లేదో చెప్పు !"

"యెందుకు ప్రేమించగూడదూ ? నా వంక అలా దొంగచూపు చూడమాకు !" యింకా నవ్వుతూనే తన చిన్న గట్టి చేతుల్తో అతని చేతుల్ని పిసుకుతూ అంది. "అబ్బ, నీచేతులు యెంత తెల్లగా యెంత మృదువుగా వున్నయ్యి వెన్నపూసలాగానూ !"

"మేరియానా, నేను నిజంగా అన్నాను. నన్ను పెళ్ళి చేసుకొంటావామరి ?"

"యెందుకు చేసుకోను మానాన్న నన్ను నీకిస్తే ?"

"గుర్తు పెటుకో బాగా. నన్ను మోసం చేశావా యిక నాకు పిచ్చి యెక్కిందన్నమాటే ! రేపు మీ నానా్న వాళ్ళతో మాట్లాడతా."

మేరియానా మళ్ళీ నవ్వింది.

"యెంతో వింతగా వుంది !"

"యేమిటివింత ? అది పూర్తిగా నిజం: నేనొక ద్రాక్ష తోటా, యిల్లూ కొంటాను. కోసక్కుల్లో జేరతాను."

"అప్పుడిక నువ్వు యితర ఆడవాళ్ళతో పోగూడదుసుమా ! నాక లాంటిది సరిపడదు."

ఆ విషయాలన్నింటినీ గురించి ఆలోచించుతూ ఓలెనిన్‌కి యెంత ఆనందం కలిగిందంటే వూపిరి పీల్చటమే అసాధ్యమైంది. కాని అతన్ని నొప్పించిన సంగతిగూడా వొకటుంది: అదేమిటంటే పూర్తిగా ప్రశాం

తంగావున్న మేరియానా వైఖరి. యీ కొత్త పరిస్థితిని గురించి ఆమె యే మాత్రమూ చలించినట్లులేదు. అదంతా యెలావుందంటే ఆమె అతన్ని నమ్మినట్లుగా, ప్రస్తుతానికి మాత్రం అతన్ని ప్రేమించినట్లూ, అతనితో తాను గడపాల్సిన భవిష్యత్తుని గురించి అణుమాత్రంగూడా ఆలోచించనట్లూవుంది.

ఐనా అతనికి ఆనందంగానేవుంది. యెందుకంటే అతన్ని పెళ్లిచేసికొంటానని ఆమె మాటల్లో వొప్పుకొంది; ఆమె అనిన ప్రతిమాటనూ అతను విశ్వసించేడు.

"ఆఁ. అవును. ఆమె పూర్తిగా నాదైన తర్వాతనే మేము వొకరొ్నకరం అర్థంచేసికోగలుతాం. యెందుకంటే అలాంటిప్రేమకు మాటలు మాత్రమే గాదు కావాలిసింది-జీవితం, సంపూర్ణ జీవితం కావాలి. రేపు అంతా స్పష్టమైపోతుంది. యిక నే మాత్రం యిలా నేను జీవించలేను. రేపు ఆమె తండ్రికీ, బెలెట్స్కీకీ, మొత్తం వూళ్లో అందరికీ యీ సంగతి చెప్పేస్తాను" అని అతను అనుకొన్నాడు.

నిద్రలేకుండా రెండురాత్రులు గడిపినాక గూడా లూకా యింకా అదేపనిగా మస్తుగా తాగుతున్నాడు. అతని జీవితమంతట్లోనూ అతను యెంత చచ్చేట్టు తాగాడంటే కాలుగూడా కదపలేక పోయేడు. యామ్కాయింట్లో నిద్రకుపడ్డాడు.

# 40

మర్నాడు ఓలెనిన్ మామూలుకంటే పెందరాళ్లేలేచేడు. లేవగానే తనముందున్న పనేమిటో అతనికి గుర్తుకొచ్చింది. గత సాయంకాలం జరిగిన సంగతుల్ని అతను ఆనందంతో తల్చుకొన్నాడు: మేరియానా ముద్దులూ, ఆమె గట్టి వేళ్లస్పర్శా, "యెంత తెల్లని చేతులు నీవీ!" అని ఆమె అన్నపుడు ఆమె గొంతుతీరూ అదంతా గూడాను.

ఆమె తల్లి దండ్రులవద్దకుపోయి వారి కూతురితో తన పెళ్ళికి అంగీకారం యిమ్మని అడిగే వుద్దేశ్యంతో అతను మంచందిగేడు.

పొద్దింకా పొడవలేదు. బజార్లో యేదో విపరీతమైన గొడవ జరుగుతూన్నట్లు అతనికి తట్టింది: పరుగెత్తటం, స్వారీచేయటం, కేకలూ అరుపులూనూ. సరాలున కోటువేసుకొని చర చరా వసారాలో కొచ్చేడు. ఐదుగురు కోసక్కులు వుద్రేకంగా యేదో చర్చించుకొంటూ గుర్రాలెక్కి పోతున్నారు. తన గుర్రంయొక్క వెడల్పాంటి వీపు మీదెక్కి లూకా తక్కిన వాళ్ళకంటే ముందర పోతున్నాడు. అందరూ వొకేసారి మాటాడుతూ కేకలు పెట్టు కొంటున్నారు. అసలు గొడవేమిటో అర్థంచేసుకోటం అసాధ్యంగావుంది. "పై కొవలా చోటికి పదండి!" "మీ గుర్రాలకి జీన్లువేసి యెక్కి మాతోవచ్చి కలసికోండి. వూc. త్వరగా." "రెండో గేటుగుండా అది దగ్గిర!"

"వుహూc. కానేకాదు. మనం మధ్య గేటుగుండా పోయితీరాలి!" అని కేక పెట్టేడు లూకా.

"ఆc. అది మంచిపని. తొందరగా పనవుతుంది" అని నిండా దుమ్ము కొట్టుకొని చెమటోడుతూన్న వొక గుర్రంమీదున్న వొకరన్నారు.

కిందటిరోజున తాగిన తాగుడు మూలంగా లూకా ముఖం యెర్రగా, వుబ్బరించివుంది. అతను తలని పెట్టుకొన్న మేక పిల్ల తోలుటోపీ తలవెనక్కి తోసివేయబడివుంది. తానొక ఆఫీసరయినట్లు అతను యితరులకి ఆర్డర్లు యిస్తున్నాడు.

"విషయమేమిటి? యెక్కడికి పోతున్నారుమీరు?" కొంత ప్రయత్నంచేసి ఆ కోసక్కుల దృష్టి తన వైపు తిప్పకొన్నాక ఓలెనిన్ అడిగేడు.

"మేము అబ్రెక్కుల వెంటబడుతున్నాం. వాళ్ళదుగో ఆ యిసుక దిబ్బల్లోవున్నారు. కాని వాళ్లింకా యెక్కువమంది పోగడలా."

గుర్రాలెక్కి మెల్లగా ఆ వీధివెంట పోతూ వాళ్లు కేకలు పెట్టేరు. తమ తమ దొడ్లల్లోంచి గుర్రాలెక్కి రాను రాను చాలామంది మగవాళ్ళు బైలుదేరేరు. తాను వెనకాలుంటే బాగుండదని ఓలెనిన్‌కి తట్టింది. అంతేగాక తాను త్వరగానే వెనక్కి తిరిగొచ్చేస్తానని అతను గట్టిగా విశ్వసించేడు. డ్రెస్సువేసుకొని, తుపాకి దట్టించి, అప్పుడే ఐవాన్ జీనువేసిన గుర్రం మీదికి యెగిరెక్కి, వూరి గేట్లవద్ద ఆ కోసక్కుల్ని కలిసికొన్నాడతను.

వాళ్ళు గుర్రాలు దిగి వలయాకారంలో నిలబడివున్నారు. తమ తోటి తెసికొచ్చిన ఒక చిన్న బొక్కెనలోంచి ఛిఖిర్ తీసి ఒక గిన్నెలో పోసి ఒకరి కొకరు అందించుకొంటూ తమ దండయాత్ర విజయం కోసరం తాగుతున్నారు.

వారి మధ్య, చక్కగా దుస్తులు వేసుకొన్న ఒక యువ కార్నెట్ వున్నాడు. ఆ రాత్రి అతనా వూళ్ళో వుండటం తటస్థించింది. ఆ తొమ్మిది మందికీ అతను నాయకత్వం వహించేడు. అతను అధికారిలాగా పోజువేసినప్పటికీ ఆ కోసక్కులు ప్రయివేట్లుమాత్రమే అవటంవల్ల లూకా చెప్పినదాన్నే చేస్తున్నారు. యిక ఓలెనిన్ని గురించి వాళ్ళేమీ పట్టించుకోనేలేదు.

వాళ్ళు గుర్రాలెక్కి బైలుదేరినాక అతను కార్నెట్ వద్దకు తన గుర్రాన్ని పోనిచ్చేడు. ఆ కార్నెట్ వస్తుతా పూర్తిగా స్నేహితాభిలాషి. కాని ఆ వుదయాన్న మాత్రం తన బాధ్యతన్ని జూసికొని వుబ్బిపోయి అతన్ని కరుకుగా చూసేడు. యిక యెంతో శ్రమపడిన మీదటగాని ఓలెనిన్ యేం జరుగుతూందో అతన్నించి తెలిసికోలేకపోయేడు.

వూరికి ఆరుమైళ్ల దూరానున్న ఇసుక దిబ్బలమధ్య కొద్దిమంది అబ్రెక్కుల్ని స్కౌట్లు చూసినట్లుంది. ఒకే గంటలో రక్షణ తీసుకొని అబ్రెక్కులు లొంగిపోవటానికి నిరాకరించేరు. కాల్పులు సాగించేరు. తనతో పాటున్న యిద్దరు కోసక్కుల్తో గలిసి ఆ స్కౌట్ల నాయకుడైన కార్పొరల్ వాళ్లని కనిపెట్టి చూడటానికి వెనక దిగబడి మరొకర్ని సహాయంకోసరం వూళ్ళోకి పంపేడు.

పొద్దు పొడుస్తోంది. వూరికి మూడు మైళ్లవతల పచ్చగడ్డి మైదానం పరుచుకొని వుంది. దీవురుమంటూన్న యిసుకా, పశువుల అడుగులూ, వడిలిపోయిన పచ్చగడ్డి కుచ్చులూ, పల్లాల్లో పొట్టిగా పెరుగున్న కనపడీ కనపడని కాలిబాటలూ తప్పితే చూడటానికి మరేమీ లేదు. దూరాన దిక్చక్రం వద్ద నోగేజాతి వారి మకాంలు కనపడటం లేదు. ఆచోటు ప్రత్యేకంగా చెట్టూ చేమా లేకుండా ఖాళీగా వుంది.

పచ్చగడ్డి మైదానాల్లో వుదయించేప్పుడూ అస్తమించేప్పుడూ సూర్యుడిచుట్టూ యెర్రటి వెలుగుంటుంది. గాలి వీచటం మొదలెట్టితే పర్వ

తాలకొద్దీ యిసుకను మోసుకుపోయి గుట్టలువేస్తుంది. ఆ నాటి వుదయం లాగా ప్రశాంతంగా వుంటే యే అడ్డూ ఆటంకమూ లేకుండా ఆ నిశ్శబ్దత అదో గంభీరంగా వుంటుంది.

పొద్దు పొడిచినా ఆనాడు మందకొడిగా, పొగమంచు పట్టివుంది. యేదో వింతైన నిశ్శబ్దం వ్యాపించివుంది చుట్టూ. గుర్రపుడెక్కల మెత్తని చప్పుడూ, అవి గుర్రుమని ధ్వని చేయటం మాత్రమే వినపడుతున్నాయి. ఆ ధ్వనులైనా బలహీనంగా వున్నాయి. త్వరలోనే అవి మాయమవుతున్నాయి.

చాలాభాగం వారు పూర్తి నిశ్శబ్దంగా స్వారీచేసేరు. కోసక్కు తన ఆయుధాల్నెలా ధరిస్తాడంటే అవి కటకటలూ, గణగణలూచెయ్యవు. కటకటమని ధ్వనిచేస్తే యిక అది సామర్థ్యాయే.

మరో యిద్దరు కోసక్కులు ఆ దళంతోవచ్చి కలిసి యేవో రెండు మాటలు మాటాడేరు వారితో. లూకా గుర్రం గడ్డిలో తన గిట్ట చిక్కుపడగా తూలింది. యిది అపశకునంరా అనుకొన్నారు. అంత ఆ కోసక్కులు దాన్ని గుర్తించకుండా వుండటం కోసరం చరచరా అక్కణ్ణుంచి వెదొలిగేరు. యిలాంటి సమయంలో ఆ శకునం ప్రత్యేకంగా వారికి కనపడింది.

పళ్లు బిగబట్టి లూకా కళ్ళెపుతాళ్ళు లాగి తన తలమీద కొరడాని ఝళ్ మనిపించేడు. ఆ గుర్రం వొక పాదం నుంచి మరోపాదంమీదికి యెగురుతూ, దేంతో ఆరంభించాలో తెలీక, గాలిలో కెగిరిపోవటానికి ప్రయత్నించుతూన్నట్లగపడింది. పుష్టిగావున్న దాని పార్శ్వాల్ని లూకా తన కొరడాతోకొట్టేడు. మరోసారి కొట్టేడు. మూడోసారి కొట్టేడు. ఆ గుర్రం పళ్లికిలించి తోక నాడిస్తూ గురుర్రుమని ధ్వనిచేసి తన వెనకాళ్ల మీదనుంచుని తక్కినవాటినుంచి కొన్ని అడుగులు దూరంగా తూలిందా కాళ్లమీద.

"వోహెూ! నీకు మంచి గుర్రమే వున్నదయ్యా!" అన్నాడు కార్నెట్.

"సింహంలాంటి గుర్రం!" అన్నారు కోసక్కుల్లో వొకరు.

వొకసారి మామూలు నడక వేగంతో, యింకోసారి గులుకు నడకతో, వారు గుర్రాల్ని నడిపిస్తూ నిశ్శబ్దంగా ముందుకుసాగేరు. తాళ యుక్తమైన వారి కదలికల్ని యీ నడకలోవచ్చిన మార్పులు మాత్రమే చెడగొట్టుతున్నాయి.

తాము ప్రయాణించిన ఆరుమైళ్లదూరంలోనూ వాళ్లకి కనపడిందల్లా వొకబండీ దానిమీదున్న డేరానూ. వారికో మైలుదూరాన ఆ బండి మెల్లగా ఆ మైదానాన్ని దాటిపోతోంది. అది వొక మకాంనుంచి మరో మకాముకి పోతూన్న నోగేకుటుంబం. తర్వాత వొక పల్లపుదుల్లో వారికి యిద్దరు స్త్రీలు కనిపించేరు. వారు చిరిగిన బట్టలు కట్టుకునున్నారు. ముఖాలు వెడల్పుగా వున్నాయి. వారి వీపుమీద పళ్లికలున్నాయి. ఆ పచ్చగడ్డి మైదానం మేస్తూ తిరిగే పశువులు వేసిన పేడను వారా పళ్లికల్లో వేస్తున్నారు.

కాన్నెట్ వాళ్లని ప్రశ్నించటానికి ప్రయత్నించేడు. కాని అతనికి వారి భాష రెండు మూడు మాటలకంటే బాగారాదు. అందువల్ల వారిద్దరూ భయంతో వొకరి ముఖం వంక వొకరు చూసుకొన్నారు. అంతేగాని బదులు చెప్పలేదు.

లూకా వారి దగ్గరకి గుర్రాన్ని పోనిచ్చి వారి ఆచారానికి తగినట్టు మామూలుగా పలకరించేడు. ఆ స్త్రీలు అతని వైపు తిరిగేరు హమ్మయ్యా అనుకొంటూ.

"ఐ–ఐ, కొప్ అబ్రెక్" అని వారా దళం పోతూన్న దిక్కుగా చూపుతూ విచారంగా అన్నాడు. చాలా మంది అబ్రెక్కులున్నారని వారంటున్నారని ఓలెనిన్ అర్థంచేసికొన్నాడు.

దండయాత్ర ముగిసేవరకూ అతను వారితో కలిసి వుండాలనుకొన్నాడు. యెందుకంటే అలాంటి పోరాటాన్ని అతనంతకు ముందెన్నడూ చూడలేదు. ఇరోష్కా కథలద్వారా మాత్రమే అతనికి వాటిని గురించి తెలుసు.

అతనా కోసక్కులవంక చూస్తూ వారిని మెచ్చుకుంటూ వారంటూన్న ప్రతిమాటనీ వారు చేస్తూన్న ప్రతి అభినయాన్నీ ఆకళింపు చేసికొంటూ

చూసేడు. తనవద్ద తుపాకీ, ఖడ్గమూ వున్నప్పటికీ ఆ కోసక్కులతన్ని పట్టించుకోనట్లు ప్రవర్తించటం చూసి అతనా పోరాటంలో తానేమీ కలుగజేసికోగూడదని నిర్ణయించుకొన్నాడు. అంతే గాకుండా తాను గత దండయాత్రలో తన ధైర్య సాహసాల్ని బాగా చూపేడు. కాగా అతని కిప్పుడు చాలా హాయిగావుంది గూడాను.

అంతలో హఠాత్తుగా దూరాన తుపాకి ధ్వని ధన్‌మని మోగింది.

ఆ యువ కార్నెట్ చాలా ఆవేశంచెందేడు. వారు యెలా చీలిపోయి యేదిక్కు నుంచి రావాలిసిందీ అతను ఆజ్ఞాపించసాగేడు. కాని ఆ కోసక్కులు అతని మాటలకి ఆపగింజంత విలువగూడా యివ్వలేదు. వారు లూకా మాట మాత్రమే వింటున్నారు.

లూకా ముఖమూ, ఆకారమూ ప్రశాంతతనీ గాంభీర్యాన్నీ చూపుతున్నాయి. యితరులు తనతో కలిసికోలేనంతగా అతను ముందుకి పరుగెత్తి కళ్ళు చికిలించుకొని దూరంలోకి చూసేడు.

''అదుగో వొక మనిషి గుర్రమెక్కి పోతున్నాడు'' గుర్రం కళ్లెం లాగిపెట్టుతూ, యితరుల్తో కలుస్తూ, అతను ఆకస్మికంగా అన్నాడు.

ఓలెనిన్ తన కళ్ళు పొడుచుకొని చూసేడుగాని అతనికేమీ అసుపించలేదు. అంతలోనే వారికి యిద్దరు రౌతులు కనిపించేరు. వారంతా ఆ యిద్దరికేసి ప్రశాంతంగా ముందుకు సాగేరు.

''వాళ్ళు అబ్రెక్కులా ?'' అనడిగేడు ఓలెనిన్.

కోసక్కులు అతనికే సమాధానమూ యివ్వలేదు. వారికా ప్రశ్న విడ్డూరంగా అగుపించింది: గుర్రాలెక్కి నది కీవలకు రావటానికి అబ్రెక్కులు వెర్రివాళ్ళేంగాదు.

''చూడండి, చూడండి. అతను చెయ్యూపుతున్నాడు. అతను రోడ్కా అనుకొంటా'' యిప్పుడు బాగా అవుపించుతూన్న ఆ రౌతుల వంక చూపుతూ లూకా అన్నాడు. ''చూడండి అతనిటే వస్తూన్నాడు!''

నిజంగా, కొన్ని నిమిషాల తర్వాత, ఆ యిద్దరు రౌతులూ కోసక్కు స్కౌట్లనీ—కాగొప్పెరలూ, ప్రియవేటూ అని—అందరికీ తెలిసి పోయింది.

# 41

కార్పొరలు తన గుర్రాన్ని లూకా వద్దకు పోనిచ్చేడు.

"వాళ్ళు దూరా నున్నారా ?" అని ముక్తసరిగా అడిగేడు లూకా.

సరీగ్గా అదే సమయంలో నుప్ఫయ్యి అంగల దూరంలో ధనామనే మోత వినపడింది. కార్పొరల్ చిరునవ్వు నవ్వేడు. "అది మన గుర్కా. వాళ్లని చెత్తరేగ్గొట్టుతున్నాడు !" అన్నాడతను.

ఆ మీద వాళ్ళు కొద్దిదూరం ముందుకు పోగానే వొక యిసుక గుట్ట చాటున గొంతుకు కూచుని తుపాకి దట్టించుతూన్న గుర్కా అగుపించేడు. పూరికినే యేమీ తోచక అతను మరో యిసుక మిట్టచాటున దాగిన అబ్రెక్కులమీదికి కాల్చుతున్నాడు. వారి వైపు నుంచి వొక తుపాకిగుండు ఈలవేస్తూ యిటొచ్చింది. ఆ యువ కార్నెట్ ముఖం తెల్లబడింది. అతను ఖంగారుపడ్డాడు.

లూకా గుర్రందిగి, కళ్లెపుతాళ్లని వొక కోసక్కు చేతుల్లోకి విసిరి, గుర్కావద్దకెళ్ళేడు. ఓలెనిన్ గూడా గుర్రందిగి వంగి అతన్ననుసరించేడు. సరీగ్గా వాళ్ళు గుర్కావద్దకొచ్చే సరికి రెండు తుపాకిగుండ్లు వారి తలల మీదుగా ఈలవేస్తూ పోయేయి. లూకా కొంచెం వంగి నవ్వుతూ చుట్టూ చూసేడు.

"జాగర్త ! లేకపోతే వాళ్ళు నిన్ను చంపేరయ్యోయ్, డిమిట్రీ ఆండ్రీయెవిచ్!" అన్నాడు లూకా. "యెందుకుగాని నువ్వు వెనక్కి తిరిగెళ్ళిపోటం మంచిది. యిది నీకు తగినచోటు గాదు."

కాని ఓలెనిన్ హృదయ మంతా అబ్రెక్కుల్ని చూడాలనేదాని మీదే వుంది.

రెండు వందల అంగల దూరంలో వొక యిసుకగుట్ట వెనకాల కొన్ని తుపాకులూ, టోపీలూ అతని కగుపించేయి. హఠాత్తుగా వారి తలలపై వొచిన్న పొగమబ్బు లేచింది. మళ్ళీ యింకొక గుండు ఈలవేసుకొంటూ యిటొచ్చింది. అబ్రెక్కులు ఆ యిసుక గుట్టముందరున్న వొక బురద

గుంటలో దాక్కొని వున్నారు. వారెన్నుకొన్న స్థలంజూసి ఓలెనిన్ వహ్వా అని మెచ్చుకొన్నాడు. యధార్థంగా చాలావరకి అది తక్కిన మైదానం లాగానేవుంది. కాని వాళ్లక్కడ దాక్కొటంవల్ల అది తక్కిన దానికంటే విభిన్నంగా కనపడుతోంది. నిజంగా ఖచ్చితంగా యిలాంటిచోటునే యెన్ను కొంటారని ఓలెనిన్‌కి తట్టింది.

లూకా తన గుర్రం వద్ద కెళ్ళేడు. ఓలెనిన్ అతని వెనకాల వెళ్ళేడు.

"మనమో గడ్డిబండి సంపాదించాలి. లేకపోతే వాక్కొక్కళ్లనే మనల్ని లంకిచ్చుకొంటారు. అదుగో అక్కడొక నోగేవాళ్ల గడ్డిబండి వుంది. అదుగో ఆ యిసుకదిబ్బ వెనకాల."

ఆ యువ కార్నెటూ, కార్పొరలూ అందు కంగీకరించేరు. బండి తీసుకొని రాబడింది. దాని వెనకాల రక్షణకొని ఆ బండిని వాళ్ళు ముందుకు నెట్టసాగేరు. ఓలెనిన్ వొక చిన్న కొండవద్దకి స్వారీ చేసుకొంటూ వెళ్ళేడు. ఆ కొండమీ దెక్కితే అతని కంతా కనపడుతుంది.

బండి ముందుకు సాగుతోంది. దానివెనకాల నక్కి కోసక్కులా బండిని అబ్రెక్కులవైపు తోస్తున్నారు. అబ్రెక్కులు—వాళ్ళు తొమ్మిది మంది—మోకాళ్ళు ఆనించి వొక వరుసలో కూచున్నారు.

అంతా ప్రశాంతంగా వుంది. హఠాత్తుగా వింతగా విచారకరంగా వున్న వొక పాట—ఇరోష్కా పాడే "అయ్యోదినమా, డా-లా-లే!" అనే దానిలాగా వున్నట్టిది—ఆ నిశ్శబ్దాన్ని భగ్నపరిచింది. తాము తప్పించుకొని పోలేమని అబ్రెక్కులకి తెలుసు. అందువల్ల తాము పిరికిబారి పారిపోయేస్థితి రాకుండా తప్పించుకొనేందుకై తొమ్మిదిమంది మోకాళ్లూ వొకదానితో వొకటి కట్టేసి కూచుని తమ మృత్యుగీతం ఆలాపించ సాగేరు.

బండిని తోసుకొస్తూన్న కోసక్కులు దగ్గరదగ్గరౌతున్నారు. యే క్షణంలోనైనా కాల్పులు సాగవచ్చని ఓలెనిన్ అనుకొంటున్నాడు. కాని అబ్రెక్కుల దుఃఖగీతం తప్పితే మరేధ్వనీ వినరావటంలేదు. హఠాత్తుగా పాట ఆగిపోయింది. వొకగుండు రింగురుమని బండి ముందరి భాగానికి తగిలింది. తార్తారు భాషలో బూతులూ కేకలూ రణగొణధ్వనిగా బైలుదేరినాయి. వొకదాని తర్వా తొకటి కాల్పులు సాగినాయి. గుండు తర్వాత

గుండు వచ్చి గడ్డిలో గుచ్చుకొంటున్నాయి. కోసక్కులు కాల్పు లారంభించలేదు. యిప్పుడు ఐదంగల దూరంలో వున్నారు.

వొక క్షణం తర్వాత బొబ్బరించి కోసక్కులు హఠాత్తుగా బండ రెండు పక్కలనుండీ యెగిరి ముందుకు దూకేరు. లూకా అందరికంటే ముందున్నాడు. ఓలెనిన్‌కి రెండు మూడు సార్లు కాల్చటం వినిపించింది. తర్వాత కేకలూ, మూల్గులూ వినిపించినాయి. ఆ పొగగుండా తనకి రక్తం అగుపించిందని అతననుకొన్నాడు. ఆ భీభత్సం చూసి దిగ్భ్రమచెంది, గుర్రాన్ని విడిచిపెట్టి, అతను కోసక్కులవైపు పరుగెత్తేడు. అతనికేమీ కనపడలేదు. కాని అంతా ఐపోయిందని అతననుకొన్నాడు.

లూకా తెల్లముఖం వేసివున్నాడు. గాయపడిన వొక అబ్రెక్కుని చేత్తో పట్టుకొని, "కాల్చమాకండి! వీణ్ణి నేను బతికుండగానే పట్టుకొంటాను!" అని అరుస్తున్నాడు. ఆ అబ్రెక్కు యెవరో గాదు. తన సోదరుణ్ణి ముదరాయిచ్చి విడిపించుకుపోవటానికి అల్లప్పుడు వచ్చిన యెర్రజుట్టువాడే. లూకా అతని చేతుల్ని మెలిక తిప్పుతున్నాడు. హఠాత్తుగా ఆ అబ్రెక్కు తప్పించుకొని తన పిస్తోలు కాల్చేడు.

లూకా కిందపడిపోయేడు. అతని కడుపులోంచి రక్తం చిమ్మి కొట్టింది. బలవంతాన లేచి మళ్లీ కింద పడిపోయేడు రష్యను, తార్తారు భాషలో బూతులు తిడుతూ. అతని బట్టలమీదా, కిందా మరింత రక్తం అగుపించ సాగింది. చాలామంది కోసక్కులు సరసరా అతనివద్దకెళ్లి అతని నడుం పట్టీ విప్పదీసేరు. నాజరు ఉపయోగించకుండానే తన ఖడ్గంతో కొంతసేపు గడిపేడు. ఆ ఖడ్గం రక్తంతో తడిసివుంది. ఒరలో దూరటం లేదు.

యెర్రటి జుట్టూ, కత్తిరించిన మీసాలూ గల్గిన ఆ అబ్రెక్కులు ముక్కలు ముక్కలుగా నరకబడి చచ్చిపడివున్నారు. చాలాచోట్ల పెద్ద గాయాలు పడి వున్నప్పటికీ వారందర్లోనూ బతికున్నవాడు లూకాని కాల్చిన జిఘిత్తే.

దెబ్బతిన్న డేగలాగా, రక్తంతో తడిసి (అతని కుడికంటి కిందనుంచి రక్తం కారుతోంది) పళ్ళు బిగబట్టి, తన బ్రహ్మాండమైన నల్లని కళ్లు చుట్టూచూస్తుండగా, బాకు చేత్తో పట్టుకొని కట్టకడవరకూ ఆత్మరక్షణ

చేసుకోటానికి సిద్ధంగా నక్కి కూచున్నాడతను. యేదో మామూలు చూపుతో కార్నెట్ అతని వైపు వెళ్లి వూహించకముందే సరాలున అతని చెవిలోగుండా కాల్చేడు. ఆ అబ్రెక్కు ముందుకు దూకేడు. కాని అప్పటికే చాలా ఆలస్యమైంది. అతను విరగదీసుకొని కిందపడిపోయేడు.

కోసక్కులు రొప్పుతూ రోజుతూ ఆ శవాల్ని వొక పక్కకి యీడ్చికెళ్లి వాటి నున్న ఆయుధాల్ని తీస్తున్నారు. ఆ యెర్రిటి జుట్టు అబ్రెక్కుల్లో ప్రతివాడూ వొక మానవుడు. ప్రతివాడి ముఖానా అతని ప్రత్యేకభావం అగపడుతోంది. లూకా రష్యను, తార్తారు భాషల్లో యింకా బూతులు తిడుతూనే వున్నాడు. అతన్ని బండివద్దకి మోసికెళ్ళేరు.

"వుహూం. నువ్వు పోలేవురా! నా చేతుల్లోనే నీ గొంతుపిసికి చంపుతారా! నువ్వు పారిపోలేవురా! అన్నాసెనీ!" అని అతను వాళ్ళ చేతుల్లో గింజులాడుతూ అరిచేడు. కాని త్వరలోనే అతని సత్తువ వుడిగి పోయింది. యిక అరవలేక పోయేడు.

ఓలెనిన్ గుర్రాన్నెక్కి యింటికెళ్ళేడు. సాయంత్రాన, లూకా మృత్యువాకిట వున్నాడనీ, కానీ నది అవతలనుంచి వచ్చిన వొక తార్తారు తన మూలికల్తో నయం చేయటానికి చూస్తున్నాడనీ అతని కొకరు చెప్పేరు.

ఆ శవాలు గ్రామ ఆఫీసుకి తీసికొని రాబడినాయి. స్త్రీలూ పిల్లలూ వాటిని చూడటం కోసరం గుంపులు కూడేరు చుట్టూరా.

తాను చూసిన దానివల్ల గలిగిన దిగ్భ్రమనుంచి తేరుకోటానికి ఓలెనిన్‌కి చాలాసేపు పట్టింది. కాని రాత్రిపూట మళ్ళీ పగటిపూట జరిగిన ఘటనలు గ్యాపకానికొచ్చేయి. మేరియానా ఆవుల చావడినుంచి యింటికీ యింటి నుండి ఆవుల చావడికీ అటూ యిటూ తిరుగుతూండటాన్ని అతను కిటికీ లోంచి చూసేడు. ఆమె తల్లిదండ్రులు బైటికెళ్ళేరు. ఆమె తల్లి ద్రాక్ష తోటకీ, తండ్రి గ్రామ ఆఫీసుకీనూ. ఆమె పని పూర్తిచేసుకోనేవరకూ ఓలెనిన్ ఆగలేక పోయేడు. ఆమెని కలిసికోటానికి బైటికెళ్ళేడు.

తలుపువైపు వీపుతిప్పి ఆమె యింట్లో నుంచునివుంది. ఆమెకి సిగ్గుగా వుందని ఓలెనిన్ అనుకొన్నాడు.

"మేరియానా! మేరియానా, నేను లోనికిరానా?"

దడాలున ఆమె గిరుక్కున తిరిగింది. ఆ కళ్లల్లో నీళ్ళున్న జాడ లున్నాయి. విచారంలో ఆమెముఖం మనోహరంగా వుంది. ఆమె అతని ముందర నిశ్శబ్దంగా, మహోన్నత ఠీవిగా నుంచుంది.

''మేరియానా, నేనొచ్చా—'' అని ఆరంభించేడు ఓలెనిన్.

''పోపో!'' అన్నాదామె. ఆమె ముఖంలో మార్పేమీరాలేదు. కాని, కన్నీళ్ళు మాత్రం ప్రవాహంగా కారసాగేయి ఆమె చెక్కిళ్ల మీదుగా.

''యేమిటది? యెందుకు?''

''యెందుకా?'' అని ఆమె భయంకరంగా ఆ మాటని పునరుచ్చరించింది. ''కోసక్కులు చచ్చిపోయారు. అందుకూ.''

''లూకా?''

''యేంకావాలి నీకు? పోపో!''

''మేరియానా!'' అని అన్నాడతను ఆమె దగ్గిరగా వెళ్తూ.

''నానుంచి నీకేమీ లభ్యంకాదు!'' అన్నాదామె.

''దయయుంచి అలా మాటాడమాకు!'' అని ప్రార్థించేడు ఓలెనిన్.

''వైటికినడువ్! నిన్ను చూచి నాకు రోతబుట్టింది!'' అని ఆమె తన పాదాన్ని నేలమీద తాకించుతూ, అతనివైపు భీకరంగా నడుస్తూ, ఆమె అరిచింది.

ఆమె ముఖంలో యెంత అసహ్యమూ, ద్వేషమూ కనపడినాయంటే అదిచూసి యిక ఆశలేదురా అనుకొన్నాడు ఓలెనిన్. మొదట తాను మేరియానాని గురించి అనుకొన్నది సరైనదేనని యిప్పుడు సంపూర్తిగా స్పష్టమైంది: ఆమె అందరానిపండు.

అతను యిక నేమీ మాటాడకుండా వైటికెళ్ళేడు.

# 42

గదికి రాగానే అతను మంచంమీదపడుకొని యిక కదలకుండా అలా రెండుగంటలసేపున్నాడు. తర్వాత లేచి, తన కంపెనీ కమాండరువద్దకెళ్లి, స్టాఫు *(Staff)* తో చేరటానికి సెలవు తీసుకొన్నాడు.

ఎవరికీ వస్తానంటూ వందనం చెయ్యకుండా యింటి యజమానికి యివ్వాల్సిన అద్దె చెల్లించి వచ్చేందు కతను ఐవాన్‌ని పంపించి, తన రెజిమెంటువున్న కోటకు వెళ్లడానికి అన్నీ సిద్ధం చేసుకొన్నాడు.

అతను వెళ్ళేప్పుడు చూడటాని కొచ్చింది. వొక్క ఇరోష్కా మాత్రమే. నారు వొక సారి, రెండుసార్లు, మూడు సార్లు తాగేరు. వొక నాటిరాత్రి తాను మాస్కోనుంచి బైలుదేరినప్పటికిమల్లే బైట అతని కోసరం ట్రోయికా వొకటి నుంచునివుంది. కాని యీ సారి ఓలెనిన్ తన వ్యవహారం తాను తేల్చుకోటం లేదు. అదీ గాక తాను యిప్పటివరకూ ఆలోచించిందీ ఆచరించిందీ "సక్రమమైందిగాదు" అని అతనిప్పుడు అనుకోటం లేదు గూడాను. అంతే గాక తన కొక "నూత్న జీవితం" ఆరంభం కాబోతూందని అనుకోలేదు గూడా. అంతకు ముందుకంటే గూడా యిప్పుడతను యినుమిక్కిలిగా మేరియానాను ప్రేమిస్తున్నాడు. ఆమె తన నెన్నడూ ప్రేమించదనిగూడా అతనికి తెలుసు.

"సరే, అబ్బాయ్" అంటూ ఆరంభించేడు ఇరోష్కా. "యుద్ధరంగాని కెళ్ళినపుడు, కొంచెం మంచీ చెడూ చూడు. ముసలాడి సలహాని గుర్తుపెట్టుకో. నేను ముసలితోడేలునని నీకు తెలుసు. నేను సర్వం చూశాను. కనక నువ్వు దాడికీ గీడికీ పోయినప్పుడు కాల్పు లారంభం అయినపుడు చాలామంది వున్న గుంపులోకి మాత్రం వెళ్లమాక. మీబోటాళ్ల విషయంలో రెప్పుడూ అంతే: భయం పుట్టినపుడు అందరూ కట్టగట్టుకొని వొకచోట చేరతారు. కలిసుంటే మంచిదని మీవ్యూహం. కాని అదే ప్రళయం తెచ్చిపెట్టేది. కాల్చేవాళ్లెప్పుడు గుంపుమీదకే కాలుస్తారు. నే నేంచేసేవాణ్ణో తెలుసా? గుంపును వదిలిపెట్టి వంటరిగా వుండే వాణ్ణి. చూడు మరి! వొక్కసారన్నా దెబ్బతినలేదు! ఐనా నా జీవితంలో నే నెంత చూడలేదు!"

"కాని నీ వీపులో మాత్రం వొక గుండు దూర్చుకొన్నావు" అని గదిని ఖాళీచేస్తూన్న ఐవాన్ అన్నాడు.

"అది మనవాళ్ల తిక్కలతనంవల్ల జరిగింది" అన్నాడు ఇరోష్కా.

"అదెలాగు?" అన్నాడు ఓలెనిన్.

''అందులో యేమీలేదు గొప్ప. మాలో నౌకరు—సిట్‌కిన్ అనే కోసక్కు కొంచెం కైపెక్కి భరవాసా చేశాడు. యిక ధన్‌మని అతని పిస్తోలు పేలి గుండు నా వీపులో గుచ్చుకొంది.''

''బాధ పెట్టిందామరి ?'' అనడిగేడు ఓలెనిన్. ''ఐవాన్ ! యింకెంత ఆలస్యముంది తయారవడానికి !''

''తొందరేమిటీ ! నన్ను చెప్పనియ్యి...సరే, ధన్‌మని పేలింది. కాని ఆ గుండు యెముకని మాత్రం పగలగొట్టలా. పగలగొట్టక అక్కడే వుంది. ''నన్ను చంపావుగందరా బాబూ ! నాకు నువ్వు చేసిన పనేంటి ? ఆఁ ? నేను నిన్ను వూరికే పోనియ్యను !'' అన్నాను. అందుకు జరిమానాగా నువ్వు నాకొక బొక్కెన సారా యిచ్చుకోవాలి !'' అన్నాను.

''మరి అది బాధపెట్టిందా ?'' కథయేమీ వినకుండానే ఓలెనిన్ అడిగేడు మళ్లీ.

''చెపుతానుండు. వాడు అన్నట్టుగానే బొక్కెన నిండా సారా తెచ్చాడు. మేము దాన్ని తాగేశాం. రక్తం యిక చిమ్మికొట్టసాగింది. మొత్తం గదంతా రక్తంతో తడిసిపోయింది. ఆపర్నే బర్‌లాక్కు అనే తాత యేమన్నాడంటే ''ఆ పిల్లాడు చచ్చిపోతున్నాడు. నువ్వగిని మాకొక సీసాడు తియ్యని సారా యిచ్చావా యియ్యి. లేకపోతే నిన్ను పోలీసులకి అప్పగిస్తాం'' అన్నాడు. సరే, వాళ్లామీద తియ్యని ద్రాక్ష సారా తెచ్చారు. యిక మేం తాగటం మొదలెట్టాం...''

''అది బాధ పెట్టిందామరి ?'' అని ఓలెనిన్ మూడోసారి అడిగేడా ప్రశ్న.

''యెందుకుబాధ ? మధ్యలో అడ్డుతగలమాక. నాకలాంటిది యిష్టం లేదు. నన్ను చెప్పనియ్యి. సరే, మేము ఆపర్నే పొద్దుపొడిచేవరకూ తాగాం. నేనా పొయ్యి అరుగుమీద పడుకొని నిద్రపోయాను మత్తులో. నిద్రలేచి నపుడు వంగిన నడుమును లేపలేక పోయాను.''

''అది చాలా బాధపెట్టిందా ?'' దాని సమాధానం చెప్పాల్సిన చోటుకి కథ వచ్చిందని వూహించుకొని ఓలెనిన్ మళ్లీ అడిగేడు.

''బాధని గురించి నేన్నీకేమన్నా చెప్పానా ! ఆఁ ! వుహూఁ. యేమీ బాధపెట్టలేదు. నడవలేక పోయాను అంతే.''

"మరి అది మానిపోయిందా ?" నవ్వలేక ఓలెనిన్ అడిగేడు.

"ఓ ! అది బాగానే నయమైంది కాని ఆ గుండు మాత్రం యింకా అక్కడే దిగడిపోయింది. చూడు. యిదుగో యిక్కడ చూడు !" అని తన చొక్కా పైకెత్తి ఇరోష్కా తన బలమైన వీపుని చూపించేడు. వెన్నుకదగ్గర వేల్తో కదిలిస్తే గుండు అటూ యిటూ దొర్లుతోంది.

"అది యెలా దొర్లుతూందో చూడు" అదేదో ఆట వస్తువైనట్లుగా అతనన్నాడు. "ఆఁ ! అదిప్పుడు కిందకు జారుతూంది !"

"లూకా సంగతేమయ్యింది ? కోలుకుంటాడా ?" అనడిగేడు ఓలెనిన్.

"భగవంతుడికే తెలియాలి. వైద్యుడెవరూ లేరు. యెవర్నో పిల్చుకురావటానికని యింతకుముందే వెళ్ళారు మరి."

"డాక్టరెక్కడుంటాడంట ? గ్రాజ్నోలోనా ?"

"వుహూఁ. గ్రాజ్నోలో కాదబ్బాయ్. మీ రష్యన్ డాక్టర్లని వురి తియ్యటానికి తప్పితే మరెందుకూ పనికిరారు. నేను జారు చక్రవర్తినైతే వాళ్ళనెప్పుడో వురితీసి వుండేవాణ్ణి. వాళ్ళకి తెలిసిందల్లా రోగిని కోయటం ముక్కలు ముక్కలుగా. మా కోసక్కు బక్లాష్కా సంగతే చూడు. వాణ్ణెందుకూ పనికిరాకుండా చేశారు. కాలుకోసేశారు. అది చూస్తే చాలు వాళ్ళెంత దద్దమ్మలో తెలుస్తుంది. కాలులేకుండా యింకా వాడెందుకు పనికొస్తాడు ? వుహూఁ. అది గాదురా అబ్బాయ్. అసలు డాక్టర్లంటే డాక్టర్లు పర్వతాల్లో వున్నారు. నా క్యునాక్—గిర్చిక్—విషయంలో అంతే జరిగింది. వాడికి యెదురొమ్ములో సరిగ్గా యిక్కడ గాయం తగిలింది వొక దండయాత్ర సందర్భంలో. సరే; మీ రష్యన్ డాక్టర్లు పెదిమలు చప్పరించారు. కాని, పర్వతాలనుంచి సెచ్ అనే వాడొచ్చాడు. మందిచ్చాడు. వాడి కాళ్లమీద వాడు నిలబడేట్లు చేశాడు. వాళ్ళకి మూలికల్ని గురించి అంతా తెలుసు. అదీ అసలు సంగతి."

"ఆపావు ! యిక ఆ చెత్త చెప్పమాక !" అన్నాడు ఓలెనిన్. "నేను హెడ్ క్వార్టర్సునుండి డాక్టర్ని పంపితే మంచిది."

"చెత్తా !" నువ్వు దద్దమ్మవి. అంతే. చెత్తంట ! తాను డా... పంపుతాడంట ! మీ డాక్టర్లు యెన్నడన్నా వొక్కరికన్నా

చేసుంటే కోసక్కులూ, తార్తారులు వాళ్ల దగ్గరకే మందు కెళ్ళే వాళ్ళని నీకు తెలీదూ ? కాని విషయ మేమంటే మీ ఆఫీసర్లూ కర్నల్లూ తమకి జబ్బుచేస్తే పర్వతాల్లోవున్న డాక్టర్లకి కబురంపుతారు. తెలిసిందా ? మీ వాళ్లంతా పచ్చి మోసగాళ్ళు, అందరూనూ !''

అందుకు ఓలెనిన్ యే సమాధానమూ యివ్వలేదు. తాను విడిచి వచ్చేసి మళ్ళీ వెళ్తూన్న ప్రపంచంలో అంతా మోసమేనని అతనికి బాగా తట్టింది.

''అది సరేగాని, లూకా కెలావుంది ? నువ్వు అతన్ని చూశావా ?''

''వాడు శవంలాగా పడివున్నాడు. తినటం లేదు, తాగటంలేదు వాడికిష్టమైంది వోడ్కా వొక్కటే. సరే వోడ్కా వాడి కేచెరుపూ చెయ్యదు గూడాను. కాని, అసలావ్యవహారమంతా చూస్తే వట్టి సిగ్గుచేటు పనిగావుంది. వాడు చక్కని కుర్రాడు. నాలాంగా జిగిట్ ! నాకుగూడా వొకప్పుడు అలాగే చస్తూండటం జరిగింది. ముసలి ముండలు నామీద పడి యేడుస్తున్నారు. నాతల కాలిపోతున్నది జ్వరంతో. అంతకుముందే వాళ్ళు నిరాశ చేసుకొని నన్ను కింద పెట్టేశారు గూడాను. సరే అలా పడి వున్నానక్కడ. యికపైన పొయ్యి అరుగుమీద కొంతమంది మద్దెలవాళ్లు కూచుని వాయించటం నాకగపడుతున్నది. నేను వాళ్లకేసి అరిచాను. కాని వాళ్ళింకా బిగ్గరగా వాయించసాగారు'' అని ముసలాడు తనలో తాను నవ్వుకొన్నాడు. ''ఆడవాళ్లు పోయి చర్చిపెద్దను తీసుకొచ్చారు. వాళ్లు నన్ను పాతిపెట్టటానికి సిద్ధమవుతున్నారు. ''ఆయన భగవంతునిలో నమ్మకంలేని దుర్మార్గుల్తో కలిసి చెడిపోయాడు. ఆడవాళ్లతో తిరిగాడు. మనుషుల్ని చంపాడు. ఉపవాసాలు జేసేవాడుగాదు. బేలలైకా వాయించే వాడు'' అని వాళ్లు ఆ చర్చిపెద్దతో చెప్పారు. ''పాపాలు వొప్పుకో'' అని అతను నాతోఅన్నాడు. సరే, నేను అన్నీ చెప్పేశాను. నేను పాపం చేశానన్నాను. అతనేదన్నా, నేను పాపం చేశానని మాత్రమే అన్నా. అతను బేలలైకా విషయం యెత్తేడు. దానితోగూడా నేను పాపం చేశా. ఆ పాపిష్టి వస్తువేదని అతనడిగేడు. దాన్ని నాకు చూపించమన్నాడు. యిప్పుడు అది నా దగ్గరలేదన్నా. చూడూ. దాచేశా అంతకుముందు. వాళ్లకది దొరకదని నాకు

తెలుసు. సరే, యిక ఆఖరికి నాకు నీళ్లు వదలుకొన్నారు. ఐనా యింకా గాలి పీలుస్తూ యిదుగో యిక్కడున్నా. యిక ఆ తర్వాత నేనా జేల లైకానిక నాయించనేలేదుతే!......''

''ఆఁ. నేను చెపుతున్నదేంటీ? ఆఁ. అవునవును: గుంపునుంచి దూరంగా వుండు. లేకపోతే వెర్రిమొగం లాగా చచ్చిపోతావు! నువ్వంటే నాకు యిదిగావుంది. మనస్సారా నువ్వంటే నాకు జాలిగా వుంది. నువ్వు తాగు చక్కగా. నీలాంటివాళ్లకి కొండల్లో స్వారీ కెళ్లటమంటే యిష్టం. యిక్కడ మాలోకలిసి వొకడుండేవాడు. అతను నీలాగా రష్యానుంచే వచ్చాడు. దిబ్బలమీదకి గుర్రాన్ని నడిపేవాడు. యేదన్నా దిబ్బ చూశాడంటే యిక దానిమీదకి గుర్రాన్ని పరుగెత్తించేవాడు. అలా అత నొక నాడు గుర్రమెక్కి వెళ్లి వొక కొండమీదకెక్కి వుషారుగా వున్నాడు. వొక తార్తారు అతన్ని చూసి గురిపెట్టి కాల్చాడు. అంతే. దెబ్బకు చచ్చాడు. అబ్బా, యీతార్తార్లు తుపాకితో మహా తెలివితేటలుగా కాలుస్తారు. కొందరు నాకంటే తెలివిగల్లాళ్లు గూడాను......వుహూఁ. యెవడన్నా అంత వెర్రిగా వూరికినే చావటమంటే నాకిష్టంలేదు. మీ మనుషుల వంక చూసి నేను వింత పడేవాణ్ణి. యెంత వెర్రి మొఖాలాని అని! పాపం అందరూకలిసి, ఆఖరికి తమకోట్లకి యెర్రటి కాలర్లుగూడా తగిలించుకొని నడిచేవాళ్లు. అలాంటి వాళ్లని గురిగా కాల్చటంలో వింతేముంది? వొకడు కిందపడతాడు. వాణ్ణి దూరంగా లాగేస్తారు. మళ్లీ యింకోడు పడతాడు. యెంత వెర్రితనం!'' అని ముసలాడు తలవూపుతూ మళ్లీ అదేమాట అన్నాడు. ''కావాలిసిందల్లా యేమిటంటే విడివిడిగా దూరంగా చీలిపోయి ముందుకు సాగటం. శత్రువు నీకు గురిపెట్టలేడప్పుడు. అలాచెయ్యాలాని అబ్బాయ్.''

''నమస్కారాలు, మామా. గుడ్‌బై! భగవంతుడు దయ తలిస్తే మళ్లీ మనం కలిసికోవచ్చు'' అని లేస్తూ, ఓలెనిన్ అన్నాడు.

ముసలాడు నేలమీద నుంచి లేవలేదు.

''గుడ్‌బై చెప్పేది అలాగేనా వెర్రిమొఖమా? అబ్బబ్బా కాలంలో వాళ్ళు యేమి మనుషులాని నాయనా, యేమి మన అరె, మనం యేడాదిపాటు సావాసం చేశాం. మరిప

పోతూంటివి ! నువ్వంటే నాకు ప్రేమని నీకు తెలీదూ ? నువ్వు వింత మని షివి. యెప్పుడూ వొంటరితనమే నీది. యెవరూ ప్రేమించని వొక తరహా జంతువ్వి నువ్వు. వొకొక్కప్పుడు నాకు నిద్రపట్టనప్పుడు నిన్ను గురించి ఆలోచిస్తే నాగుండె నెప్పులు పెడుతుంది. పాట వొకటుంది :

పరదేశమున నీవు బ్రతుకవలెనంటే

ప్రియ మిత్రుడా అదీ సులభమ్ముగాదోయ్ !

అలాగే నీ విషయంలోనూ !''

''సరే, గుడ్ బై !'' అని ఓలెనిన్ మళ్లీ అన్నాడు.

ఈ సారి ముసలాడు లేచి తనచేయి సాచేడు. ఓలెనిన్ దాన్ని వొత్తి వెళ్లబోయేడు.

''నీ ముట్టి ! నీ ముట్టి యిటుకళ్లే తిప్పరా !'' అన్నాడు ముసలాడు.

తన వెడల్పాటి చేతుల్తో అతను ఓలెనిన్ తలపట్టుకొని, మూడు సార్లు ముద్దుపెట్టుకొని, యేడ్వసాగేడు.

''నీమీద నాకు ప్రేముంది. గుడ్ బై.''

ఓలెనిన్ బండి యెక్కేడు.

''ఆఁ. వెళ్లటమంటే అలాగేనా ? నీ గుర్తుగా యేదన్నా దిగవిడిచి పోవటం మంచిది. నీ తుపాకి యివ్వు. రెండు తుపాకులు నువ్వేంచేసుకుం టావ్ ?''అని; సంపూర్ణప్రేమతో వెక్కి వెక్కి యేడుస్తూ ముసలాడన్నాడు.

''అబ్బ, వాడికి యివ్వని దే ముంది గనుక !'' అని సణిగేడు ఐవాన్. ''వాడికి యెంత యిచ్చినా చాలనే చాలదు, ముసలితొత్తుకొడుకు ! వాళ్లంతా అంతే'' తన కోటుని కప్పుకొని బండి తొట్లో కెక్కుతూ అత నన్నాడు.

''నోర్ ముయ్ పంది వెధవా !'' చిరునవ్వుతో ముసలాడు కేక పెట్టేడు. ''పిసినారి వెధవా !''

మేరియానా ఆవుల చావట్లోంచి బైటికొచ్చింది. నిర్లక్ష్యంగా బండి వంక చూసింది. తలవంచి నమస్కరించింది. యింట్లో కెళ్లిపోయింది.

''లాఫిల్ !'' అని కన్ను గీటుతూ ఐవాన్ అని వెర్రి నవ్వు నవ్వేడు.

''పోనియ్యవోయ్ !'' అన్నాడు ఓలెనిన్ చిరాకుగా.

''గుడ్‌బై, అబ్బాయ్; గుడ్‌బై ! నేను నిన్నెప్పుడూ గ్యాపకం పెట్టుకొంటాను !'' ఇరోష్కా కేకపెట్టేడు.

ఓలెనిన్ వెనక్కి తిరిగి చూసినప్పుడు ముసలాడు మేరియానాతో మాటాడుతున్నాడు తన సొంత వ్యవహారాల్ని గురించి. అతను గానీ ఆ యువతిగానీ ఓలెనిన్ వంక చూడటంలేదు.





నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్, 7112–మహంకాళీ స్ట్రీట్, సికింద్రాబాదు.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B157 |
| పుస్తకం పేరు | మేరియానా |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 243 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 |
| లేని పేజీలు | I TO VI |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | pradeep |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |